# శ్రీమదాంధ్రమహాభాగవతంలో కృత్తద్ధిత ప్రయోగాలు

పరిశోధకుడు

**రామక పాండురంగ శర్మ**

పర్యవేక్షకులు

**డా. యన్. అనంతలక్ష్మి**

రైల్వే డిగ్రీ కళాశాల

లాలాగూడ, సికింద్రాబాద్.

పి.హెచ్.డి. పట్టం కొరకు

ఉస్మానియా విశ్వవిద్యాలయం, తెలుగు భాషా విభాగానికి సమర్పించిన సిద్ధాంతవ్యాసం

సెప్టెంబర్ - 2006

# DECLARATION

I, **RAMAKA PANDU RANGA SHARMA**, declare that this thesis entitled **" SRI MADANDHRA MAHA BHAGAVATHAM LO KRITTADDHITHA PRAYOGALU"** is prepared by me on the basis of my own independent research work done under the supervision of **Dr. N. Ananta Lakshmi** (Reader, Railway Degree College, Secunderabad) and this thesis has not previously formed the basis for the award of any other degree.

Hyderabad. **(RAMAKA PANDU RANGA SHARMA)**

Date :

# CERTIFICATE

This is to certify that this thesis entitled **" SRI MADANDHRA MAHA BHAGAVATHAM LO KRITTADDHITHA PRAYOGALU"** submitted for the award of Ph.D. Degree is a record of research work done by Ramaka Pandu Ranga Sharma under my guidence during the academic years 2000-2006 at the Dept. of Telugu, Faculty of Arts, Osmania University, Hyderabad, A.P.

Hyderabad.

Date :

**(Dr. N.ANANTA LAKSHMI)**
M.A., Ph.D.
Research Supervisor

# అంకితం

మూకం కరోతి వాచాలం

పంగుం లంఘయతే గిరిమ్!

యత్కృపా తమహం వందే

పరమానంద దాయకమ్!!

మృత్యుముఖంలో ఉన్నవాడిని మృత్యుంజయుని చేయగలిగే శక్తి ఎవరికుంటుంది? ఒక్క జగదీశ్వరునికి కాక!

అటువంటి మహిమాన్వితుడైన ఋషి, నా గురువు, దైవం బ్రహ్మశ్రీ గుడా జగదీశ్వర శర్మ గారికి

సహస్ర సాష్టాంగ నమస్కార పూర్వకంగా...

రామక పాండురంగ శర్మ

# ముందుమాట

'ఆంధ్ర మహాభాగవతంలో కృత్తద్ధిత ప్రయోగాలు' అనేది ప్రస్తుత పరిశోధనాంశం. ఈ శీర్షికను డా. ఎల్లూరి శివారెడ్డి గారు సూచించారు.

పరిశోధన ఆరంభించే ముందు భాషా శాస్త్ర విభాగంలో, వ్యాకరణ విభాగంలో వెలువడిన పరిశోధనలను పరిశీలించాను. డా. అళహసింగరాచార్యుల వారి 'ఆంధ్ర భారతంలో కృత్తద్ధిత ప్రయోగాలు - విశ్లేషణ' అనే పరిశోధనా గ్రంథాన్ని పూర్తిగా చదివాను. డా. గాలి రాధాకృష్ణ గారి 'తెలుగులో కృద్రూప నిర్మాణం' వ్యాసాన్ని చదివాను. ఆ తర్వాత నేను నా పరిశోధనా గ్రంథాన్ని ఏ క్రమంలో రాయాలో నా పరిశోధనా నిర్దేశకులు డా. అనంతలక్ష్మి గారితో చర్చించి, నిర్ణయించుకున్నాను.

రాసే ప్రతి అధ్యాయానికి ప్రయోజనముండాలని, అధ్యాయాల మధ్య శృంఖలాబద్ధత ఉండాలని, సమన్వయం, సంక్షిప్తత ఉండాలని నా నిర్దేశకుల సూచన. నేనూ ఆ సూచన కనుగుణంగానే ప్రణాళిక సిద్ధం చేసుకున్నాను. నాకు తోచినంత మేరకు "అవసరమైన విషయాన్ని విడిచిపెట్టను, అనవసర విషయాన్ని తాకను'' (నానపేక్షితముచ్యతే) అని నిర్ణయించుకున్నాను.

ఇది భాషా శాస్త్ర, వ్యాకరణాలకు సంబంధించిన పరిశీలన. ఇందులో నూత్న సిద్ధాంతాల ప్రతిపాదన అనేది అరుదు. ఎక్కువగా పరిశీలన ఉంటుంది. తెలుగులోని కృత్తద్ధితాలను సోదరభాషాపదాలతో తులనాత్మక పరిశీలన చేయాలనుకున్నాను. దానికి అనుగుణంగా ప్రణాళికను రచించాను.

"ప్రయోజన మనుద్దిశ్య నమందోపి ప్రవర్తతే'' అని సూక్తి. కాబట్టి పరిశోధన విషయానికి ప్రయోజనం ఉండాలి. అంతకు ముందు దాని అవసరం ఉండాలి.

కాబట్టి నా పరిశోధనాంశ ప్రయోజనం, అవసరం మొదటి అధ్యాయంలో ప్రస్తావించాను.

మానవునికి భాష అవసరం. భాషా నిర్దుష్టతకు వ్యాకరణం అవసరం. మానవుని జీవితంలో కాలానుగుణంగా వచ్చే మార్పులకు తగిన విధంగా, కొత్తగా పుట్టుకొస్తున్న శాస్త్రాలు, ఆవిష్కరణలు మొదలైన వాటిని సమర్థంగా వ్యక్తపరిచే సాధనంగా మన భాషను సిద్ధం చేసుకోవాలి. అందుకు ఉపకరించేవే కృత్తద్ధితాలు. అందుకే వాటిని పరిశీలించాలని ప్రథమాధ్యాయంలో నిరూపించాను.

కృత్తద్ధితాలు వ్యాకరణ శాస్త్ర విషయాలు. భారతీయ భాషల్లోని శాస్త్రాలన్నీ సంస్కృతంలోని శాస్త్రాలను అనుసరించి పుట్టినవే. తెలుగు వ్యాకరణం కూడ సంస్కృత వ్యాకరణాన్ని అనుసరించి పుట్టిందే. అందుకే సంస్కృత వ్యాకరణ చరిత్రను, తెలుగు వ్యాకరణ చరిత్రను అవసరం మేరకు (కృత్తద్ధితాల ప్రస్తావన ఉన్న వాటిని) పరిచయం చేసేదే ద్వితీయాధ్యాయం.

కృత్తద్ధితాల తులనాత్మక పరిశీలనలో మూల రూప పునర్నిర్మాణం, ప్రస్తుత రూపసాధన చేసాను. ఆ క్రమంలో వచ్చే ధ్వని పరిణామాలు నిరూపించాలి. అందుకే ఆ పనిని వీలైనంత సమగ్రంగా చేసాను తృతీయాధ్యాయంలో.

చేయబోయేది కృత్తద్ధితాల పరిశీలన. అందుకే కృత్తద్ధితాల నిర్వచనాలు, విభాగం, వివిధ కృత్తద్ధితాలు నిరూపించేదే చతుర్థాధ్యాయం.

క్రియాపదాలపై ప్రత్యయాలు చేరగా ఏర్పడినవే కృదంతాలు. తెలుగులోని క్రియా పదాలన్నీ ఉదంతాలే. ఉత్‌కు అచ్చు పరమైతే సంధి నిత్యం. కాబట్టి క్రియలకు అజాది ప్రత్యయాలు పరమైనప్పుడు, హలాది ప్రత్యయాలు పరమైనప్పుడు కలిగే మార్పులను విడివిడిగా పరిశీలించాల్సి ఉంది. అజాది కృత్ ప్రత్యయాంతాల పరిశీలన పంచమాధ్యాయంలో చేసాను.

భాగవతంలోని హలాది ప్రత్యయాలు పరమైన కృదంతరూపాలను షష్ఠాధ్యాయంలో పరిశీలించాను.

పై రెండు అధ్యాయాల్లో పరిశీలన సాగిన విధం -

1. భాగవతంలోని ప్రయోగం.
2. కృదంత మూలమైన క్రియా పదానికి అర్థాలు.
3. కృదంతానికి గల అర్థాలు.
4. సోదర భాషల్లో సజాతీయ రూపాలు, అర్థాలు.
5. వాటి ఆధారంగా మాతృభాషారూప పునర్నిర్మాణం.
6. దాని ఆధారంగా కృదంత రూప సాధన (వ్యుత్పత్తి సాధన)
7. నిర్వచనం
8. జన్య పదాల ప్రస్తావన

భాగవతంలోని తద్ధితాంతాలను క్రమంగా పరిశీలించాను సప్తమాధ్యాయంలో.

పై మూడు అధ్యాయాల్లో పరిశీలించిన కృత్తద్ధితాంతాల విభాగం, వివిధ కోణాల్లో పరిశీలన, నిరూపణ, ఫలితావిష్కరణ అనేవి అష్టమాధ్యాయంలో చేసాను. ముగించాను.

మొదట వివిధ వ్యాకరణ గ్రంథాలు, వ్యాకరణ పదకోశం ఆధారంగా కృత్తద్ధిత ప్రత్యయాలను ఏరి కూర్చాను. భాగవతమంతా చదివి కృత్తద్ధితాంత పదాలను సంగ్రహించాను. ఆయా పదాల అర్థాలకు శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువును, సజాతీయ పదాల కొరకు D.E.D.,T.V.B. లను ఆశ్రయించాను. వ్యాకరణ చరిత్ర రచనలో అళహసింగరాచార్యుల గ్రంథం, ధ్వని విజ్ఞాన రచనలో ఆధునిక భాషాశాస్త్ర

సిద్ధాంతాలు, వ్యాకరణ పదకోశం చాలా ఉపకరించాయి. గాలి రాధాకృష్ణ గారి వ్యాసం, ద్రావిడ భాషలు పుస్తకం కూడా ఎంతగానో నా పరిశోధనలో ఉపయోగపడ్డాయి.

ఎంత చదివినా , ఎంత చేసినా **భాగవతమ్ము తెలిసి పలుకుట చిత్రమ్ము శూలికైన తమ్మి చూలికైన ...** అని పోతన నే చెప్పినట్లు ఇంకా ఎంతో మిగిలే ఉంటుంది.నా దృష్టిలోకి రాని పదాలు ,వచ్చినా DTP సమయంలో తప్పిపోయినవి...ఇలా ఎన్నో.ఏది ఏమైనా **విద్యావతాం భాగవతే పరీక్షా** అని అన్నట్లు నన్ను విశ్వవిద్యాలయం వారు భాగవతంలోనే పరీక్షిస్తున్నారు. మా అమ్మకు కూడా భాగవతం అంటే ఎంతో ప్రీతి.మృత్యుముఖంలో ఉన్న ఆమె చివరిసారిగా మా నాన్నను కోరిన కోరిక ఒక్కటే "గజేంద్రమోక్షం చదివి వినిపించరూ?" అని అట.అందుకే ఈ అవకాశం నా భాగ్యం కొద్ది దొరికిందని భావిస్తున్నాను.

చిన్న నాటి నుండి నా అధ్యయనమంతా సంప్రదాయ పద్ధతిలో సాగింది. నేను వ్యావహారిక భాషలో రచన సాగించినా, దాని ప్రభావం (రచనలో గ్రాంథిక భాష) నుండి తప్పించుకోలేక పోయాను. పరిహరించే ప్రయత్నం ఎంతచేసినా, "నేనున్నాను" అంటూ అక్కడక్కడ అది తొంగి చూసింది. ముఖ్యంగా కోశం నుండి అర్థాలు స్వీకరించినప్పుడు, వ్యాకరణాంశాల నిరూపణ సమయంలో. భాషా శాస్త్రపు సాంకేతికాల వాడకం కూడ రచనలో విరివిగానే చేసాను. అది కొంచెం రచనకు క్లిష్టత కలిగించినా, శాస్త్ర విషయ రచనలో అది తప్పదనేది వాస్తవం.

ఈ పరిశోధనకు ప్రత్యక్షంగా, పరోక్షంగా సహకరించిన వారు ఎందరో మహానుభావులు - శీర్షిక సూచించిన ఎల్లూరి శివారెడ్డి గారు; వెన్నుతట్టిన కసిరెడ్డి వేంకటరెడ్డి గారు, మిత్రులు జనమంచి విఠలేశ్వర శర్మ; పరిశోధనా మార్గ నిర్దేశం చేసిన అనంతలక్ష్మి గారు; తెలుగు విభాగాధ్యక్షులు సుమతీ నరేంద్ర గారు, గ్రంథ సహాయం చేసిన మిత్రులు నల్లూరి రాజేంద్రప్రసాద్, రామోర్జుల సుమన్; రచనంతా చదివి సూచనలు చేసిన మిత్రులు పెన్నా శివరామకృష్ణ; జాడ్యంతో రచనలో స్తబ్దుగా ఉండే నన్ను ఎప్పటికప్పుడు మేల్కొలిపి సంపూర్తయ్యే వరకు వెంబడించి పూర్తి చేయించిన శ్రీమతి కళ్యాణి, చిరంజీవి విమల్ ఆత్రేయ, నిట్టూరి శరత్, శ్రీనివాస్,అభినవ్‌లు నా పరిశోధనా గ్రంథాన్ని డి.టి.పి. చేయించే బాధ్యత స్వీకరించిన జె.పి. ప్రింట్ సిస్టమ్స్ ప్రైవేట్ లిమిటెడ్ అధినేత మాథ్యూస్ పీటర్ గారు, డి.టి.పి. ఆపరేటర్ వీరాస్వామి... వీరందరికీ నా కృతజ్ఞతలు.

నా యీ రచన తెలుగు భాషా పరిశోధనలో భవిష్యత్ తరాలకు ఏ విధంగా తోడ్పడినా నా పరిశోధన సార్థకంకాగలదు.

- రామక పాండురంగ శర్మ

# విషయ సూచిక

**సంకేతాలు :-**

జ. జన్యపదాలు

ü ధాతువు

* మూలద్రావిడ రూపం

> ఎడమవైపు పదం నుండి కుడి వైపు పదం పుట్టిందని / ఏర్పడిందని అర్థం.

ఉదా :- శ్రీ > సిరి. శ్రీ నుండి సిరి ఏర్పడిందని అర్థం.

< ఎడమ వైపు పదం కుడి వైపు పదం నుండి పుట్టిందని అర్థం.

ఉదా :- సిరి < శ్రీ

' ' ఒక పదం యొక్క అర్థాన్ని సూచించడానికి భాషాశాస్త్రం దీని (సింగిల్ కోటేషన్) ని వాడుతారు.

ఉదా :- నేత్రం 'కన్ను' (అంటే నేత్రం పదానికి కన్ను అనేది అర్థం)

\ అందువల్ల (Therefore)

→ ఎడమవైపు పదం కుడివైపు ఉన్నట్లు పరిణమించింది.

**సంకేతాక్షరాలు :-**

వి. విశేష్యం

విణ విశేషణం

స.క్రి. సకర్మక క్రియ

అ.క్రి. అకర్మక క్రియ

చూ చూడుము

ఉదా ఉదాహరణ

జ జన్యపదాలు

క్రి.విణ క్రియా విశేషణం

మూ.ద్రా. మూల ద్రావిడం

మూ.మ.ద్రా. మూల మధ్య ద్రావిడం

| | |
|---|---|
| మూ.ద.ద్రా. | మూల దక్షిణ ద్రావిడం |
| భాగ. | భాగవతం |
| సూ.రా.ని. | శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు |
| DED | Dravidan Etymological Dictionary |
| TVB | Telugu Verbal Bases |
| శ.ర. | శబ్ద రత్నాకరం |
| బా.వ్యా. | బాల వ్యాకరణం |

## <u>భాషా సంకేతాలు.</u>

| | | | |
|---|---|---|---|
| క. | కన్నడ | కు. | కుడుఖ్ |
| కువి. | కువి | కూ. | కూయి |
| కొం | కొండ | కొ. | కొడగు |
| కో. | కోలామి | కోత. | కోత |
| గ. | గదబ | గోం. | గోండీ |
| త. | తమిళం | తె. | తెలుగు |
| తొ. | తొద | నా. | నాయకి |
| ప. | పర్జి | పెం. | పెంగో |
| బ్రా. | బ్రాహూయీ | మం | మండ |
| మ. | మలయాళం | సం. | సంస్కృతం |

# శ్రీమదాంధ్ర మహాభాగవతంలోకృత్తద్ధిత ప్రయోగాలు

# భూమిక

## 1.1 భాష - మాహాత్మ్యం

భాషారూపాయై నమః[1]

ఈ లోకంలో ప్రతి ప్రాణీ మౌలికంగా జీవించేందుకు ప్రయత్నిస్తుంది. ప్రాణుల సకల ప్రయత్నాలూ అందుకే. మానవుడు కూడా ఒక ప్రాణే. కావున మానవునిలోనూ ఆ లక్షణం ఉంది.

కాగ, మానవుడు విలక్షణమైన ప్రాణి. మిగిలిన ప్రాణుల్లో లేనిదీ, మానవునిలో మాత్రమే ఉన్నదీ - జ్ఞానం. ఈ జ్ఞానం వలన మానవుడు కేవలం జీవించేందుకే కాక అంతకంటే విశిష్ట / విలక్షణ ప్రయత్నం చేస్తాడు. ఆ ప్రయత్నమే - అత్యంత 'దుఃఖ నివారణ, సుఖప్రాప్తి'.

ఈ దుఃఖ నివారణ కొరకు, సుఖప్రాప్తి కొరకూ నిరంతరం అన్వేషిస్తుంటాడు. అందుకోసం విజ్ఞానాన్ని సముపార్జిస్తూ ఉంటాడు. దీనికీ ఓ క్రమముంది. అది - మొదట అధ్యయనం, తర్వాత - పరిశోధన. ఆ తర్వాత - ఫలితావిష్కరణ.

ఈ విధమైన విజ్ఞాన సముపార్జనలో భాగంగానే తాను కనుగొన్న విషయాలనెన్నింటినో మానవ లోకానికి అందించారు - మనీషులు. ఆ క్రమంలో వెలువడినవే వేదాలు, శాస్త్రాలు, కళలు,.... మొదలగునవి ఎన్నో. ఎంత నేర్చినా, ఎన్ని కనుగొన్నా మానవునికి తృప్తి లేదు. విజ్ఞాన తృష్ణ తీరలేదు. అందుకే ఇంకా శోధిస్తున్నాడు. ఎంతో భౌతిక విజ్ఞానాన్ని అభివృద్ధి చేసాడు. కంప్యూటర్లు, రాకెట్లు, మొదలైనవి ఎన్నో కనుగొన్నాడు. గ్రహాంతర విషయాలనూ శోధిస్తూ ఉన్నాడు. ఇంకా ఎంతో విజ్ఞానం సమకూరుస్తాడు.

ఇంతగా సాధించ గలిగే మానవుని శక్తి - ఏమిటి? - "జ్ఞానం". అది ఏ విధంగా ఉంటుంది? అంటే - 'భాషారూపం'గా. అందుకే యోగులు శక్తిని "భాషారూపాయైనమః" - అని కీర్తించారు.

ఈ ప్రపంచంలోని ఏ శాస్త్రజ్ఞుడైనా, ఏ మేధావి అయినా ఏదో ఒక భాషలో ఆలోచిస్తేనే - 'ఉన్నది' అర్థమౌతుంది. 'కొత్తది' స్ఫురిస్తుంది. ఏ భాషాలేకుండా ఏ ఆలోచనా లేదు. ఆలోచన లేనిది విజ్ఞానమే లేదు. విజ్ఞానం లేనినాడు ఇన్ని శాస్త్రాలు లేవు. ఇంత భౌతిక సంపదా లేదు. భర్తృహరి కూడ -

"ఇతికర్తవ్యతా లోకే సర్వా శబ్ద వ్యపాశ్రయా[2]"

"ఈ పనిని ఇలా చేయాలి" అని భావించడం అంతా శబ్దాన్ని ఆశ్రయించే ఉంటుంది"

అని చెబుతాడు

ఒక్క మాటలో చెప్పాలంటే - భాష అనేదే లేకుంటే, మిగతా ప్రాణులకు, మానవునికీ భేదమే లేదు. అందుకే అంటాడు సంస్కృత కవి దండి -

**" ఇదమంధం తమః కృత్స్నం**

**జాయేత భువన త్రయమ్।**

**యది శబ్దాహ్వయం జ్యోతిః**

**ఆ సంసారం న దీప్యతే[3]॥"**

- అని.

("సృష్ట్యాది నుండి 'శబ్దం' అనే జ్యోతే వెలుగకుండా ఉంటే ఈ ముల్లోకాల్లో పూర్తిగా గుడ్డి చీకటి ఆవరించేది" - అని దీని భావం)

**నసోస్తి ప్రత్యయోలోకే**

**యశ్శబ్దాను గమాదృతే।**

**అనువిద్ధ మివ జ్ఞానం**

**సర్వం శబ్దేన భాసతే[4]"॥**

(శబ్ద సంబంధం లేని జ్ఞానమే లేదు. జ్ఞానమంతా శబ్దంతో మాత్రమే ప్రకాశిస్తుంది)

అంతేకాక -

**ఇహ శిష్టాను శిష్టాణాం శిష్టానామపి సర్వదా।**

**వాచామేవ ప్రసాదేన లోకయాత్రా ప్రవర్తతే" [5]॥**

(పాణిని మొదలైన శిష్టులు, వారి అనుయాయులు, ఇతరులు సూచించిన వాక్కుల వల్లనే ఈ లోకయాత్ర సాగుతుంది.)

భాష యొక్క ఈ గొప్పదనాన్నే వేదం ఈ విధంగా వర్ణిస్తుంది.

**"దేవీం వాచ మజనయన్త దేవాః**

**తాం విశ్వరూపాః పశవో వదన్తి।**

**సానో మంద్రేష మూర్జం దుహానా**

**ధేను ర్వాగ స్మానుపసుష్టు తైతు"॥**

(దేవతలు వాగ్దేవిని సృష్టించారు : ఆ వాక్కును వ్యక్త వాక్కులూ, అ వ్యక్త వాక్కులూ ఐన సర్వజంతువులూ ఉపాసిస్తాయి. బాగా స్తుతింపబడిన ఆ వాగ్దేవి స్తుతిచే సంతోషించినదై, వరాలిచ్చి, సంతోషాన్ని కలిగేట్టు చేస్తూ - అన్నాన్నీ, పాలూ, నెయ్యీ వంటి రసాల్నీ ఇచ్చే ధేనువై మమ్మల్ని పొందుగాక[6]!)

అంతేకాక -

**"కేయూరాణి న భూషయన్తి పురుషం హారా న చంద్రోజ్జ్వలాః**

**న స్నానం న విలేపనం న కుసుమం నాలంకృతా మూర్ధజాః।**

**వాణ్యేకా సమలం కరోతి పురుషం యా సంస్కృతా ధార్యతే**

**క్షీయంతే ఖలు భూషణాని సతతం వాగ్భూషణం భూషణమ్"[7]॥**

(పురుషుడికి దండకడియాలు, చంద్రోజ్జ్వలాలైన హారాలు, స్నానం, విలేపనం, పుష్పం, కేశాలంకరణ.... ఇత్యాదులేవీ అలంకారాలు కావు. సంస్కరింపబడిన వాక్కు ఒక్కటే అతడిని అలంకరిస్తుంది. ఆ భూషణాలన్నీ నశిస్తాయి. కాని, వాగ్భూషణం ఎల్లప్పుడుండే సుభూషణం). అందుకే మన పూర్వులు శబ్దాన్ని ఉపాసన బ్రహ్మగా పేర్కొన్నారు.

**"ద్వేబ్రహ్మణీ వేదితవ్యే శబ్దబ్రహ్మపరంచయత్।**

**శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరంబ్రహ్మాధి గచ్ఛతి"[8])**

**కాబట్టి సకల విజ్ఞానాలకు మూలమైన *భాష ఆలోచించదగినది. పరిశోధించదగినదీనూ.***

కాగ, ఆ శక్తి (వాక్కుకు శబ్దానికి) భాషకు ఎప్పుడు కలుగుతుంది?

### 1.2 సుశబ్దమాహాత్మ్యం :-

మధుమత్యై నమః[9]

ఆ వాక్కు మధుమతి - అమృతమయమైనప్పుడు - దానికి ఆ శక్తి.

"ఏకః శబ్దః సుప్రయుక్తః సమ్యజ్ఞాతః స్వర్గేలోకే కామధుక్ భవతి"

("ఒక శబ్దాన్ని చక్కగ తెలిసికొని , చక్కగా ప్రయోగిస్తే - అది స్వర్గలోకంలోని కామధేనువు అవుతుంది. అంటే కోరికలన్నీ నెరవేరుస్తుంద"ని భావం).

ఈ విషయాన్ని చక్కగా తెలిసికొన్న మన పూర్వులు ఆ వాగీశ్వరిని 'మధుమతి' గా ఉపాసించారు.

పై విషయాన్నే దండి -

**" గౌర్గౌః కామదుఘా సమ్యక్**

**ప్రయుక్తా స్మర్యతే బుధైః।**

**దుష్ప్రయుక్తా పునర్గోత్వం**

**ప్రయోక్తుః సైవ శంసతి"[10]॥**

( 'గౌః' శబ్దానికి గోవు, వాక్కు మొదలైన అర్థాలున్నాయి. "గౌః" అనేది చక్కగా ప్రయోగిస్తే - పండితులు కామధేనువును స్మరిస్తారు. ఆ "గౌః" దుష్ప్రయుక్తమైతే అది ప్రయోగించినవాడినే సూచిస్తుంది. అంటే ప్రయోగించినవాడే గోవు / పశువు - అని భావం).

అని సుశబ్ద మాహాత్మ్యాన్ని, దుశ్శబ్దం వలని నష్టాన్ని వివరించాడు. కాబట్టి సుశబ్దమే ప్రయోగించాలి. అపశబ్దం ప్రయోగించవద్దు

మరి - "ఇది సుశబ్ద" మని, "ఇది దుఃశబ్దమ"ని ఎలా తెలుసుకోవాలి?

### 1.3 వ్యాకరణజ్ఞానం - అవసరం:-

**సాధుత్వజ్ఞాన విషయా**

**సైషా వ్యాకరణ స్మృతిః।**

**అవిచ్ఛేదేన శిష్టానాం**

**ఇదం స్మృతి నిబంధనం[11]॥**

(శబ్దం యొక్క సాధుత్వ జ్ఞాన విషయకమైన శాస్త్రం వ్యాకరణం. అది పెద్దల ఉపదేశాన్ని అనుసరించే ప్రవర్తిస్తుంది).

వాల్మీకి కూడా అంటాడు -

**"నూనం వ్యాకరణం కృత్స్నం అనేన బహుధా శ్రుతమ్।**

**బహు వ్యాహరతానేన నకించి దప శబ్దితమ్"[12]॥**

(సీతను వెనుకుతూ రామలక్ష్మణులు అరణ్యంలో తిరుగుతుంటారు. వారిని దూరంగానే గమనించిన సుగ్రీవుడు ఆంజనేయుని వారి వద్దకు పంపిస్తాడు. అతని మాటలు విన్న రాముడు లక్ష్మణునితో అంటున్న మాటలివి.

" ఈతడు వ్యాకరణాన్నిపూర్తిగా తెలిసినవాడు. ఎంతగా మాట్లాడినా - ఒక్క అపశబ్దం కూడ లేదు" - అని)

**కాబట్టి సుశబ్ద జ్ఞానానికి 'వ్యాకరణం' తెలియాలి.**

వైకరణుల సూక్తి ఒకటి ఉంది -

**"యద్యపి బహు నాధీషే**

**తథాపి పఠపుత్ర వ్యాకరణమ్।**

**స్వజనః శ్వజనో మాభూత్**

**సకలం శకలం సకృచ్ఛకృత్"॥**

(పుత్ర! ఇతర శాస్త్రాలు ఎక్కువగా చదువకున్నా వ్యాకరణం మాత్రం చదువు. 'స్వజనుడి'ని, 'శ్వజనుడ'ని, 'సకలం'ను 'శకల'మని, 'సకృత్' ను 'శకృత్' అని పలుకకుందువు గాక. అంటే వ్యాకరణం వలననే సుశబ్ద జ్ఞానం కల్గుతుందని, అర్థ జ్ఞానం కలుగుతుందని - అర్థం)

అంతే కాక -

**"సంస్కారేణ యథా హీనాం వాచమర్థాంతరం గతాం"[13]॥**

(ఆంజనేయుడు - లంకలో ఉన్న సీతను - "సంస్కారహీన మగుటచే అర్థాంతరం పొందిన వాక్కు వలె" చూసెను.) కాబట్టి సంస్కారహీనమైన వాక్కు ఇవ్వవలసిన అర్థాన్ని ఇవ్వక వేరొక అర్థాన్ని స్ఫురింప చేస్తుంది. కాబట్టి శబ్దానికి సంస్కారం అవసరం. అది వ్యాకరణం వల్లనే కలుగుతుంది.

**కాబట్టి <u>వ్యాకరణాధ్యయనం, పరిశోధన చేయాలి.</u>**

భాషలో ఉండేవి శబ్దార్థాలు. అవి రెండూ కలిసే ఉంటాయి. ఆ విషయాన్నే ప్రస్తుతిస్తూ కాళిదాసు -

**"వాగర్థావివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే।**

**జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ"[14]॥**

**అంటాడు. కాబట్టి <u>భాషాధ్యయనంలో శబ్దార్థాల పరిశోధన చేయాలి.</u>**

## 1.4 శబ్దవిభాగం :-

శబ్ద ప్రపంచాన్ని మన పూర్వులు విభజించారు. యాస్కుని ప్రకారంగా శబ్దభేదాలు (1) నామం (2) ఆఖ్యాతం (3) ఉపసర్గ (4) నిపాతం[6]. కాని ఈ విభాగంలోని నామాలు, ఆఖ్యాతాలు (క్రియలు), నిపాతాలు (అవ్యయాలు) తెలుగులో ఉన్నా, ఉపసర్గలు తెలుగులో లేవు.

" నామాలు ఆఖ్యాతజాలు"(ధాతువుల నుండి పుట్టినవి) - అనే సిద్ధాంతమున్నట్లు యాస్క నిరుక్తం వల్ల తెలుస్తుంది. నాటికే 'గార్గ్యుడు' మొదలైన కొందరు వైయ్యాకరణులు నామాలన్నింటిని ధాతుజాలుగా ఆమోదించలేదు[17].

ధాతువుల నుండి పుట్టిన నామాలను - 'కృదంతా'లని అంటారు. నామాలే అదనంగా ప్రత్యయాలను చేర్చుకొని ఏర్పడిన శబ్దరూపాలను 'తద్ధితాంతా'లని అంటారు. ఈ కృత్తద్ధి తాంతాలతో 'సమాసాల' ను పుట్టించవచ్చు. ఈ విభాగం స్థూలంగా - ఇది -




నూతన శబ్ద సృష్టికి కృత్తద్ధితాలు ఎంతగానో దోహదం చేస్తాయి. నేటి కాలంలో వెలువడుతున్న ఎన్నెన్నో కొత్త కొత్త శాస్త్రాలను మన భాషలో వ్యాఖ్యానించడానికి,వాటి పరిభాషను సృష్టించడానికి కృత్తద్ధితాలను అధ్యయనం చేయడం అవసరం.

ఇంత వరకూ చేసిన చర్చ వల్ల -

(అ)మానవ అభివృద్ధికి కారణమైన భాషను పరిశోధించాలి;

(ఆ) సుశబ్ద జ్ఞానానికి వ్యాకరణాధ్యయనం, పరిశోధన చేయాలి .

(ఇ) నూతన పదసృష్టికి కృత్తద్ధితాలు అవసరం,అందుకే వాటిని పరిశీలించాలి.

- అని తేలింది.

ఈ సందర్భంగా కలిగే సందేహం-'ఎక్కడి పదాలను పరిశీలించాలి ?.

**"లౌకికానాం హి సాధూనాం**

**అర్థం వాగనువర్తతే।**

**ఋషీణాం పునరాద్యానాం**

**వాచమర్థోనుధావతి"[15]॥**

అనే భవభూతి సూక్తి మేరకు **ఋషి తుల్యుడూ, వాక్సిద్ధి నొందిన వాడూ అయిన పోతన కవిత్వం లోని శబ్దార్థాల పరిశోధన చేయాలి.**

## 1. 5. శ్రీమదాంధ్ర మహా భాగవతం - పరిశోధనీయత

" ప్రయోగ శరణం వ్యాకరణం" అనేది సూక్తి .అంటే మహాకవి ప్రయోగాన్ని అనుసరించి వ్యాకరణం దాని అధ్యయనం ప్రవర్తిల్లుతుంది. " విద్యావతాం భాగవతే పరీక్షా" అని పెద్దల మాట.విద్యావంతులను (వారి విద్యల్లో) పరీక్షించాలంటే భాగవతంలో పరీక్షించాలి. కాబట్టి భాగవతం సకల విద్యా విషయమని తేలింది.అందుకే కృత్తద్ధిత పరిశోధన (వ్యాకరణ పరిశోధన) భాగవతంలో చేయాలి. అంతేకాక-

**కొందఱికి దెనుగు గుణమగు**

**గొందరికిని సంస్కృతంబు గుణమగు రెండున్**

**గొందరికి గుణములగు నే**

**నందరి మెప్పింతు గృతుల నయ్యై యెడలన్[18]**

అంటూ పోతన భాగవతారంభంలో ప్రతిజ్ఞ చేసాడు. ఇందులో- సంస్కృతాన్ని నచ్చినవారంటూ మార్గ కవులను, తెలుగు నచ్చిన వారంటూ దేశీ కవులను ప్రస్తావించాడు. కాని తాను మాత్రం ఆయా సందర్భాల్లో అవసరమైన భాష ప్రయోగిస్తూ అందరినీ మెప్పిస్తానన్నాడు.కాబట్టి- అటువంటి భాషాప్రయోగరహస్యాలు తెలిసిన కవి రచనలో

భాషాపరిశోధన చేయడం సమంజసం.

పై పద్యంలో సందర్భానుసారం తాను భాషను మలచుకున్నాననడంలో-"భాషను అవసరాలకు అనుగుణంగా మలచుకోవాలి"అనే సూచన కూడా ఉంది.

అంతేకాక-తూమాటి దొణప్పగారు ఇలా చెప్పారు " 'శబ్దశాస్త్రవేది హృదయంబులాగున విశద ప్రకాశాభిరామంబై .......'(భాగ.10పూ.763) అని పోతన సూచించినందువల్లనూ, 'భవతి ధాతువెట్లు భావార్థమై సర్వధాతుగణమునందు దనరునట్లు ....'(భాగ.10పూ.589) అని మూలంలోని 'సర్వేషామపి ధాతూనాం భావార్థో భవతి స్మృతః' అన్న భాగాన్ని తెనిగించడంవల్లనూ ఆయనకు గల లక్ష్య శుద్ధీ,శబ్ద శాస్త్రంపై గల ప్రామాణిక బుద్ధీ సుస్పష్టమవుతున్నవి"[19] అని.కాబట్టి పోతనగారి ఆంధ్ర భాగవతం వ్యాకరణపరిశోధనకు అనువైనది.

అంతేకాక-**" పలికెడిది భాగవతమట**

**పలికించెడి విభుడు రామభద్రుండట......"**(భాగ.1-16) అని చెప్పడం వల్ల భాగవతం తెలుగువారి అభిమాన దైవమైన రామప్రోక్తం.ఆ స్వామి "శబ్దశాస్త్రంబునకుం గారణంబు(భాగ.3-57)" అందుకే దాన్ని పరిశోధించాలి.

### 1.6. ప్రస్తుత గ్రంథ క్రమము:-

ఈ గ్రంథంలో పోతన రచించిన శ్రీమదాంధ్ర మహాభాగవతమందలి కృత్తద్ధితాంతాల పరిశీలన చేయబడుతుంది. దాని క్రమము -

(1) శ్రీమదాంధ్ర మహాభాగవత మందలి కృత్తద్ధితాంతాలను ఏరడం

(2) ఆ పదాలను ప్రత్యయాల వారీగా విభజించడం.

(3) సోదర భాషల్లో ఆయా పదాల సరూపాల తో పోల్చి చూడడం.

(4) పై తారతమ్య పరిశీలన వలన తెలిసే -

(అ) ధ్వని (ఇ) శబ్దరూపం (ఉ) అర్థం

అనే వానిలో కలిగే మార్పులు మొదలగునవి వర్ణించడం.

(5) మూ.ద్రా. రూపం తెలిపి, దానిపై ధ్వని నియమానుసారం ఆ శబ్ద రూప నిర్మాణం చేయడం.

(6) ఆ 'శబ్దాన్ని' ఆయా అర్థాలకు అనుగుణంగా నిర్వచించడం.

(7) ఆ శబ్ద జన్యాలైన ఇతర శబ్దాలను పేర్కొనడం (ఇది భావి పరిశోధకుల కొరకు).

(8) ప్రత్యయాంత సమీక్ష.

ఈ పరిశీలనలో - ఉపకరించే శాస్త్రాలు - (1) వ్యాకరణం (2) నిరుక్తం (3) భాషాశాస్త్రం (4) శీక్షా అనేవి. కావున మొదట వీని చరిత్ర సంగ్రహంగ చెబుతాను. శబ్దార్థ పరిణామాలను అవసరం మేరకు ప్రస్తావిస్తాను. ఆ తర్వాత కృత్తద్ధితాంతాల పరిచయం చేస్తాను. ఆ తరువాత ప్రధాన గ్రంథం సాగుతుంది.

**1.7. ఈ పరిశీలన వలన తెలిసే విషయాలు -**

(1) ఒకే భాషలో చారిత్రకంగా వచ్చిన మార్పులు

(2) సోదర భాషల్లోని పోలికలు, భేదాలు.

(3) మాతృభాషలోని పద, ప్రత్యయ జ్ఞానం

(4) నేటి భాష పారిభాషికపదాల స్వరూపం, తీసుకోవాల్సిన జాగ్రత్తలు.

**1.8. ఈ పరిశోధన వలన కలిగే ప్రయోజనాలు :-**

1. మాతృభాషా పదాల, ప్రత్యయాల పునర్నిర్మాణం (భూత కాల సంబంధి)

2. కృత్తద్ధితాల పరిశీలన వలన వ్యుత్పత్తి జ్ఞానం (వర్తమానం).

3. నూత్న పద సృష్టికి, పారిభాషిక పద సృష్టికి దోహదం (భవిష్యత్).

# పాద సూచిక

1. లలితా సహస్ర నామావళి - నామ సంఖ్య - 679.
2. వాక్య పదీయం 1 - 121.
3. దండి -కావ్యా దర్శః 1 - 4.
4. వాక్య పదీయం 1 - 123.
5. దండి -కావ్యా దర్శః 1 - 3.
6. ఋగ్వేదం 8 -89 - 11.
7. భర్తృ హరి - సుభాషిత త్రిశతి - నీతి శతకం .
8. మైత్రాయిణీ ఆరణ్యకం 6 - 22.
9. లలితా సహస్ర నామావళి - నామ సంఖ్య -717.
10. దండి -కావ్యా దర్శః 1 - 6.
11. వాక్య పదీయం 1 - 142.
12. వాల్మీకి రామాయణం - కిష్కింధ కాండ - 3 - 29.
13. వాల్మీకి రామాయణం -సుందర కాండ - 15 - 137.
14 .కాళిదాసు - రఘు వంశ : -1 -1.
15 .భవభూతి ఉత్తర రామ చరితం .1 - 10.
16. తద్యాన్యేతాని చత్వారి పదజాతాని . నామాఖ్యాతే చోప సర్గ నిపాతాశ్చ.యాస్కుడు - నిరుక్తం.1.1.1.
17.తత్ర నామాన్యాఖ్యాతజానీతి శాకటాయనః నైరుక్త సమయశ్చ . న సర్వాణీతి గార్గ్యః. వైయ్యాకరణానాం చైకే.-యాస్కుడు - నిరుక్తం.1-4 -12.
18. భాగవతం.1-18.
19. తూమాటి దొణప్ప-సింహావలోకనం-భాగవతం-తెలుగు విశ్వవిద్యాలయం.

# శ్రీమదాంధ్ర మహా భాగవతంలో కృత్తద్ధిత ప్రయోగాలు

## అనుబంధ శాస్త్ర పరిచయం

**2.0. అవతారిక :-**

రాబోయే అధ్యాయాల్లో పరిశీలించబోయే కృత్తాద్ధితాంతాలను -

(అ) ప్రకృతి ప్రత్యయాత్మకంగా విభజిస్తాము. అది వ్యాకరణాధీనం. కాబట్టి అవసరమైనంతవరకు వ్యాకరణం గూర్చిన పరిచయం చేసుకోవాలి.

(ఇ) నిరుక్త పద్ధతిన నిర్వచిస్తాము. కాబట్టి నిరుక్తం గూర్చిన పరిచయం అవసరం.

(ఉ) కృతద్ధితాల నిరూపణ సమయంలో ఆయా పదాల ధ్వన్యాత్మకమైన పరిణామాలను పరిశీలిస్తాము.కాబట్టి ధ్వని శాస్త్రం - శిక్షా. దాని పరిచయం అవసరం.

(ఋ) పరిశీలనఅంతా సోదర భాషలతో తులనాత్మకంగా చేయవలసి ఉంటుంది. ఇది తులనాత్మక భాషా శాస్త్ర సంబంధి. అంతేకాక ఈ పై పరిశీలనాత్మక పద్ధతులన్నీ భాషా శాస్త్ర అనుబంధ విషయాలు. కాబట్టి భాషా శాస్త్ర పరిచయం కూడా అవసరం.

కాబట్టి పై శాస్త్రాలను అవసరం మేరకు పరిచయం చేస్తాను.

## 2.1. వ్యాకరణం

**2.1.0 వ్యాకరణం ప్రాచీనత: -**

వ్యాకరణం చాలా ప్రాచీనమైన శాస్త్రం. దీని ప్రస్తావన ప్రప్రథమంగా తైత్తిరీయ సంహితలో[1] కనిపిస్తుంది. దాని ప్రకారం ఇంద్రుడు మొట్టమొదటి వ్యాకరణకారుడు. ఋక్తంత్రంలో- "బ్రహ్మ బృహస్పతికి, బృహస్పతి ఇంద్రునికి, ఇంద్రుడు భరద్వాజునికి, ఆయన ఋషులకు, వారు బ్రాహ్మణులకు వ్యాకరణాన్ని ఉపదేశించారు"[2] అని ఉంది. పై వానివల్ల ఈ శాస్త్రం యొక్క ప్రాచీనతను ఊహించచ్చు. ఇంద్రుడిని ప్రథమ వ్యాకర్తగా స్వీకరించినా వ్యాకరణ శాస్త్రం 21, 65, 050 సంవత్సరాల ప్రాచీనమని శ్రీయుధిష్ఠిర్ మీమాంసక్ నిరూపించారు.[3]

"వ్యాక్రియతే అనే నేతి వ్యాకరణమ్" దీనిచే శబ్దాలు వ్యాకరించబడుతాయి. ప్రకృతి, ప్రత్యయ విభాగం నిరూపింపబడుతుంది. 'వ్యాకృ' ధాతువునకు విభజనార్థంలో వేదంలోనే ప్రయోగాలున్నాయి. "నామ రూపే వ్యాకరవాణి', 'దృష్ట్వా రూపే వ్యాకరోత్" ఇత్యాదులు. వ్యాకరణంలో ఉపయోగించబడే పారి భాషిక పదాలు - గోపథ బ్రాహ్మణంలో ఇలా దర్శనమిస్తాయి. అవి -

"ఓం కారః పృచ్ఛామః, కోధాతుః? కింప్రాతిపదికమ్? కిం నామాఖ్యాతమ్? కిం లింగం? కిం వచనం? కా విభక్తిః? కః ప్రత్యయః? కః స్వరోపసర్గ నిపాతః? కింవై వ్యాకరణమ్? కోవికారః? కోవికారీ? కతిమాత్రా? కతి వర్ణాః? కత్యక్షరాః? కతి పదాః? కః సంయోగః? కిం స్థానానుప్రదాన కరణమ్? శైక్షికాః కి ముచ్చారయన్తి! కిం ఛందః, కో వర్ణ ఇతి పూర్వప్రశ్నాః!"

పై మంత్రం "ఓం కారమును" గూర్చి ప్రశ్నిస్తూ సాగింది. ఈ విధంగా ఒక పదం గూర్చి ఎన్ని విధాలుగా విచారించాలో కూడా వేదం ఉపదేశిస్తుంది.

ఇంతేగాక, మైత్రాయణీ సంహితలో, ఐతరేయ బ్రాహ్మణంలో ఆరు విభక్తుల గురించి ఏడు విభక్తుల గురించీ ప్రస్తావన ఉంది.[4]

### 2.1.1 సంస్కృతవ్యాకరణం - కృత్తద్ధితాలు: -

**1.పాణిని[5] :-**

పాణిని తన వ్యాకరణంలో 110 వరకు కృత్ ప్రత్యయాలను పేర్కొన్నాడు. ఇవి కాక 'ఉణాది' ప్రత్యయాలు - 325. ఇవి కూడా కృత్ప్రత్యయాలే. వీటిని శాకటాయనాది వైయాకరణులు ప్రతిపాదించారు. ఇవి పాణిని సమ్మతాలే కాని పాణిని ప్రోక్తాలు కావు. ఈ విధంగా ధాతువుల కంటే పరమై నామరూపాల నిష్పాదించేందుకు 435 కృత్ప్రత్యయాలు సహాయం చేస్తున్నాయి. (వీని వివరాలు - ప్రస్తుత పరిశోధనలో అవసరం లేకపోవడం వలన స్పృశించడం లేదు).

పాణిని అష్టాధ్యాయిలో 4-1-76 తో ప్రారంభించి పంచమాధ్యాయాంతం తద్ధిత ప్రత్యయాలను ఇంచుమించుగా 1114 సూత్రముల్లో ఉపదేశించాడు. వీటిలో ప్రతిపాదించబడిన తద్ధితప్రత్యయాలను అకారాది క్రమంలో చూస్తే 237

ప్రత్యాయాలుగా గుర్తించవచ్చు. తెలుగు వ్యాకరణాల్లో తద్ధితాలు తక్కువగా ఉండగా, సంస్కృతంలో మాత్రం ఈ ప్రక్రియ విస్తృతంగా ఉంది[6].

లోకంలో పద ప్రయోగానికి ఈ తద్ధితాలు ఎంతగానో ఉపకరిస్తున్నాయి. అందునా దక్షిణదేశస్థులు తద్ధితాంత ప్రయోగాలను ఆదరిస్తారనీ, **"ప్రియతద్ధితాః దాక్షిణాత్యాః"** అని పతంజలి పలికాడు. అంతేకాక వైయాకరణుల సూక్తి ఒకటుంది -

**"తద్ధిత మూఢో వైయ్యాకరణః**

**తద్ధిత మూఢో వైయ్యాకరణః"** - అని.

తద్ధితం + ఊఢః = తద్ధితంను బాగుగా వహించిన వాడు (అభ్యసించినవాడు) వైయ్యాకరణుడు; తద్ధితంను తెలియని మూఢుడు అవైయ్యాకరణుడని - అర్థం. పాణినిః, కాత్యాయనః, వైయ్యాకరణః మొదలగు రూపాలను తద్ధిత ప్రక్రియలో విశేష పరిశ్రమ చేసిన వారుమాత్రమే సాధించగలుగుతారు.

సాధారణంగా ప్రత్యయాలు ప్రకృతికి పరంగా ఉంటాయి. కాని తద్ధిత ప్రత్యయాల్లో మాత్రం 'బహుచ్' అనే ప్రత్యయం పూర్వ ప్రత్యయంగా చేరుతుంది.[7] అయితే అటువంటి ప్రత్యయం ఇది ఒక్కటే. 'అకచ్' అనే మరొక్క ప్రత్యయం - ప్రకృతికి మధ్య భాగంలో చేరుతుంది.[8] తక్కిన ప్రత్యయాలన్నీ - సాధారణరీతిన పరప్రత్యయాలే.

**2.ధారాధిపతి భోజుడు[9] (వి.శ. 1075-1110): -**

'సరస్వతీ కంఠాభరణ' మనే ఒక గ్రంథాన్ని రాసాడు. అందులో అలంకార, రసాది విషయాలతో పాటు వ్యాకరణాంశాలు కూడా చర్చించాడు. అందులో గణపాఠం, పరిభాషా పాఠం, లింగానుశాసనం మొదలైన ఎన్నో విషయాలను సూత్రీకరించాడు. ఈయన శబ్దానుశాసనానికి పాణిని వ్యాకరణం, చాంద్ర వ్యాకరణం ముఖ్య ఆధారాలు. ఈ గ్రంథానికి దండనాథుని 'హృదయహారిణీ' అనే టీక ఉన్నట్లు నిఘంటు భాష్యంలో దేవరాజు యజ్వ పేర్కొన్నాడు. దీనికున్న మరొక టీక కృష్ణ లీలాశుకముని రచితం. అది నేటికీ అముద్రితమే.

ఈ సరస్వతీ కంఠా భరణంలో ప్రథమాధ్యాయంలోని తృతీయ, చతుర్థ పాదాల్లో

కృత్తులు నిరూపించి, ద్వితీయాధ్యాయమంతా ఉణాది ప్రక్రియను నిరూపించాడు. వీనిలో చాలా వరకు పాణిని చెప్పిన కృత్ప్రత్యయాలే ప్రతిపాదించాడు. చాలా శబ్దాలు నిపాతాలుగా చూపాడు. దీనిలో ఎన్నో సూత్రాలు పాణినీయాన్ని పోలిఉన్నాయి.

సరస్వతీ కంఠాభరణంలో చతుర్థపంచమాధ్యాయాల్లో తద్ధిత ప్రక్రియ నిరూపించాడు. ఇందులోని ప్రత్యయాలు కూడా చాలా వరకు పాణిని వాటిని పోలిఉన్నాయి. కొన్ని భిన్న ప్రత్యయాలూ ఉన్నాయి. 'పితృవ్యమాతుల మాతామహ పితామహాః' (4-2-36). అని పాణిని నిపాతాలుగా పేర్కొన్న వాటికి భోజుడు ప్రక్రియ తెలిపాడు. సరస్వతీ కంఠాభరణంలోని సూత్రాల్లో కొన్ని పాణిని సూత్రాలకు యథాతథంగా ఉన్నాయి.

భోజుడు ప్రత్యయాలు, సూత్రాలనే కాక అధ్యాయ సంఖ్యలో కూడా పాణినిని అనుకరించినట్లు తెలుస్తుంది.

**3. జీవగోస్వామి[10] :-**

జీవగోస్వామి గొప్ప విష్ణుభక్తుడు. ఈయన 'శ్రీహరినామామృత వ్యాకరణం' అనే పేరుతో వ్యాకరణ శాస్త్ర గ్రంథం రాసాడు. దీనిలోని సూత్రాలు, ప్రక్రియలు పాణినీయాన్ని పోలి ఉన్నాయి. సంజ్ఞలను విష్ణుపరంగా చెప్పడమే ఈ గ్రంథ వైశిష్ట్యం.

పాణిని 'నిష్ఠా' సంజ్ఞను విధించగా, దీనిలో 'విష్ణునిష్ఠా' అని సంజ్ఞ చెప్పాడు. అధికార సూత్రాన్ని 'విభుః' అని, వృద్ధిని 'వృష్ణీన్ద్రః' అని, ప్రత్యయాన్ని 'నృసింహః' అని పేర్కొన్నాడు. స్త్రీ ప్రత్యయ ప్రకరణాన్ని 'లక్ష్మీ ప్రకరణ' మని పేర్కొన్నాడు.

ఇందులో 1227 సూత్రం నుండి 1692 వరకు కృదంత ప్రక్రియ నిరూపించాడు.

తద్ధిత ప్రకరణంలో మొదట 90 సూత్రాల్లో తద్ధిత కార్యాలు వివరించి, తరువాత 2157 నుండి 3192 సూత్రం వరకు తద్ధిత ప్రక్రియలు నిరూపించాడు.

**4. శర్వవర్మ[11] :-**

కాతంత్ర వ్యాకరణకర్త శర్వవర్మ శాతవాహనుడి ఆస్థాన పండితుడు. ఒకటవ శతాబ్దం వాడు. ఇతర శాస్త్రాలు చదువుకునే వారూ, వాణిజ్యాది వృత్తులు చేసేవారూ, స్వల్పమతులూ సంస్కృతాన్ని సులభంగా, స్వల్ప కాలంలో నేర్చుకునేట్టు ఈ వ్యాకరణం రచించినట్లు ఈయన

చెప్పుకున్నారు.

శాతవాహన మహారాజు భార్యతో సహా జలకేళిలో ఉన్నప్పుడు, ఆయన రాణి మీద నీళ్ళు చల్లుతుండగా, ఆమె "మోదకైః తాడయ" (మా + ఉదకైః, తాడయ = నీళ్ళతో కొట్టకు) అన్నదట. దానికి ఆయన మోదకైః = ఉండ్రాళ్ళతో కొట్టమంటుందనుకొని వాటిని తెప్పించినాడట. రాణి అందుకు నవ్వగా రాజు సిగ్గుపడి, శర్వవర్మను సులభంగా, స్వల్ప కాలంలో సంస్కృతం నేర్చుకొనుటకు అనువైన వ్యాకరణం వ్రాయమని కోరగా, అతడు 'కాతంత్ర వ్యాకరణం' రచించాడని కథ.

ఇందులో ప్రత్యాహారామును పరిహరించాడు. స్వరవ్యంజనాది సంజ్ఞలు పూర్వాచార్యులవే గ్రహించారు. వ్యాకరణ విషయాలు కూడా కౌముది పద్ధతిలో కూర్చాడు. ఇందులో (1) సంధి ప్రకరణం (2) నామ ప్రకరణం (3) ఆఖ్యాత ప్రకరణం (4) కృత్ప్రకరణం అని నాలుగు ప్రకరణాలు ఉన్నాయి. వీనిలో కృత్ప్రకరణం, నామ ప్రకరణంలోని తద్ధిత స్త్రీ ప్రత్యయ పాదాలు తరువాత కాలంలో చేర్చారు. ఇందులో వైదిక ప్రక్రియా, అపవాద సూత్రాలు పరిహరించాడు.

ఇందులో సూత్రాల సంఖ్య కృత్ప్రకరణంతో కలిపి 1400. ఇది ప్రముఖంగా కాశ్మీర్, బెంగాల్, శ్రీలంకల్లో వ్యాప్తి లోకి వచ్చింది. దీనికి కౌమార, కాలాప అనే మారు పేర్లు కూడా ఉన్నాయి.

**5. సారస్వత వ్యాకరణం :-**

సారస్వత వ్యాకరణం మహమ్మదీయ రాజుల ప్రోద్బలం వల్ల రచించబడింది. దీనిలో సూత్రాలు 594 మాత్రమే. కర్తపేరు తెలియదు. 13వ శతాబ్దంలో రాయబడినట్లు తెలుస్తుంది. దీనికి అనేక వ్యాఖ్యలు ఉన్నాయి. విల్కిన్స్ సంస్కృత వ్యాకరణానికి మూలం ఈ సారస్వత వ్యాకరణమే. అనుభూతి స్వరూపాచార్యుడు (13-15 మధ్యకాలం) దీనికి వార్తికాలు, వ్యాఖ్య 'సారస్వత ప్రక్రియా' అనే గ్రంథంలో వ్రాసి ప్రచారం కలిగించాడు.

ఇందులో కృత్ ప్రకరణంలో 87 సూత్రాలు ఉన్నాయి. తద్ధిత ప్రకరణంలో 31

సూత్రాలున్నాయి.

ప్రచుర ప్రయోగం గల పదాల రూప నిష్పత్తినీ, అక్లిష్ట ప్రయోగ సరణినీ తెలుపుతూ కావ్యాది పఠన సామర్థ్యం కలిగించడమే సారస్వత వ్యాకరణ లక్ష్యం.[12]

**6. భోపదేవుడు :-**

బోపదేవుని ముగ్ధ బోధ వ్యాకరణం (13వ శతాబ్దం) లో ఐదు అధ్యాయాలు ఉన్నాయి. 1. సంజ్ఞ 2. అజన్త 3. హలన్త 4. సనాద్యన్త 5. కృదన్తాధ్యాయాలు.

వీటిలో చతుర్థాధ్యాయంలో స్త్రీ ప్రత్యయ, కారక, సమాస, తద్ధిత ప్రకరణాలున్నాయి. చివరి అధ్యాయం కృదంతాలను గూర్చి విపులంగా చర్చించింది.

ఇందులో సంజ్ఞలన్నీ ఏకాక్షరాలుగానే ఉన్నాయి. పాణినీయం కంటే లాఘవం సాధించబడింది. గణాలు శ్లోక రూపంలో కాని గద్య రూపంలో కాని వివరింపబడినాయి.

**7. క్రమదీశ్వరుడు :-**

వాదీంద్రచక్రచూడామణి అనే బిరుదు గల క్రమదీశ్వరుడు తన 'సంక్షిప్తసారం' అనే గ్రంథంలో అష్టాధ్యాయి సూత్రక్రమం మార్చి- సంధి, తిజన్త, కృదంత, తద్ధిత, కారక, సుబంత, సమాస అనే క్రమంలో ఏడు పాదాల్లో రచించాడు. ఇందులో ఉదాహరణలు భట్టి కావ్యం నుంచి తీసుకున్నాడు. 'జుమరనంది' దీన్ని సంస్కరించి, 'రసవతి' అనే వ్యాఖ్య రాసాడు. ఈ వ్యాకరణ శాఖకు 'జౌమరశాఖ' అని పేరు.

**8. పద్మనాభదత్తుడు :-**

పద్మ నాభ దత్తుడు (14వ శతాబ్దమని పండితుల ఊహ) 'సుపద్మ పంజిక' అనే వ్యాఖ్యతో కూడిన వ్యాకరణ గ్రంథం రచించాడు. ఇందులో పాణిని సూత్రాలు కొన్ని మార్పులతో సంజ్ఞ, సంధి, కారక, ఆఖ్యాత, కృత్, తద్ధిత అనే ఐదు అధ్యాయాల్లో కూర్చాడు.

ఈ విధంగా సంస్కృత వ్యాకరణంలోని వివిధ శాఖలకు చెందిన కొన్ని వ్యాకరణ గ్రంథాలు మచ్చుకు పేర్కొన్నాను. ఇవేకాక కేవల ప్రక్రియా గ్రంథాలు కొన్ని ఉన్నాయి. అవి అన్నీ పాణినీయ శాఖకు చెందినవే.

**9. భట్టోజీ దీక్షితుడు :-**

"అష్టాధ్యాయిలో ప్రక్రియా కాఠిన్యాన్ని తొలగించే ప్రయత్నంలో సూత్ర క్రమాన్ని పూర్తిగా మార్చివేసి, రూపసాధనకు అనుగుణంగా సూత్రాలను ఒక చోట చేర్చే సంప్రదాయం 14వ శతాబ్దిలో విమల సరస్వతి (1350 ప్రాంతం) 'రూపమాల'తో ప్రారంభమైంది. రామచంద్రుడు (15వ శతాబ్ది పూర్వభాగం) 'ప్రక్రియా కౌముది' ని రచించాడు. ఈ సంప్రదాయంలో రచించిన గ్రంథాల్లో ముఖ్యమైంది - భట్టోజీ దీక్షితుడి 'వైయ్యాకరణ సిద్ధాంత కౌముదీ' (1630 ప్రాంతం).

సిద్ధాంత కౌముదీ ప్రాచుర్యం అష్టాధ్యాయీ సూత్రాల క్రమాన్నే మరిచిపోయేట్టు చేసింది. సిద్ధాంత కౌముదిలో సంజ్ఞా ప్రకరణం, పరిభాషా ప్రకరణం, అచ్ సంధి ప్రకరణం, హల్సంధి ప్రకరణం,... ఇత్యాదిగా సూత్రాలను ప్రకరణానుగుణంగా ప్రవేశ పెట్టినా, ఒకచోట చెప్పిన సూత్రం పునరుక్తం కాకపోవడం వల్ల ప్రక్రియా గౌరవం తగ్గలేదు. పైగా దీని వల్ల అష్టాధ్యాయిలోని సూత్ర క్రమాన్నే విద్యార్థులు మరచి పోవడం తటస్థించింది. భట్టోజీ దీక్షితుడే దీనికి స్వయంగా ప్రౌఢ మనోరమ, బాల మనోరమ అనే వ్యాఖ్యలు రచించాడు. ఈ గ్రంథంలో కృదంత ప్రకరణం, తద్ధిత ప్రకరణాలు ఉన్నాయి.[13]

**10. వరదరాజు :-**

సిద్ధాంత కౌముదిని సంగ్రహ పరిచి, వరదరాజు మధ్య సిద్ధాంత కౌముది, లఘు సిద్ధాన్త కౌముది, సార సిద్ధాంత కౌముది అనే గ్రంథాలు రాసాడు. ఇవి ఒక దాని కంటే ఒకటి సంక్షిప్త గ్రంథాలు. వీనిలో లఘు సిద్ధాంత కౌముదికి ప్రాచుర్యం ఎక్కువ.

**కౌముదీ యది కంఠస్థా వృథా భాష్యే పరిశ్రమః !**

**కౌముదీ యద్యకంఠస్థా వృథా భాష్యే పరిశ్రమః!!**

(కౌముది కంఠస్థమైతే మహాభాష్యంలో పరిశ్రమనే అవసరం లేదు. కౌముది కంఠస్థం

కాకుంటే మహాభాష్యంలో పరిశ్రమ చేయడం వృథా ) అనే నానుడి కౌముది యొక్క ప్రాశస్త్యాన్ని నిరూపిస్తుంది.

**11. నారాయణ భట్టతిరీ :-**

"భట్టోజీ దీక్షితుని కాలంలోనే కేరళ దేశానికి చెందిన నారాయణ భట్టతిరీ (1560-1666) 'ప్రక్రియా సర్వస్వం' రచించాడు. ఇది కూడ విషయాను క్రమణికలో సిద్ధాంత కౌముది వంటిదే.

మహాకవులు చేసిన అపాణినీయ ప్రయోగాలను ఈయన సమర్థించాడు. నారాయణ భట్టతిరీ, భట్టోజీ దీక్షితుడూ ఒకరి గ్రంథం ఒకరు చూడటం గాని, కలుసుకోవడం గాని తటస్థించలేదు.

ఇవేకాక ఇంకెన్నో సంస్కృత వ్యాకరణ గ్రంథాలు ఉన్నాయి. ముఖ్యమైన గ్రంథాలను మాత్రమే ప్రస్తావించాను.

**2.1.2 ద్రావిడ భాషల్లో వ్యాకరణాలు :-**

ద్రావిడ భాషల్లో కూడా వ్యాకరణ గ్రంథాలు ఉన్నాయి. ఇవన్నీ పాణినికంటే అర్వాచీనాలు కావడం వల్ల వీటన్నిటి మీద సంస్కృత వ్యాకరణ ప్రభావం ఉంది. ఐతే ద్రావిడ భాషల రూప నిర్మాణాదికం సంస్కృతం కంటే భిన్నం కావడంచేత, వారు అక్కడక్కడ మార్పులు చేసి, వారి వారి భాషలను ఆ వ్యాకర్తలు వ్యాకరించారు.

**1. తమిళం :-**

**తొల్కాప్పియం :-**[14]

ద్రావిడ భాషలన్నింటిలో ప్రాచీన వ్యాకరణ గ్రంథం తొల్కాప్పియం. దీని రచయిత తొల్కాప్పియార్. ఈయన అసలు పేరు 'తృణధూమాగ్ని' అని, ఆయన జమదగ్ని కొడుకు అనీ, అగస్త్యుడి పన్నెండు మంది శిష్యుల్లో ఒకడనీ ఈ గ్రంథానికి వ్యాఖ్యానం రాసిన నచ్చినార్కినియర్ పేర్కొన్నారు.

ఈ తొల్కాప్పియనార్ కాలం గూర్చి వాదోపవాదాలు ఉన్నాయి. కాని ఇది క్రీస్తు

కాలానికి కొంచెం ఇటు అటుగా ఉండవచ్చు. తొల్కాప్పియంపై మాత్రం పాణినీయ ప్రభావం లేదు.

తొల్కాప్పియంకు ఉపోద్ఘాతం (పాయిరం) రాసిన పనం పారనార్ "తొల్కాప్పియనార్ అంతకు ముందున్న తమిళ వ్యాకరణ గ్రంథాలన్నింటినీ పరిశీలించి, ఐంద్ర వ్యాకరణ పద్ధతిలో రచించాడు" అని తెలిపాడు. ఐంద్ర వ్యాకరణం నేడు అలభ్యం. కాని ఐంద్ర వ్యాకరణం అనే గ్రంథం ఉన్నా లేకపోయినా ఆ సంప్రదాయమూ, దాని ప్రత్యేక పద్ధతులూ ఉండేవని ఈ వాక్యం వల్ల మనకు తెలుస్తుంది. ఐంద్ర వ్యాకరణ పద్ధతిని గూర్చి తెలుసుకొనేందుకు తొల్కాప్పియం ముఖ్యాధారం.

తొల్కాప్పియనార్‌కు ప్రాతిశాఖ్యలతోనూ, నిరుక్తంతోనూ పరిచయం ఉన్నట్లు ఆ గ్రంథం వల్ల తెలుస్తుంది. తొల్కాప్పియంలో 1600 సూత్రాలు మూడు అధికారాలలో ఉన్నాయి. అవి - ఎళుత్తది కారం (వర్ణాధికారం), చొల్లదికారం (పదాధికారం), పొరుళదికారం (అర్థాధికారం). పొరుళదికారం అలంకార శాస్త్రం, ఛందస్సు మొదలైన వానికి సంబంధించినది. వ్యాకరణం మొదటి రెండు అధికారాలలోనే ఉంది.

ఎళుత్తదికారంలో 480 సూత్రాలు తొమ్మిది విభాగాల్లో ఉన్నాయి. మొదటి మూడు విభాగాల్లో తమిళ ధ్వనులూ (వాటి గుర్తులు), వాటి ఉచ్చారణ విధానం, పదంలో వివిధ స్థానాల్లో ధ్వనులుండడంలో నియమాలు - అనే విషయాలు ఉన్నాయి. చివరి ఆరు విభాగాలలో సంధి వర్ణించబడింది. సంధి పాణినీయంలోలా సాధారణీకరణాలతో కాక, వివరణాత్మక దృష్టితో - అంటే ఒక్కొక్క పదాంత ధ్వనినీ ప్రత్యేకంగా వివరించాడు.

చొల్లదికారం 460 సూత్రాలు గల తొమ్మిది విభాగాల ప్రకరణం. వీటిలో మొదటి నాలుగు విభాగాల్లో వాక్య నిర్మాణం, చివరి అయిదింటిలో పదనిర్మాణమూ వర్ణించాడు.

ఈ గ్రంథం మొట్టమొదట పాండ్యరాజు ఆస్థానంలో 'అతం కొట్టాచాన్' అనే వైయ్యాకరణుని సమక్షంలో చదువబడినట్లు పనంపారనార్ పేర్కొన్నారు.

తొల్కాప్పియానికి చాలా మంది వ్యాఖ్యాతలు ఉన్నారు. వారిలో ఇళంపూరణర్ (10 లేక 12 శతాబ్ది), సేనావరైయర్ (14వ శతాబ్ది), పేరాచియర్, నాచినార్కినియర్ (14వ శతాబ్ది), దెయ్వచ్చిలైయార్, కల్లాడనార్ ముఖ్యులు.తొల్కాప్పియంలో పదనిర్మాణానికన్నా వాక్య నిర్మాణానికి ప్రాధాన్యం ఇచ్చారని ఆధునిక పరిశోధకుల అభిప్రాయం[15]. ఇంతేకాక -

1. పుత్తమిత్తరనార్ (11 వ శతాబ్ది) - 'వీరచోళియం'
2. కుర వీరపండితర్ (13వ శతాబ్ది) - 'నేమినాతం'
3. పవణంతి (13వ శతాబ్ది) - 'నన్నూల్'
4. చుప్పిరమణియతీట్చితర్ (17 వ శతాబ్ది) - 'ఇలక్కడక్కొత్తు'.

మొదలైన వ్యాకరణగ్రంథాలు తమిళంలో ప్రసిద్ధాలు[16].

**2. మలయాళం :-**

మలయాళ భాషలో పద్నాలుగవ శతాబ్దికి చెందిన 'లీలాతిలకం' ప్రసిద్ధ వ్యాకరణ గ్రంథం. ఇది సంస్కృతంలో రాయబడింది. దీనిలో 'మణిప్రవాళ' శైలి గూర్చి వివరించబడింది. మలయాళ భాషలో సంస్కృత శబ్ద బాహుళ్యం వృద్ధి పొంది, స్థిరపడింది. నేటికీ విద్యా వంతులు సంస్కృత బాహుళ్యం గల భాషనే ఉపయోగిస్తారు[17].

**3. కన్నడ :-**

కన్నడ భాషలో మొట్టమొదటి వ్యాకరణ గ్రంథం రెండవ నాగవర్మ (1145 ప్రాంతం) వ్రాసిన 'కర్ణాటక భాషాభూషణ'. ఈ గ్రంథం కన్నడ భాషావ్యాకరణం గూర్చి సంస్కృత సూత్ర వృత్తులతో రచించబడింది. ఉదాహరణలు కన్నడంలో ఉన్నాయి. ఇందులో పది పరిచ్ఛేదాలు ఉన్నాయి. 269 సూత్రాలు ఉన్నాయి. ఈయనే వ్రాసిన 'కావ్యాలోకన' లో ఐదు అధికరణాలు ఉన్నాయి. అందులో మొదటి అధికరణం వ్యాకరణ శాస్త్ర సంబంధి కావడం చేత దానికి 'శబ్దస్మృతి' అనే పేరు వచ్చింది. మిగిలిన నాలుగు అధికరణాల్లో అలంకార శాస్త్ర

విషయాలు చర్చించాడు[18].

పదమూడవ శతాబ్దివాడైన 'కేశిరాజు' - శబ్దమణి దర్పణ అనే వ్యాకరణ గ్రంథాన్ని రాసాడు. భట్టాలకదేవ (17 పూర్వార్థం) అనే జైన కవి 592 సంస్కృత సూత్రాలతో 'కర్ణాటక శబ్దాను శాసన' అనే వ్యాకరణ గ్రంథం రచించాడు[19].

తెలుగు వ్యాకరణాల గూర్చి విపులంగా చర్చిస్తాను. తమిళ, మలయాళ, కన్నడ భాషా వ్యాకరణాల గూర్చి చెప్పాను. మిగిలిన ద్రావిడ భాషలు సాహిత్య వంతమైనవి కావు. కాగ వాటి వ్యాకరణాలను ఈ మధ్యనే భాషా శాస్త్రజ్ఞులు ఆంగ్లంలో రచించారు.

### 3.1.3 తెలుగు వ్యాకరణం - కృతద్ధితాలు

తెలుగు వ్యాకరణ గ్రంథాలను ఈ క్రింది విధంగా విభజించారు.

(అ) సంస్కృతంలో వ్రాయబడిన తెలుగు వ్యాకరణ గ్రంథాలు

(ఆ) తెలుగులోనే వ్రాయబడిన తెలుగు వ్యాకరణ గ్రంథాలు.

మొదట సంస్కృత గ్రంథాలను గూర్చి తెలుపబడుతుంది.

### (అ) సంస్కృతంలో వ్రాయబడిన తెలుగు వ్యాకరణ గ్రంథాలు :-

**1.ఆంధ్ర శబ్ద చింతామణి** :-తెలుగు వ్యాకరణాల్లో మొదటిది. సంస్కృతంలో,ఆర్యా వృత్తంలో, సూత్ర రూపంగారాయబడింది. దీని కర్తృత్వ విషయంలోను, రచనా కాలంలోనూ మతభేదాలున్నాయి. దీనిలో కృత్తద్ధిత ప్రత్యయాలను పేర్కొనడం గాని, నిర్వచించడం గాని జరుగలేదు. కాబట్టి కృత్తద్ధితాల పరిశీలనలో ఇది అంతగా ఉపకరించేది కాదు.

**2.కాణ్వ వ్యాకరణం :-**

కణ్వుడు తెలుగు భాషకు వ్యాకరణం వ్రాసినట్లు ఆంధ్ర కౌముదీ కర్త మండ లక్ష్మీ నరసింహాచార్యుడు, త్రిలింగ శబ్దాను శాసనకారుడు పేర్కొన్నారు. త్రిలింగ శబ్దాను శాసనంలో

కొన్ని సూత్రాలు కాణ్వ వ్యాకరణం నుండి ఉదహరించాడు . అవి కృత్తద్ధిత సంబంధులు కావు. ఈ గ్రంథం ప్రస్తుతం అలభ్యం.

ఇదేకాక, బార్హస్పత్య వ్యాకరణం, నృసింహ పండితీయ మనే వ్యాకరణ గ్రంథాలు కూడా ప్రస్తుతం అలభ్యాలు.

**3.త్రిలింగ శబ్దాను శాసనము :-**

ఇది సంస్కృతంలో వ్రాయబడిన తెలుగు వ్యాకరణ గ్రంథం. అధర్వణాచార్యుడు రచించాడు. ఇందులో పదికాండాలున్నాయి. పంచమకాండలో తద్ధిత ప్రత్యయాల గూర్చి ఎనిమిది శ్లోకాల్లో చెప్పాడు. దశమ కాండలో కృదంతాల గూర్చి స్థూలంగా చెప్పాడు.

**4. కవిశిరోభూషణము :-**

ఆంధ్ర శబ్దచింతామణికి 'వికృతి వివేకము' పూరకం. దాన్ని అథర్వణుడు (13వ శతాబ్ది) రచించడం వల్ల అధర్వణకారికావళి అని కూడా అంటారు. ఈ రెండు గ్రంథాలను సమన్వయం చేస్తూ వ్రాసిన వ్యాఖ్యాగ్రంథమే ఈ అహోబల పడింతుని (17వ శతాబ్దం) 'కవిశిరోభూషణము'.

ఆంధ్ర శబ్ద చింతామణిలో కృత్తద్ధితాంతాలు పేర్కొనబడనప్పటికి ఇందులో కొన్ని తద్ధితాంతాలు, కృదంతాలు పేర్కొన్నాడు.

కవిశిరోభూషణంలో పేర్కొనబడ్డ తద్ధితాంతాలు- వన్నెకాడు, వన్నెలాడు, కన్నడీడు, కల్లరి, వెరవరి, ముక్కిడి, వెరవడి, ఎద్దడి, కట్టడి, చలిమిడి, వలిమరి, కన్నెరికము, కలవరము, కనికరము, వేగిరము, తేజరము, కోమలికము, దొరతనము ఇంతేసి కన్నులు, ముక్కుబంటి నీరు[20], ఇత్యాదులు.

'జన్యములైన ధాతు ప్రకృతికముల'నే పేరుతో - ఒకిలింత, వెక్కిరింత, పల్కరింత, అలయిక, కలక, చూపు, కరగు, నవ్వుటాలు, ఆడికోలు, విడుపు, ఏడుపు, ఆడికలు, వాడిక, అందడము, పొందడము మొదలైనకొన్ని కృదంతాలను[21] అజంత ప్రకరణంలో పేర్కొన్నాడు.

**5.ఆంధ్ర కౌముది :-**

ఈ పేరుతో రెండు వ్యాకరణ గ్రంథాలున్నాయి. ఒకటి - సంస్కృతంలో మండ లక్ష్మీ నరసింహాచార్యులు వ్రాయగా, మరొకటి తెలుగులో గణపవరపు వేంకట కవి రాసారు.

సంస్కృతంలోని ఈ వ్యాకరణ గ్రంథంలో సంజ్ఞా, సంధి, అజంత, హలంత, క్రియా ప్రకరణాలనే ఐదు ప్రకరణాలున్నాయి. ఈ క్రమం చింతామణిని అనుసరించే ఉంది. కృత్తద్ధితాల స్వరూప, ప్రక్రియాదులను ఇందులో పేర్కొనలేదు[22].

**6.వైకృత చంద్రిక[23] :-**

దీనిని మంచెళ్ళ వాసుదేవ కవి రచించాడు. దీనిలో మొత్తం పదకొండు ప్రకరణాలు ఉన్నాయి. కృత్తులు, తద్ధితాలు ప్రత్యేక ప్రకరణాలుగా వివరంగా పేర్కొన్నాడు.

పదాల మీద సంస్కృత తద్ధిత ప్రత్యయాలు చేరి, వాని స్థానంలో తెలుగు ప్రత్యాయాలు ఆదేశాలుగా వస్తాయని వాసుదేవ కవి మతం. అందుకే ఆయన దాన్ని తద్ధితాదేశ ప్రకరణమని పేర్కొన్నాడు.

ఇందులో పేర్కొన్న తద్ధిత ప్రత్యయాలు - అర, అరిమ్, అవమ్, అవస్, అస్, ఆమ్, ఆమస్, ఇడిమ్, ఇమి, ఇర, ఇరిస్, ఉటస్, ఎడుమ్, కమ్, కామ్, ట, టుక్, తనమ్, ంత, ందమ్, తుమ్, ని, పుడు, బంటిమ్, యు, రికస్.

వీనిలో అవమ్, టుక్, ంత, ందుమ్, పుడు, యు ప్రత్యయాంతాలు అవ్యయాలుగా ఉంటాయి.

ఇమి ప్రత్యయాంతాలుగా చూపబడిన కలిమి, తాలిమి, అనేవి కృదంత ప్రకరణంలో చెప్పదగినవి. 'పరగుట' అనే 'ట' ప్రత్యయాంతం కూడా తద్ధిత ప్రకరణంలో చెప్పవలసింది కాదు. సముచ్చయార్థకమైన 'యు' , ప్రత్యయంగా చెప్పవలసింది కాదు.

దేవ, వేగ శబ్దాలపై (తత్సమాలపై) అర, ఇర, ప్రత్యయాలు చేరుట వలన దేవర, వేగిర రూపాలు సిద్ధించినట్లు చెప్పాడు. ఈ పదాల నిష్పత్తిని ఇతర వ్యాకరణ కారులు పేర్కొనలేదు.

సాధురేఫతో ఇందులో చెప్పిన 'రిక' ప్రత్యయాన్ని ఇతర వ్యాకర్తలందరూ శకట రేఫతోనే

పేర్కొన్నారు. ప్రాచీన కవి ప్రయోగాలన్నీ శకట రేఫతోనే ఉన్నాయి. కాని సాధు రేఫతో లేవు.

ఇక - ఈ వైకృత చంద్రిక పేర్కొన్న కృత్ ప్రత్యయాలు - ఇ, ఇక, ఇకి, ఉ, ఉడు, ఎడి, ఎడు, క, కిర్, కువజ్, ట, టుశ్, డిజ్, తజ్, న, ని, పుక్, ప్పి, మి, రవ, వ, విశ్, వు, వుశ్ - అనేవి.

ఈ విధంగా వైకృత చంద్రికా కారుడు కృత్తద్ధితాల గూర్చి విపులంగానే చర్చించాడు.

**7.సూత్రాంధ్ర వ్యాకరణము [24] :-**

దీనిని చిన్నయసూరి క్రీ.శ. 1842 ప్రాంతంలో రాసాడు. దీనిని కాకినాడ - ఆంధ్రసాహిత్య పరిషత్తు క్రీ.శ. 1931లో ముద్రించింది.

దీనిలో సంజ్ఞాసంధి, అజంత, కారక, సమాస, తద్ధిత పరిచ్ఛేదాలున్నాయి.

తద్ధిత పరిచ్ఛేదంలో - అడి, అఱ, అరి, అటిమి, అరజ్, ఆడి, ఆష్, ఇ, ఇక, ఇద, ఇ, డి, ఇమి, ఉక, ఎడు, ఈష్, కత్తియ, కార, కాష్, టిమిజ్, త, తనాజ్, తుష్, న, నజ్, పోతు, మారి, వడి అనే ప్రత్యయాలను చర్చించాడు.

ఇందులోని సూత్రాలు తర్వాత వ్రాయబడిన బాల వ్యాకరణానికి మూలాలవలె ఉన్నాయి. దీనికీ బాల వ్యాకరణానికీ కొన్నివిషయాల్లో భేదాలున్నాయి. అవి -

(అ) ఇందులో పేర్కొన్న ప్రత్యయానుబంధాన్ని బాలవ్యాకరణంలో నిరనుబంధంగా పేర్కొనడం జరిగింది. అటువంటివి

| | | |
|---|---|---|
| తనజ్ | - | తన |
| కాష్ | - | కా |
| ఆష్ | - | ఆ |
| ఈష్ | - | ఈ |

(ఆ) ప్రత్యేకంగా ఇందులో చెప్పబడ్డ ప్రత్యాయాలు బాల వ్యాకరణంలో నిపాతాలుగా చెప్పబడ్డాయి. అటువంటివి -

(1) సూ. ఆం. వ్యా. మగాదులకు - 'టిమిజ్'

బా.వ్యా. 'మగటిమ్యాదులు యథా ప్రయోగంబుగ గ్రాహ్యంబులు.

(2) మారి, పోతు - సూ.ఆం.వ్యా. చెప్పగా -

"అర్థవిశేషంబుల వర్ణకాంతరములును మహాత్రప్రయోగంబుల నెఱుంగునది" (బా.వ్యా.తద్ధిత-28).

(ఇ) ఇందులో చెప్పబడ్డ ప్రత్యయాలు కొన్ని బా.వ్యా.లో చెప్పబడలేదు.

అటువంటివి - సూ.ఆం.వ్యా. లో -

ముందు + అఱ

పగ + తుక్

కొంత /ఒక + వడి

ఉబ్బు + అరజ్

సందు / మందు + అడి

ఒప్పు, ఎల్లు, క్రొవ్వు, బెట్టు, పెల్లు + ఇదమ్.

ఉబ్బు + అర

అనేవి పేర్కొనగా - బాలవ్యాకరణంలో వాటిని పేర్కొనలేదు.

(ఈ) ఇందులో పేర్కొనక , బాలవ్యాకరణంలో పేర్కొనబడినవి-

బంటి, కొలది మొదలైనవి అటువంటివి.

ఈ విధంగా కొన్ని భేదాలున్నా, రెంటికి సామ్యమెక్కువనే చెప్పవచ్చు.

ఇంతవరకు సంస్కృతంలో వ్రాయబడ్డ తెలుగు వ్యాకరణాల గూర్చి ప్రస్తావించాను.

ఇక తెలుగు భాషలో వ్రాయబడిన తెలుగు వ్యాకరణాలను గూర్చి ప్రస్తావిస్తాను.

**(ఆ) తెలుగులో వ్రాయబడిన తెలుగు వ్యాకరణ గ్రంథాలు :-**

**8.ఆంధ్ర భాషా భూషణము :-**

ఇది తెలుగు భాషలో పద్యరూపంలో వెలసింది, మొట్టమొదటిది. తనకు ముందు తెనుగుకు వ్యాకరణమెవ్వరు వ్రాయలేదని, తానే మొదటి వ్యాకర్తను అనీ దీనిని వ్రాసిన కేతన పేర్కొన్నాడు. ఈయన తిక్కన శిష్యుడు.

ఇందులో కృత్తద్ధిత ప్రకరణ విభాగం, వాటి ప్రక్రియా చూపలేదు. కాని అవి కలగలుపుగా కొన్ని లభిస్తాయి.

ఈ గ్రంథంలో ప్రస్తావించిన తద్ధితాలు - కాడు, ఈడు, ఇండి, ఆడు, అరి, తన, కత్తె, బోడి, ఎడు మొదలైనవి.

కృత్ప్రత్యయాలు - అమి, ఇమి, మి, ట మొదలైనవి.

ఈ ప్రత్యయాలలో ఈడు, తన అనే ప్రత్యయాలు ఆచ్ఛికాలతో పాటు తత్సమాల మీద కూడా చేరుతాయని కపటీడు, లోభితనము అనే ఉదాహరణలతో సూచించాడు. మిగిలినవి అన్నీ ఆచ్ఛికాల మీద చేరిన ప్రత్యయాలే.

ఇందులో - అభావార్థంలో 'ఇండి' ప్రత్యయం చెప్పబడింది. కాని దీనికి ప్రయోగాలు లేవు. శ్రీనాథుని 'ఉప్పిండి' అనే ప్రయోగమున్నా, అది అభావార్థంలో మాత్రం కాదు. తక్కిన వ్యాకర్తలందరూ దీనిని 'ఇడి' ప్రత్యయంగానే చెప్పారు.

**9.కావ్యాలంకార చూడామణి :-**

విన్నకోట పెద్దన రచించిన లక్షణ గ్రంథమిది. ఇది ప్రధానంగా అలంకార శాస్త్ర గ్రంథం. ఐనా వ్యాకరణాంశాలు కూడా నిరూపించాడు.

ఇందులో చెప్పిన తద్ధిత ప్రత్యయాలు -

"అరియిడి కాడాడఱయిన
ధరలో నొకకొన్ని చెల్లు దద్ధిత పదముల్,
పరువడి వాని నెఱుంగుట
పరమ పరిజ్ఞాన మాంధ్ర భాషా కవితన్"

అనే పద్యంలో - అరి, ఇడి, కాడు, ఆడు, అఱ, అను అయిదు ప్రత్యయాలను పేర్కొన్నాడు. వీనికి ఉదాహరణలు మరొక సీస పద్యంలో ఇచ్చినాడు.

అవి -

1. అరి :- సూడరి, ముండరి, కల్లరి

2. ఇడి :- ఉప్పిడి, వ్రాయిడి, తన్నిడి, చిక్కిడి, చప్పిడి

3. కాడు :- నీటుకాడు

4. ఆడు :- ఉదురులాడు

5. అఱ :- దబ్బఱ

కావ్యాలంకార చూడామణిలో కృత్తులను పేర్కొనలేదు.

**10.ఆంధ్రకౌముది[25] :-**

క్రీ.శ. 17వ శతాబ్దం వాడైన గణపవరపు వేంకటకవి తెలుగులో పద్య రూపంలో 'సర్వ లక్షణ శిరోమణి' అనే మహాగ్రంథాన్ని రచించాడు. అందులోని తృతీయోల్లాసం మాత్రమే వ్యాకరణ విషయాలను ప్రతిపాదిస్తుంది. దానికే 'ఆంధ్రకౌముది' అని పేరు. ఇందులోని విషయ ప్రణాళిక విశాలంగా ఉంది. అంతేకాక ఆయా సందర్భాల్లో కవి ప్రయోగాలను ఉదహరించాడు. అంతకు ముందు వ్యాకరణాల్లో ఈ ఒరవడి లేదు.

ఇందులో వ్యాకరణ పరంగా - ఆంధ్రోద్భవ కారణం, పంచవిధాంధ్ర భాషా స్వరూపం, సంజ్ఞా ప్రకరణం మొదలైన పదిహేను విభాగాల్లో విషయాలు విపులంగా చర్చించాడు.

'తద్ధితపద నిష్పత్తి' అనే విభాగంలో కాడు, గాడు, ఆడు, వాడు, అరి, ఈడు, తన, ఱిక, ఎడు అనే తద్ధిత ప్రత్యయాలు పేర్కొన్నాడు.

'కృదంత ప్రత్యయ రీతి భావార్థ ప్రతిపాదనము' అనే పదమూడవ ప్రకరణంలో పు, త, ఇక, ఉట, అడ, ఉడు, మొదలైన కృత్ప్రత్యయాలను పేర్కొన్నాడు.

**11.నారాయణీయాంధ్ర వ్యాకరణము [26] :-**

చర్ల నారాయణ శాస్త్రి పద్యరూపంలో వ్రాసిన గ్రంథమిది. దీనికి వారి కుమారుడు గణపతిశాస్త్రి వివరణ రచించాడు. దీనిలో కృదంత, తద్ధిత ప్రకరణాలు ప్రత్యేకంగా సమకూర్చాడు.

"ధాతువులకు విధింపబడి క్రియా విభక్తులు కాకుండునవి కృత్తులనబడు" నని కృత్‌ను

నిర్వచించాడు. 30కి మించి కృత్ప్రయాలు పేర్కొన్నాడు. వాటిలో బాల వ్యాకరణంలోనివి ఏడు చేరి ఉన్నాయి. పై రెంటిలో కనిపించని 'అలి', ఇత, డు అనే మూడు ప్రత్యయాలను అధికంగా పేర్కొన్నాడు.

కాచు, వీచు, తిరుగు లపై 'అలి' వచ్చి కావలి, వీవలి, తిరుగలి శబ్దాలు నిష్పన్నాలౌతాయని నారాయణీయం. ప్రౌఢవ్యాకరణంలో ఇది 'వలి' ప్రత్యయంగా పేర్కొనబడింది.

నారాయణీయంలో వైకృత శబ్దాలు 'వ్యుత్పన్నములు, అవ్యుత్పన్నములు' అని రెండు రకాలుగా విభజించారు. గోడ, మేడ, నోరు, బావి మొదలైనవి అవ్యుత్పన్న శబ్దాలని, అక, వీక, రాక, మొలక వంటివి వ్యుత్పన్నాలని వివరించారు.

"తత్సమ తద్భవదేశ్యములందు విభక్త్యంతములగు విశేష్య విశేషణంబుల మీద భావాద్యర్థంబులందు వచ్చు ప్రత్యయములు తద్ధిత ప్రత్యయములనబడును" అని నారాయణీయం తద్ధితాన్ని నిర్వచించింది. దీనిలో బాలవ్యాకరణమందలి 17 తద్ధితాలను, ప్రౌఢ వ్యాకర్త పేర్కొన్న ఆరు తద్ధితాలను పేర్కొన్నాడు .

అవేకాక - అర, గార, అసి, కోరు, దారు, ర, ఏసి, క, ఇద అనే తొమ్మిది అదనంగా పేర్కొన్నారు.

**12. శబ్ద లక్షణ సంగ్రహము [27] :-**

చిన్నయసూరి సంస్కృతంలో సూత్రాంధ్ర వ్యాకరణం వ్రాసిన తర్వాత బాలవ్యాకరణం కంటే ముందు ఒక తెలుగు సూత్రాలతో కూడిన వ్యాకరణం రాసాడు. అదే 'శబ్ద లక్షణ సంగ్రహము'.

"శబ్ద లక్షణ సంగ్రహమును మొదట 1853 లో 'ఏలూరు - మంజువాణీ ముద్రణాలయము' వారు ప్రచురించగా, తరువాత 1958లో 'కవిరాజు గ్రంథమాల పొన్నూరు' వారు ముద్రించారు" - అంటూ సింగరాచార్యుల వారు చెప్పిన విశేషాలివి.

దీనిలో పంచమ పరిచ్ఛేదం తద్ధిత ప్రక్రియను ప్రతిపాదించింది. ఎడు, అరి, ఇ, ఇడి,

త, కత్తియ, కాడు, తనము, మి, ఱికము, న, క అను ప్రత్యయాలను చెప్పి, "మతుబర్థాదులందు లా తులుం బెక్కులు గలవు" అని సూత్రికరించాడు.

'ఉగ్మలి, ముత్యము, జోస్యము, అప్డు, ఇప్డు, ఎప్డు, కాయ్వు, చెయ్వు, ఎయ్దుట, చెయ్దము' అను శబ్దాలను నిపాతాలుగా ఒక్క సూత్రంలో చెప్పాడు.

చతుర్థ పరిచ్ఛేదంలో కృత్తుల గురించి కొద్దిగా ప్రస్తావన ఉంది.ట ,మి ప్రత్యయాలు భావార్థ వ్యతిరేకార్థాల్లో వస్తాయని చెప్పాడు.

**13.బాల వ్యాకరణం :-**

దీని కర్త చిన్నయ సూరి .ఇందులో క్రమంగా ప్రకరణాలు ఉన్నాయి.అందులో కృదంత ప్రకరణం ,తద్ధిత ప్రకరణం ఉన్నాయి.

కృదంత ప్రకరణంలో -"ధాతువుకు విహితంబగు డుఙ్ భిన్న ప్రత్యయము కృత్తు నా బడు[28]"అనినిర్వచించి -

-క ,-ఇమి,-తఙ్,-కువ,-ట,-టు,-ప,-పు,-ఇక,-నఙ్,-బడి,-గడ,-ఇక,-వు,-అ,-అక, -డు,-ఉ,-వడి,-వి,-అవు,-ఇ,-కలి అనె 24 ప్రత్యయాలను పెర్కొన్నాడు.

"ధాత్వంతమందలి త,గ,చ,య,వ వర్ణాలకు కృత్ప్రత్యయము యొక్క క,గ,త,ప,వ, ఇమి పరమైనపుడు ధాత్వంతమునకు లోపం జరుగును" - అని పేర్కొన్నాడు.

తద్ధిత ప్రకరణంలో - తన, ఱిక, ఇమి, న, ఇక, ఉక, కా, కత్తియ, ఈ, అరి, ఇత, ఆడి, ఆ, ఇడి, ఎడు, బంటి, కొలది, అనే తద్ధిత ప్రత్యయాలు పేర్కొన్నాడు.. వీటిని చెప్పి "అర్థవిశేషంబుల వర్ణకాంతరంబులును మహాత్ప్రయోగంబుల నెఱుంగునది[29] అని సూత్రం చెప్పి, తిండిపోతు, మంటమారి, అడపము, పెండ్లము అనే ఉదాహరణల్లో పోతు, మారి, అ, అము అనే ప్రత్యయాలను కూడా సూచించాడు.

ఇవికాక "మగటిమ్యాదులు యథా ప్రయోగంబున గ్రాహ్యంబులు[30]" అని కొన్నింటిని నిపాతాలుగ ప్రతిపాదించాడు. అవి - మగటిమి, పేదఱిమి, ఒజ్జనము, కొటరము, కోడఱికము, కోడంట్రము, కోట్రము, కోడంట్రికము, చెలికారము మొదలైనవి.

**14. ప్రౌఢ వ్యాకరణము :-**

దీనికి 'త్రిలింగ లక్షణ శేషము' అని కూడా పేరు. దీనిని చిన్నయసూరి శిష్యుడైన బహుజనవల్లి సీతారామాచార్యులు రచించారు. ఇది బాలవ్యాకరణానికి పూరకము.

ఇందులో - ఇ, ఇడి, ఎన, పుర, మతి, వు, వలి అనే ఏడు కృత్ ప్రత్యయాలను పేర్కొన్నారు.

అ, అడ, అడి, ఇడి, ఇత, ఇద, ఇరి, కర, కార, మిరి, టి, ఎడు, బంటి, మయట్, న - అనే తద్ధిత ప్రత్యయాలను పేర్కొన్నారు.

**15.ఆంధ్ర భాషాను శాసనము[31]:-**

దీనిని మల్లాది సూర్యనారాయణ శాస్త్రి రాసారు. ఇది చారిత్రక దృష్టితో భాషా పరిణామ క్రమాన్ని అనుసరించి వ్రాసిన వ్యాకరణం.

"దీనిలో నామ వాచకములకంటెను, మఱి కొన్ని విశేషణముల కంటెను విశేషార్థమందు విధింపబడు ప్రత్యయములు తద్ధితములు" - అని తద్ధితాన్ని నిర్వచించారు.

దీనిలో తన, ఱిక మొదలగు తద్ధిత ప్రత్యయాలతో పాటు బాల వ్యాకరణంలో చెప్పని - 'అసి, ఇడి, ఇ, టి, ఇత, ఇద, మయ, కొరు, దారు, గొట్టు వంటి ప్రత్యయములు కూడ చెప్పాడు. ఉడు, ఇటి, మాత్ర, అంత, అ, మయ, మారి, పోతు, కోరు, దారు, కొట్టు, కా, కత్తియ, బంటి వంటి వాని విశేష ప్రయోగాలను కూడ చూపించారు.

"భావాద్యర్థములందు ధాతువుల కంటే వచ్చు క్రియా విభక్తి భిన్నములైన ప్రత్యయములు కృత్తులన బడును" - అని కృత్ ను నిర్వచించారు.

ఇందులో క, ఇక, పు మొదలగు 32 కృత్ ప్రత్యయాలు పేర్కొన్నాడు. ఇందలి 'ఇడి, ఇత, వ, కడ, మతి, ఇలి అను ప్రత్యయాలు బాల వ్యాకరణంలో కన్పించవు.

**15. ముక్తలక్షణకౌముది[32] :-**

వంతరాం రామకృష్ణరావు దీని కర్త. పేరునుబట్టి - పూర్వ లాక్షణికులు చెప్పని విషయాలను ప్రకాశింపజేసేది అని తెలుస్తుంది.

ఇందులో 16 కృత్ ప్రత్యయాలు చెప్పాడు. అవి - "అటి, అలి, అర, అస, ఇమి, ఇన, ట, దల, ది, పిడి, వ, వు, వర, సు, ప, ఉ" అనేవి. వీటిలో చాలా వరకు పూర్వ లాక్షణికులు చెప్పినవే.

తద్ధిత ప్రకరణంలో అట, అద, అల, మొదలైన 33 ప్రత్యయాలు చెప్పాడు..

**16. వ్యావహారిక భాషా వ్యాకరణం [33] :-**

డా. వడ్లమూడి గోపాలకృష్ణయ్య దీనిని రాసారు. ప్రాచీన కవి ప్రయోగాలతోపాటు వ్యావహారిక రూపాలకు కూడ లక్షణాలు చెప్పడం ఇందులోని విశేషం.

ఇందలి కృదంత పరిచ్ఛేదంలో మొత్తం 38 కృత్ ప్రత్యయాలు నిరూపించారు. వానిలో చాలా వరకు పూర్వ లాక్షణికులు తెలిపినవే. అదనంగా కేవలం వ్యావహారిక రూపాలకే చెప్పినవి - ప, అక, అన, వడి, డు, ఇలి మాత్రమున్నాయి. వీనికి లక్ష్యాలు పాలపం, మారకం, వడ్డన, కొలువడి, ఎగుడు, అంకిలి వంటివి చూపారు.

చిన్నయసూరి చెప్పిన 20 ప్రత్యయాలు, ప్రౌఢ వ్యాకర్త చెప్పిన 11 ప్రత్యయాలు కలుపుకొని మొత్తం 41 తద్ధిత ప్రత్యయాలు ఇందు నిరూపించారు. అవి అన్నీ కూడా పూర్వ లక్షణికులు చెప్పినవే.

**17. ద్రావిడ భాషలు :-**

దీనిని రచించిన వారు అన్నామలై విశ్వవిద్యాలయంలో భాషా శాస్త్ర విభాగంలో ఆచార్యులైన పి.యస్. సుబ్రహ్మణ్యం గారు. ఇది ద్రావిడ భాషల తులనాత్మక వ్యాకరణ గ్రంథం. దీనిలో ఇంతవరకు ద్రావిడ భాషలలో జరిగిన పరిశోధనా ఫలితాలను ఒక్క దగ్గర క్రోడీకరించడం జరిగింది. ఈ గ్రంథం ప్రస్తుత పరిశోధనాగ్రంథరచనకు ఎంతగానో ఉపకరిస్తుంది.

ఇంతవరకు తెలుగు వ్యాకరణంలో వెలువడిన ప్రముఖ గ్రంథాలను పరిశోధనాంశం అవసరం మేరకు సంగ్రహంగా నిరూపించాను. ఇవే కాక ఇంకెన్నో గ్రంథాలున్నాయి. వాటిలో

ప్రస్తుత పరిశోధనాంశానికి అవసరమైన సామాగ్రి లేకపోవడమో లేక అంత ప్రాధాన్యత లేకపోవడమో అనే కారణాల వల్ల వాటిని పరిహరించాను.

## 2.2. శిక్షా :-

ఇది షడంగాల్లో ఒకటి. ఇది ధ్వని విజ్ఞానానికి సంబంధించింది. దీని ప్రస్తావన -

**"శీక్షాం వ్యాఖ్యాస్యామః ! వర్ణః స్వరః! మాత్రాబలమ్! సామ సంతానః! ఇత్యుక్త శీక్షధ్యాయః"**

అంటూ తైత్తిరీయ ఉపనిషత్తులో దర్శనమిస్తుంది. ఈ శాస్త్రం ధ్వనులూ, వాటి స్థానాలు, వాటి ప్రయత్నాలు వాటిని ఉచ్చరించాల్సిన తీరు మొదలైనవి చక్కగా వివరిస్తుంది. ఈ శాస్త్రంలో తెలిపిన ధ్వని నియమాలు నేటికీ ప్రామాణికాలు గానే ఉన్నాయి.

ఈ నాడు నలుబది వరకు శీక్షా గ్రంథాలు లభిస్తున్నట్లు తెలియవస్తుంది. వానిలో పాణినీయ శీక్షా, నారద శీక్షా, భారద్వాజశీక్షా, యాజ్ఞవల్క్య శీక్షా, స్వరవ్యంజన శీక్షా ఇత్యాదులు ప్రముఖాలు. భాషా శాస్త్ర విద్యార్థులకు వీటి అధ్యయనం ఎంతగానో ఉపకరిస్తుంది.

## 2.3. నిరుక్తం :-

నిరుక్తమంటే ఏమిటో తెలుపుతూ - భరతుడు - నాట్య శాస్త్రంలో -

**"నానా నామాశ్రయోత్పన్నం నిఘంటు నిగమాన్వితమ్!**
**ధాత్వర్థహేతు సంయుక్తం నానాసిద్ధాన్త సాధితమ్!!**
**స్థాపితోర్థో భవేద్యత్ర సమాసేనార్థ సూచకః !**
**ధాత్వర్థవచనే నేహ నిరుక్తం తత్ర్పచక్షతే !!**

"నిరుక్తమనగా వాగర్థ పరీక్ష. వాక్ అనగా అర్థమును బోధించు శబ్దము."గౌః" అనే శబ్దానికి 'గోవు' అనే అర్థం ప్రసిద్ధం. ఇంతేకాదు - వాక్కు, ఆదిత్యుడు, కిరణము, బాణము ఇత్యాద్యర్థాల్లో శ్రుతి ప్రయోగాలున్నాయి.ప్రకరణాను గుణంగా వీటిలో ఏ అర్థాన్ని గ్రహించాలి అనే జిజ్ఞాసయే పరీక్ష.

“గచ్ఛతీతి గౌః” అనే వాక్యార్థ సంగ్రహ/సమాస రూపమే - “గౌః”. “గౌః” అనేది సమాసం. పై లక్షణ వాక్యం విగ్రహ వాక్యం. ఒక్కొక్క అర్థానికి ఒక్కొక్క తీరు లక్షణ వాక్యం ఉంటుంది. లక్షణీయార్థ దర్శన సమయంలో కలిగే ఆక్షేపాదులకు తగిన సమాధానాలు తెలిపి లక్షణాత్మకమైన అర్థం ఎక్కడ చెప్పబడుతుందో అది పరీక్షా రూపమైన నిరుక్తం. అంటే - ఆక్షేప ప్రతిసమాధానాదుల ద్వారా అర్థాన్ని నిరూపించడం లేక నిర్వచించడమే నిరుక్తం.

విగ్రహ (లక్షణ) వాక్యంలో చెప్పిన క్రియలు, నామాలు, కారకాలు - ఆ సమాస పదంగా నిష్పన్నంకావడానికి గల వ్యాకరణ సిద్ధ ఉపపత్తులను చూపడమే శబ్ద పరీక్ష.

సర్వతంత్ర, ప్రతితంత్ర, అధికరణ తంత్ర, అభ్యుపగమ తంత్రమని తంత్రాలు నాలుగు q^ ¥□ం[34]. వీటిని పరిశీలించి పక్షప్రతిపక్షవాదాల ద్వారా అర్థ నిర్ణయం చేయడమే - అర్థ పరీక్షా రూపమయిన - నిరుక్తం[35].

ఇటువంటి నిరుక్త సంప్రదాయానికి యాస్కుడు ఆద్యుడు. ఆయన కాల నిర్ణయ విషయంలో వాదోపవాదాలున్నాయి. ఈయన క్రీ.పూ. 7-8 శతాబ్దుల ప్రాంతానికి చెందినవానిగా భావిస్తున్నారు[36].

### 2.3.2.నిరుక్త విషయం :-

‘నిరుక్తం’ వేదంలోని పదాలకు నిర్వచనాన్ని వ్యుత్పత్తిని తెలుపుతుంది. ఇది ‘నిఘంటువు’ అనే ఐదు అధ్యాయాల గ్రంథానికి వ్యాఖ్యారూపం. నిఘంటువులో మొత్తం 1767 పదాలు ఉన్నాయి. ఈ పదాలను పర్యాయపదాల సముదాయాలుగా కూర్చారు. ఇందులోని పదాలన్నీ యాస్కుడు ‘నిరుక్త’ంలో వ్యుత్పత్తి పూర్వకంగా నిర్వచించాడు.

నిరుక్తంలో యాస్కుని సర్వాంగీణమైన భాషాశాస్త్ర జ్ఞానం ఆధునిక పండితులకు ఆశ్చర్యం కలిగేట్టు చేస్తుంది. ఇందులో - ధ్వని విజ్ఞానం, రూప విజ్ఞానం, అర్థ విజ్ఞానం, వాక్య విజ్ఞానం లను ఆయన వినియోగించుకున్న తీరు అనితరసాధ్యం.

### 2.3.3.యాస్కుని నిరుక్తంలో పదాలను నిర్వచించిన పద్ధతులు[37]:-

1. వ్యాకరణబద్ధమై స్పష్టంగా ధాతువు తెలియునపుడు - ఆ ధాతుజంగా ఆ పదాన్ని

నిర్వచించాడు.

2. స్పష్టంగా ధాతువు తెలియనప్పుడు - అర్థ సామ్యాన్ని అనుసరించి, తదనురూపమైన ధాతుజంగా చెప్పాడు.

3. పై రెండు విధాలుగా సాధ్యపడనప్పుడు అందులోని వర్ణసామ్యంతో - వ్యుత్పత్తిని ఊహించవలసి ఉంటుందన్నాడు.

4. లౌకిక సంస్కృత ధాతువుల నుండి వైదిక కృదంతాలను నిరూపించాడు.

5. దేశ, కాలాలు, వక్త, శ్రోత మొదలైనవి కూడా నిర్వచన సమయంలో పరిగణలోకి తీసుకున్నాడు.

6. తద్ధితాల నిర్వచనం జాగ్రత్తగా చేసాడు. మొదట తద్ధితాంశమును విడదీసి, అప్పుడు ఆ శబ్ద కృదంశాన్ని విడదీసి, నిర్వచించాడు.

7. ఒక పదానికి గల వివిధార్థాలకు కారణాలు ధ్వని పరివర్తన సూత్రాలతో అర్థ పరివర్తన సిద్ధాంతాలతో చర్చించాడు.

8. ఒక పదానికి వ్యుత్పత్తిని చెప్పే సమయంలో దానిపై ఇతరుల అభిప్రాయాలను కూడా స్వీకరించి వాటిని తులనాత్మకంగా పరిశీలించి, పరిష్కరించాడు.

9. ఒక పదానికి నిర్వచనం చెప్పే సమయంలో అది ఏ సందర్భంలో ప్రయోగించబడిందో కూడా తప్పక పరిశీలించాడు.

ఈ విధమైన నిరుక్త శాస్త్రం ఆధునిక పరిశోధకులకు మార్గదర్శకంగా ఉంది.

### 2.3.4. ఆధునిక కాలంలో నిర్వచన శాస్త్రం :-

ఆధునిక కాలంలో భాషాశాస్త్రం అభివృద్ధి చెందిన తరువాత వ్యుత్పత్తి, నిర్వచన శాస్త్రాల్లో కొన్ని మార్పులు వచ్చాయి. అవి -

1. సోదర భాషలలోని సజాతి శబ్దాలను సమకూర్చడం.

2. వాటి అర్థ, రూపాల పరిశీలన - తారతమ్య పరిష్కారం.

3. వాటి పరిశీలన ద్వారా ధ్వని సూత్రాల నిర్మాణం.

4. ఆ ధ్వని సూత్రాల ఆధారంగా పునః పరిశీలన వలన మూల భాషా ప్రకృతులను, మూల భాషా ప్రత్యయాలను ఊహించడం.

5. పై వాని సారాంశంగా - దేశ, కాల, పరిస్థితులను పరిగణలోకి తీసుకొని నిర్వచించడం.

ఇవన్నీ తులనాత్మక భాషా శాస్త్రంలోని విషయాలు. కాగ, నేటి నిర్వచనాత్మక కోశాల పరిధి ఇంకొంచెం సంకుచితమైనదే. వాటిలో -

ఆ భాషా కుటుంబంలోని సజాతి పదాలను ఆయా భాషల్లోని అర్థాలతో సహా పేర్కొంటారు.అంతే! ఇవి తులనాత్మక అధ్యయనం చేసే పరిశోధకులకు ఉపయోగకరంగా ఉంటాయి. అంటే పైన సూచించిన పంచసూత్రాల్లో మొదటి సూత్రమొక్కటే వాటిలో ఉంటుంది. మిగిలిన నాలుగు పరిశోధకులు చేయాలి.

(1) సంస్కృతం మొదలైన ఇండో ఆర్యన్ సజాతి శబ్దాలను - ఆర్.ఎల్.టర్నర్ - "A comparative dictionary of Indo - Aryan Languages" (1962) అనే గ్రంథంలో కూర్చినాడు.

(2) ద్రావిడ భాషా సజాతి శబ్దసముదాయాలను టి. బరో, బి. ఎమెనో - " A Dravidian Etymological Dictionary" (1961) లో కూర్చారు.

ఏమైనా, ఈ నిర్వచన శాస్త్రం ప్రస్తుత పరిశోధనలో ఎంతగానో ఉపకరిస్తుంది అనడంలో సందేహం లేదు.

## 2.4. భాషాశాస్త్రం[38] :-

ప్రాచీన భాషలన్నింటికి పూర్వకాలం నుంచి వ్యాకరణాలు ఉన్నాయి. కాని అవి అన్నీ కేవలం తమ భాషను ఒక్క దానినే వర్ణించేవిగా ఉన్నాయి. 16, 17, 18 శతాబ్దులలో పాశ్చాత్యులు వ్యాపార నిమిత్తం లేదా మత వ్యాప్తికి ఆసియా, ఆఫ్రికా, అమెరికా వంటి ఖండాలకు వలస వెళ్ళడం వలన వారికి ఆయా భాషలతో పరిచయం ఏర్పడింది.

పాశ్చాత్యులకు సంస్కృతంతో పరిచయం కలుగడం ఒక ముఖ్య ఘట్టం. సంస్కృతానికి, యూరప్ ఖండ ప్రాచీన భాషలైన గ్రీక్, లాటిన్ భాషలకు శబ్దాలలోను, వ్యాకరణంలోను పోలిక

కొట్టవచ్చినట్టు కన్పించింది. ఉదా :- సం. భ్రాతృ. లా. Frater, సం. పితృ. లా.Pater ; సం. అష్టౌ, లా. Octo మొదలైనవి.అంతే కాక ఈ భాషలోని ధ్వనుల్లో ఉండే పోలికలు తుల్యంగా ఉండడం వల్ల - వీటిని సూత్ర రూపంలో చెప్పవచ్చు అని గ్రహించారు. ఈ ఆధారాల వల్ల 1786లో సర్ విలియం జోన్స్ "సంస్కృతమూ, లాటిన్, గ్రీకూ, మరికొన్ని భాషలు ఒకే మూలభాష నుంచి పుట్టాయి" అని ప్రతిపాదించాడు. ఈ ప్రతిపాదనే తులనాత్మక భాషా శాస్త్రానికి నాంది అయింది. "జన్మ సంబంధం గల భాషలలో మార్పులు సూత్ర బద్ధంగా ఉంటాయి" అని గ్రహించారు. దీనితో తులనాత్మక పద్ధతికి శాస్త్రీయత చేకూరింది.

భాషా పరిణామంలోనేకాక ఒక కాలపు భాషా నిర్మాణంలో కూడా ఒక క్రమమూ, సూత్రబద్ధతా ఉంటాయని గ్రహించారు. వీరిలో ప్రథముడు ఫెర్డినాండ్ దససూనర్. ఈయనతో వర్ణనాత్మక భాషా శాస్త్రం ప్రారంభమైంది. ఈ విధంగా భాషా శాస్త్రం వర్ణనాత్మక భాషా శాస్త్రం, చారిత్రక భాషా శాస్త్రం, తులనాత్మక భాషా శాస్త్రం అనే శాఖలుగా వృద్ధి పొందింది.

**వర్ణనాత్మక భాషా శాస్త్రంలో**- ఒకే భాషలోని ధ్వనులు, వర్ణనిర్మాణం, పదనిర్మాణం, అర్థనిర్మాణం, వాక్యనిర్మాణంల గూర్చిన అధ్యయనం చేస్తారు.

**తులనాత్మక భాషా శాస్త్రంలో**- సజాతీయ భాషల మధ్య ధ్వని, వర్ణ, పద, అర్థ. వాక్య నిర్మాణాలలోని తులన జరుగుతుంది. దీని వలన ధ్వని సూత్ర నిర్మాణం, వర్ణపునర్నిర్మాణం, ప్రత్యయ పునర్నిర్మాణం, మూల భాషయందలి పదాల ఊహాస్వరూపం, కుటుంబ, ఉపకుటుంబాది విభజన అనేవి సిద్ధిస్తాయి.

**చారిత్రక భాషాశాస్త్రం** ఒకే భాషలో, లేదా భాషా కుటుంబంలో కాలక్రమంలో కలిగిన ధ్వన్యాదుల పరిశీలన, ఫలితాల ఆవిష్కరణా చేస్తుంది.

ప్రస్తుత పరిశోధన తులనాత్మక భాషా శాస్త్రంలోని వ్యుత్పత్తి శాస్త్ర పరిధిలో సాగుతుంది.

ఈ సందర్భంలో **ఫర్దినా దససూర్** - మాటలు అవధేయాలు.

"వ్యుత్పత్తి శాస్త్రం కేవలం పృధక్కరణ శబ్దాలను వివరించి, ఆగిపోదు. అది శబ్ద కుటుంబాల చరిత్రను, నిష్పాదక అంశాల కుటుంబాలు మొదలైన వాటి చరిత్రను సంకలనం చేస్తుంది[39].

అంతేకాక శ్రీ **కే.కే. రంగనాథాచార్యుల** పలుకులు కూడా గమనించదగ్గవి.

"పందొమ్మిదవ శతాబ్ది నాటికి గాని తెలుగు వ్యాకరణాలు కృత్, తద్ధితాల మీద తమ దృష్టిని కేంద్రీకరించలేదు. అది కూడ అంత సమగ్రం కాదు. ద్రావిడ భాషల తులనాత్మక అధ్యయన రంగంలో కూడా నామ నిష్పాదక ప్రత్యయాలను పునర్నిర్మించే అధ్యయనం ఇంకా ఎంతో ముందుకు సాగవలసి ఉంది. 1973 లో వచ్చిన గాలి సాంబశివరావు గారి సిద్ధాంత వ్యాసం."A comparitive study of Dravidian noun derivations" ఈ రంగంలో జరిగిన ప్రధానమైన కృషి. మూల ద్రావిడ భాషలోని ధాతువులపైన ఏర్పడ్డ నామాలు, క్రియలలో కొన్ని భాషలలో నామాలు మాత్రమే మిగలగా, కొన్నిటిలో క్రియలు మాత్రమే నిలిచాయి. అందువల్ల తెలుగు నామాలలో ధాతువులను ప్రత్యయాలను విశ్లేషించి చూపడం కూడా చాలా కష్ట సాధ్యమయిన పని. దీనికి ద్రావిడ భాష తులనాత్మక అధ్యయనం కూడా అవసరం[40].

**పి.యస్. సుబ్రహ్మణ్యం** గారి మాటల్లో - "మధ్యోత్తర ఉపకుటుంబాల సాహిత్య రహిత (ద్రావిడ) భాషలలో ప్రాచీన కృత్ప్రత్యయాలు చాలా వరకు నశించాయి. కొన్ని భాషలకి ఈ విషయం మీద ఇంకా సామాగ్రి లభ్యం కాలేదు. ఈ కారణాల వల్ల అంశంపై తులనాత్మక చర్చ సమగ్రంగా చేయడం సాధ్యం కాదు. సాహిత్యవంతమైన భాషలలో కూడా కృదంతాలని సమగ్రంగా సేకరించి పరిశీలన చెయ్యవలసిన అవసరం ఉంది[41].

పై ముగ్గురు భాషా శాస్త్రజ్ఞుల అభిప్రాయాల వలన తెలిసిన అంశాలు -

1. కృత్తద్ధితాల పరిశీలన నిర్వచన శాస్త్ర విభాగ పరిధిలో జరుగుతుంది.
2. నిర్వచన శాస్త్రం - తులనాత్మక భాషా శాస్త్రమందలి ఉప విభాగం.
3. తులనాత్మక భాషా శాస్త్ర పరిధిలో కూడా - నామ నిష్పాదక - ప్రత్యయాల అధ్యయనం కుంటుబడి ఉంది.
4. ఇప్పటికైనా ద్రావిడ భాషల - నిష్పాదక ప్రత్యయాలను సమగ్రంగా సేకరించి, అధ్యయనం చెయ్యవలసిన అవసరం ఉంది.

కావున పైన పేర్కొన్న బృహత్ పరిశోధనా యజ్ఞంలో - ప్రస్తుత పరిశోధన కూడా ఒక సమిధలా ఉపయోగపడుతుంది.

**ఈ రంగంలో ఇంతవరకు జరిగిన కృషి -**

1. గాలి సాంబశివరావు గారు, కార్నెల్ విశ్వవిద్యాలయంలో 1973లో జి.ఎ. కెల్లి పర్యవేక్షణలో పరిశోధన సాగించి -

   "A comparative study of Dravidian noun derivation".

   - అనే సిద్ధాంత వ్యాసం సమర్పించారు.

2. గాలి రాధాకృష్ణగారు - శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో 1985 - తెలుగులో నామ రూప నిష్పత్తి - అనే ఎం.ఫిల్ సిద్ధాంత వ్యాసం సమర్పించారు.

3. గాలి రాధాకృష్ణగారు - శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో - 1987 లో -
   "Nominal Derivation in Dravidian:"
   (with Special reference to nouns derived from verbs)

   అనే Ph.D. సిద్ధాంత వ్యాసం సమర్పించినారు.

4. శ్రీ కండ్లకుంట అళహ సింగరాచార్యులు, ఉస్మానియా విశ్వవిద్యాలయంలో 1989లో నాయని కృష్ణకుమారి గారి పర్యవేక్షణలో -

   "ఆంధ్ర మహాభారతంలో కృత్తిద్ధిత ప్రయోగముల విశ్లేషణము"

   - అనే Ph.D. సిద్ధాంత వ్యాసం సమర్పించినారు.

   ఈ పూర్వరంగంతో ప్రస్తుత పరిశోధన సాగుతుంది.

# పాద సూచికలు

**1.**"వాగ్వై పరాచీ అవ్యాకృతా అవదత్ . తే దేవా ఇంద్ర మబ్రువన్.ఇమాం నో వాచం వ్యాకుర్వితి .సో బ్రవీద్వరం వృణై.మహ్యాం చైవైష వాయవె చ సహ గృహ్యాతా ఇతి.తా మింద్రో మధ్యతోవక్రమ్య వ్యాకరోత్.తస్మాదియం వ్యాకృతా వాగుద్యతె."-తైత్తిరీయ సంహితా.6-4-7-3.

2."బ్రహ్మ బృహస్పతయె ప్రోవాచ.బృహస్పతి రింద్రాయ.ఇంద్రో భరద్వాజాయ.భరద్వాజ ఋషిభ్యః.ఋషయో బ్రాహ్మణెభ్యః" -ఋక్తంత్రం.1-4.

3. -శ్రీ యుధిష్ఠర్ జీ మీమాంసక్.'సంస్కృత వ్యాకరణ శాస్త్ర్ కా పరిచయ్'.కల్యాణ్ హిందూ సంస్కృతి కా అంక్.(24-1) పుట 654.

4. జోగి సోమయాజి,గంటి .వాక్య పదీయం పరిచయం.తెలుగు అకాడమి.1974.పుట.X.

5."This grammer (Paniniya Astadhyayi)which dates from some where round 350 to 250 B.C. is one of the greatest monuments of human inteligence...No other language to this day has been so perfectly described" _Bloom field.Language.

6.- సింగరాచార్యులు,అళహ. ఆంధ్ర మహా భారతంలో కృత్తద్ధితప్రయోగములు-విశ్లేషణము. పుట.09.

7. -పాణిని -అష్టాధ్యాయి . 3-1-93.

8. -పాణిని -అష్టాధ్యాయి . 3-1-90.

9. - సింగరాచార్యులు,అళహ.ఆంధ్ర మహా భారతంలో కృత్తద్ధిత ప్రయోగములు-విశ్లేషణము.

10. - సింగరాచార్యులు,అళహ.ఆంధ్ర మహా భారతంలో కృత్తద్ధిత ప్రయోగములు-విశ్లేషణము.

11. - సుబ్రహ్మణ్యం,పి.యస్. ఆధునిక భాషా శాస్త్ర సిద్ధాంతాలు .పుట . 327.

12. - సుబ్రహ్మణ్యం,పి.యస్. ఆధునిక భాషా శాస్త్ర సిద్ధాంతాలు .పుట . 328

13. - సుబ్రహ్మణ్యం,పి.యస్. ఆధునిక భాషా శాస్త్ర సిద్ధాంతాలు .పుట . 329.

14. - సుబ్రహ్మణ్యం,పి.యస్. ఆధునిక భాషా శాస్త్ర సిద్ధాంతాలు .పుట . 329.

15. - సుబ్రహ్మణ్యం,పి.యస్. ద్రావిడ భాషలు .

16. - సుబ్రహ్మణ్యం,పి.యస్. ద్రావిడ భాషలు . పుట .12.

17. - సుబ్రహ్మణ్యం,పి.యస్. ద్రావిడ భాషలు . పుట .16 మరియు విజ్ఞాన సర్వస్వం . 6వ, సంపుటం. పుట .391.

18. విజ్ఞాన సర్వస్వం . 6వ, సంపుటం. పుట .780.

19. - సుబ్రహ్మణ్యం,పి.యస్. ద్రావిడ భాషలు . పుట .23.

20. అహోబల పండితీయం . పుట . 126.
21.అహోబల పండితీయం . పుట . 147.
22. - సింగరాచార్యులు,అళహ.ఆంధ్ర మహా భారతంలో
కృత్తద్ధిత ప్రయోగములు-విశ్లేషణము.పుట 33.
23. -సింగరాచార్యులు,అళహ.ఆంధ్ర మహా భారతంలో
కృత్తద్ధిత ప్రయోగములు-విశ్లేషణము.పుట 33.
24. - సింగరాచార్యులు,అళహ.ఆంధ్ర మహా భారతంలో
కృత్తద్ధిత ప్రయోగములు-విశ్లేషణము.పుట 39.
25. - సింగరాచార్యులు,అళహ.ఆంధ్ర మహా భారతంలో
కృత్తద్ధిత ప్రయోగములు-విశ్లేషణము.పుట 43.
26. - సింగరాచార్యులు,అళహ.ఆంధ్ర మహా భారతంలో
కృత్తద్ధిత ప్రయోగములు-విశ్లేషణము.పుట 46.
27. - సింగరాచార్యులు,అళహ.ఆంధ్ర మహా భారతంలో
కృత్తద్ధిత ప్రయోగములు-విశ్లేషణము.పుట 49.
28. -చిన్నయ సూరి. బాల వ్యాకరణం.కృదంత ప్రకరణం.1.
29. -చిన్నయ సూరి. బాల వ్యాకరణం.తద్ధిత ప్రకరణం.28.
30. -చిన్నయ సూరి. బాల వ్యాకరణం.తద్ధిత ప్రకరణం.8.
31. -సింగరాచార్యులు,అళహ.ఆంధ్ర మహా భారతంలో
కృత్తద్ధిత ప్రయోగములు-విశ్లేషణము.పుట 59.
32. -సింగరాచార్యులు,అళహ.ఆంధ్ర మహా భారతంలో
కృత్తద్ధిత ప్రయోగములు-విశ్లేషణము.పుట 63.
33. -సింగరాచార్యులు,అళహ.ఆంధ్ర మహా భారతంలో
కృత్తద్ధిత ప్రయోగములు-విశ్లేషణము.పుట 65.
34. (1) సర్వ తంత్ర అవిరుద్ధః తంత్రే అధికృతః అర్థః - సర్వ తంత్ర సిద్ధాంతః.1.1.28.
(2)సమాన తంత్ర సిద్ధాంతః , పర తంత్రాసిద్ధః -ప్రతితంత్ర సిద్ధాంతః. 1.1.29.
(3)యత్సిద్ధౌ అన్య ప్రకరణ సిద్ధిః, సః అధికరణ సిద్ధాంతః.1.1.30.
(4)అపరీక్షితాభ్యుపగమాత్తద్విశేష పరీక్షణం- అభ్యుపగమ సిద్ధాంతః . 1.1.31.
గౌతమ న్యాయ సూత్రాలు.
35. -హరి సోదరులు.భారతీ నిరుక్తి - అవతారిక .
36.-ఉమా శంకర శర్మ-నిరుక్త భూమికా-చౌఖంబా విద్యా భవన్.వారాణసి.1977.పుట105.

37. (1) తద్యేషు పదేషు స్వర సంస్కారౌ సమర్థౌ ప్రాదేశికేన గుణేన అన్వితౌ స్యాతాం,
తథా తాని నిర్బ్రూయాత్.

(2)అథ అనన్వితేఅర్థే ,అప్రాదెశికే వికారేఅర్థ నిత్యః పరీక్షేత కేనచిత్ సామాన్యేన.

(3)అవిద్యమానే సామాన్యేపి అక్షర సామాన్యాత్ నిర్బ్రూయాత్.

(4)అథాపి భాషికేభ్యః ధాతుభ్యః నైగమాః కృతః భాష్యంతె.

(5)అథ తద్ధిత సమాసేషు ఏక పర్వసు చఅనేక పర్వసు చ పూర్వం పూర్వం
అపర మపరం ప్రవిభజ్య నిర్బ్రూయాత్. -నిరుక్తం

38. - సుబ్రహ్మణ్యం,పి.యస్. ఆధునిక భాషా శాస్త్ర సిద్ధాంతాలు .పుట .

39. ఫర్దినా ససూర్ - సామాన్య భాషాశాస్త్రం -పాఠ్యక్రమం. తెలుగు అకాడమి.పుట.205.

40. -రంగనాథాచార్యులు,కె.కె. ఆంధ్ర మహా భారతంలో కృత్తద్ధిత
ప్రయోగములు-విశ్లేషణము -గ్రంథ పరిచయంలో.

41. - సుబ్రహ్మణ్యం,పి.యస్. ద్రావిడ భాషలు . పుట .174.

# ధ్వని పరిణామాలు

## 3.0 భూమిక :-

వ్యవహారంలో ఉన్న ఏ భాషైనా మార్పులకు గురి కావడం సహజం. ప్రతి భాషలోనూ మాండలిక భేదాలుంటాయి. వ్యవహరించేవారు పెరిగి, వారు వివిధ ప్రాంతాల్లో స్థిరపడ్డప్పుడు మాండలిక భేదాలు పెరుగుతాయి. ఒక ప్రాంతం వారికి వేరొక ప్రాంతం వారికి రాకపోకలు తగ్గినప్పుడు, ఒక ప్రాంతం వారి భాష వేరొక ప్రాంతం వారికి అర్థం కాకపోవచ్చు. ఒక మూలభాష అనేక దుహితృభాషలుగా కొన్ని వేల సంవత్సరాలలో మారడం ఈ విధంగానే జరుగుతుంది.

మూ.ద్రా. భాషకూ తెలుగుకు, కృత్తద్ధితాది ప్రత్యయాలు చేరినపుడు తెలుగులోని పదాల ధ్వనుల లోనూ ఇట్టి మార్పులు వచ్చి ఉండవచ్చు. కాబట్టి ధ్వని పరిణామాల గూర్చి తెలుసుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

## 3.1 నిర్వచనం :-

"ఒక భాషలో ఒక కాలంలో ఉన్న ఒక ధ్వని తరువాతి కాలంలో ఒకటి గాని అంతకన్నా ఎక్కువ ధ్వనులుగా గాని మారడాన్ని 'ధ్వని పరిణామం (Sound Change) అంటారు"[1].

## 3.2 చరిత్ర[2] :-

భారతీయ శాస్త్రజ్ఞులలో క్రీ.పూ. 700-800 మధ్యకాలం వాడైన యాస్కుడు తన నిరుక్తం లో ధ్వని పరిణామాలను ప్రస్తావించాడు.

ప్రాకృత వైయ్యాకరణులు - హేమచంద్రుడూ (12వ శతాబ్ది), త్రివిక్రమ దేవుడూ (13వ శతాబ్ది) ధ్వని పరిణామాన్ని గ్రహించడమేకాక సంస్కృత ధ్వనులు ప్రాకృతంలో పొందే మార్పులను సూత్రబద్ధంగా వివరించారు.

ధ్వని పరిణామాన్ని గూర్చిన చర్చ యూరప్‌లో 18వ శతాబ్ది ప్రారంభంలో మాత్రమే మొదలయింది. 19వ శతాబ్దిలో రాస్క్, గ్రిమ్, గ్రాస్మన్, వెర్నర్, బ్రూగ్‌మన్ మొదలైన పండితులు ఇండో-యూరోపియన్ భాషలపై పరిశోధనలు చేసి ధ్వని పరిణామం నియతంగా జరుగుతుందనీ, దీనికి నిజమైన అపవాదాలు ఉండవనీ కనుగొన్నారు.

**3.3 ధ్వని పరిణామాలు: -**

"వర్ణాగమో వర్ణ విపర్యయశ్చ

ద్వౌ చాపరౌ వర్ణ వికార నాశౌ"

దీని ప్రకారం -

(1) వర్ణాగమం (2). వర్ణ విపర్యయం

(3.) వర్ణ వికారం (4). వర్ణ నాశం

అనేవి ధ్వని పరిణామ రీతులు. ఆధునిక భాషా శాస్త్ర పండితులు వీటినే వివరించి పేర్కొన్నారు.(దీని పట్టిక 54వ పుటలో చూడవచ్చు)

**3.3.1 వర్ణా గమం : -**

**(అ) ఆది స్వరాగమం : -**

పదాదిన స్వరం వచ్చి చేరడాన్ని ఆది స్వరాగమం అంటారు.

ఉదా :- సం. రథము > తె. అరదము

**(ఆ) మధ్య స్వరాగమం / స్వరభక్తి :-**

పదమధ్యంలో స్వరం వచ్చిచేరడాన్ని మధ్య స్వరాగమం అంటారు. దీనికే 'స్వరభక్తి' అని కూడా నామాంతరం.

ఉదా :- సం. యత్నము > తె. జతనము

సం. కీర్తి > తె. కీరితి

**(ఇ) అంత్య స్వరాగమం :**

పదాంతంలో స్వరం వచ్చి చేరడాన్ని అంత్య స్వరాగమం అంటారు.

ఉదా :- త. కణ్ > తె. కన్ను

త.పాల్ > తె. పాలు

**(ఈ) ఆది వ్యంజనాగమం :-**

పదాదిన వ్యంజనం (హల్లు) వచ్చి చేరుడాన్ని ఆదివ్యంజనాగమం అంటారు.

వెసరు <ఎసరు (వంట కొరకు కాచెడి నీరు)

వేట <ఏట (దేవతకు బలికై ఏర్పరిచిన మేక)[4]

(ఉ) మధ్య వ్యంజనాగమం :-

పదమధ్యంలో వ్యంజనం వచ్చి చేరడాన్ని పద మధ్య వ్యంజనాగమం అంటారు.

ఉదా :- తెగు >త్రెగు (తెంచు)

తుళ్ళు>త్రుళ్ళు (ఎగిరిపడు, గర్వించు)

పక్క >ప్రక్క

**(ఊ) అంత్య వ్యంజనాగమం :**

పదాంతమందు వ్యంజనం వచ్చి చేరడాన్ని అంత్య వ్యంజనాగమం అంటారు.

ఉదా [5] :- సం. వనం >తె. వనంబు

హిం. పర్వా >భోజ్‌పురి. పర్వాహ్

**(ఋ) స్వర వ్యంజనాగమం**

పదంలో స్వరం, వ్యంజనం వచ్చి చేరడాన్ని స్వర వ్యంజనాగమం అంటారు.

ఉదా [6] :-కంటె >కంటియ

గడె >గడియ

దీవె >దీవియ

**3.3.2 వర్ణవిపర్యయం/వర్ణ వ్యత్యయం(**Meta thesis) **:-**

ఒక మాటలో రెండు ధ్వనులు పరస్పరం స్థానం మార్చుకోవడాన్ని - వర్ణవిపర్యయం / వర్ణ వ్యత్యయం అంటారు.

ఉదా:- రోలు <*ఒరల్[7]

నవ్వులు + ఆట ---- నవ్వులాట >నవ్వుటాల[8]

### 3.3.3.వర్ణవికారం :-

**3.3.3.1. సమీకరణం** (Assimilation) [9]:-

ఒక వర్ణం దాని పక్కనున్న వర్ణోచ్చారణకు అనుగుణంగా మారితే -

అది - **(1)సమీకరణం (Assimilation)**

ఇది రెండు రకాలు -

అ) హల్ పూర్వముఖ సమీకరణం - Progressive Assimilation

ఆ) హల్ పరముఖ సమీకరణం - Regressive Assimilation

(2) స్వరాకర్షణము - Vowel hormony / Vowel Assimilation

(1) అ) హల్-పూర్వముఖ సమీకరణకు ఉదాహరణ -

సం. అగ్నిః > తె. అగ్గి

సం. పక్షి > తె. పక్కి

ఆ) హల్-పరముఖ సమీకరణకు ఉదాహరణ -

సం. ఉత్పలం > ప్రా. ఉప్పలం

సం. భక్తి > తె. బత్తి

**(2) స్వరాకర్షణ :-**

ఒక అచ్చు తన సమీపాచ్చును తనలా మారుస్తుంది. ఆమార్పు పూర్వాచ్చుకు గాని పరాచ్చుకు గాని కావచ్చు దీన్నే స్వరాకర్షణ అంటారు.

కవి + లు -- కవులు (పూర్వాచ్చులో మార్పు)

అటు + తిని -- అటితిని (పూర్వాచ్చులో మార్పు)

సుకృతి + వు -- సుకృతివి. (పరాచ్చులో మార్పు)

**3.3.3.2. (ఆ) వర్ణ విభేదనం** (Dissimilation):-

ఒక మాటలో ఒకే ధ్వని పక్కపక్కనే ఉన్నప్పుడు వాటిలో ఒకటి వేరు ధ్వనిగా మారడం - వర్ణ విభేదనం.

బాల + లు -- బాలు + లు > బాలురు

**3.3.3.3 (1) స్వరపరిణామాలు [10] -**

**(అ) పదాది దీర్ఘ స్వరం హ్రస్వంకావడం -**

(1) ఆ -> అ - మాఱు --> మఱు

(2) ఈ -> ఇ - నీలుగు --> నిలుగు

(3) ఊ -> ఉ - ఊయేల --> ఉయాల

గూడారము --> గుడారము

(4) ఏ -> ఎ - పేడ --> పెండ

(5) ఓ -> ఒ - ఓయారము --> ఒయారము

**(ఇ) పదమధ్యదీర్ఘం హ్రస్వంకావడం [11]:-**

(6) - ఆ -> -అ - ఆరాటము > ఆరటము

కొమారుడు > కొమరుడు

(7) - ఊ -> -ఉ- కక్కూఱితి > కక్కుఱితి

గంబూరము > గంబురము

(8) - ఏ -> -ఎ - నల్లేరు > నల్లెరు

తంగేడు > తంగెడు

(9) - ఓ -> - ఒ - సంతోసము > సంతొసము

**(ఉ) పద మధ్యహ్రస్వం దీర్ఘంకావడం [12] :-**

(10) - అ - >- ఆ - ఏతము > ఏతాము

గాలము > గాలాము

గోతము > గోతాము

**(ఊ) ఇతరపరిణామాలు :- [13].**

(11) - ఇయ >- ఎ కన్నియ > కన్నె

వన్నియ > వన్నె

(12) -ఇయ -> ఎ, 'ఇ'లోపము    ముత్తియము > ముత్తెము, ముత్యము

కన్నియ > కన్నె, కన్య

కళ్ళియము > కళ్ళెము, కళ్యము

## (ఈ) వ్యంజనాలలో మార్పులు :

**(ఎ) పదాదిన ఒక వ్యంజనం మరొక వ్యంజనంకావడం:-**

(1) ద > డ [14] :    దక్కు - డక్కు

దొప్ప - డొప్ప

దెందము - డెందము

**(బి) పద మధ్య వ్యంజనంలో మార్పులు :-**

(2) - డ - >- ణ - [15] :    అడగు - అణగు

పోడి - పోణి

మిడుగురు - మిణుగురు

(3) - ద - > - జ - [16] :    జూదము - జూజము; జాది - జాజి

-త -> - జ -    జాతి - జాజి

(4) - త - >- ద - :    బ్రతుకు - బ్రదుకు

మెతుకు - మెదుకు

ఉతుకు - ఉదుకు

(5) - గ - > - వ - [17] :    పలుగురు - పలువురు

పగలు - పవలు

తొగ - తొవ

(6) -గ - >- హ - :    సగము - సహము

మొగము - మొహము

(7) -గ- >-యు- : ఓగిరము - ఒయిరము

(8) -ర-/-ల- >-న- : అరటి - అనటి

చిరుగు - చినుగు

గొలుసు - గొనుసు

(9) - బ - > - మ - : గుబురు - గుమురు

గుబిలి - గుమిలి

(10) - మ - > - వ - : చలిమిడి - చలివిడి

మామిడి - మావిడి

సోమరి - సోవరి[18]

(సి) **పదాంతవ్యంజనంలో మార్పులు**[19]:

(11) -గ > - వ : ఈగి - ఈవి

ఎలుగు - ఎలువు

(12) -గ > - హ : ఇగ - ఇహ

సెగ - సెహ

(13) - త > - ట : గుంత - గుంట

గుమ్మెత - గుమ్మెట

**3.3.4.వర్ణనాశం / వర్ణలోపం :**

(A) స్వరలోపం :

**(అ) ఆది స్వరలోపం :**

(1) ఆ -> : సం. ఆశ్రిత > శ్రిత

**(ఆ) మధ్య స్వర లోపం -**

(2) - ఉ -> [20]: పాలతి > పాల్తి

కలికి>కల్కి

ములికి> ముల్కి

(3) - ఉ -> -[21] : కినుక>కిన్క

అబ్బురము >అబ్రము

కప్పురము > కప్రము

**(ఇ) అంత్య స్వరలోపం :**

సం. రామ హిం. రామ్

**(B) వ్యంజన లోపం :**

**(అ) ఆది వ్యంజన లోపం[22] :**

(1) చ ->- : చిగురు - ఇగురు

చులకన - ఉలకన

(2) త/ద ->-: తూపర - ఊపర

దొరలు - ఒరలు

(3) న->- : నీలుగు - ఈలుగు

నీవు - ఈవు

నన - అన

నట్టు - అట్టు

(4) ప ->- : పొందు - ఒందు

పొదలు - ఒదలు

(5) వ ->- : వెక్కిరింత - ఎక్కిరింత

వెద - ఎద

(6) హ ->- : హడపము - అడపము

హలది - అలది

హారతి - ఆరతి

**(ఆ) మధ్య వ్యంజన లోపం :**

సం. సూచీ - హిం. సూఈ

సం. సప్త - హిం. సాత్

తె. ఆ + కడ - ఆడ

తె.ఈ + కడ - ఈడ

**(ఇ) అంత్య వ్యంజన లోపం :**

ఇం. Water > Water వాట (ఉచ్చారణలో)

ఇం. Bomb > బామ్

**(C) స్వరవ్యంజన లోపం :**

**(అ) ఆది స్వర వ్యంజన లోపం :**

దీనికి ఎక్కువ ఉదాహరణలు దొరకవు.

ఇం. Necktie > tie

సం. ఆదిత్యవార్ > హిం. ఇత్తవార్ / ఇత్‌వార్

**(ఆ) మధ్య స్వర వ్యంజన లోపం :**

సం. భాండాగార్ > హిం. భాండార్

**(ఇ) అంత్య స్వర వ్యంజన లోపం** Apocope :-

సం. మాతా > హిం. మా

సం. విజ్ఞప్తికా > హిం. వినతి

సం. కుంచికా > హిం. కుంజీ

(D) **ద్విత్వ లోపం / సదృశవర్ణలోపం** Hapology [23] :

ఒక పదంలో సదృశ వర్ణాలు రెండు ఉంటే వాటిలో ఒకటి సాధారణంగా లోపిస్తుంది.

తె. నిప్పు + పుల్ల > నిప్పుల్ల

సం. స్వర్గగంగా > స్వర్గంగా

(1) క్క > క : తె. అక్కట > అకట

(2) గ్గ > గ : ప్రెగ్గడ > ప్రెగడ

(3) చ్చ > చ : అచ్చట > అచట

(4) జ్జ > జ : మజ్జ > మజ

(5) ట్ట > ట : చిట్ట > చిట

(6) డ్డ > డ : ఎడ్డ > ఎడ

(7) త్త > త : మత్తాబు > మతాబు

(8) ద్ద > ద : నిద్దుర > నిదుర

(9) ప్ప > ప : అప్ప > అప

(10) మ్మ > మ : ఉమ్మి > ఉమి

(11) ఱ్ఱ > ఱ : అఱ్ఱు > అఱు[24]

**(E) లోప దీర్ఘము :**

తెలుగులో ఒక ప్రత్యయం పరమైనపుడు ఏదేని అక్షరము లోపిస్తే దాని ముందు అక్షరం దీర్ఘం ఔతుంది.

ఉదా :- ఫలము + లు > ఫలాలు / (ఫలములు)


ధ్వని పరిణామం
వర్ణాగమం
వర్ణవిపర్యయం
వర్ణవికారం
వర్ణనాశం
స్వర
వ్యంజన
స్వరవ్యంజన
ఆది మధ్య అంత్య
ఆది మధ్య అంత్య
సమీకరణం
విషమీకరణం
(వర్ణవిభేదనం)
స్వరపరిణామం
వ్యంజనపరిణామం
స్వర
వ్యంజన
ఆది మధ్య అంత్య
పూర్వ పర
పూర్వ పర
హ్రస్వీకరణం దీర్ఘీకరణం ఇతరం
స్వర
వ్యంజన
స్వరవ్యంజన
సదృశవర్ణలోపం
లోపదీర్ఘం
ఆది మధ్య అంత్య ఆది మధ్య అంత్య ఆది మధ్య అంత్య

# 3.4. వర్ణ నిర్మాణం

**3.2.0.** రాబోవు అధ్యాయాలలో - కృత్తద్ధితాంత పదాల తులనాత్మక పరిశీలనలో - వివిధ ద్రావిడ భాషల లోని సజాతీయ పదాల తులనాత్మక పరిశీలన చేయబడుతుంది. ఆ సమయంలో వివిధ ద్రావిడ భాషలలోని వర్ణాల ఆధారంగా మూ. ద్రా. భా. లోని వర్ణాలు, అవి తెలుగులోకి మారిన తీరు సంగ్రహించబడుతుంది.

**3.4.1అచ్చులు:-**

| క్ర.సం. | మూ.ద్రా అచ్చు | | తెలుగు అచ్చు |
|---|---|---|---|
| 1 | * అ | | |
| | * అ | > | తె.అ |
| 2 | * ఆ | | |
| | * ఆ | > | తె.ఆ |
| 3 | * ఇ | | |
| | * ఇ | > | ఇ, ఎ (అకారం ముందు * ఇ) |
| 4 | * ఈ | | |
| | * ఈ | > | ఈ |
| 5 | * ఉ | | |
| | * ఉ | > | ఉ, ఒ (అకారం ముందు * ఉ) |
| 6 | * ఊ | | |
| | * ఊ | > | ఊ |
| 7 | * ఎ | | |
| | * ఎ | > | ఎ |
| 8 | * ఏ | | |
| | * ఏ | > | ఏ |
| 9 | * ఒ | | |
| | * ఒ | > | ఒ |
| 10 | * ఓ | | |
| | * ఓ | > | ఓ |

**3.4.2. హ్రస్వీకరణం :-**

ద్రావిడ భాషా ధాతువు తర్వాత అచ్‌తో మొదలయ్యే నిష్పాదక ప్రత్యయం చేరినపుడు ధాతువులోని దీర్ఘాచ్చు హ్రస్వంగా మారుతుంది.

నామవాచకాలలో త్ర్యచ్కాలలో (Trisyllabics) నే సాధారణంగా కన్పిస్తుంది. ద్వ్యచ్కాల (Disyllabics) లో ఇట్టి మార్పు సాధారణంగా రాదు. (కొన్ని ద్వ్యచ్కాలలో మాత్రం మార్పు వచ్చిన రూపం, రాని రూపం కూడా ఉన్నాయి).

**3.4.3. అద్విరుక్తత :-**

అజాది ప్రత్యయం పరమైనప్పుడు దీర్ఘాచ్చు హ్రస్వమైనట్లుగా ద్విరుక్త హల్లు కూడా అద్విరుక్తంగా మారుతుంది.

తె. వెల్లి. వెండి, వెలుగు

**3.4.4. 'య' ముందు దీర్ఘాచ్చు :-**

తెలుగులో యకారాంతాలైన క్రియలోనూ, నామవాచకాలలోను దీర్ఘాచ్చే ఉంటుంది.

ఉదా :- ఏయు, కోయు, నేయు, చేయు

హల్‌తో ప్రారంభమయ్యే కొన్ని ప్రత్యయాల ముందు యకారం లోపిస్తుంది.

ఉదా :- కోఁత, నేఁత, చేఁత

**హల్లులు**

**3.4.5. * క**

* క కారం పదాదిన అగ్రాచ్చుల (ఇ, ఈ, ఎ, ఏ) ముందు తెలుగులో చకారంగా మారుతుంది.

ఉదా :- త.మ. కిళి; క.తు.గిళి, గిణి, తె.చిలుక

ప.కిల్

(దీనినే 'తాలవ్యీకరణం' Palatalization - అంటారు).

తెలుగులో కిట్టు, కినియు, కినుక, కెడయు, కెంపు, కలయు మొదలైన కొన్ని పదాలలో

తాలవ్యాచ్చు ముందున్న కకారం చకారంగా మారలేదు. కాబట్టి ఇటువంటి పదాలు తెలుగులో తాలవ్యీకరణం జరిగి ఆగిపోయిన తర్వాత కన్నడం నుంచి ఎరువు తెచ్చుకున్నవై ఉండాలి.

*- క -

పదమధ్య * కకారం గకారంగా మారుతుంది.

ఉదా :- త. ఏకు ; తె. ఏగు; కూ. మా. ఏక్ - ఒక్కొకసారి 'వ' కారంగా మారుతుంది.

పగలు/పవలు.

*- క్క -

పదమధ్య మందలి ద్విరుక్త కకారం దీర్ఘాచ్చు తర్వాత అద్విరుక్తంగా మారుతుంది.

(హ్రస్వాచ్చు తరువాత అలాగే ఉంటుంది)

ఉదా:- తు.త.మ.క. నక్కు; కోత. నక్; తొ. నొక్ -

తె. నాకు

త. అక్కా; మ.క.తు.తె. అక్క; గోం. తక్కా

*- ంక -

*- ంక - తెలుగులో 'ంగ' అవుతుంది.

త. పొంకు; మ. పొఙ్ఙు; తె. పొంగు

*- క > చ

*- క - > గ - / - వ -

- క్క - > - క - (దీర్ఘాచ్ తరువాత) క్క - హ్రస్వాచ్ తరువాత.

*- ంక - > ంగ

3.4.6. *చ :-

మూ.ద్రా. పదాది చకారం తెలుగులో కొన్ని పదాలలో లోపించింది. కొన్ని పదాలలో మిగిలి ఉంది. కొన్ని పదాలలో పదాది చకారం ఉన్న రూపం, లోపించిన రూపం కూడా ఉన్నాయి.

ఉదా:- త. ఏర్, చేర్; కో.ప. చేర్; గోం. సేర్; కూయి, సేరు; కువి హేర్; తె. ఏరు

(వాక)

త.మ.తె. చిక్కు; కోత. కొడ. చిక్ - ; తొ.తిక్; క.సిక్కు, సిల్కు, సిర్కు; తు. తిక్కు, సిక్కు

అందము. చందము; ఇగురు, చిగురు;

- చ - > - చ / -

- చ్చ - > - చ్చ -

-ంచ - > - ంజ -

త.మ. అంచు; కోత. అంజ్ -; తొ.ఒజ్; క.తు.తె. అంజు

3.4.7. * ట

మూల ద్రావిడంలో పదాది * టకారం ఉండదు. దుహితృభాషలలో కూడా తెలుగు - కువి ఉప కుటుంబములోనే పద మధ్య * టకారం వర్ణ వ్యత్యయం వల్ల పదాదికి వచ్చి 'డ'గా ఉంటుంది.

* - ట - > - డ - / డ -

ఉదా :- త.మ. నాటు; కోత. నాడ్; తొ. నోడ్; క.తు.తె. నాడు (దేశం)

* - ట్ట - > - ట్ట -

- ంట - > -ండ -

త. ఇరంటు ; మ. రంటు; క. ఎరడు; తె. రెండు

3.4.8 * త

* త - > త -,

* -త- - > ద -,

* -ంత- > -ంద-

* -త్త - > - త్త -

త. ఉతవు; మ. ఉతకు; క.ఒదగు.ఒదవు; తె.ఒదవు. త. మరుంతు; మ. మరున్ను; కోత. తొ. మద్; తె. మందు. త. అత్తై; క. అత్తె, అత్తి; గ.ఆత; తె.అత్త;

3.4.10. * ప

* ప - > ప -

* ప - >- వ - / - ప -

* ప్ప - > ప్ప / ప

* ంప - > మ్మ, మ

త.మ.క.తె. తప్పు

త.మ. నంపు; కోత. కొడ. నంబ్ - ; క.తు. నంబు;

తె. నమ్ము.

త.మ. పాంపు; క.పావు; కో.నా. పాం; తె.పాము; ప.గ. బాం

3.4.11. * త్త (* ఱ)

దంత మూలీయమైన మూ.ద్రా. * త్త (* ఱ)

పదాదిని ఉండదు.

* -ఱ - >- ఱ -

* - ఱ్ఱ - >- ట్ట -

* -న్ఱ - >- ండ -

త.మ. పఱ్ఱు; కోత. తొ. పత్ - ; క.తు. పత్తు; తె. పట్టు. కొం.త. పన్ఱి; మ.పన్ని; గోం. పద్దీ; క.కొడ. తె. పంది; తు.పంజి.

తెలుగులో ప్రాజ్నన్నయ శాసనాలలోన్ఱఉంది.

వాన్ఱు (క్రీ.శ. 600 - 1000) = వాడు.

3.4.12 * ఞ

మూ.ద్రా. పదాది * ఞ కారం ప్రాచీన తమిళ, మలయాళాల్లో చాలా పదాల్లో; కొడగు,

తొదల్లో కొన్ని పదాల్లో మాత్రమే నిలిచి ఉంది. తెలుగులో, ఇతర భాషల్లో ఇది నకారంతో కలిసి పోయింది.

పదమధ్యంలో * చ ముందే ఉంటుంది.

పదాంతంలో అసలు ఉండదు.

త. నరంపు; మ. ఞరంపు; తొ. నర్ట్; క. నర(వు);

తె. నరము

త. ఞాంచిల్, నాంచిల్, మ. ఞేఙ్ఞోల్, కోత, నేల్గ్; క.నేగల్, నేగిల్; తె. నాగలి.

3.4.13. * ణ

* ణ >- న

పదాదిని ఇది ఉండదు.

త. అణ్ణన్, అణ్ణా; మ. అణ్ణన్; కోత. అణ్; తె. అన్న.

3.4.14.* న

* న > న

పదాదిన క్వాచిత్కంగా లోపిస్తుంది.

త.మ. నీంతు; క. ఈసు, ఈజు; తె. ఈఁదు.

3.4.15 * మ

* మ > మ

3.4.16 * య

మూ.ద్రా. పదాది * య కారం చాలా కొద్ది మాటలలోనే ఉంది.

* య > ఏ

త.యాటు; మ.ఆటు; తు. ఏడు; తె. ఏడిక

* - య >- య -

* - య >- య

పదాంతంలో *అయ్ తమిళంలో 'ఐ'గా వ్రాస్తారు.

అది తెలుగులో 'అ' గా మారుతుంది.

*- అయ్ >- అ

త. తలై; మ.తె.కొం. తల

3.4.17 *ర

మూ.ద్రా. *ర పదాదిని ఉండదు. పద మధ్యంలోనూ, పదాంతంలోనూ ఇది 'ర' గానే ఉంటుంది.

తెలుగు కన్నడాల్లో హల్లు ముందు ఇది లోపిస్తుంది. తెలుగులో పదాది సంయుక్తాక్షరాలలో కూడా అర్వాచీన భాషలో ఇది లోపిస్తుంది;

క్రొవ్వు కొవ్వు; త్రాగు తాగు; మ్రోగు మోగు

లోపానికి ఉదా :-

త.మ. ఎరుతు ; తె. ఎద్దు

తమ. ఉరుక్కు ; క. ఉర్కు, ఉక్కు; తె. ఉక్కు

3.4.18 *ల

మూ.ద్రా. *ల పదాదిని ఉండదు. పద మధ్యంలో పదాంతంలోనూ ల గానే ఉంటుంది. ద్విరుక్తం లోనూ మార్పు లేదు.

3.4.19 *వ

మూ.ద్రా. *వకారం కొన్ని పదాల్లో 'బ' గా మారుతుంది.

త. వయల్; తె. బయలు

3.4.20 *ళ

*-ళ >- ల - / - ల్ల -

*- ళ్ళ - >- ల్ల -

త.మ.కోత.తొ.క. ముళ్; కొడ.తు.ముళ్ళు; తె. ముల్లు.

త.మ.క.తు. ఉళ్లి : కో. ఉళ్య్; తె.కో.ప.ఉల్లి; గోం. ఉల్లీ.

3.4.21 *ళ (మూర్ధన్య ఈషత్ స్పృష్టం - Retroflex Fricative)

పదాదిని ఉండదు. ఎప్పుడూ అద్విరుక్తంగానే ఉంటుంది. ఇది ప్రాచీన భాషలో ప్రత్యేక వర్ణంగా ఉండేది. ఇది ళ గా మారుతుంది.

ఇది - ప్రాఙ్నన్నయ శాసనాలలో - ళ - ,

అచ్చుల మధ్య - డ - , వర్ణవ్యత్యయం వల్ల పదాదికి వచ్చినప్పుడు దీని ముందు హల్లు ఉంటే - ర -, హల్లు లేకపోతే డ - (> తర్వాతి కాలంలో - ద - )

*ళ > ర / డ

త.మ.క.పుళు; కొడ. పుళు; తు. పురి; తె. పురుగు.

3.4.22. తెలుగులో వర్ణవ్యత్యయం

మూ.ద్రా. భాషలోని హల్లు, దాని ముందు అచ్చూ పరస్పరం స్థానం మార్చుకొంటాయి. అంటే వర్ణ వ్యత్యయం (Metathesis) పొందుతాయి. (చూ. 3.3.2)

ధాతువు మొదట హల్లు లేకపోతే వర్ణ వ్యత్యయం పొందే హల్లు *ట (డ), *ళ, *ళ, *ల, *ర, *ఱ లలో ఒకటి అయి ఉంటుంది.

సర్వనామాల్లో మరికొన్ని హల్లులు (*వ, *త, *న, *మ) ఉన్నప్పటికీ కూడ వర్ణ వ్యత్యయం జరిగింది.

దీనివల్ల పదాదికి వచ్చి *ళ కారం డకారం గానూ (తరువాత అది దకారం గానూ), ళకారం లకారంగానూ తెలుగులో మారుతాయి.

ధాతువు మొదట హల్లు ఉంటే వర్ణ వ్యత్యయం పొందే రెండో హల్లు *ళ, *ర లలో ఒకటిగా ఉంటుంది. ఈ రెండూ వర్ణ వ్యత్యయం తరువాత కావ్య భాషలో ఈ స్థానంలో ర గా మారుతాయి. (ఈ రేఫ వ్యావహారిక భాషలో నశించింది).

త.మ.క. కీళ్ : తె. క్రీ - ; కూ. కియ్యా

త. కుళి (=తవ్వు); తె. గ్రొచ్చు. క్రొచ్చు

3.4.23. తెలుగు వర్ణాలు

తెలుగు వర్ణాలు - అవి ఏయే మూల భాషా వర్ణాల నుండి వచ్చాయో సంగ్రహించ బడుతున్నాయి.

| క్ర.సం. | తెలుగు వర్గం | < | * మూ.ద్రా. వర్గం |
|---|---|---|---|
| 1 | అ | < | * అ |
| | ఆ | < | * ఆ |
| 2 | ఇ | < | * ఇ |
| | ~~ఈ~~ | < | * ~~ఈ~~ |
| 3 | ఉ | < | * ఉ |
| | ఊ | < | * ఊ |
| 4 | ఎ | < | * ఎ, * ఇ (అకారం ముందు) |
| | ఏ | < | * ఏ, * యా |
| 5 | ఒ | < | * ఒ, * ఉ (అకారం ముందు) |
| | ఓ | < | * ఓ |
| 6 | క - | < | * క - (అతాల వ్యాచ్‌ల ముందు) |
| | - క -, - క్క - | < | -క్క-, * -ర్క - |
| 7 | - ంక - | < | * ంక్క - |
| 8 | - గ - | < | * క -(బహుళంగా) |
| | - గ - | < | * * - క - |
| | - గ్గ - | < | * ళ్ గ - , * - ఙ్గ - |
| | - ంగ - | < | |
| 9 | - చ -, -చ్చ - ఏ | < | * క - (తాలవ్యాచ్చుల ముందు), * చ - |
| | - ంచ - | < | - ంచ్చ - |
| 10 | జ - | < | * చ - (బహుళంగా) |
| | -ంజ - | < | * - ంచ - |
| 11 | - ట - , - ట్ట - | < | * - ట్ట -, * - ఱ్ఱ - |
| | - ంట - | < | * ంట్ట |

| క్ర.సం. | తెలుగు వర్గం | < | * మూ.ద్రా. వర్గం |
|---|---|---|---|
| 12 | డ - | < | * -ట-, * -ళ- |
| | -డ - | < | * -ట-, * - ళ - |
| | -ండ - | < | * -న్ట-, * - ంట - |
| 13 | త - | < | * త |
| | -త-,-త్త - | < | * -త్త- |
| | -ంత | < | * -ంత్త |
| 14 | ద - | < | * త - (బహుళంగా), వర్ణ వ్యత్యయంలో * -ళ-, * - ట - |
| | - ద - | < | * - త - |
| | -ద్ద - | < | * -ర్ద-, * - ళ్ద - |
| | -ంద - | < | * -ంత-, * - న్త - |
| 15 | న | < | * న-, * ఞ, * ణ |
| 16 | ప - | < | * ప - |
| | - ప -, ప్ప - | < | * ప -(బహుళంగా), * వ (క్వాచిత్కంగా) |
| 17 | - బ్బ - | < | * ప్ప * - ర్ప - |
| | -ంబ - | < | * - ంప - |
| 18 | మ - | < | * మ - |
| | - మ -; మ్మ - | < | * - మ, - * ంప - |
| 19 | - య - | < | .* - య - |
| 20 | - ర - | < | . * ర - < * - ంప - |
| | . ర . | < | * ర, * ళ |

(* ళ, వర్ణ వ్యత్యయం జరిగి అది పదాది హల్లు తర్వాతకు వచ్చినప్పుడే, 'ర' గా మారుతుంది).

| | | | |
|---|---|---|---|
| 25 | ఱ | < | * ఱ (* త్త) |
| 26 | ల | < | * ల, * ళ |
| 27 | వ | < | * వ |
| 28 | స | < | * చ (క్వాచిత్కంగా) |
| 29 | హ - (కన్నడ హ - | < | * ప -) |

తెలుగులో జరిగిన సాధారణ పరిణామాలు అయిదు ఉన్నాయి. అవి -

1. దీర్ఘాచ్చు నిష్పాదక ప్రత్యయం ముందు హ్రస్వమవడం.

2. యకారం ముందు హ్రస్వాచ్చు దీర్ఘమవడం.

3. వర్ణవ్యత్యయం.

4. మూ.ద్రా. పదాది * చ కార లోపం.

5. మూ.ద్రా. పదాది శ్వాస స్పర్శాలు కొన్ని పదాలలో నాద స్పర్శాలుగా మారడం.

## అర్థ విపరిణామాలు

3.5.0. రాబోవు అధ్యాయాల్లో ఒక పదానికి ఎన్నో విధాలైన అర్థాలు చూస్తాము. ఆ అర్థాలు సోదర భాషలలో ఉన్నవైతే అది మూ.ద్రా. యొక్క అర్థంగా భావించవచ్చు. అట్లు కాక సోదర భాషల్లోని అర్థాల కంటే కొంచెం భిన్నంగా ఉండవచ్చు. లేదా తెలుగులోనే ఒకానొక కాలంలో ఒక అర్థంలో ప్రయోగింపబడిన పదమే వేరొక కాలంలో మరో అర్థంలో ఉపయోగింపబడవచ్చు. ఉదా :- 'కంపు' శబ్దాన్ని భారతంలో తిక్కన 'వాసన' అనే అర్థంలో వాడగా, నేడు దానికి 'దుర్గంధం' అనే అర్థము ప్రచారంలో ఉంది. ఈ విధంగా ఒక శబ్దము యొక్క అర్థాలు పరిణామము చెందడాన్నే 'అర్థ విపరిణామాలు' అంటారు.

3. అట్టి అర్థ విపరిణామాలను ఏడు విధాలుగా **పి.యస్. సుబ్రహ్మణ్యం** పేర్కొన్నారు[24]. అవి -

(1) అర్థ వ్యాకోచం - (Semantic Extension)

(2) అర్థ సంకోచం - (Semantic Narrowing)

(3) ఆలంకారిక ప్రయోగం - (Figurative use)

(4) అర్థ గౌరవం - (Elevation of meaning)

(5) అర్థాపకర్ష - (Degradation of meaning)

(6) సభ్యోక్తి - (Euphemism)

(7) వస్తు పరిమాణం - (Subreption)

**3.5. (1) అర్థ వ్యాకోచం** :- (Sementic Extension) :

ఒక పదం యొక్క అర్థం పాత కాలంలో కన్నా తర్వాత కాలంలో విస్తృతమైతే అది అర్థ వ్యాకోచం అవుతుంది.

ఉదా :- చెంబు. ఈ పదం మూ.ద్రా. కెమ్ - తె. చెమ్ అనే ధాతువు నుండి పుట్టినది. దానికి ఎరుపు, ఎర్రని అని అర్థం కాబట్టి రాగి చెంబే మొదట్లో చెంబు. కాని మనం ఇప్పుడు ఇత్తడి చెంబు, వెండి చెంబు - ఇత్యాదిగా వ్యవహరిస్తున్నాం.

నూనె (నువ్ + నెయ్). దీనిఅర్థం 'నువ్వుల నుండి తీసిన చమురు' - కాని నేడు కొబ్బరి నూనె, పల్లి నూనె అని ఏ ద్రవ్యం నుంచి తీసిన చమురుకైనా వాడుతున్నాం.

ఈ రెండు ఉదాహరణల్లో అర్థం తర్వాతి కాలంలో వ్యాకోచం చెందడం వలన - అర్థ వ్యాకోచానికి లక్షణ సమన్వయం.

**3.5. (2) అర్థ సంకోచం :-**

ఒక పదం యొక్క అర్థం తర్వాతి కాలంలో సంకోచం చెందితే అది అర్థ సంకోచం.

ఉదా :- 'కంపు' అనే పదానికి ప్రాచీనార్థం 'వాసన' - అని (సుగంధం కానీ, దుర్గంధం కాని) సాధారణ విస్తృతార్థం. కాగ నేడు దానిని మనం నేడు 'దుర్గంధం' అనే అర్థంలో మాత్రమే ఉపయోగిస్తున్నాం.

**3.5.1 (3) ఆలంకారిక ప్రయోగం :-**

'తీపి మాటలు', 'చేదు నిజం', 'పచ్చి అబద్ధం' వంటి మాటల్లో తీపి, చేదు, పచ్చి అనే పదాలకు ఆలంకారికార్థం ఉన్నదనేది స్పష్టం.

**3.5. (4) అర్థ గౌరవం / అర్థోత్కర్ష :-**

పూర్వకాలంలో అర్థం కంటే తర్వాతి కాలం అర్థం ప్రశస్తమైతే అది అర్థ గౌరవం / అర్థోత్కర్ష.

ఉదా :- ముహూర్తం 'నిమేష కాలం'. 'శుభకార్యానికి తగిన కాలం' అని ప్రస్తుతార్థం. ఇందులో 'అర్థగౌరవం' ఉంది.

**3.5. (5) అర్థాపకర్ష :-**

పాతకాలంలో అర్థం కన్నా తర్వాత కాలంలో అర్థం నీచమైనదైతే అది - అర్థాపకర్ష.

ఉదా :- ఛాందసుడు 'వేదవేత్త'. 'లోకజ్ఞానం లేనివాడు (చాదస్తుడు)'. అని ప్రస్తుతార్థం. ఇందులో అర్థాపకర్ష స్పష్టం.

**3.5 (6) సభ్యోక్తి :-**

పెద్దల సమక్షంలో కాని, సభలలో కాని ఉచ్చరించగూడని పదాలకు గౌరవ సూచకమైన పర్యాయపదాలే - సభ్యోక్తులు.

ఉదా :- 'చచ్చిపోయాడు' అనడానికి బదులు 'పోయారు', దివంగతులయ్యారు, కాలధర్మం చెందారు మొదలైనవి అనడం అట్టివే.

**3.5. (7) వస్తు పరిణామం :-**

ఒక పదం భాషలో స్థిరపడి, పాత కాలంలోని వస్తువులో మార్పు వచ్చినా ప్రయోగింప బడిన అది వస్తుపరిణామం.

ఉదా:- పాతకాలం పాకలు, పెంకుటిళ్ళనూ, నేటి మేడలనూ రూపంలో, వస్తువులలో భేదం ఉన్నా 'ఇల్లు' అనే వాడుతున్నాం.

ఈ విధంగా అర్థ పరిణామాలు సంభవించవచ్చు.

# పాద సూచిక

1.- సుబ్రహ్మణ్యం,పి.యస్. ఆధునిక భాషా శాస్త్ర సిద్ధాంతాలు .పుట . 242.
2. - సుబ్రహ్మణ్యం,పి.యస్. ఆధునిక భాషా శాస్త్ర సిద్ధాంతాలు .పుట . 242.
3. -దుర్గాచార్యుడు ,నిరుక్త వ్యాఖ్యానంలో .
4. - దొణప్ప,తూమాటి.భాషాచారిత్రక వ్యాసావళి.పుట348,349.
5. - దొణప్ప,తూమాటి.భాషాచారిత్రక వ్యాసావళి.పుట337.
6. - దొణప్ప,తూమాటి.భాషాచారిత్రక వ్యాసావళి.పుట339.
7. - సుబ్రహ్మణ్యం,పి.యస్. ఆధునిక భాషా శాస్త్ర సిద్ధాంతాలు .పుట . 252.
8. వ్యాకరణ పదకోశము.పుట 584.
9. - సుబ్రహ్మణ్యం,పి.యస్. ఆధునిక భాషా శాస్త్ర సిద్ధాంతాలు .పుట . 248.
10. వ్యాకరణ పదకోశము.పుట 584
11. చిన్నయ సూరి - బాల వ్యాకరణం - ప్రకీర్ణ పరిచ్ఛేదం-12.
12. వ్యాకరణ పదకోశము.పుట 342.
13. వ్యాకరణ పదకోశము.పుట 343.
14. వ్యాకరణ పదకోశము.పుట 343.
15.చిన్నయ సూరి - బాల వ్యాకరణం - ప్రకీర్ణ పరిచ్ఛేదం-14.
16.చిన్నయ సూరి - బాల వ్యాకరణం - ప్రకీర్ణ పరిచ్ఛేదం-13.
17.చిన్నయ సూరి - బాల వ్యాకరణం - ప్రకీర్ణ పరిచ్ఛేదం-21.
18.చిన్నయ సూరి - బాల వ్యాకరణం - ఆచ్ఛిక పరిచ్ఛేదం-27.
19.వ్యాకరణ పదకోశము.పుట 18
20.వ్యాకరణ పదకోశము.పుట 17.
21.చిన్నయ సూరి - బాల వ్యాకరణం - ప్రకీర్ణ పరిచ్ఛేదం-18.
22. చిన్నయ సూరి - బాల వ్యాకరణం - ప్రకీర్ణ పరిచ్ఛేదం-17.
23. చిన్నయ సూరి - బాల వ్యాకరణం - ప్రకీర్ణ పరిచ్ఛేదం-10.
24.- సుబ్రహ్మణ్యం,పి.యస్. ఆధునిక భాషా శాస్త్ర సిద్ధాంతాలు .పుట . 254.
25.చిన్నయ సూరి - బాల వ్యాకరణం - ప్రకీర్ణ పరిచ్ఛేదం-8.

# కృత్తద్ధిత ప్రత్యయాలు - పరిచయం

## 4.0 ప్రవేశిక :-

రాబోవు అధ్యాయాల్లో శ్రీమదాంధ్ర మహాభాగవతంలో కృత్తద్ధిత ప్రయోగాలను పరిశీలించ బోతున్నాను. ప్రముఖంగా పరిశీలించబడేవి కృత్తద్ధిత ప్రయోగాలు. కాబట్టి ఆ కృత్తద్ధితాల స్వరూపాన్ని గూర్చి తెలుసుకోవలసిన అవసరం ఉంది.

## 4.1. ‘కృత్’ - పరిచయం :-

‘కృత్’ అనేది ఒక విధమైన ప్రత్యయం పేరు. ఈ ‘కృత్’ అనే పారిభాషిక పదం సంస్కృత వ్యాకరణం నుంచి గ్రహించబడింది. ఇది యాస్కుని నిరుక్త కాలం నుంచి పారిభాషిక పదంగా వ్యవహరించ బడుతూ వుంది. తెలుగు వ్యాకరణ కారులు చాలా వరకు తమ వ్యాకరణ గ్రంథాల్లో సంస్కృత వ్యాకరణ పారిభాషిక పదాలనే ఉపయోగించారు. అటువంటి వానిలో ఈ ‘కృత్’ కూడా ఉంది.

‘కృత్’ - ఒక ప్రత్యయం. కాగ ‘కృత్’ ప్రత్యయం క్రియధాతు ప్రాతిపదికకు చివరన చేరుతుంది. ఆ విధంగా కృత్ ప్రత్యయం చేరడం వలన నిష్పన్నమైన శబ్దరూపాన్ని కృదంతం అంటారు. వీటినే Primary Derivatives అంటారు.

## 4.2. తద్ధితం - పరిచయం :-

‘తద్ధితం’ ఒక ప్రత్యయం. ఇది నామవాచకాలపై చేరుతుంది. ఈ ప్రత్యయం చేరిన పదాన్ని తద్ధితాంతం అంటారు. వీటిని Secondary Derivatives అంటారు.

తెలుగులోని కృత్తద్ధిత ప్రత్యయాలను సోదరభాషా ప్రత్యయ పరిచయ పురస్సరంగా పరిచయం చేస్తాను .

**4.3. కృత్ ప్రత్యయం నిర్వచనాలు :-**

పాణిని తన అష్టాధ్యాయిలో కృత్‌ను నిర్వచిస్తూ

(1) కృదతిఙ్[6] అని సూత్రం చెప్పాడు. ఆ కృత్‌ను 'ధాతోః' అంటూ ధాతువు కంటే పరంగా విధించాడు.

ధాతువుకు విధించబడే క్రియా ప్రత్యయాలను పద్దెనిమింటిని కలిపి చెప్పే ప్రత్యాహారమే తిఙ్. ఈ తిఙ్ భిన్నమై, ధాతువుకు విధింపబడే ప్రత్యయమే కృత్ అని అర్థం.

(2) A dictionary of sanskrit grammar లో కృత్ ఈ విధంగా నిర్వచించబడింది.

కృత్ A term used in the grammers of panini and others for affixes aplied to roots to form verbal derivations. - అని.

(3) "అథాపి భాషికేభ్యో ధాతుభ్యో నైగమాః 'కృతో' భాష్యన్తే - నిరుక్తం.

(4) "తిఙ్ కృత్తద్ధిత సమాసాః శబ్దమయమ్" - వాజసనేయ ప్రాతిశాఖ్యమ్.

(5) "నిష్పాదకాలు ఒక పదానికి చేరి నిఘంటువు లో సూచించదగిన ఇంకొక పదాన్ని ఏర్పరచడానికి ఉపయోగపడతాయి. క్రియలకి నిష్పాదక ప్రత్యయాలు చేరి నామవాచకాలు ఏర్పడితే వీటిని కృత్ ప్రత్యయాలు అంటారు"[2]. - పి.ఎస్. సుబ్రహ్మణ్యం.

(6) "క్రియాధాతు ప్రాతిపదికలకు కృత్ ప్రత్యయం చేరినప్పుడు మొత్తం రూపం నామంగా (కృదంతంగా) మారుతుంది. అంటే భాషా భాగ సభ్యత్వంలో మార్పు (క్రియ నామంగా మారడం) కన్పిస్తుంది. కృత్తు మీద మళ్ళీ కృద్రూప నిర్మాణం జరుగదు"[3]. - గాలి రాధాకృష్ణ.

(7) "ధాతువులకు విధింపబడి క్రియా విభక్తులు కాకుండునవి కృత్తులనబడు[4]". -నారాయణీయం.

(8) "భావాద్యర్థములందు ధాతువుల కంటే వచ్చు క్రియా విభక్తి భిన్నములైన ప్రత్యయములు

కృత్తులనబడు [5]". - ఆంధ్ర భాషానుశాసనము.

ఇవన్నీ వివిధ పండితుల 'కృత్' ప్రత్యయ నిర్వచనాలు.

**4.4 కృత్ - స్వరూపం :-**

ఎందరు ఎన్ని విధాలుగా చెప్పినా, వాటి సారాంశం మాత్రం ఇది.

(1) ఇవి (కృత్‌లు) ధాతువు కంటే పరంగా విధించబడుతాయి.

(2) ఇవి క్రియా విభక్తి ప్రత్యయాలు ఐన డుఙ్ కంటే భిన్నమైన ప్రత్యయాలు.

(3) వీటి చేరిక వలన ఆ పదాలు నామవాచకాలు అవుతాయి. అంటే ఇవి నామ నిష్పాదక ప్రత్యయాలు అని అర్థం.

(4) ఒక కృదంతం పై మరొక కృత్ప్రత్యయం చేరదు.(ఐతే కృదంతంపై తద్ధిత ప్రత్యయం చేరవచ్చు)

(5) ధాత్వర్థంచే ఆకాంక్షితాలగు కర్త్రాదికారకార్థాలో, భావార్థంలో - కృత్ప్రత్యయాలు - విధించబడుతాయి.

**4.5. కారకార్థాల్లో కృత్ప్రత్యయాలు :-**

కారకాలు ఆరు అవి కర్త, కర్మ, కరణః సంప్రదానః అపాదనః అధికరణం అనేవి. ఈ కారకార్థాల్లో, భావార్థంలో కూడా కృత్ప్రత్యయాలు విధించబడుతాయి. కొన్ని ప్రత్యయాలు, ఒకే ధాతువుపై విధించబడి రెండు కారకార్థాల్లో ప్రవర్తిస్తాయి. వాటికి క్రమంగా ఉదాహరణలు[6]:

**4.5.1. ఒకే అర్థంలో :-**

**(1) కర్త్రర్థంలో :-**

-కః

మొలచు + క > మొలక, మొలచునది (అంకురము)

తేలు + ట > తేట (మీదికి తేలునది)

(2) **కర్మార్థంలో :-**

- అ, -బడి

కాయు + అ > కాయ, దీనిని చెట్టుకాయును (కాయబడునది)

పెట్టు + బడి > పెట్టుబడి, వ్యాపారంలో ముందుగ దీనిని పెట్టెదరు (పెట్టబడునది).

(3) **కరణార్థంలో :-**

-ఇమి, -గడ :-

కూరు + ఇమి > కూరిమి, దీనిచేత (ప్రేమచే) కూర్తురు.

మను + గడ > మనుగడ, దీనిచేత జీవింతురు. (జీవనోపాయం)

(4) **సంప్రదానార్థంలో :-**

ఇదము :-

పన్ను + ఇదము > పన్నిదము. దీనికై పన్నుదురు.

(5) **అపాదానార్థంలో :-**

అరము :-

దెప్పు+అరము > దెప్పరము. దెప్పుట వలన పుట్టునది (అసహనం).

(6) **అధికరణార్థంలో :-**

-ఇకి, -కువ:-

మను+ఇకి > మనికి, దీనియందు మనుదురు (నివాసస్థానం)

వేగు + కువ > వేకువ, దీనియందు వేగును (తెల్లవాఱును)

**(7) భావార్థంలో :-**

కోయు + త > కోఁత (కోయుట)

ఆడు + ట >ఆట

**4.5.2. రెండర్థాల్లో :-**

**(1) భావ + కర్తృ :-**

-ట, -పు

ఊఱడు + ట> ఊఱట, ఊరడిల్లుట - భావార్థం', సహాయం - కర్త్రర్థం.

కాచు + పు >కాపు 'కాచుట' - భావార్థం : రక్షించు (కాచు) వాడు కర్త్రర్థం.

**(2) భావ + కర్మ :-**

-త

చేయు + త > చేఁత 'చేయుట' - భావార్థం పని' - కర్మార్థం.

మేయు + త > మేఁత ' మేయుట'- భావార్థం, పక్ష్యాదుల ఆహారం - కర్మార్థం.

**(3) భావ + కరణ :-**

-క, -కువ

ఎఱుఁగు + క > ఎఱుక 'ఎఱుగుట' భావార్థం, జ్ఞానం - కరణార్థం.

నలంగు + కువ > నలంకువ 'ఆపద' / 'వ్యాధి' - భావార్థం 'శ్రమ' - కరణార్థం.

**(4) భావ + అధికరణ :-**

-ఇమి, -కువ

కలుగు + ఇమి > కలిమి, కల్గుట - భావార్థం, 'సంపద' 'అధికరణార్థం.

పొలయు + కువ > పొలకువ 'జాడ' - భావార్థం 'మార్గం' అధికరణార్థం.

**(5) కర్మ + అధికరణ :-**

-ప

కలయు + ప > కలపము, 'పరిమళ విశేషం, పరిమళ ద్రవ్యాలతో కలుపబడినది. దీనిని కలుపుదురు - కర్మార్థం. పరిమళ ద్రవ్యాలు దీనియందు కలియును' - అధికరణార్థంలో.

**4.5.3. ఒకే రూపం రెండు క్రియా ధాతువుల నుండి నిష్పన్నమైనవి :-**

(1) తాలిమి. తాలు + ఇమి. 'ఓరిమి' - భావర్థం.

తాల్చు + ఇమి . దీని యందు ధైర్యము తాల్తురు. అధికరణార్థం.

(2) పంట. పండు + ట పలంచినది - కర్త్రర్థం.

పండు + ట 'శయినించుట - భావార్థం.

**4.5.4. ఒకే ధాతువు నుండి ఒకే అర్థంలో నిష్పన్నమైన వివిధ రూపాలు :-**

నడచు + క > నడక; నడచు + త > నడత

చూచు + పు > చూపు; చూచు + ఇకి > చూడికి

**4.6. ద్రావిడ భాషలు - కృత్ప్రత్యయాలు [7]:**

ఇక సోదర ద్రావిడ భాషల్లో ఉండే కృత్ప్రత్యయాలు, కృదంతాలు పేర్కొనబడుతున్నాయి.

**4.6.1. తమిళం :-**

(1) భావార్థక ప్రత్యయం - అల్ :- తల్. కెటుతల్, కెటల్ ('చెడటం'), పిరితల్ ('విడిపోవడం'), పిఱత్తల్ ('పుట్టడం'), కాత్తల్ ('రక్షించడం').

(2) కృత్ప్రత్యయాలు :- -అం: అకలం ('వెడల్పు'), చినం ('కోపం')

- అవు: చెలవు ('పోవడం, ఖర్చు'), ఉణవు ('తిండి'), కళవు ('దొంగతనం')

-ఇ : వెకుళి ('కోపం'); -ఇల్ : మిచ్చిల్ ('మిగులు')

-ఉళ్ : మిక్కుళ్ ('ఎక్కుళ్ళు'), విళైయుళ్ ('పంట')

- ఐ : విలై ('వెల'), కొలై ('చంపడం'), నకై ('నవ్వు')

-కై : వాళ్కై ('బ్రతుకు'), వరుకై ('రాక')

-చి : ముయఱ్చి ('ప్రయత్నం'), ఆల్చి ('ప్రభుత్వం'), మకిళ్చి ('సంతాపం')

-తి : మికుతి ('ఎక్కువ'), పకుతి ('విభాగం')

-వి : కేళ్వి ('ప్రశ్న'), కల్వి ('చదువు')

(3) ధాత్వచ్చు దీర్ఘంకావడం :

కేటు (=చేటు) <(కెటు = చెడు) పేఱు (=పొందడం) <(పెఱు = పొందు)

కోళ్ = సిద్ధాంతం <(కొళ్ = తీసికొను) ఊణ్ = తిండి <(ఉణ్ = తిను/తాగు)

తీన్ = తిండి <(తిన్ = తిను)

(4) అంత్యస్పర్శం ద్విరుక్తం కావడం (స్పర్శం = క,చ,ట,త,ప)

ఎళుత్తు = అక్షరం <(ఎళుత్ = రాయు), విళక్కు = దీపం <(విళంకు = ప్రకాశించు)

పొట్టు = పాట <(పాటు = పాడు).

(5) ప్రత్యయలోపం -

చిరి (=నవ్వు), ఇకల్ (=శత్రుత్వం), కుత్తు (=పోటు), చొల్ (=మాట), పుకళ్ (=పొగడ్త).

**4.6.2. మళయాళం :**

భావార్థక ప్రత్యయం :- -అల్; చెయ్యల్ (=చెయ్యడం), నటక్కల్ (=నడవడం)

కృత్ప్రత్యయాలు :- -అ:- నిల (=స్థానం), కొట (=దానం)

-అం :- నీళం (=పొడుగు), ఆళం (=లోతు), కళ్ళం (=అబద్ధం)

-ఇ :- కేళి (=వినడం), తోలి (=ఓడిపోవడం)

-చ్చ :- చేర్చ (=సంబంధం), వీళ్చ్చ (=పడడం)

-టు :- సుమటు (=నెత్తి మీద బరువు)

- తల్ :- పొచ్చల్ (=పరిగెత్తడం), కెటుతల్ (చెడడం)

- తల :- మఱుతల (=ఇంకొకవైపు)

- తి :- అఱుతి (=అంతం), పొఱుతి (=ఓర్పు)

-త్తం :- పిటత్తం (=పట్టడం), నటత్తం (=నడక)

-త్తు :- నెయ్‌త్తు (=నేత), కొయ్‌త్తు (=కోత)

ధాత్వచ్చు దీర్ఘంకావడం :- ఊణు (=భోజనం) (ఉణ్ = తిను)

కేటు (=చేటు), (కెటు = చెడు), చూటు (=వేడి), (చుటు = కాలు)

అంత్య స్పర్శం ద్విరుక్త మవడం :- పొట్టు (=పాట) (పాటు = పాడు)

ఓత్తు (=చదవడం) (ఓతు = చదువు), ఊట్టు (=ఊట) (ఊఱు)

విళక్కు (=దీపం) (విలఙ్గం = వెలుగు)

చిరి : (=నవ్వు); వళ (=గాజు); కళి (=ఆట), కుత్తు (=పోటు), వెట్టు (=కత్తివేటు).

4.6.3. కొడగు :-

భావార్థక ప్రత్యయం :- -పె , -వె (ఒ), బప్పె (=రావడం), పెరువె (=కనడం), బాళొ (=బతకడం), మాడో (=చెయ్యడం)

కృత్ప్రత్యయాలు :- -ఇ : తీని (=తిండి)

- (ఇ) కె : బాకె (=జీవితం), నంబికె (=నమ్మిక)

-పు : ఒప్పు (=ఒప్పందం), నిప్పు (=నిలబడడం)

- పె : కుడిపె (=తాగడం)

- (అ) వు : చావు (=చావు), అరివు (=జ్ఞానం), తరవు (ఇవ్వడం)

-ఆట : తుమ్మాట (=తుమ్మడం), నడకాట (=నడవడం)

- ఆమె : ఉక్కామె (=వ్యవసాయం)

- కు : పోకు (=నడవడి)

ం : మొరటు (=ఏడుపు), చీపు (చీకడం), ఊణు (తిండి), అడి (=దెబ్బ)

ధాత్వంత నాద స్పర్శం శ్వాస స్పర్శంగా మారడం. పాటు (=పాట) (పాడ్)

ఆటు (=ఆట) (ఆడ్) కూట (=గుంపు) (కూడ్-)

**4..4. తొద :-**

- ఇల్ : కోఫిల్ (=కాపలా);

- క్య్ : నొబ్క్య్ (=నమ్మకం); కొణ్క్య్ (కానుక)

- ఖూ : ముచ్ ఖూ (=మూత)

-త్ : పేస్త్ (=ఇల్లు నెయ్యడం)

-ప్ : నఢ్ప్ (=నడవడి), నెన్ప్ (జ్ఞాపకం)

-ఫ్ : కేళ్ఫ్ (=వార్త, మాట)

-ఫ్య్ : కల్ఫ్య్ (=చదువు)

-మ్ : ఒణ్మ్ (=లెక్కపెట్టడం), వీడ్మ్ (=పరుగు)

య్ : పోత్య్ (=పక్క, Bed), పఖ్య్ (=భాగం)

**4.6.5. కన్నడం :-**

-అం : అగలం (=వెడల్పు), గెల్లం (జయం), పొంకం (పొంగు),

ఆటం (ఆట), పాటం (పాట).

-అల్ : అళల్ (దుఃఖం), ఏఱల్ (=సింహాసనం), (ఏఱు = ఎక్కు)

-ఆర్ : బెళర్ (=వెలుగు)

- ఆవు : తొడవు (=భూషణం), గెలవు (=గెలుపు), బరవు (=రావడం)

- ఇ : పుట్టి (=పుట్టినవాడు), ఆడి (=ఆడేవాడు)

-ఇగె : తొడిగె (=తొడవు, ఆభరణం)

-కె : అగల్కె (=విడదీయడం), అఱికె (=ప్రసిద్ధి), ఇర్కె (=నివాసం)

కాణ్కె (=చూపు), బెంకె (=వేడి)

-గె : అడుగె (=వంట), బేగె (=మంట)

-తం : గెయ్‌తం (=పని), మేతం (=మేఁత)

-తె : పొగళ్‌తె (=పొగడ్త), నెగళ్‌తె (=కీర్తి)

-పం : తొూనెపం (=ఊగడం), బరెపం (=వ్రాత)

-పి : నోంపి (=నోము), కల్పి (=చదువు)

-పు : పొళెపు / పొళపు (=తెలుపు), కాయ్‌పు (=కోపం), కాపు (=రక్షణ)

-పె : కయ్‌పె (=చేదు)

-మె : కూర్మె (=ప్రేమ)

-వి : నరవి (=పోగుచేయడం), అళవి (=కొలత)

- వు : అఱివు (జ్ఞానం), అళివు (నాశం), నోవు (నొప్పి), నావు (చావు)

ధాత్వచ్చు దీర్ఘమవడం :- కోళ్ (=తీసుకోవడం) < (కొళ్ = తీసుకొను), సూడు (=వేడి) < (సుడు = కాలు); కేడు (=చేటు) < (కిడు <* కెటు = చెడు), కోడు (=దానం) (< కుడు <* కొటు = ఇచ్చు)

౦ : నడె (=నడక) ; కట్టు ; కూగు (=కేక)

తడె (=అడ్డు), తప్పు.

**4.6.6.** తుళు :

-అంద : ఒప్పంద (=ఒప్పందం)

-అణె : తిర్గణె (= స్క్రూ)

-అలు : కావలి (=కావలి)

-ఇ : మెంచి (=మెరుపు), గుత్తి (=మోడు)

-ఇకె : బెదరికె (=భయం), బిరికె (=బీట)

-ఇగె : మెత్తిగ (=అరుగు), బిత్తిగె (=విత్తనాలు చల్లడం)

-ఎ : కట్టె (=కట్టినది), పత్తె (=గుర్తు), అరిపె (=జల్లెడ)

-ఎలు : ముచ్చెలు (=మూత), కడపెలు (=తిరుగలి)

- వు : మేవు (=మేత), కళవు (=దొంగతనం)

**4.6.7. కొండ :-**

-ఉణ్ : నేంజుణ్ (=ఊపిరి) (నేంజ్ = ఊపిరిపీల్చు)

-కు : మూల్కు (=మూత్రం) (మూల్ = మూత్రము)

**4.6.8. కూయి :**

- ఎడి : పంగెడి (=కర్రెపలక), కిసెడి (=చెవిపోగు)

- ఎరి : కోఎరి (=కోతలు) (కో = కోయు)

- ఒడి : సీపొడి (=గరిటె) (సీ = ఇచ్చు)

- ఒరి : దేస్పొరి (=ఎత్తడం) (దేస్ = ఎత్తు)

- ఒలి : ద్రుంగొలి (=ఉయ్యాల) (ద్రుంగ్ = ఊగు)

**4.6.9. పెంగొ :**

-అ : డవ (=తవ్విన మట్టి), పక (=చీలిక)

-ఇ : క్డేంజి (=కల), పకి (=వెదురుబద్ద), ముచి (=మూత)

-కొండ్ : కేర్కొండ (=పాట)

-పొండ్ : కుతఅస్పొండ్ (=దగ్గు)

**4.6.10. కొలామి :**

- ఊడ్ : సీఊడ్ (ఇచ్చినది), పండూడ్ (పండు)

**4.6.11.పర్జీ :-**

- అల్ : నేఞల్ (=ఊపిరి), ఊబల్ (=చెప్పడం)

- కుడ్ : ఊర్జుకుడ్ (=చెమట), తుమ్‌కుడ్ (=తుమ్ము)

నొయ్‌కుడ్ (=నొప్పి)

**4.6.12.బ్రాహుయి :-**

-అ : చండ (=కదలిక) (చండ్ = కదులు), జక్క (=దగ్గు)

-స్ : తిస్స్ (=దానం) (తిన్ = ఇచ్చు), ఖులీస్ (=భయం)

(ఖుల్ = భయపడు), పిరేస్ (=వాపు) (పిర్ = వాచు)

ం : ద్రిక్ (=గంతు), అక్కల్ (=అరుపు), పుల్ (దొంగతనం), తక్ (=కోరిక)

**తులనాత్మక చర్చ** [8] :-

1.మధ్యోత్తరోప కుటుంబాల సాహిత్య రహిత భాషలలో ప్రాచీన కృత్ప్రత్యయాలు చాలా వరకు నశించాయి.

2. ఒక భాషలో ఒకే ధాతువుకు భిన్నార్థాలలో కాని ఏకార్థంలోనే కాని భిన్న ప్రత్యయాలు చేరడం కూడా ఉంది. ఉదా :- నడక, నడత; చూపు, చూడ్కి; చేఁత, చేయి, మొ.

3. టు, ఱు లతో అంతమయ్యే ధాతువుల్లో అచ్చు దీర్ఘం కావడం వల్ల - కృదంతరూపం ఏర్పడడం సాహిత్యవంతమైన నాలుగు భాషల్లోనూ ఉంది.

4. చివరి స్పర్శం ద్విరుక్తమవడం కూడా ఉంది.

5. కొన్నింటిలో ప్రత్యయమేమీ లేకుండుట కూడ సాధారణ ద్రావిడ లక్షణమే.

### 4.7. తెలుగులో కృదంతాలు - విభాగం

తెలుగులోని కృదంతాల విభజన రెండు విధాలుగా చేయవచ్చు. అవి -

1. భాషా శాస్త్ర పద్ధతి
2. వ్యాకరణ పద్ధతి

ఈ విభాగాల గూర్చి చర్చించే ముందు ధాతువు, నిష్పాదక ప్రత్యయాల గూర్చి పి.యస్. సుబ్రహ్మణ్యం గారి సూచనలు చూద్దాం.

**4.7.0. (అ)ధాతువు - నిష్పాదక ప్రత్యయం[9] :-**

తులనాత్మక పరిశీలనలో ధాతువు (Root), నిష్పాదక ప్రత్యయం (Derivative Suffix) ఈ రెండింటికీ ఉన్న భేదం తెలుసుకోవడం అవసరం.

సోదర భాషలలో ఉన్న సజాతి పదాల (Cognates) లో మొదటి కొన్ని వర్ణాలే తుల్యంగా ఉంటాయి. ఇలా అన్ని భాషలలో తుల్యంగా ఉన్న వర్ణ సముదాయాన్ని 'ధాతువు' (Root) అంటారు. (ధాతువులో వర్ణాలు తుల్యంగా లేకపోయినా కొన్ని భాషలలో నియతమైన ధ్వని పరిణామాలు పొంది ఉండవచ్చు).

ధాతువు తరువాత ఉన్న వర్ణ సముదాయాన్ని 'నిష్పాదక ప్రత్యయం' అంటారు. (కొన్ని సందర్భాల్లో నిష్పాదక ప్రత్యయం లేకుండా కేవలం ధాతువు మాత్రమే ఉండవచ్చు).

ఉదాహరణకు :-

త., మ. ఎలి ; క. ఎలి, ఇలి; తె. ఎలుక; ప.ఎల్ ;

కోత. ఎయ్జ్; బ్రా. అల్ (DED 833)

పై వ్యుత్పత్తి సముదాయంలో (Etimological Group) '* ఎల్ ' అనేది అన్ని భాషలలో ఉంది. కాబట్టి ఇందులో అదే ధాతువు.

ఇందులోని 'ఎ' కారం కన్నడ 'ఇలి' లో, 'ఇ' కారంగా, బ్రాహుయిూలో అకారంగానూ =¶i Ok . D =¶~¡æ° D ƒì+¬..Õx † Ç Ç°Ø" ÍHâ \ *ఎల్ ని ధాతువుగా పరిగణించ డానికి ఇవి ప్రతి బంధకాలు కావు.

* ఎల్ - తరువాత ఉన్న - త., మ., క. లో '-ఇ', కోత లో '-య్', తె.లో '-ఉక్' అనేవి నిష్పాదక ప్రత్యయాలు. పర్జీ, బ్రాహూయీాలలో ధాతువు మాత్రమే ఉంది. నిష్పాదక ప్రత్యయం లేదు.

**4.7.0 (ఆ) ద్రావిడ ధాతువులు - విభజన[10] :-**

ద్రావిడ భాషా కుటుంబంలో ధాతువులను వాటి స్వరూపాన్ని బట్టి ఆరు రకాలుగా విభజించవచ్చు.

((హ) = హల్లు ఉండవచ్చు, లేకపోవచ్చు; అ = హ్రస్వాచ్చు; ఆ=దీర్ఘాచ్చు)

(స్పష్టత కోసం ధాతువూ, ప్రత్యయం విడివిడిగా ఇవ్వబడుతున్నాయి).

**1. (హ) అ - :-**

ఉదా :- త. వ - ంతు (=వచ్చి), మ. వ-న్ను, క.బ - ందు, (5270), (వీనిలో 'వరు' - (=వచ్చు) రూపాంతరమైన - 'వ'.

త.త-ంతు (=ఇచ్చి), మ. త - న్ను, క.త - ందు (వీటిలో 'తరు-' (=ఇచ్చు) రూపాంతరమైన 'త-').

ఈ రకం ధాతువులు చాలా స్వల్పం. ఉన్నవి కూడా మిగిలిన రకాలకు చెందిన ధాతువుల రూపాంతరాలు గానే ఉంటాయి.

**2. (హ) ఆ - :-**

ఉదా :- త. మ. కొడ. క. తు. 'కా-', తె. 'కా-చు' (=రక్షించు), ప.గ. కూయి. 'కా-' (1416DED)

**3. (హ) అహ - :-**

ఉదా :- త.మ. కోత. క.తు. 'నిల్'; తె.నిల్ - ఉచు; ప. 'నిల్'.

**4. (హ) ఆహ - :-**

ఉదా :- త.మ. 'ఆటు'; కోత. 'ఆడ్'-; తొ. ఓడ్ - ; క.తు.తె. 'ఆడు'; కో.నా. 'ఆడ్-' (DED 347).

**5. (హ) అహహ - :-**

ఉదా :- త. 'కట్టు'; మ. 'కట్టు', 'కెట్టు'; కోత. 'కట్'-; తొ. కొట్-, క.తు.తె. 'కట్టు';

ప. 'కట్ట్', గోండి. కట్ట్ - (1147).

**6. (హ) ఆహహ - :**

ఉదా :- త.మ. 'తాంటు'; కోత. 'దాట్-';

తొద. 'తోట్-'; క. తాంటు, దాంటు; తు. దాంటు; తె. దాఁటు.

**4.7.1. తెలుగు కృదంతాల విభజన - భాషా శాస్త్ర పద్ధతి :**

తెలుగులోని కృదంతాలను భాషా శాస్త్ర పండితులు **డా. గాలి రాధాకృష్ణ** ఈ విధంగా విభజించారు[11].

కృదంత శబ్దాలలో (తెలుగులో) కొన్నింటిలో కృత్ ప్రత్యయం అనుబంధంగా చేరినవి, మరికొన్ని కృత్ ప్రత్యయం అనుబంధంగా చేరనవి ఉంటాయి. ఉదా :- కృత్ప్రత్యయం చేరినది.

'ఏలుబడి' చేరనిది - 'చదువు'.

కృత్ప్రత్యయం అనుబంధంగా చేరని వానిని 'నిరనుబంధాలు' అనీ, చేరిన వానిని 'సాను బంధాలు' అనీ అనవచ్చు.

వానిలోనే - ధాతువు రూపంలో మార్పు లేకుంటే 'అభేద రూపం' (ఉదా :- చదువు, పుట్టుక (పుట్టు + క) అనీ, మార్పు ఉంటే 'పరివర్తన రూపం' అని అనవచ్చు. ఈ విధంగా కృదంతాలు స్థూలంగా నాలుగు విధాలు.

కృదంతం

నిరనుబంధం

సానుబంధం

అభేదరూపం

పరివర్తన రూపం

అభేదరూపం

పరివర్తన రూపం

(ఉదా : చదువు)

(L ^ ¥: g#° < √విను) (ఉదా: పుట్టుక)

(ఉదా: కలిమి)

వీనిలో 'పరివర్తన రూపం' అనే విభాగంలో వివిధాలైన రూప నిర్మాణ భేదాలు గోచరిస్తాయి.(దీనికి సంబంధించిన పట్టిక పక్క పుటలో)

### 4.7.1.1. నిరనుబంధ కృదంతాలు :-

క్రియాధాతు ప్రాతిపదికకు నిష్పాదక ప్రత్యయం చేరనిచో - అవి నిరనుబంధ కృదంతాలు.

#### 4.7.1.1. (1) నిరనుబంధ - అభేదరూపం :-

దీనిలో నిష్పాదక ప్రత్యయమేదీ చేరదు. క్రియాధాతు ప్రాతిపదికలో మార్పురాదు.

## తెలుగు కృదంతాల విభజన - భాషా శాస్త్ర పద్ధతి



ఉదా :-

√ చదువు to read, study > చదువు reading, education

√ తప్పు to err, mistake > తప్పు Error, Mistake

√ నవ్వు to laugh, smile > నవ్వు laughter, smile

√ పండు to ripen > పండు fruit

**4.7.1.1. (2) నిరనుబంధ పరివర్తన రూపాలు :-** ఇవి ఐదు విధాలు :

అవి :-

1. లోపం
2. దీర్ఘీకరణం
3. ద్విరుక్తీకరణం
4. శ్వాసీకరణం
5. సహ పరివర్తన ప్రక్రియలు

**(1) నిరనుబంధ లోపాత్మక పరివర్తన రూపాలు :**

క్రియా ధాతు ప్రాతిపదికకు ప్రత్యయ మేదీ చేరక ధాత్వంతంలో పాక్షిక లోపం జరుగును.

ఉదా :-

(అ) -చు లోపం :

√ తెరచు to open > తెర curtain

√ వగచు to grieve > వగ grief

(ఆ) -యు లోపం :

√ తడియు to get wet > తడి wetness

√ ముదియు to grow old > ముది oldage

(2) నిరనుబంధ - దీర్ఘీకరణం :-

క్రియాధాతు ప్రాతిపదికలోని ఆద్యహ్రస్వ స్వరం నామ నిష్పత్తిలో దీర్ఘస్వరంగా పరివర్తన చెందుతుంది.

ఉదా :- √ విను to hear > వీను an ear (ఇ→ఈ)

(3) నిరనుబంధ - ద్విరుక్తీకరణం :-

క్రియా ధాతు ప్రాతిపదికలోని అంత్య వ్యంజనం నామ నిష్పత్తిలో ద్విరుక్తంగా మారుతుంది.

ఉదా :- న్ → న్న్

కను to see > కన్ను an eye

**(4) నిరనుబంధ - శ్వాసీకరణం :-**

క్రియా ధాతు ప్రాతిపదికలోని నాదాలు (గజడదబ) శ్వాస వర్ణాలు (కచటతప) గా మారుతాయి. ఉదా :-

(అ) గ్ → క్

√ వీఁగు to be swollen with pride > వీఁక pride

(ఇ) డ్ → ట్

√ ఓడు to be defecated > ఓటు defeat

(ఉ) బ్ → ప్వ్

√ ఉబ్బు to swell > ఉప్పు salt

**(5) సహపరివర్తన ప్రక్రియలు :-**పై ప్రక్రియలు రెండు, మూడు కలిసి ప్రవర్తిస్తే - అవి సహపరివర్తన ప్రక్రియలు.

(అ) లోపదీర్ఘం (లోపం, దీర్ఘకరణం)

√ కుడుచు to eat > కూడు food (చు లోపం, ఉ→ఊ)

(ఆ) లోప దీర్ఘ శ్వాసం (లోపం, దీర్ఘీకరణం, శ్వాసీకరణం)

√ పొడుచు to stab > పోటు a stab. (చు లోపం, ఒ→ఓ, డ్→ట్).

**4.7.1.2. సానుబంధ కృదంతాలు :-**

క్రియాధాతు ప్రాతిపదికకు అనుబంధంగా ప్రత్యేక నిష్పాదక ప్రత్యయం చేరడం వల్ల ఏర్పడేవి - సానుబంధ కృదంతాలు.

**4.7.1.2. (1) సానుబంధ - అభేదరూపం :-**

క్రియాధాతు ప్రాతిపదికకు (కృత్) నామ నిష్పాదక ప్రత్యయం చేరుతుంది. కాని ధాతువులో మార్పు ఏమీరాదు.

1. -క : √ పుట్టు to see > పుట్టుక birth

2. -కలి : √ కను to see > కనుకలి sight

3. - కువ : √ మను to live > మనుకువ residence

4. -గడ : √ మను to live > మనుగడ life

5. -గు : √చెడు to be spoiled > చెడుగు evil

6. -దల : √కూడు to unite > కూడుదల unity

7. -బడి : √ఏలు to rule > ఏలుబడి ruling

8. -బాటు : √గిట్టు to suite > గిట్టుబాటు profit

9. -మతి : √దిగు to be disembarked> దిగుమతి disembarkation

10. -వ : √తెగు to dare > తెగువ daring

**4.7.1.2. (2) సానుబంధ పరివర్తన రూపం :-** క్రియాధాతు ప్రాతిపదికకు నామ నిష్పాదక ప్రత్యయం (కృత్) చేరగా ప్రాతిపదిక భాగంలో మార్పులు కలిగినచో - అది సానుబంధ పరివర్తన రూపం. ఇది ప్రవర్తించే విధాలు తెలిపే పట్టిక -



**1. ఆదేశాత్మక సానుబంధ పరివర్తనం :-**

నామ నిష్పాదక (కృత్) ప్రత్యయం చేరునపుడు క్రియా ధాతు ప్రాదిక స్థానంలో వేరే అక్షరం ఆదేశంగా రావడం జరుగుతుంది.

√ వచ్చు కు రా ఆదేశం :

(అ) - క : √ వచ్చు to come > రాక coming

(ఆ) - కడ : √ వచ్చు to come > రాకడ coming

(ఇ) - బడి : √వచ్చు to come > రాబడి income

లోపాత్మక సానుబంధ పరివర్తనం :- నామ నిష్పాదక (కృత్) ప్రత్యయం చేరునపుడు ధాత్వంతం లో స్వరం కాని, వ్యంజనం కాని, రెండు వర్ణాలు కాని లోపిస్తాయి.

స్వరలోపం :- -ఉ లోపం :

| | | | |
|---|---|---|---|
| 1. | -అ : | √ కట్టు to be bind | > కట్ట dam, bundle |
| 2. | -అకము : | √ నమ్ము to believe | > నమ్మకము belief |
| 3. | -అంకి : | √ అడ్డు to obstruct | > అడ్డంకి obstruction |
| 4. | -అటి : | √ ఓము to preserve | > ఓమటి food |
| 5. | -అడ : | √ కట్టు to tie | > కట్ట rule |
| 6. | -అడి : | √ ముట్టు to be surround | > ముట్టడి surrounding |
| 7. | -అనము : | √ విత్తు to sow | > విత్తనము a seed |
| 8. | -అందము : | √ ఒప్పు to agree | > ఒప్పందము an agreement |

9. -అము : √అడ్డు to obstruct >అడ్డము obstruction

10. -అడము : √కట్టు to build >కట్టడము building

11. -అరము : √ఉబ్బు to swell >ఉబ్బరము swelling

12. -అలి : √కూడు to meet, join >కూడలి junction

13. -అవు : √తగు to be proper >తగవు justice

14. - అసము : √వ్రాయు to write >వ్రాయసము clerkship

15. - ఇ : √చేయు to do >చేయి a hand

16. - ఇక : √కోరు to desire >కోరిక desire

17. - ఇగ : √నమ్ము to believe >నమ్మిగ belief

18. - ఇడి : √తాకు to touch >తాకిడి an attack

19. - ఇణి : √పంపు to send >పంపిణి distribution

20. - (ఇ)త : √పొగడు to praise >పొగడిత/పొగడ్త praise

21. - ఇస : √ద్రోకు to pare >ద్రోకిస paring

22. - ఎ : √జంకు to fear >జంకె threat

23. - ఎన : √దువ్వు to comb >దువ్వెన a comb

**వ్యంజన లోపం :-**

(అ) - గు లోపం :-

-త : √మ్రోగు to sound >మ్రోత sound

(ఆ) -ంచు లోపం :-

| | | | |
|---|---|---|---|
| | -ంపు : | √ ముంచు to plunge | > ముంపు plunging |

(ఇ) -చు లోపం :-

| | | | |
|---|---|---|---|
| (1) | -క : | √ నడచు to walk | > నడక walking, conduct |
| (2) | -కడ : | √ నిలుచు to stand | > నిలకడ standing |
| (3) | -గర : | √ విడుచు to release | > విడుగర release |
| (4) | - త : | √ మడచు to fold | > మడత a fold |
| (5) | - దల : | √ విడుచు to release | > విడుదల release |
| (6) | - ప : | √ కడచు to pass | > కడప threshold |
| (7) | - పి : | √ తెరచు to open | > తెరపి intermission |
| (8) | -పు : | √ చూచు to see | > చూపు sight |
| (9) | - మర : | √ విడుచు to release | > విడుమర releaf |
| (10) | -వ : | √ విలుచు to sell | > విలువ value |
| (11) | - వడి : | √ నడచు to go | > నడవడి conduct, behaviour |
| (12) | - వు : | √ కొలుచు to serve | > కొలువు serving. |

(ఈ) '-చ్చు' లోపం :-

| | | | |
|---|---|---|---|
| (1) | -ప్పు : | √ మెచ్చు to admire | > మెప్పు admiration |
| (2) | -వ్వు : | √ నొచ్చు to ache, pain | > నొవ్వు pain, desease |

(ఉ) -ను లోపం :-

-త : √ ఈను to yean, bring fourth > ఈత yeaning, bringing forth young.

(ఊ) -యు లోపం :-

(1) -ట : √ మూయు to cover > మూట cover, bundle

(2) -త : √ కోయు to cut > కోత cutting

(3) -దల : √ విడియు to halt > విడుదల halting place

(4) -ది : √ విడియు to halt > విడిది halting place

(5) -పు : √ మోయు to bear > మోపు large bundle

(6) -వి : √ తెలియు to be understand > తెలివి intelligence

(ఎ) '-రు' లోపం :-

(1) -ట : √ చెమరు to sweat > చెమట sweat

(2) -వ : √ ఎగురు to fly > ఎగువ the top

(ఐ) '-వు' లోపం :-

-క : √ పోవు to go > పోక going

**వర్ణ ద్వయ లోపాత్మకములు :-**

ఇంతవరకు ఒక్క వర్ణము లోపించే కృదంతాలు కనిపించాయి. రెండు వర్ణాలు లోపించేవి కూడా ఉంటాయి. అయితే - ఇందులో వర్ణలోపమనేది సంధి వలన జరిగేది

మాత్రమే. ఇంతకు ముందు చూసిన 'స్వర లోపం' లో చూసింది కూడా అటువంటిదే.

(క) '-అయు' లోపం :-

(1) -ఇ : √నెరయు to becomfull > నెరి fullness

(2) - ఇమిడి : √సొలయు to faint > సొలిమిడి fainting

(గ) '-ఇయు' లోపం :-

(1) -అక : √నులియు to be twisted > నులక a rough kind of rope

(2) -అసు : √సొగియు to be pleasant > సొగసు beautiful

(3) - ఉపు : √ఉరియు to leak > ఉరుపు leakage

(చ) '-ఉగు' లోపం :-

- (ఇ) మి : √కలుగు to occur, beenist > కలిమి / కల్మి weath, existence

(జ) '-ఉచు' లోపం :-

(1) -అత : √కొలుచు to measure > కొలత measurement

(2) - ఇ : √తొలుచు to bore > తొలి hole

(3) -ఇక : √అమరుచు to prepare > అమరిక fitness

(ట) '-ఉలు' లోపం :

-ఇ : √ఉరులు to cought in a snare > ఉరి snare

**సానుబంధ స్వర పరివర్తనం :-**

నామ నిష్పాదక (కృత్) ప్రత్యయం చేరగా ప్రాతిపదికలోని అద్యస్వరంలో పరివర్తనం రావడం

జరుగుతుంది.

**(క) దీర్ఘీకరణం :-** ప్రాతిపదికలోని ఆద్యస్వరం హ్రస్వంగా ఉన్నది దీర్ఘమౌతుంది.

అ → ఆ

(1) - క : కను - కానుక

(2) - పు : కను - కానుపు

(గ) హ్రస్వీరకణం :- ధాతువులోని ఆద్యస్వరం దీర్ఘంగా ఉన్నది హ్రస్వంగా మారుతుంది.

(1) ఆ → అ

- గు : పారు - పరుగు

(2) ఏ → ఎ

- గు : పేరు - పెరుగు

**సానుబంధ వ్యంజన పరివర్తనం** : నిష్పాదక (కృత్) ప్రత్యయం చేరినపుడు ధాతు ప్రాతిపదికలోని చివరి వ్యంజనములో మార్పు వస్తుంది.

**(అ) అద్విరుక్తీకరణం :-** ద్విరుక్తం అద్విరుక్తమౌతుంది.

ర్ర్ → ర్

- సు : బిర్రు బిరుసు

**(ఇ) శ్వాసీకరణం :-** నాదస్పర్శం (కచటతప) శ్వాస స్పర్శంగా మారుతుంది.

గ్ → క్ : - వ : వేగు వేకువ

గ్గ్ → క్క్ : - వ : తగ్గు - తక్కువ

డ్ → ట్ : - వ : కూడు - కూటువ

సహ పరివర్తన క్రియలు ఇంతవరకు పేర్కొన్న ఈ ప్రక్రియలే రెండు, మూడు, నాలుగు ఒకేసారి ప్రవర్తించిన ఉండే రూపాలు -

**(అ) లోపాదేశం -**

లోపము - ఆదేశమూ ఇందు ప్రవర్తిస్తాయి.

(1) - ఉ లోపం : చ్ కు ప్ ఆదేశం

- ఇడి : √దోచు to plund > దోపిడి plunder

- ఎన : √ఈర్చు to remove nits from the hair with a comb > ఈర్పెన a comb for extracting nits.

- అలి : √కాచు to gaurd > కావలి gourd

(2) - ఉ లోపం : య్ కు ప్ ఆదేశం

- అట : √పాయు to be separated > పాపట the parting of hair

- అము / ఎము : √మురియు to be in great glee > మురిపెము gracefulness.

(3) - ఉ లోపం : య్ కు స్ ఆదేశం

- అట : √అలయు to be fatigued > అలసట fatigue

**(ఆ) లోపదీర్ఘం :-** ఇది రెండు విధాలు :

(అ) అంత్య స్వరలోపం : ఆద్యస్వర దీర్ఘం

- ఉ లోపం : అ → ఆ

- క : √కను to see > కాన్క gift offered to appear

(1) - ఇయు లోపం : ఉ → ఊ

- ఉ : √నులియు to be trusted > నూలు twine

(2) -చ్చు లోపం : అ → ఆ

-వు : √చచ్చు to die > చావు death

(3) -చ్చు లోపం : ఇ → ఈ

-ఁగి/వి : √ఇచ్చు to give > ఈఁగి / ఈవి giving

(4) -చ్చు లోపం : ఒ → ఓ

- వి : √నొచ్చు to pain > నోవి pain

(5) -ను : లోపం : ఒ → ఓ

- లు : √కొను to take, rob > కోలు taking, plunder

(6) - రుగు లోపం : ఎ → ఏ

-ట : √చెరుగు to winnow > చేట winnowing basket

**(ఇ) లోపహ్రస్వం** : అంత్య స్వరం కాని అక్షరం కాని లోపించగా ఆద్యస్వర దీర్ఘం హ్రస్వంగా మారుతుంది.

(1) అంత్యస్వర లోపం : ఆద్యస్వర హ్రస్వీకరణం.

- ఉ లోపం : ఊ → ఉ

ఇదము : √చేయు to do > చెయిదము doing

**(2) అంత్యాక్షర లోపం : ఆద్యస్వర దీర్ఘీకరణం**

-చు లోపం : ఊ → ఉ

-వు / వ్వు : √పూచు to blossom > పూవు flower

**(ఈ) లోపద్విరుక్తం :**

**(1) అంత్య స్వరలోపం : అంత్యవ్యంజన ద్విరుక్తం.**

ఉ లోపం : న్ → న్న

-ఇక : √మను to exist > మన్నిక long lasting

**(2) అంత్యాక్షర లోపం : అంత్య వ్యంజన ద్విరుక్తీకరణం**

(1) -ఇయు లోపం : ల్ → ల్ల

- అమి : √తెలియు to be clear > తెల్లమి clearness

(2) -యు లోపం : ల్ → ల్ల

-డి : √వెలయు to be known > వెల్లడి publicity

(3) -రు లోపం : మ్ → మ్మ

-ట : √చెమరు to sweat > చెమ్మట sweat

(ఉ) లోపనాదం : అంత్య స్వరం లోపించగా, అంత్య శ్వాసం (కచటతప) నాదం (గజడదబ) గా పరిణమిస్తుంది.

-ఉ లోపం : చ్ → జ్

-అడి : √అలచు to grieve > అలజడి sorrow, grief

**లోపశ్వాసం :**

(1) అంత్య స్వరం లోపించి అంత్యనాదం (గజడదబ) శ్వాసంగా పరిణమిస్తుంది.

-ఉ లోపం : గ్ → క్

-క : √మునుగు to sink, plunge > మునుక sinking, plumging

**(2) అంత్యస్వరలోపం : అనునాసికలోపం : శ్వాసీకరణం**

-ఉ లోపం : ంలోపం : గ్ → క్

-క : √అలుగు to be angry > అలుక angry

**(౨) లోపమూర్ధన్యం :-**

అంత్య స్వరం లోపించి, అంత్యానునాసికం మూర్ధన్యంగా పరిణమిస్తుంది.

-ఉ లోపం : న్ → ణ్

-డి : √తిను to eat > తిండి food ( = తిణ్డి)

**(౩) లోప సమీకరణం :-**

అంత్య స్వరం లోపించి ఉపధాచ్చుతో సమీకరణము (స్వరాకర్షణ) జరుగుతుంది.

-ఉ లోపం : ఉ → ఇ

-ఇక : √కుదురు to settle > కుదిరిక settlement

**(౭) దీర్ఘ శ్వాసం :-**ఆద్యస్వర దీర్ఘీకరణం : అంత్య వ్యంజన శ్వాసీకరణం.

ఎ → ఏ : గ్ → క్

-వ : √తెగు to dare > తేకువ

(ఒ) లోప - అదీర్ఘ - ద్విరుక్తం :-

-ఉ లోపం : ఏ → ఎ : య్ → య్య

-ఇ : √చేయు to do > చెయ్యి the hand

**(ఓ) లోప ద్విరుక్త శ్వాసం :-**

-ఉ లోపం : డ్ → ట్ట్

-అ : √చెడు to be spoiled > చెట్ట evil, harm, wicked

(అం) లోప దీర్ఘ అద్విరుక్త శ్వాసం :-

-ఉ లోపం : ఉ → ఊ : గ్ → క్

-క : √నుగ్గు to pound > నూక

**4.7.2. తెలుగు కృదంతాలు - వ్యాకరణ విభాగం :-**

ఇంతవరకు తెలుగు భాషలోని కృదంతాలను భాషా శాస్త్ర పద్ధతిన విభజించడం జరిగింది. ఆ విభాగం అంతా కూడ ప్రత్యయాలు చేరినపుడు ధాతువులో కలిగే మార్పుల ఆధారంగా చేయబడింది. ఇక వ్యాకరణ శాస్త్ర విభాగం గూర్చి చర్చించాలి.

వ్యాకరణాల్లో క్రియా ధాతు ప్రాతిపదికలపై వచ్చే ప్రత్యయాలను పేర్కొన్నారు . ఈ ప్రత్యయాలు క్రియాధాతువుకు పరంగా వచ్చేవి. ఇటువంటి కృత్ప్రత్యయాలు పూర్వాధ్యాయాలలో పేర్కొన్న గ్రంథాల ఆధారంగా లభించినవాని వివరాలు :

| | | |
|---|---|---|
| అజాది ప్రత్యయాలు | - | 40 |
| హలాది ప్రత్యయాలు | - | 46 |
| లభించిన మొత్తము | - | 86 |

కృత్ ప్రత్యయాలకు చెందిన క,గ,త,ప,వ,ఇమి అనేవి పరమైనపుడు ధాతువు చివరి త,గ,చ,యు,వ అను వర్ణాలు లోపిస్తాయని చిన్నయసూరి చెప్పాడు[12]. అటువంటి కృత్ప్రయాలు 22 లభించాయి.

ఆ ప్రత్యయాలన్నింటిని సంగ్రహంగా పట్టికలో నిరూపిస్తాను.

# కృత్ప్రత్యయాలు - పట్టిక

| క్ర. సం. | ప్రత్యయం | ఉదాహరణలు |
|---|---|---|
| 1. | - అంకి | అడ్డంకి |
| 2. | - అందము | ఒప్పందము |
| 3. | - అ | ఎండ, గీఱ |
| 4. | - అక(ము) | అమ్మకము, నమ్మకము |
| 5. | - అట | త్రిప్పట, పాపట |
| 6. | - అటి | ఓమటి |
| 7. | - అడ(ము) | కట్టడము, కట్టడ |
| 8. | - అడి | ముట్టడి |
| 9. | - అత | కొలత |
| 10. | - అన(ము) | విత్తనము |
| 11. | - అమి | ఓటమి, కూటమి |
| 12. | - అర(ము) | ఉబ్బరము, దెప్పరము, కావరము |
| 13. | - అఱు | చూపఱు |
| 14. | - అరి | ప్రేలరి |
| 15. | - అల | తావలము |
| 16. | - అలి | కూడలి, తిరుగలి |
| 17. | - అవు | తగవు, తొడవు |
| 18. | - అసము | వ్రాయసము |
| 19. | - అసు | సొగసు |
| 20. | - ఇ | చేయి, ముడి, తిండి |
| 21. | - ఇక | కోరిక, అమరిక, కుదిరిక, ఎన్నిక, మన్నిక |
| 22. | - ఇకి | కోరికి, వినికి, ఉనికి |
| 23. | - ఇగ | నమ్మిగ |
| 24. | - ఇడి | తాకిడి, దోపిడి |
| 25. | - ఇణి | పంపిణి |
| 26. | - ఇత | పొగడిత |
| 27. | - ఇదము | చేయిదము, పన్నిదము |
| 28. | - ఇది | చెయిది |
| 29. | - ఇమి | కలిమి |

| | | |
|---|---|---|
| 30. | - ఇమిడి | సొలిమిడి |
| 31. | - ఇలి | బదిగలి, పొదిగిలి |
| 32. | - ఇవ | ఉక్కివము |
| 33. | - ఇస | దోఁకిస |
| 34. | - ఉ | చదువు, నవ్వు |
| 35. | - ఉడు | తిరుగుడు, విరుగుడు, కలగుడు. |
| 36. | - ఉపు | ఉరుపు |
| 37. | - ఎ | జంకె |
| 38. | - ఎడి | |
| 39. | - ఎన | ఈర్పెన, ఉప్పెన, దువ్వెన |
| 40. | - ఎడు | తూమెడు |
| 41. | - క | వేడుక, పుట్టుక, నడక |
| 42. | - కడ | నిలకడ |
| 43. | - కని | కనుకని |
| 44. | - కలి | వినుకలి, కనుకలి |
| 45. | - కువ | అణకువ, మఱకువ, మెలంకువ |
| 46. | - కోలు | వేడుకోలు |
| 47. | - గడ | మనుగడ, చేరుగడ, విరుగడ |
| 48. | - గర | విడుగర |
| 49. | - గి | ఈఁగి |
| 50. | - గు | చెడుగు |
| 51. | - ట | మూట, చెమట |
| 52. | - టు | వేటు, పోటు |
| 53. | - డి | వెల్లడి (వెలయు), తిండి |
| 54. | - డు | మ్రింగుడు, అల్కుడు, తగులుడు, మాపుడు |
| 55. | - త | మోత, పూత, మడత |
| 56. | - తి | పొలఁతి, వలంతి |
| 57. | - దల | విడుదల, కూడుదల, తాఁకుదల, తీఱుదల |

| | | |
|---|---|---|
| 58. | - ది | విడిది |
| 59. | - నబీ | అప్పన, గడన, వీవన |
| 60. | - ప | చనుప, కడప, కలపము, పొలపము |
| 61. | - పి | తెఱపి |
| 62. | - పిడి | ఒరపిడి (ఒరయు=రాయు), దోపిడి,నుఱిపిడి |
| 63. | - ప్పి | నొప్పి |
| 64. | - ంపు | ముంపు |
| 65. | - పు | వాపు, చూపు |
| 66. | - పుర | కాపురము, దాపురము |
| 67. | - ప్పు | మెప్పు |
| 68. | - బడి | రాబడి, ఏలుబడి |
| 69. | - బాటు | గిట్టుబాటు, జరుగుబాటు |
| 70. | - మతి | ఎగుమతి, దిగుమతి |
| 71. | - మర | విడుమర |
| 72. | - ము | నోము |
| 73. | - లు | కోలు (కొను) |
| 74. | - వ | విలువ, ఎగువ (ఎగురు), వేకువ, కూటువ |
| 75. | - వడి | ఒరవడి, నడవడి |
| 76. | - వర | కావరము |
| 77. | - వలి | కావలి |
| 78. | - వి | తెలివి, నోవి |
| 79. | - వు | పూవు, తడవు, పొడవు, లావు, మఱవు |
| 80. | - వ్వు | పువ్వు, నొవ్వు |
| 81. | - సలి | ముదుసలి |
| 82. | - సు | బిరుసు (బిఱ్రు) |

శ్రీమదాంధ్ర మహాభాగవతంలోని కృదంతాలను ఈ పద్ధతిలోనే విభజించి పరిశీలిస్తాను.

### 4.8. తెలుగులో తద్ధిత ప్రత్యయాలు :-

సంస్కృతంలో తద్ధిత ప్రక్రియ చాలా విస్తృతంగా ఉంది. కాగా తెలుగులో మాత్రం చాలా స్వల్పంగా ఉంది.

### 4.8.1. తద్ధితం - నిర్వచనాలు :-

(1) శబ్దార్థచింతామణిలోని తద్ధిత నిర్వచనం[13] :-

"తద్ధితాః చ ద్వివిధాః। ప్రకృత్యర్థ భిన్నార్థాః, స్వార్థికాశ్చ।

తేభ్యః ప్రయోగేభ్యః హితాః ।"

"తద్ధితాలు ప్రకృత్యర్థ భిన్నార్థాలనీ, స్వార్థాలనీ రెండు విధాలు. రెండు విధాల ప్రయోగాలకు తగునది తద్ధిత వృత్తి" అని పై వాక్యాల సారాంశం.

(2) A Dictonary of Sanskrit grammer లో -

"Taddhitha - A term of Ancient prepaninian grammarians used by Panini".

(3) "అథ తద్ధిత సమాసేషు ఏకపర్వసు చానేకపర్వసు

పూర్వ పూర్వ మపర మపరం ప్రతిభజ్య నిర్బ్రూయాత్।

దణ్డ్యః పురుషః దండ మర్హతీతి వా దణ్డేన సమ్పద్యతే

ఇతివా" నిరుక్తం 2-2.

(4) "తిఙ్ కృత్తద్ధిత చతుష్టయ సమాసాః శబ్దమయామ్"

- వాజసనేయ ప్రాతిశాఖ్యమ్।

(5) "సమాస తద్ధితా కారాయై నమః" - శ్రీ లక్ష్మీసహస్రనామావళి - 670

(6) "భావాద్యర్థాల్లో విశేష్య విశేషణాలకు చేరే ప్రత్యయాలు తద్ధిత ప్రత్యయాలు".

- వ్యావహారిక భాషా వ్యాకరణము

(7) నిష్పాదక ప్రత్యయాలు నామ వాచకాలకు చేరి నామవాచకాలను ఏర్పరుస్తాయి. మంచి-

తనం, చుట్ట-రికం, తిండి-పోతు, వేట-గాడు, అందగత్తె, టక్కరి (టక్కు + అరి) వంటి వాటిలో నిష్పాదకాలు నామవాచకాలకు చేరి కొత్త నామవాచకాలను ఏర్పరిచాయి. ఇటువంటి వాటిని 'తద్ధితాలు' అంటారు[14]. - పి.యస్. సుబ్రహ్మణ్యం.

(8) "తద్ధిత ప్రత్యయాలు దేశిపదాల పైననూ, తత్సమాల పైననూ రావచ్చు. ఇవి మూల ధాతువులపై కాక ప్రాతిపదికలపై వస్తాయి[15]" - ఎం.కందప్ప శెట్టి.

పై అన్నింటిలో చివరి రెండు మాత్రమే చాలా స్పష్టంగా ఉన్నాయి. వాని సారాంశం -

(1) నామవాచకాలపై చేరే ప్రత్యయాలు తద్ధితాలు.

(2) 'తద్ధితాలు' చేరి సిద్ధమైన రూపాలను 'తద్ధితాంతాలు' అంటారు.

(3) తద్ధితాలు స్వార్థమందు కాని, ప్రకృత్యర్థ భిన్నార్థాల్లో కాని విధించబడుతాయి.

(4) దేశిపదాలపై కాని, తత్సమాలపై కాని (వేటగాడు, పూజరి/పూజారి) వస్తాయి.

(5) తద్ధితాలను Secondary derivatives అంటారు.

**4.8.2. ద్రావిడ భాషలలో తద్ధితాలు :-**

సోదర ద్రావిడ భాషల్లో లభించిన లింగవాచక ప్రత్యయాలు కొన్ని ఇక్కడ పేర్కొనడం జరుగుతుంది. సాధారణంగా - ద్రావిడ భాషల్లో నామవాచకం యొక్క లింగం అర్థం వల్లనే తెలుస్తుంది. కాని సంస్కృతంలోవలె శబ్దాన్ని బట్టి, ప్రత్యయాన్ని బట్టి కాదు. అంతేకాక తెలుగులో కాడు, వాడు, ఆడు (వన్నెకాడు, పిల్లవాడు) ఇత, కత్తె, త, ఆడి (చాకిత, చెలికత్తె, ముట్టుత, వగలాడి) మొదలైన లింగవాచక ప్రత్యయాలు తద్ధితాలే. కాబట్టి అట్టి తద్ధితాలు ఇక్కడ పేర్కొనబడుతున్నాయి.

**(1) తమిళం[16] :-**

పురుషవాచక ప్రత్యయాలు :-

- అన్ : మకన్ 'కొడుకు', కాతలన్ 'ప్రేమికుడు', ఇళైయన్ 'యువకుడు'.

-ఆన్ : పార్ప్పాన్ 'బ్రాహ్మణుడు'.

- వన్ : చిఋకున్ 'పిల్లవాడు', తలైవన్ 'నాయకుడు', కళ్వన్ 'దొంగ'.

- నన్ : (ఐ తర్వాత నన్, ఙన్) : పొరుగన్, యోద్ధ: విలైనన్, విలైఙన్, అమ్మేవాడు.

- ఓన్ : కిళవోన్ 'నాయకుడు', ఇళైయోన్ 'యువకుడు'.

స్త్రీ వాచక ప్రత్యయాలు :-

-అళ్, -ఆళ్, -ఓళ్ : మకళ్ 'కూతురు', మాతరాళ్, వటరాళ్, స్త్రీ

కిళవోళ్ 'నాయిక', ఇళైయోళ్ 'అమ్మాయి',

- ఇ : తోళి 'చెలికత్తె', కాతలి 'నాయిక', కిళవి 'నాయిక'.

- వి : తలైవి 'నాయిక', చెల్వి 'రాణి', కళ్వి 'ఆడదొంగ'.

- వి : చఋవి, 'అమ్మాయి'.

- ఐ : పరత్తై 'వెలయాలు'.

-త్తి : పులైత్తి 'చాకలిది', ఆయ్‌త్తి/ఆయ్‌చ్చి 'గొల్లది',

ఒరుత్తి 'ఒకర్తి', వణ్ణాత్తి 'చాకలిది', తట్టాత్తి 'కంసాలిది'.

పై వాటిని పరిశీలిస్తే అవి తద్ధిత ప్రత్యయాలు ఎలా ఔతాయో తెలుసుకోవచ్చు. ఉదా-

చిఋ 'చిన్న' చిఋవన్ 'అబ్బాయి', చిఋవి 'అమ్మాయి';

తలై 'తల, ముందు, చివర' తలైవన్ 'నాయకుడు', తలైవి 'నాయిక';

పై వాటిలో మొదటి నామవాచకానికి ఆయా ప్రత్యయాలు చేరడం వల్ల వేర్వేరు అర్థాలు పుట్టినాయి. కాబట్టి వాటిని తద్ధిత ప్రత్యయాలు అనేందుకు సందేహం లేదు. ఇట్లే మిగిలిన భాషల ప్రత్యయోదాహరణల్లో ఊహించుకోవచ్చు.

**(2) మలయాళం :-**

పురుష వాచక ప్రత్యయాలు :-

-అన్, -ఆన్ : మకన్ 'కొడుకు', వణ్ణాన్ 'చాకలివాడు'

స్త్రీ వాచక ప్రత్యయాలు :-

- అళ్ : మకళ్ 'కూతురు'

-ఇ : పొట్టి 'మూగది'

-త్తి : ఒరుత్తి, 'ఒకర్తె', తియ్యత్తి 'తియ్యది', వాణ్ణాత్తి, 'చాకలిది'.

**కోత** : పురుష వాచక ప్రత్యయం :- -న్ : పరెన్ 'మాలవాడు', కళ్ణ్ 'దొంగ',

స్త్రీ వాచక ప్రత్యయాలు :- -ఇ : కళి 'దొంగది', కుర్ది 'గుడ్డిది'.

-త్తి : దేర్తి 'దేవత', మయ్‌తి 'బడగజాతి స్త్రీ'.

-చ్ : పర్చ్ 'మాలది', కవఢ్చ్ 'కురుంబజాతి స్త్రీ'.

**తొద** : పురుష వాచక ప్రత్యయాలు :-

-న్ : కొనడ్‌య్‌న్ 'కన్నడిగుడు', కొళ్ణ్ 'దొంగ'.

- ఒళ్ : కెలోళ్ 'ముసలివాడు';

- ఇ : మీమి 'అత్త' : -త్‌య్ : వుర్‌కిత్‌య్ 'తోడికోడలు';

-చ్ : కుర్‌బ్‌చ్ 'కురుంబజాతి స్త్రీ', పఱ్చ్ 'మాలది'.

**కొడగు** : పురుషవాచక ప్రత్యయం :- ఎ : కళ్ళె 'దొంగ', ఎరపె, ముష్టివాడు.

స్త్రీ వాచక ప్రత్యయాలు :- -అతి : కొరవతి 'కొడుగు స్త్రీ'.

-చి : తోటిచి 'పాకీది', ఎరపచి 'ముష్టిది'.

-ఇ : కళ్ళి 'ఆడదొంగ', మూగి 'మూగది'.

-అ(ళ్) : ఒబ్బ (ళ్) 'ఒకర్తె', మోవ(ళ్), 'కూతురు'.

-కర్తి : ఆటకర్తి 'ఆటది', అడిగె కర్తి 'వంటిది'.

(3) **కన్నడం :-** పురుషవాచక ప్రత్యయం :- అం : అణ్ణం 'అన్న', అమ్మం 'తండ్రి', తమ్మం 'తమ్ముడు', అళియం 'అల్లుడు', (వీటిలో మ*న నుంచి వచ్చింది. మూ.ద్రా. పదాంత *న

ప్రాచీన కన్నడంలో 'మ' గా మారుతుంది. ఇది ఆధునిక కన్నడంలో లోపిస్తుంది).

స్త్రీ వాచక ప్రత్యయాలు :- అళ్ : ఒర్వల్/ఒబ్బళ్ 'ఒకస్త్రీ'.

**తుళు :-** పురుషవాచకప్రత్యాయం :- - ఎ: కురుడె 'గుడ్డివాడు'

కుంటి 'కుంటివాడు', కెప్పి 'చెవిటివాడు'

స్త్రీ వాచకప్రత్యయాలు :-

-ఇ : కురిడి 'గుడ్డిది', కెప్పి 'చెవిటిది', మామి 'అత్త'

- తి, - త్తి : మర్తి 'పిచ్చిది', ఆచార్తి' కంసాలిస్త్రీ'

సాల్యెత్తి 'సాలెది', మడ్డెళ్తి 'చాకలిది'.

**గోండు :-** పురుషవాచకప్రత్యాయాలు :-

- ఆల్ : ఆందాల్ 'గుడ్డివాడు', తాదాల్ 'అన్న' కుటాల్ 'కుంటివాడు',

మూకాల్ 'మూగవాడు', కుమ్మాల్ 'కుమ్మరివాడు'

-ఓర్ : తొత్తోర్ 'పుర్వుడు', డియ్యోర్ 'పడుచువాడు'

స్త్రీవాచక ప్రత్యయాలు :-

- ఆఢ్ : మియ్యాఢ్ 'కూతురు' సేలాఢ్ 'చెల్లెలు', కోర్యాఢ్ 'కోడలు', పోరాఢ్ '

చెల్లెలు', కోర్యాఢ్ 'కోడలు', పోరాఢ్ 'అత్తగారు'

- ఈ : నోర్వీ 'పెళ్ళికూతురు', పోరాఢ్ 'అత్తగారు'.

- ఆ : డియాన 'పడుచుది',

- ఏ : కుమ్మే 'కుమ్మరిది', మొడ్డే 'నెలలోపిల్ల', వర్టే 'చాకలిది'.

**కొండ :-** పురుషవాచకప్రత్యయాలు : -అ: కణ 'గుడ్డివాడు', డొక్ర 'ముసలి',

- ఎన్ : గాన్సియెన్ 'తక్కువజాతివాడు', కటయెన్ 'పిసినారివాడు'.

స్త్రీవాచకప్రత్యయాలు :- - ఇ : కణి 'గుడ్డిది', డొక్రి 'ముసల్దీ'.

- ని : కల్కిని 'పిసినిగొట్టుస్త్రీ', గాన్నిని 'తక్కువజాతిస్త్రీ', కర్నిని 'కర్నిజాతిస్త్రీ'

**పెంగొ :-** పురుషవాచక ప్రత్యయాలు :-

- ఎన్ : పొత్తిన్ 'మామ', టొండెన్ 'అన్న', దూతెన్ 'ముసలివాడు'.

- ఆన్ : కెయ్యకన్ 'నౌకరు', నాటకన్ 'ఊరివాడు', ఇంజకన్ 'ఇంటివాడు'.

స్త్రీవాచకప్రత్యయం :- - ఎల్ : తొఢ్ందెల్ 'చెలికతన్ 'పెద్దవాడు',

**మండ :-** పురుషవాచక ప్రత్యయాలు :- అన్ : దలికతన్ 'పెద్దవాడు',

స్త్రీవాచకప్రత్యయం : - ఎల్ : హూల్ పందెల్ 'అందమైనది'.

## తులనాత్మక చర్చ:-

పురుష వాచక ప్రత్యయం దక్షిణ భాషల్లో *న్ గానూ , మధ్య భాషల్లో *న్ఞ్ గానూ పునర్నిర్మించవచ్చు. రెంటిలో *న్ఞ్ యే ప్రాచీనతరమని అదే మూల ద్రావిడ రూపమని చెప్పవచ్చు.

స్త్రీ వాచక ప్రత్యయాలైన *-అళ్, *-త్తి , *-ఇ అనేవి ద్రావిడ భాషలన్నింటిలో ఉన్నాయి.కాబట్టి అవి మూల ద్రావిడ భాషా ప్రత్యయాలుగా భావించవచ్చు.

## సోదాహరణ (తెలుగు) తద్ధిత ప్రత్యయాలు

**(**వివిధ వైయ్యాకరణులు పేర్కొన్నవి , అక్షర క్రమంలో)

| క్ర.సం. | ప్రత్యయం | ప్రత్యయార్థం | ఉదాహరణలు |
|---|---|---|---|
| 1 | అ | మత్వర్థం | అడప,చెలువ |
| 2 | అడ | స్వార్థం | ఇల్లడము ,వేఱడము |
| 3 | అడి | అభావార్థం | సందడి,ఉఱవడి |
| | అడి | స్వార్థం | వెల్లడి |

| | | | |
|---|---|---|---|
| 4 | అంత | పరిమాణార్థం | విన్నంత , కన్నంత |
| 5. | అము | మతుబర్థం | పెండ్లము,పెండ్లాము |
| 6 | అర | స్వార్థం/భావార్థం | దేవర,కోటరము |
| 7 | అఱ | స్వార్థం | ముందఱ |
| 8 | అరి | మతుబర్థం | ఆలరి,జాలరి,నేర్పరి |
| 9 | అసి | మతుబర్థం | రూపసి |
| 10 | ఆఁడి | మతుబర్థం | వగలాఁడి, కులుకులాఁడి |
| 11 | ఆఁడు | మతుబర్థం | వన్నెలాఁడు |
| 12 | ఆలు | మతుబర్థం | వెలయాలు |
| 13 | ఇ | మతుబర్థం | ఒయారి,కడలి,జవ్వని |
| 14 | ఇక | భావార్థం | అగ్గలిక ,కోమసిక |
| 15 | **ఇఁటి** | **అభావార్థం** | **చెవిటి** |
| 16 | ఇఁడి | అభావార్థం | ముక్కిఁడి ,కట్టిఁడి |
| 17 | ఇడి | స్వార్థం | తెలివిడి, వినికిడి |
| 18 | ఇత | స్వార్థం | పోరితము,ఇంపితము |
| 19 | ఇద | స్వార్థం | ఒప్పిదము,తప్పిదము |
| 20 | ఇమి | భావార్థం | మేలిమి,వాడిమి |
| 21 | ఇర | స్వార్థం/భావార్థం | వేగిరం |
| 22 | ఇరి | స్వార్థం | వాపిరి |
| 23 | ఇలి | భావార్థం | ఇక్కిలి |
| 24 | ~~ఈఁడు~~ | మతుబర్థం | అటమటీఁడు ,ఉక్కీఁడు |
| | | స్వార్థం | మొక్కలీఁడు,కల్లరీఁడు |
| 25 | ఉక | స్వార్థం | చిఱుతుక,నెలతుక |
| 26 | ఉడు | అభావార్థం | చెవుడు |
| 27 | ఎఁడు | పరిమాణార్థం/ మానార్థం | తూమెఁడు,గంపెఁడు |
| 28 | క | స్వార్థం | వంటకము |
| 29 | కత్తియ | స్వార్థం/మతుబర్థం | చెలికత్తె , అందగత్తె |
| 30 | కాఁడు | స్వార్థం/మతుబర్థం | చెలికాఁడు,ఆటకాఁడు |
| 31 | కర | భావార్థం | నాయకరము |
| 32 | కార | భావార్థం | చెలికారము |

| | | | |
|---|---|---|---|
| 33 | కోర | మతుబర్థం | దగాకోరు |
| 34 | గార | భావార్థం | నయగారము |
| 35 | ంటి | భావార్థం | ఒంటి |
| 36 | టిమి | భావార్థం | మగటిమి |
| 37 | త | భావార్థం/స్త్రీ | చాకిత,గుబ్బెత |
| 38 | తన | భావార్థం | తియ్యందనం |
| 39 | దారు | మతుబర్థం | పెత్తందారు |
| 40 | న | స్వార్థం | తియ్యన |
| 41 | ని | స్వార్థం | తియ్యని |
| 42 | పల | స్వార్థం | లోపల |
| 43 | పోతు | భూమార్థం | తిండిపోతు |
| 44 | బంటి | పరిమాణార్థం | కటిబంటి |
| 45 | బోడి | భావార్థం/స్త్రీ | అలరు బోడి |
| 46 | మడి | పరిమాణార్థం | ఇమ్మడి |
| 47 | మారి | భావార్థం | మంటమారి |
| 48 | మిరి | స్వార్థం | చలిమిరి |
| 49 | ఱికం | భావార్థం | చుట్టరికం,కోడరికం |
| 50 | ఱిమి | భావార్థం | పేదఱిమి |
| 51 | వ | పరిమాణార్థం | మూడవ |

మొత్తం లభించిన వాటిలో -

| | |
|---|---|
| స్వార్థంలో - | 17 |
| భావార్థంలో - | 16 |
| మతుబర్థంలో - | 13 |
| అభావార్థంలో - | 04 |
| పరిమాణార్థంలో - | 04 |
| భూమార్థంలో - | 01 |
| స్త్రీ అర్థంలో - | 02 |

## 4. పాద సూచికలు

1. ధాతువుకు విధింపబడే ప్రత్యయాలు :

   "తిప్ తస్ ఝి, సిప్ థస్ థ, మిప్ వస్ మస్; త ఆతాం ఝ, థాస్ ఆథాం ధ్వమ్, ఇట్ వహిజ్ మహిజ్" 'తిప్ నుండి మహిజ్' వరకు అనే అర్థంలో 'తిప్' పేర్కొనబడుతుంది. (అష్టాధ్యాయ 3-4-78).

2. ఆధునిక భాషా శాస్త్ర సిద్ధాంతాలు. పే.76

3. 'తెలుగులో కృద్రూపనిర్మాణం' వ్యాసం. పే - 19.

   'తెలుగు' వైజ్ఞానిక మాసపత్రిక - ఆగస్టు 1990. తెలుగు అకాడమి - హైదరాబాద్.

4. ఆంధ్ర మహాభారతంలో కృత్తద్ధిత ప్రయోగములు విశ్లేషణము. పే - 47.

5. పైది పే. 60

6. ఈ ఉదాహరణములన్నీ 'బాల వ్యాకరణోద్యోతం' నుండి గ్రహించబడినవి.

7. ఈ రూపాలు - ద్రావిడభాషలు నుండి యథాతథంగా స్వీకరించబడినవి.

8. ద్రావిడ భాషలు - పే. 174

9. పైది పే.92

10. పైది పే. 94

11. రాధాకృష్ణ గారి, 'తెలుగులో కృద్రూపనిర్మాణం' వ్యాసం, తెలుగు - వైజ్ఞానిక మాస పత్రిక, ఆగస్టు - 1990, తెలుగు అకాడమి, హైదాబాద్.

12. "ఇటం కృత్కగతపవేములు పరంబులగునపుడు కగచయవలకు లోపంబగు" - బాల వ్యాకరణము - కృదన్త - 2.

13. అ.సింగరాచార్యులు పే. 16

14. ఆధునిక భాషా శాస్త్ర సిద్ధాంతాలు. పే. 76

15. - కందప్పశెట్టి - ఎం. శాసనభాషా పరిణామం (క్రీ.శ.1100-1399) వ్యాసం - తెలుగు భాషా చరిత్ర - సం.భద్రిరాజు కృష్ణమూర్తి, తె.వి. 1974.

16. సోదర భాషల ఈ ప్రత్యయాలు, ఉదాహరణములు 'ద్రావిడ భాషలు' నుండి యథాతథంగా స్వీకరించబడినాయి.

# శ్రీమదాంధ్ర మహాభాగవతంలో

## అజాది కృత్ ప్రత్యయాలు

క్రియాపదాలపై ప్రత్యయాలు చేరగా ఏర్పడినవే కృదంతాలు. తెలుగులోని క్రియా పదాలన్నీ ఉదంతాలే. ఉత్‌కు అచ్చు పరమైతే సంధి నిత్యం. కాబట్టి క్రియలకు అజాది ప్రత్యయాలు పరమైనప్పుడు, హలాది ప్రత్యయాలు పరమైనప్పుడు కలిగే మార్పులను విడివిడిగా పరిశీలించాల్సి ఉంది. అజాది కృత్ ప్రత్యయాంతాల పరిశీలన ఈ అధ్యాయంలో చేసాను.

### 5.0. భాగవతంలో అజాది కృదంతాలు -

| | | |
|---|---|---|
| (1) - అ | (2) - అడి | (3) - అన |
| (4) - అర | (5) - అమి | (6) -అవు |
| (7) -ఇ | (8) -ఇక | (9) -ఇకి |
| (10) -ఇదం | (11) -ఇమి | (12) -ఉ |
| (13) -ఎ | | |

5.1. **- అ :-** భాగవతంలోని **- అ** ప్రత్యయాంతాలు -

| | | | | |
|---|---|---|---|---|
| (1) ఎండ | (2)కట్ట | (3) కాయ | (4) చాప | (5) చిక్కము |
| (6) చెక్క | (7) తగులము | (8)తెఅ | (9) దొంగ | (10) నడ |
| (11) పటియల్ | (12) పొంకము | (13)పొగ | (14) పొడ | |

**1. ఎండ :-**

**"ఒకవేళ నభిచార హోమంబు సేయించు**
**నొకవేళ నెండల నుండ । బంపు[1]"**

ఇది ప్రహ్లాదుని పట్ల హిరణ్యకశిపుని ప్రవర్తన

ఇది 'ఎండు' ధాతువుపై 'అ' ప్రత్యయం చేరగా ఏర్పడిన రూపం.

త. ఎన్టు ('సూర్యుడు'), ఎన్టూట్ ('సూర్యకాంతి, సూర్యుడు, వేసవికాలం'); ప.నెడ్డి ('సూర్యుని వేడిమి'); గో.ఎడ్డీ, ఎడ్డి; తె.ఎండు (=సూర్యకాంతిలో శుష్కింపజేయు) < తె.**ü**ఎండ[2] (*DED* 738).

⁎ ఎం-ట:- ⁎ ఎన్టు >తె.**ü**ఎండు.(భ.రా. ⁎ ఎల్ - , ⁎ ఎల్ - ట్ట్ → ⁎ ఎంట్ → ఎండు. (*TVB* 160) తె.**ü**ఎండు + అ = ఎండ. ∴ వస్తువులను తన తీక్ష్ణమైన వేడిమిచే శుష్కింపచేసేది / ఎండ (కర్త్రర్థకము).

ఈ శబ్దం అర్థవ్యాకోచం చెంది, (సాధారణీకరణం వల్ల) 'సూర్యకాంతి' అనే అర్థాన్ని కూడా ఇస్తుంది. కాని, పై పద్యమందే కాక -

**" ఎండన్ ౖమగ్గితిరా । కటం బడితిరింకేలా విలంబింపగా**

**రండో బాలకులార ! చల్దిగుడువన్ . . .[2] "**

అన్నచోట కూడ పై నిర్వచనం ౖపకారమే అర్థం. పై ౖపకరణాల్లో - సూర్యకాంతి వల్ల కలిగే నీరసాన్ని సూచించేందుకే పోతన - 'ఎండ' పదౖపయోగం చేసాడు.

జ. ఎండదొర, ఎండమావులు, ఎండ ఱేఁడు, ఎండుగులు, ఎండుతెవులు

**2.కట్ట :-**

ఆ. **హరికి మామ నగుదు నట మీద ౖశీదేవి**

**తంౖడి నూరకేల తాగడింప**

**గట్ట గట్టి దాటు కమలాప్త కులనాథ!**

**నీ యశోలతకు నెలవు గాగ.** (భాగ.9-285)

తె. **ü**కట్టు +అ >కట్ట .కట్టబడునది ' సేతువు'(కర్మార్థం). (వివరాలకు చూ. కట్టు)

**3. కాయ :-**

**"కూరలు గాయలు నీళ్ళు**

**హారముగా గొనుచు [3]. . . "**

సోదర భాషల్లో క.కాయ్ (కాత్ -, కాయ్త్-); త. కాయ్; మ.కాయ్క్క; గో.కైఆ; కువి.కైయ - నామవాచకాలు

ౖకియలుగా -త. కాయు; తు. కాయుని; తొ.కోయ్ -; మ. కాయుక; కొలామి. కెఇక్. $(TVB-276)$ అనే రూపాలు లభించాయి.

* కాయ్ - >తె.**ü**కాయు.

తె.**ü**కాయు+అ > కాయ. ∴ చెట్టు దీనిని కాయును (కర్మార్థకం),

దీనికే - (1) వీణకు అమర్చిన సొరకాయ (అర్థసంకోచం),(2) రాపిడి వలన శరీరంపై ఏర్పడే కాయ - కిణం (సామ్యార్థం),(3) బిడ్డ (ఆలంకారికం) (4) నేౖతరోగం (సామ్యం) (5) చెడిపోయిన ధాన్యం(6) జూదం మొ. ఆడేప్పుడు ఉపయోగించే సారె మొదలైనవి (7) కాయోపండో = విఫలమో సఫలమో (సూ.రా.ని) అనే అర్థాలున్నాయి.

జ. కాయకంటి, కాయకన్ను.

(చెంపకాయ, తలకాయ, పిల్లకాయ, మొట్టికాయ మొదలైన ౖపయోగాలు కూడా ఉంటాయి).

**4.చాప :-**

**"కనకాక్షుండు భుజా విజృంభణమునన్ క్ష్మాచౖకముం జాఁపఁ జు**

**ట్టిన మాడ్కిన్ గొనిపోవ . . .[4] "**

సోదరభాషల్లో -

ౖకియారూపాలు :-త.చాటు ; క.చాచు, చాపు; తు. చాచుని; కుయి. సాయ్ప; కువి. (స) హామ్ -, జాన్జ్-;

గోం. సాహ్-లట్-; తె.చాచు; చాపు: 'దూరంగా, విశాలంగా విస్తరించి; * చా-/ * చాయ్ -

నామవాచకరూపాలు :-త. చాప్పై; క. చాపె: మ.చామ్పు; కూయ. సాస్ప; కువి. సాప. ($TVB-417$)

సూ.రా.ని సాగు > చాఁగు > చాఁచు > చాపు.

తె. üచాపు + అ = చాప. ∴ విస్తరింపబడునది (చాపబడునది) చాప. (దీనిని చాచెదరు)

ఈ పదవ్యుత్పత్తి క్రమం - పై సూ.రా.ని. ప్రకారంగా చూస్తే అ.క్రి. → స.క్రి. → స.క్రి. → కర్మార్థం.

జ. చాఁపకట్టు; చాఁపగద్ద, చాఁపచుట్టు, చాఁపట్టు, చాఁపబండి, చాఁపజూయ.

**5.చిక్కము:-**

**"వల ఉరులు జిగురు గండెలు**

**జలిదియు <u>చిక్కంబు</u> ధనువు శరములు గొనుచుం**

**బులుగుల బట్టెడు వేడుక**

**నలుకుడు వెడలంగ గదలియడవికి నడచెన్ [5]"**

వేటగాడు - 'వలలు, ఉరులు . . . చిక్కము . . . కొనుచున్ ' అడవికి నడిచాడు. వాడు తీసుకువెళ్ళిన వేటకు సంబంధించిన సామాగ్రిలో 'చిక్కము' కూడా ఒక్కటి.

కాగ -

**". . . . . . వాగురాభేదంబు చిక్కమంచనగను**

**జెలగుచుండు[6] ''.**

చిక్కమనేది ఒక విధమైన 'వల' (వాగురాభేదం) అని చెప్పడింది.సూ.రా.ని. లోతె. చిక్కము < సం.శిక్యమ్ అని పేర్కొన్నారు. 'శిక్యమ్' వ్యుత్పత్తి - ü శక్ శక్తౌ. శక్నోతి భారంవోఢుమితి (బరువును మోయుటకు తగినది) శిక్యమ్. 'ఉట్టి' కి పేరు. 'ఉట్టి' అనే అర్థంలో మాత్రమే 'శిక్యం' కు వికృతి 'చిక్కము'.

వాగురా, మృగబన్థినీ-[8] అని రెండే పేర్లు- వలకు.కాని, 'వల' అనే అర్థంలో మాత్రం ఇంకోరకంగా చెప్పాలి. üచిక్కునకు - పట్టువడు, కట్టువడు అనే అర్థాలున్నాయి.

**" చిక్కఁడు సిరి కౌగిటిలో**

**జిక్కడు సనకాదియోగి చిత్తాబ్జములం**

**జిక్కడు శృతి లతికావళి ।**

**జిక్కెనతడు లీలఁదల్లి చేతన్ రోలన్ [9]"**

అనే పద్యంలో 'పట్టువడు' అనే అర్థం.చిక్కుధాతువు నుండి పుట్టినదిగా 'చిక్కము' ను చెప్పాలి. తె. üచిక్కు > చిక్కము.

∴ జంతువులను చిక్కునట్లు చేయునది -కాబట్టి చిక్కము.

**6. చెక్క :-**

**"వదలక విరివిగా వదనంబుదెఱచుచు**

**నాకాశమంతయు నప్పళించుఁ**

**గడునాల్క నిగుడించి గ్రహతారకంబుల**

**నయమెల్లఁ దిగజాఱ నాకి విడుచు**

**నలవోకయును బోలె నట్టహాసము చేసి**

**మెఱసి లోకము లెల్లమ్రింగజూచుఁ**

**దనరు దిగ్దంతి దంతములు చెక్కలు వాఱ**

**నుగ్ర దంష్ట్రలు రద్రిప్పు నుక్కు మిగిలి . . .[10] "**

ఇవి వృత్రాసురుని ఘోరకృత్యాలు..

సోదరభాషల్లో -

త.చిర్రై; క.కెరె -; కొ. కెర్క్; నా.సెక్క్; ప.చెక్క్; కువి.సెక్; తె.చెక్కు నఱుకు/కోయు/ముక్కలు చేయు. అనేవి ధాతురూపాలు త; చక్కై; కొ.చెక్ ; క.చెక్కె; చక్కె; సక్కె, సెక్కె; తు. చక్కె, చెక్కె, చెక్కి. = కర్రముక్క (*DED* – 2266) అనేవి నామవాచకాలు.

* కెర్ అనే మూలధాతువుకు -క్క - ( *-ట్క్-) (*TVB* 455) అనుబంధం చేరుతుంది. తాలవ్యీకరణం వల్ల 'కె' - 'చె' గా మారగా'క్క్' పై తెలుగులో 'ఉ' చేరి ధాతురూపం తె. üచెక్కు ఏర్పడుతుంది.

తె. üచెక్కు + అ > చెక్క.చెక్కబడినది = నఱుక బడినది / కోయబడినది - చెక్కఁ ' ముక్క'.

పై పద్యంలో - వృత్రాసురుడు దిగ్గజాలు దంతాలను, చెక్కలు వాఱునట్లు = ముక్కలు అయ్యేట్లు చేస్తున్నాడు అని అర్థం.

**7.తగులము (తగులు) :-**

దీనికి -(1) ప్రేమ, వలపు, మోహము (2) అనుబంధము, సంబంధము, జంజాటము (3) అడ్డు, నిరోధము-అనే అర్థాలు సూ.రా.ని. లో సూచించారు.

క. **"మగవాడవై జగంబులఁ, దగిలిచి చిక్కులను బెట్టుదంటవు నీకున్**

**మగువతనంబున జగముల. దగులముఁ బొందింపనెంత తడవు ముకుందా"![11]**

అన్నచోట 'మోహము' అని అర్థం

చం. **". . . . ఆత్మ । దా, ధనపుత్ర మిత్ర వనితాతతి పెందగులంబు మానిన,**

**న్ననఘుని విశ్వతోముఖునవ్యగతిన్ భజియెంచెనేని [12] . . . . "**

అన్నచోట 'జంజాటము' అని అర్థంలో

'తగులు' ధాతువుకు - అ.క్రి.గా - (1) ఆసక్తి నొందు (2) చిక్కు (3) కలుగటు (4) ఇష్టపడు అనీ;

స.క్రి.గా -(1) పొందు (2) ఆశ్రయించు (3) వెంబడించు (4) కూడు (5) పురికొల్పు అనీ; ఆ.క్రి., స.క్రి. గా - (1) అంటు (2) మోహించు అనీ; విశేషంగా - (1) అభిలాష (2) వలపు (3) సంబంధము (4) కలయిక (5) చిక్కు (6) రతి (7) తుష్టి (8) నిరోధము (9) నష్టము (10) అడ్డు అనీ;విశేషణంగా - (1) ప్రియుడు , ప్రియురాలు (2) ఆశ్రితుడు, సంబంధి అని అర్థాలున్నాయి. (సూ.రా.ని.)

సోదరభాషల్లో -

త. తకై' పట్టుకొను, ఆపుచేయు, అడ్డగించు, కటు, ప్రేమ'; మ. తకరుక' పిండబడు';కరుక్క 'పిండు', నాశముచేయు; తైక్క కొట్టు కురుఖ్. తక్ - చిన్నతాకు; కువి.తచ్ - కుట్టు; బ్రా. టాఫ్ - ఒప్పందం; క.తగుళ్,' తగులు కలుపబడు, చేర్చు , వెంబడించు'; తగుళ్చు 'చేరు, పొందు'; తగు' చేరు'; తె.తగులు. (*TVB* 523 )

'* త' - 'ఒక్క దగ్గర చేరు'. * తయ్-; * తక్-వ్-.

*తక్ → తగ్ అనుబంధ 'వ' కారం (దంతోష్ఠ్యం) అజంతమైన తెలుగులో 'ఉల్'గా (ఓష్ఠ్యంగా దంత్యంగా స్థాన సామ్యం వల్ల) పరిణమించి - తె.**ü**తగులు అవుతుంది. తె.**ü**తగులు పై - 'అ'ప్రత్యయం చేర్చి, 'ము' విభక్తి ప్రత్యయం చేరి - 'తగులము' ఔతుంది.

∴ తె.**ü**తగులు+అ > తగులము. తగులు కొనునది తగులము. దీనిని తగులుకొందురు. (కర్మ)

తె.**ü**తగులు + ఉ = తగులు. తగులు కొనునదితగులు. దీనిని తగులుకొందురు. (కర్మ)

**‹ ఁరామయెఱింగినమనువెల్లఁ జెడిపోవుదలవరి యెఱిఁగిఁన <u>దగులు</u>సేయు"**[13]

అన్నచోట -'నిరోధము' అని అర్థం.

ఆ. **"మగలు <u>తగులు</u> గారె మగువలకును** [14] - -అన్నచోట 'బంధము' అని అర్థం.

**8. తెఱ :-**

సీ. **.......వదన పంకజములు వాడి వాతెఱ లెండ........**(భాగ.9-305)

తె.**ü**తెఱచు + అ >తెఱ.తెఱవదగినది/తొలగించదగినది 'యవనిక '(కర్మార్థం).

(వివరాలకు చూ. తెఱకువ)

**9.దొంగ:-** -

సీ. **"చుట్టాలు దొంగలు సుతులు ఋణస్థులు కాంతలు సంసార కారణములు** [15]".

సోదరభాషల్లో -

త.తొంకణ్ (పుం), తొణ్కి 'దొంగ'; మ.తొణ్ణన్ 'సిగ్గు లేనివాడు, విలువలేనివాడు'; తె.దొంగ. దొంగు (క్రి), దొంగిలు, దొంగిలించు; కొ.దొంగ్లి ' చాటుపని'; దొంగ్లిగొట్టి 'రహస్యం'; డొంగ 'దొంగ'; డొంగ్లిప్ 'దొంగిలించు'; ప.డొంగ్ - డొంగళ్; గోం. దొంణ్గా; దాణ్గానా 'దొంగిలించు . (*DED* 2417)

పై పదాల పరిశీలన వల్ల నామవాచకంగా, క్రియగా కూడ - దొంగ, దొంగు పదాలు ఉన్నట్లు తెలుస్తుంది.

'దొంగు' ధాతువుకు స.క్రి.గా 'అపహరించు' అని, అ.క్రి.గా 'ఒదుఁగు, దాఁగు' అని అర్థాలు.

* దొంగు > తె.üదొంగు + అ > దొంగ. ∴ దొంగిలించువాడు - దొంగ (కర్త్రర్థకం.)

జ. దొంగ, దొంగ తనము, దొంగ పని, దొంగమేపు,దొంగఱికము, దొంగసొమ్ము, దొంగిలించు, రీరీ

**10.నడ :-**

క. **అడిగెదనని కడువడిజను**

**నడిగిన దనుమగుడ నుడుగ(డని నడ యుడుగున్**

**వెడవెడ సిడిముడి తడ(బడ**

**నడుగిడు నడుగిడదు జడిమ నడుగిడునెడలన్.**[16]

ఇది గజేంద్రుని రక్షించేందుకు విష్ణుమూర్తి బయలుదేరినప్పుడు, వెంటనే వెళుతున్న లక్ష్మీదేవి పరిస్థితి. వైకుంఠంలో జరుగుతున్న హడావిడిని తన శబ్దశక్తితో చక్కగా నిబంధించాడు పోతన. తెలుగురాని వానికి కూడ పద్యం అర్థం కాకున్నా 'పరిస్థితిలో ఏదో హడావిడి ఉంది' అని మాత్రం స్ఫురించక మానదు. ఇక్కడ 'నడ' శబ్దానికి 'నడక' అని అర్థం. (అది 'ఒయ్యారపునడకా' కావచ్చు)

ఇది తె.üనడచునుండి ఉద్భవించింది.

నడుచు ధాతువుకు - (అ.క్రి) (1) సంచరించు (2) వెడలు (3) ప్రవర్తించు (4) జరుగు(5) కలుగు (6) ఉండు (7) సరిపడు (8) చేరు (9) చెల్లు అనే అర్థాలున్నాయి. (సూ.రా.ని)

క.నడె.నడి 'నడుచు, ప్రవర్తించు, అనుసరించు'; నడు; తు.నడపుని 'నడుచు, ప్రవర్తించు'; నడకె 'నడక'; కొ. నఢ్వ్ - (నఢ్ద్-) 'నడచు, వెడలు, జరుగు'; నఢ్త్- 'నడిపించు'; తొ.నఢ్ -, నడ్ - 'ప్రవర్తించు'; నఢ్త్ 'నడిపించు'; త.నట 'నడుచు'; నాల్ 'గడుచు, ప్రవర్తించు, జరుగు; నటట్టు ముందుండు, నడకకు కారణం'; నటై 'నడక, దారి, ఒయ్యారపునడక'; నటప్పు 'ప్రవర్తన'; మ. నటక్క 'నడుచు, అనుసరించు, ప్రవర్తించు'; నట, నటచ్చు 'నడక'; నటట్టుక ' నడిపించు, అమర్చు'; కు.డ్డప 'అధిగమించు, అడుగు': (*TVB* 697)

* నట్ - అ- >తె.üనడ దీనికి ధాత్వను బంధం 'చు' చేరి üనడచు అవుతుంది.

(*i*) తె.üనడచు + అ > నడ. ధాత్వను బంధలోపం.

(*ii*) తె.üనడచు + క > నడక. ధాత్వనుబంధలోపం. క ప్రత్యయం.

పై రెండు పదాలకు 'నడచు' ధాతుభావార్థం.

(*iii*) తె.üనడచు + త > నడత. ధాత్వను బంధలోపం. తప్రత్యయం. 'ప్రవర్తన' (నడితి. రూపా.)

(*iv*) తె.üనడచు + వ > నడవ 'ఇంటి నడిమి భాగం, సేతువు, మార్గం'.

(*v*) తె.üనడచు + వడి > నడవడి 'ప్రవర్తన, నడక, ధర్మం, జీవిక'.

జ. నడ, నడక, నడకొండ, నడకొల(కు, నడగ(డు, నడగొట్టు, నడగోట, నడచియాడు మొ.

ద్రావిడ భాషలన్నింటిల్లో ఎన్నో అర్థాలుండడం ఎక్కువ రకాలైన కృదంతరూపాలుండడం - ఈ ధాతువు ప్రత్యేకతలు.

**11.పఱియ :-**

క. **" కఱచిన భుజగము రదములు**

**విఱుగక వదనముల విషము వెడల(గ శిరముల్**

**<u>పఱియలు</u>గా నడిచె గరుడుఁడు**

**తఱిమి కనక రుచులు గలుగు తన వలఱెక్కన్[17]".**

గరుత్మంతుడు సర్పముల శిరస్సులను పఱియలు 'ముక్కలు' చేసినాడని పై పద్యంలో వర్ణించబడింది.

'పరియు' అనే అ.క్రి. కు - (1) విఱుగు, ముక్కలగు (2) తప్పు (3) చెడు. అని అర్థాలు (సూ.రా.ని)

'పఱియు' (అ.క్రి.) 'చీలు, బ్రద్దలగు'. త. పఱి 'సడలించు'; పత్రై 'మాయమగు; వ్యర్థమగు; తీసివేయు';

మ. పఱియుక 'సడలించు, బయటపడు'; పరిక్క 'కలుపుతీసివేయు'; తొ.పఙ్య్ - (పఙ్చ్-) 'బలవంతంగా లాగివేయు' (*TVB* 799)

పై పదాల పరిశీలన వల్ల '*పఱి' మూ.ద్రా. రూపంగా ఊహించవచ్చు. దానిపై ధాత్వను బంధం 'యు' చేరి తె. **ü**పఱియు రూపమేర్పడింది.

∴ తె. **ü**పఱియు + అ > పఱియ.పఱియునది పఱియ (కర్త్రర్థకం).పట్టియ, పట్టె, పరియ అనేవి - రూపాంతరాలు.

జ. పఱి, పఱియ, పఱియలగు, పఱియలు చేయు, పఱియలు వాఱు, పఱియవడు, పఱియవాపు, పఱియవయు, పఱివోవు.

**12.పొంకము :-**

క. **"అంకెలు వైచె వృషభము ల**

**హంకారముతోడ లేఁగ లట్టిట్టుఱికెం**

**<u>బొంకముల</u> నొప్పెధేనువు**

**లంకురితము లయ్యె దరువులా హరి రాకన్"?[18]**

పై పద్యంలో పొంకము అనగా 'పొందిక' అని అర్థం.

పొంకము (వి.) కు (1) ఉబ్బు, అతిశయము, గర్వము (2) పొందిక, సౌష్ఠవము, ఒప్పిదము, సౌందర్యము (3) సౌకుమార్యము, మార్దవము. (4) కాంతి, జిగి (5) అలంకారము (6) విధము, రీతి

విశేషణంగా - (1) గొప్పది (2) సుందరము (3) యుక్తము అని అర్థాలు. ఈ పదం 'పొంగు' (అ.క్రి) ధాతుజన్యం.

సోదరభాషల్లో -

త. పొఙ్కు 'వేడిచే పైకి ఉబుకు, నురుగులెత్తు, ఉబ్బు, ఉబ్బింపజేయు'; మ. పొఙ్ఙుక 'ఉప్పొంగు, పెంచు';

క.పొంగు 'ఉప్పొంగు, ఉబ్బు; కుయి. పొంగ్ - 'ముక్కలగు'; కువి. పొంగ్- 'ఉప్పొంగు'; గో. పోంగ్ - (నది) ఉప్పొంగు; తె.పొంగు (*TVB* 366 )

* పొ - ఒక్ - > పొంగ్ (3-2-14) >తె. **ü**పొంగు.

మూ.ద్రా. రూపమైన *పొంక్ నకు 'అ' ప్రత్యయము చేరగా -పొంక. దానిపై ప్రథమా విభక్తి ప్రత్యయం - ము. 'పొంకము' సిద్ధిస్తుంది.

తె. **ü**పొంక్ + అ > పొంకము.పొంగునది / అతిశయించునది - పొంకము.

జ. పొంకపండు, పొంకపఱుచు, పొంకము, పొంకి, పొంకించు, పొంగటి నెల, పొంగటి పండుగ, పొంగరము, పొంగలి, పొంగలించు, పొంగారు, పొంగుఁబ్రాలు, పొంగుడు, పొంగుడువడు, పొంగునీళ్ళు, పొంగులెత్తు.

**13.పొగ :-**

సీ. **పౌరాణికోత్తమ ! బ్రతుకు పెక్కేండ్లు తామరసాక్షుని ధవళ యశము**
**మరణశీలురమైన మాకెఱిగించితి కల్పితంబగు క్రతుకర్మమందు।**
**బొగలచే। బొగిలి యబద్ధ చిత్తులమైన మము హరిపదపద్మమధురసంబుఁ**
**ద్రావించితివి నీవు ధన్యుల మైతిమి సర్గమేనియు నపవర్గమేని**

తే. **భాగవత సంగ లవభాగ్యఫలముకీడే, ప్రకృతి గుణహీనుఁడగు చక్రి భద్రగుణము**
**లీశ కమలాసనాదులు నెఱుఁగలేరు, వినియు వినజాలననెడి వెఱ్ఱిగలదె?** [19]

దీనికి 'ధూమ' మనే అర్థం ప్రసిద్ధం. ఆవిరి (ఊష్మం), పొగాకు మొక్క అనే అర్థాలు కూడా ఉన్నాయి.

సోదరభాషల్లో -

త. పుకై-వ్-, ంత్ 'పొగబెట్టు, ఆవిరి గ్రక్కు';మ. పుకయుక ' పొగలేచు, మసకగాకనిపించు, పొగచే చీకటియగు';

క. పొగె ' పొగలేచు'; తె. పొగయు/పొవయు, పొగుచు, పొగచు అనే క్రియారూపాలు,

త.పుకై; కొడ. పెగ్, పొగ్; మ. పుక; క.పొగె; కొ.పొగ్, పోగు అనే నామవాచకరూపాలు ఉన్నాయి. *TVB* – 3483

* పుక్ - మూలద్రావిడ ధాతువుగా ఊహించవచ్చు.

* పుక్+అ > తె. **ü**పొగ.పొగయునది పొగ.

జ. పొగకన్ను, పొగకట్టు, పొగగూడు, పొగచు, పొగచుట్ట, పొగచూరు, పొగచెట్టు, పొగపిడుత, పొగవు, పొగబండి, పొగబాణము, పొగవైచు, పొగసూపు, పొగాకు.

**14.పొడ :-**

సీ. **"భువనమోహన! నిను। బొడ గానఁగా లేని**
**చక్షురింద్రియముల సత్త్వమేల ?"**[20]

ఇది రుక్మిణీదేవి కృష్ణునికి పంపిన సందేశంలోనిది.

తె. **"గఱులు సారించు మీసలు గడలు గొలుపుఁ**
**బొడలు మెఱిపించుఁగన్నుల పొలపమార్చు . . . "**[21]

పొడకు :- (1) రూపు (2) జాడ (3) కనబడుట (4) దేహాదులయందు పొడము మచ్చ. (5) సన్నని వస్త్రము అని అర్థాలు. ఇది **ü**పొడము జన్యం.

సోదరభాషల్లో -

త. పొటి ' పైకి ముడుచుకొను, ఉదయంచు, కనిపించు';పుటై ' వెలుగొందు' ; మ. పొటి -యుక ' పైకి ముడుచుకొను'; నిరంతరం కనిపించు; క. పొణ్ము, పుణ్ము ' పైకివచ్చు, పుట్టించు';

*పొట్ -/ * పొణ్ (*TVB* 869).

(*i*) *పొట్ + అ ⇒ పొడ. పొడమునది - పొడ.

(*ii*) పొడము+పు = పొడుపు.

**ü**పొడముకు ఉదయించు, పుట్టు, సంభవించు, జరుగు, కనబడు, తోచు, బయల్పడు - అనే అర్థాలున్నాయి.

జ. పొడకట్టు, పొడగనిపించు, పొడచూపు, పొడతామర, పొడతెంచు, పొడనీడ, పొడపత్రి, పొడపాటు, పొడపురుగు, పొడమాయంచు, పొడమాయు, పొడయెండ, పొడలమెకము, పొడవీడు.

5.2.**అడి :-** భాగవతంలో -అడి ప్రత్యయాంత కృదంతం ఒక్కటే లభించింది.

**ఆఱడి :-**

ఉ. **అత్తలు మామలున్ వగవ నాడిక కోడక నాథులన్ ద్రపా**
**యత్తులఁజేసి యిల్వరుస లాఱడిఁ బోవఁగ నీదు నవ్వులన్**
**మెత్తని మాటలన్ మరుడు మేకొని యేచఁన వచ్చినారమే**
**పొత్తుల నొల్లమో పురుషభూషణ! దాస్యము లిచ్చికావవే.**[22]

కృష్ణుని పొందుకై వచ్చిన గోపికల దీనాలాపాలివి. ఇక్కడ 'నింద' అనే అర్థంలో ప్రయుక్తం. 'ఆఱడి' కి - (వి) (1) కష్టము / దుఃఖము / బాధ (2) హాని / భంగము (3) నింద / అపకీర్తి అనీ (విణ) (1) వ్యర్థము (2) దుష్టం (3) నింద్యం - అనీ (క్రి.విణ) (1) నిష్కారణంగా (2) వ్యర్థంగా (3) దీనం గా అనీ అర్థాలు. 'ఆఱడి' కి ధాతుమూలాన్ని తెలుగు కోశాలు పేర్కొన లేదు.

ఈ పదం భారతంలో ప్రయోగింప బడినప్పటికీ కం. అళహసింగరాచార్యుల పరిశోధనా గ్రంధంలో కూడ ప్రస్తావింపబడలేదు.

కాగ - *TVB* (67) లో 'ఆఱు' 'సమర్థమగు' అనుధాతువుకు 'అడి' చేరి 'ఆఱడి' సిద్ధిస్తుందనీ మూ.ద్రా. * 'అడు 'తగ్గు' అనీ, ఆఱడి కి 'శక్తిహీనత' అనే అర్థం సిద్ధిస్తుంది అని పేర్కొన్నారు.'ఆరడి' పదం కన్నడలో ఉన్నది. దానికి 'ప్రచారం', నివేదిక, అపకీర్తి, నింద' అనే అర్థాలున్నాయి.

దీని సరూపపదాలు -

త. ఆర్(-ప్-, -ట్ట్-) 'బిగ్గరగా అరుచు, రోదించు'; మ. ఆర్క్కుక (ఆర్ట్టు), ఆర్ప్పిక్క; తు. ఆర్కుని; తె. ఆర్చు, ఆఱ్చు, ఆరుచు, ఆఱుచు; అనేవి క్రియలుగా -

త. ఆరవారమ్ ' పెద్దధ్వని, రుపు'; మ.ఆరవారమ్; క. ఆరవార, ఆరడి; తు. ఆరాటె; తె.ఆర్పు అనేవి నామ వాచకాలుగా లభించాయి. *DED* (312)

పై పదాల పరిశీలన వల్ల *ఆఱ్ అను మూ.ద్రా ధాతువుకు - 'బిగ్గరగా అరుచు, బిగ్గరగా రోదించు' అనే అర్థాలున్నట్లు స్ఫురిస్తుంది. (*TVB* 68) దానిపై 'అడి' చేరి 'ఆఱడి' సిద్ధమౌతుంది. అప్పుడు- "ఆర్చుటకు కారణమైనందున 'ఆఱడి' / దీని (ఆఱడి) చే ఆర్చెదరు" - అని అర్థం చెప్పవచ్చు.

కాగ '-అడి' అనే కృత్ప్రత్యయమును లక్షణకారులెవ్వరూ పేర్కొనలేదు. అయినప్పటికి కం. అ.సింగరాచార్యులు తమ 'ఆం.మ.భా. కృత్తద్ధిత ప్రయోగముల విశ్లేషణములో - 'అడలడి' అనే 'అడి' ప్రత్యయాంత కృదంతాన్ని నిరూపించినారు (పే. 108)

అంతే కాక, తె. ఆరు 'నింద' అనే పదముంది. దానిపై స్వార్థంలో 'అడి' చేరిన తద్ధితాంతంగ భావించవచ్చు. దీనివల్ల 'ఆరడి' రూపం సిద్ధిస్తుంది. కాని అటువంటి ప్రయోగం ఎక్కడా లేదు. 'ఆఱడి' మాత్రమే లభిస్తుంది. కాబట్టి దీన్ని తద్ధితాంతమనడం కంటె పై విధంగా - కృదంతమనడమే సబబు.

5.3. **-అన :-** భాగవతంలో - అన ప్రత్యయాంతం కూడ ఒక్కటే దొరికింది.

**విత్తనము :-**

మ. **చని సత్యవ్రతమేదినీ దయితు(డోజం బూనివ్రూన్ దీగె వి**
**త్తనముల్ పెక్కులు నావపై నిడి హరిధ్యానంబుతో దానిపై**
**ముని సంఘంబులు దాను నెక్కి వెఱతో మున్నీటిపై దేలుచున్**
**గనియెన్ ముందట భక్తలోక హృదలంకర్మీణమున్ మీనమున్.**[23]

ప్రళయ సమయంలో - భగవంతుని ఆజ్ఞమేరకు సత్యవ్రతుడనే రాజు చెట్లు, తీగల విత్తనాలు నావపై వేసి ముని సంఘాలతో సహా మత్స్యావతారంపై తానెక్కినాడట.

విత్తనము (వి) 'విత్తు, బీజం'. తె. üవిత్తు (స) అనే ధాతువు తెలుగులో ఉంది.

సోదర భాషల్లో - క. బిత్తు 'విత్తనాలు వేయు'; బెదె 'విత్తనాలు చల్లు'; తు. బిత్తుని, బుత్తుని; కోత. పీత్-; త.విత్తు; మ. వితెక్క; కుయి.వీతి; కొ.విత్ -; తె. విత్తు.

నామవాచకంగా - క.బిత్తు; త.విత్తై; విత్తు, విచ్చు; మ. విత్తు; కోత. విత్; తు. బిత్తు; తె. విత్తు, విత్తనము; (*DED* – 4428) (*TVB* 1168)

మూ.ద్రా. *విత్ - ;

'*విత్' కు ధాత్వను బంధం 'ఉ' చేరి, సమీకరణం జరుగగా - తె. üవిత్తు అనే రూపం నిష్పన్నం ఔతుంది.

(*i*) తె. üవిత్తు + అన(ము) = విత్తనము. దీనిని విత్తెదరు - / విత్తబడునది - విత్తనము. (కర్మార్థకం)

(*ii*) తె. üవిత్తు + ఉ = విత్తు. దీనిని విత్తెదరు - / విత్తబడునది - విత్తు. (కర్మార్థకం)

**5.4. -అర :-** భాగవతంలోని **- అర** ప్రత్యయాంతాలు -

**1.కావరము** **2.దెప్పరము**

**1.కావరము :-**

క. **"నావంటి వెట్టివారిని**
**శ్రీవల్లభ నీవు శాస్తి చేసితి వేనిం**
**గావరము మాని పెద్దల**
**త్రోవల జరుగుదురు బుద్ధితోడుత నీశా!"**[26]

గోవర్ధనోద్ధారం తర్వాత బుద్ధి వచ్చిన ఇంద్రుడు, కృష్ణుని స్తుతిస్తూ పలికిన పలుకులు.

కన్నడంలో 'కావర, కొవుర' అనే శబ్దాలున్నాయి. 'బుద్రవేడెక్కేంతటి కోపం, మోహం' అని అర్థాలున్నాయి. 'కాయ్పు, కావు, కాహు' అనే వానికి 'వేడి, కోపం, కోపం కలవాడు' అని అర్థాలున్నాయి. వీనికి మూలధాతువు కాయ్' (కాయ్ద్ -, కాద్-) 'మరిగించు, ఎర్రగా కాల్చు, మోహంతో కాలు, కోపగించు

ఈ క్రియకు సరూపాలు - సోదరభాషల్లో - (*DED*–1219) త. కాయ్, కాయ్చ్చు, కాయ్త్తు, మ. కాయుక; కాచుక్క; కొడ. కాయ్-, కాచ్- ; తు.కాయుని; తె.కాగు, కాచు.

అన్ని భాషల్లో - కాగు 'వేడియగు', కాచు 'వేడి చేయు' అనే అర్థాల్లో ఉన్నాయి. అంతేకాక - 'కోపం, మోహం, గర్వం' మొదలైన భావాను - ఆలంకారికంగా 'అగ్ని' తో పోలుస్తారు కవులు. కాబట్టి వాటికి అగ్ని సంబంధ మైన కాలుట, కాల్చుట మొ॥ సంకేతాలు. ü కాగు - ఆలంకారిక అర్థానికి అర్థవిస్తృతి పొంది - 'కోపంతో వేడియగు, మోహాగ్ని దగ్ధుడగు, గర్వాగ్ని దగ్ధుడగు' అనే అర్థాలను పొంది, కావరము అన్న కృదంతంలో పర్యవసిస్తుంది. 'గ, వ'-ల వినియమయం వల్ల తె.üకాగు వృత్తిలో కావు గా మారుతుంది.

üకావు+అర = కావరము. కాగుటచే (కాలుటచే) కావరము. దీని యందు - కాగుదురు. (అధికరణార్థం) 'కోపం, మోహం, గర్వం'.

**1.దెప్పరము**

ఈ 'అర' ప్రత్యయాన్ని బాల ప్రౌఢ వ్యాకరణకారులు పేర్కొనలేదు. కాని ముక్తలక్షణ కౌముదిలోను, అహోబలపండితీయంలోను (ధాతుప్రకృతికములు అన్నచోట) ప్రస్తావించారు.

'దెప్పరము' ను అరప్రత్యయాంతంగా వారు ఉదాహరించారు. దుర్భర శబ్దభవమని నిఘంటుకారులు తెలిపారు.

వ. ". . . . దెప్పరంబుగ అనుజ కొప్పు బట్టి . . .[24] "

క. **" <u>దెప్పరము</u>గు కాలముచే**
**నెప్పుడు దేవతల కెల్ల నష్టంబగునీ**
**యొప్పిదము ( గృష్ణు(డరిగిన**
**దప్పె(గదా! తల్లి! నీవు తల్లడపడగన్ "[25]**

అనే స్థలాల్లో 'దుర్భరం, దుస్సహం, 'అసహనం' అని అర్థాలు.

'దెప్పరము'నకు 'డెప్పరము' అనిరూపాంతరం కూడ ఉంది. 'దెప్పు' తెüడెప్పు భవంగా ఊహించవచ్చు. తె.üదెప్పు నకు 'నిందించు', 'అవహేళన చేయు' అనే అర్థాలు ఉన్నాయి. ఎవరైనా దెప్పినపుడు దుర్భరమైన అసహనం కల్గుతుంది. అట్టి దుర్భరమైన అసహనమును సూచించుటకు 'దెప్పరము ప్రయోగింపబడుతుంది.

∴ ü దెప్పునుండి కల్గునది - దెప్పరము. అపాదానార్థం.

**5.5 - అమి:-**

భాగవతంలోని **- అమి** ప్రత్యయాంతాలు -

| | | |
|---|---|---|
| **1.ఎఱుగమి** | **2.ఓటమి** | **3. ఓపమి** |
| **4.కలుగమి** | **5.కానమి** | **6.దొరకమి** |
| **7.నేరమి** | **8.పొడమమి** | **9.పొందమి** |
| **10.మాన్పమి** | **11.నలుపమి** | |

**1.ఎఱుగమి :-**

చ. **ఎఱుఁగమి౯ జేసినట్టి గురుహేళన మంత నెఱింగి యింద్రుఁడ**

**చ్చెరువడి భీతినొంది యతి చింతితుడై తలపోసిపల్కెన**

**ప్పరమ పవిత్ర లోకనుత భవ్య చరిత్రు విశేష పాదపం**

**కరుహము ( బూజసేయక యకర్మముఁజేసితి నప్రబుద్ధినై.** [27]

'ఎఱుగు' ధాతువుకు - వ్యతిరేకార్థం 'అ' చేరి , 'మి' ప్రత్యయం చేరగా - 'ఎఱుంగమి' నిష్పన్నమౌతుంది.

తె.üఎఱుఁగు'కు (1) తెలియు (2) నేర్చు (3) అనుభవించు అనే అర్థాలుండటం వలన - ఎఱుంగమి / ఎఱుఁగమి' కి 'తెలియకుండుట' అని అర్థం.

పై పద్యంలో 'తెలియకుండుటచే' అనే అర్థంలోనే ప్రయుక్తం ఈ పదం. కాగ - ఎఱుగక చేసినా / జరిగినా గురుహేళన ఎంత భయంకరమో - ఈ పద్యం వల్ల తెలుస్తుంది. ముల్లోకాలకు అధిపతియైన ఇంద్రునంతటి వానికే అంత భయంకరం ఐతే - సామాన్యుల మాట చెప్పనేల? శాస్త్ర రహస్యాన్ని. ఇందులో నిబంధించాడు కవి. (' üఎఱుగు' పూర్తి వివరాలకు 'ఎఱుక' వద్ద చూడండి)

**2.ఓటమి :-**

శా. **నీవే పోటరివే? సురేంద్ర ! తెగడన్నీకేల? గె<u>ల్పోటముల్</u>**

**లేవే? యెవ్వరిపాల బోయినవి? మేల్కీడుల్! విరించ్యాదులున్**

**త్రోవంజాలుదురెవ్విధానమున? సంతోషింప శోకింపనా**

**దైవం బేమి కరస్థలామలకమే? దర్పోక్తులుం బాడియే?** [28]

క. **ఓటమితో నెల్లప్పుడు**

**పాటవమునఁ బనులు చేసి బాలురతోనే**

**యాటలకుఁ బోక నోక జం**

**జాటంబును లేక భక్తి సలుపుదుననఘా** [29]

'ఓటమి' కి (1) అపజయం (2) అవమానం (3) భయం అనెవి అర్థాలు. పై మొదటి పద్యంలో 'అపజయం' అనే అర్థంలో, తర్వాతి పద్యంలో 'భయము' అనే అర్థంలో ప్రయుక్తం

'ఓడు' ధాతువునకు - (అ.క్రి.) (1) అపజయం పొందు (2) భయపడు (3) సంకోచించు (4) లొంగు (5) పరిగెత్తు, పాఱు (6) స్రవించు (స.క్రి) పోగొట్టుకొను అనే అర్థాలు ఉన్నాయి.

పాదర భాషల్లో క. ఓడు = పరిగెత్తు, పారిపోవు; తు. ఓడుని; త. ఓటు, ఓట్టు; మ. ఓటు; గోం. పోడీ, జోడీ; - క్రియారూపాలు లభించును (*TVB* 226)

సోదర భాషల్లో -

క.ఓడు, ఓడువికె, ఓడికె, ఓడుకు, ఓట; తు. ఓట; త.ఓట్టమ్, ఓట్టమ్, ఓట్టణీ; మ.ఓట, ఓట్టమ్, ఓట్టి; (*DED* – 877) నామవాచకరూపాలు లభించాయి.

మూ.ద్రా. * చోట్ - .

పదాది మూ.ద్రా. 'చ' కారంలోపించి (3.2.15), 'ట' కారం 'డ' కారంగా పరిణమించి ధాత్వనుబంధం 'ఉ' చేరగా * చోట్ - >తె.üఓడు -నిష్పన్నమౌతుంది.

మూ: ద్రా. రూపం నుండి తెలుగులోకి పరిణమించక పూర్వమే - నిష్పాదక ప్రత్యయాలు ఈ ధాతువుకు చేరుట విశేషం.'ఓట్' కు నిషేధార్థంలో కాకుండా 'అ' ప్రత్యయం భావార్థంలోనే - ఉచ్చారణ సౌలభ్యం కొఱకు మాత్రమే - 'మి' కి ముందు చేరడం - మరో విశేషం.

(*i*) *ఓట్ + అ + మి ఓటమి . ఓడుట వలన ఓటమి - (భావార్థం).

(*ii*) *ఓట్ + అ ఓట / ఓటము .ఓడుట వలన ఓట - (భావార్థం). దీనికి - (1) భయం (2) సంకోచం (3) అపజయం - అనే ధాతు భావార్థంతో పాటు 'వినయం' అనే వ్యతిరేకార్థం కూడ ఉంది. ఆట్టి అర్థం - ఈ ధాతువుకు ఉన్న 'లొంగు' అనే అర్థానికి కలిగిన అర్థోత్కర్షవల్ల కలిగింది.

(*iii*) *ఓట్ + ఉ ఓటు . ఓడుటచే ఓటు -(భావార్థం).

(*iv*) తె. üఓడు + ఇక > ఓడిక.ఓడునది 'పరిగెత్తునది, పాఱునది' అగుటచే ఓడిక. (కర్త్రర్థం) 'ప్రవాహము'.

üఓడు జన్యాలు - ఓట, ఓటకండ, ఓటకాడు, ఓటమి, ఓటము, ఓటఱు, ఓటపడు, ఓటాఱు, ఓటిలు, ఓటు, ఓటుచేయు, ఓటుపడు, ఓటుపఱుచు, ఓటుపాటు, ఓటుపుచ్చు, ఓటుపోవు, ఓడించు, ఓడిక, ఓడిగిల్లు, ఓడుపడు, ఓడుపర్చు, ఓడుబిళ్ళ, ఓడుసేయు, ఓర్చు.

**3.ఓపమి :-**

క. **మందరము మోవ <u>నోపమి</u>**

**నందఱిపైఁ బడియె నదియు నతిచోద్యముగాఁ**

**గొందఱు నేలం గలసిరి**

**కొందఱు నుగ్గైరి చనిరి గొందఱు భీతిన్.** [30]

సురాసురులు అమృతమథనానికై మందర పర్వతాన్ని ఎత్తుకొని తెచ్చే సందర్భంలోనిదీ పద్యం.

తె. üఓపు నకు 'సమర్థమగు, సహించు, ఇష్టపడు' 'అనే అర్థాలున్నాయి. üఓపు నకు వ్యతిరేకార్థంలో 'అ' అనుబంధంగా వచ్చి, 'మి' ప్రత్యయం చేరగా - 'ఓపమి' నిష్పన్నమౌతుంది. 'సమర్థం కాక, సహించక, ఇష్టపడక' అనే అర్థాలు కలుగుతాయి.

పై పద్యంలో 'సమర్థం కాక / చాలక' అనే అర్థం (చూ. ఓపిక)

**4.కానమి :-**

ఉ. **ఱెక్కలు రావు పిల్లలకు ఱేపటి నుండియు మేఁత <u>గానమిన్</u>**

**బొక్కుచు గూటిలోనెగసి పోవఁగం నేరవు మున్ను తల్లియే**

**దిక్కున నుండి వచ్చునని త్రిప్పని చూడ్కుల నిక్కి నిక్కి నల్**

**దిక్కులు చూచున్న వతిదీనత నెట్లు భరింతు? నక్కటా!** [31]

వేటగాడు తనను చిక్కించుకోగా పక్షి, తన పిల్లలను తలచుకొని బాధ పడే సన్నివేశం లోనిదీ పద్యం,

పిల్లల కోసం తల్లడిల్లే తల్లిహృదయం ఇందులో నిరూపితం.

తె. üకను కు- వ్యతిరేకార్థంలో 'అ' చేరి 'మి' ప్రత్యయం చేరగా - కానమి నిష్పన్నమౌతుంది. దానికి (1) చూడక / చూడలేక (2) తెలియ(లే)క (3) పొంద(లే)క అనే అర్థాలు కలుగుతాయి.

పైన పద్యమంలో 'తెలియకుండుటచే, కన్పించకుండుటచే' అనే అర్థాల్లో ప్రయుక్తం. (చూ.కన్ను. )

**5.కలుగమి :-**

క. **విడువిడుడని ఫణిపలుకఁగఁ**

**గడు భరమున మొదలఁగుదురు గలుగమి వెడఁగై**

**బుడబుడ రవమున నఖిలము**

**వడవడ వణఁకఁగ మహాద్రి వనధి మునింగెన్.** [32]

అమృత మథన సమయంలోనిదీ మీ పద్యం.

üకలుగు / కలువు కు (అ.క్రి) (1) అగు (2) ఉండు (3) సమర్థమగు (4) పుట్టు (5) లభించు (6) తగు (7) గతించు, కడచు (స.క్రి) - పొందు అనేవి అర్థాలు. 'üకలుగు' కు కల, లే అను రూపాలగును.

సోదరభాషల్లో -

త. కల (-ప్-, -న్ట్ -), కలి (-ప్ -, ట్ -) ; కొలామి. కల్ -; కువి. కల్గ్ -; $(DED-1093)$

తె. üకలుగు నకు - వ్యతిరేకార్థంలో 'అ' అనుబంధం చేరి, మి ప్రత్యయం చేరగా- కలుగమి. దీనికి 'లేకుండుట' అనేది అర్థం.

తె. üకలుగు + ఇమి > కలిమి. కలుగుటచే - కలిమి. భావార్థం. (1) కలుగుట, ఉండుట (2) సంపద (3) పుట్టుట (4) తటస్థించుట (5) అగుట - అనేవి అర్థాలు.

తె. üకలుగు కు 'లే' ఆదేశంరాగా, 'మి' చేరి - üకలుగు + అమి > లేమి (బా.వ్యా.క్రియి. 106). వ్యతిరేకభావార్థం. (1) అభావం, లేక పోవుట (2) పేదఱికం అనేవి అర్థాలు.

**6.దొరకమి :-**

క. **మగువా! విను సుఖహేతుక**

**మగునర్థము దొరకమికి మహాదుఃఖమునం**

**దగలుదురిది యంతయు నా**

**భగవంతుని యాజ్ఞఁ జేసి ప్రాణులు మఱియున్** [33]

తె. üదొరకు ధాతువుకు (1) లభించు (2) సంభవించు, కలుగు (3) వీలగు (4) పట్టువడు అనేవి అర్థాలు. తె. üదొరకు + అమి < - దొరకమి 'లభించకుండుట' - అని అర్థం.

**7.నేరమి :-**

ఉ. **నెట్టన ఁబాప కర్మమున నేరమిఁజేసితిరేమి చెప్పు ! మీ**

**పుట్టిన నాటి నుండి యును బుద్ధులు సెప్పిజగంబులేలగాఁ**

**బట్టముఁ గట్టిపెంచిన కృపానిధి బ్రహ్మకళా విధిజ్ఞుఁ జే**

**పట్టక గుట్టు జాఱి సిరిపట్టునఁదొట్టిన పొట్ట క్రొవ్వునన్.** [34]

గురుద్రోహం వల్ల రాక్షసుల చేతిలో ఓడి దేవతలు బ్రహ్మను ఆశ్రయించబోగా - అతడాడిన మాటలివి.

'నేరమి' < నేరుచు + అమి.(1) తెలియకుండుట, అజ్ఞానం (2) దోషము, తప్పు - అనేవి దీని అర్థాలు. (చూ. నేరుపు)

**8.పొడమమి :-**

చ. **ఉడుగక పంకజాత భవుఁడొండొక దేహముదాల్చి ధైర్యమున్**
**విడువక సృష్టి, బూర్వ సమవేతముగన్ సృజియించునేర్పుదాఁ**
**బొడమమి కాత్మలోనఁదలపోయుచు నుండఁజతుర్ముఖంబులన్**
**వెడలె ననూన రూపముల వేదములంచిత ధర్మయుక్తతన్.** [35]

తె. üపొడము కు - (1) ఉదయించు (2) జనించు (3) సంభవించు (4) జరుగు, అగు (5) కనబడు, తోచు (6) ప్రకటితమగు అనేవి అర్థాలు.

తె. üపొడము కు - వ్యతిరేకార్థక 'అ', భావార్థక 'మి' ప్రత్యయం చేరగా - 'పొడమమి' నిష్పన్నమౌతుంది. పై అర్థాల వ్యతిరేకార్థాలు కలుగుతాయి.

పై పద్యంలో 'తోచకుండుటచే' అనే అర్థంలో ప్రయోగించబడింది. (చూ. పొడ)

**9.పొందమి :-**

క. **నీ వింత వాడవయ్యును**
**భూవర ! సంతాన లాభమునుఁ బొందమి నా**
**దేవతలు యాగ భాగము**
**లీవేళ భుజింపరైరి యందుకు నీవున్** [36]

తె. üపొందు కు 'ప్రాపించు, పడయు, అనుభవించు' అని అర్థాలు.

తె. üపొందు + అ-మి üపొందమి = పొందకుండుట వ్యతిరేక భావార్థం. ఈ అర్థంలోనే పై పద్యంలో ప్రయుక్తం (చూ. పొందు)

**10.బ్రతుకమి :-**

సీ. **పుష్పఫలములాత్మ భూజంబునకు సత్య**
**మా ద్రాను బ్రతుకమి నవియుఁ జెడును.**[37]

üబ్రతుకు' నకు 'జీవించు' అని అర్థం.నిషేధార్థక 'అ', భావార్థక 'మి' చేరి, 'బ్రతుకమి' అనే రూపం సిద్ధిస్తుంది. 'బ్రతుకకుండుట / జీవించకుండుట' - అని వ్యతిరేక భావార్థం (చూ.బ్రతుకు)

**11.మాన్పమి :-**

చ. **జలరుహగర్భుచేత మునుచాల సృజింపఁగబడ్డ యోషధుల్**
**కలుషమతిన్ ధృతివ్రతులు గాని యసజ్జన భుజ్యమానలై**
**వెలయుట చూచి యే నృపతివీరులు మాన్పమి ఁ జోరబాధలన్**
**బలుమఱుఁ బొంది తానవరిపాలితనై కృశియించి వెండియున్.** [38]

ఇది భూదేవి మొఱ.

తె. üమానుపు నకు (1) పోగొట్టు, వర్జింపజేయు (2) నివారించు, అనే అర్థాలున్నాయి. ఇది 'üమాను' యొక్క ప్రేరణార్థక ధాతురూపం.

తె. మాను; క. మాణ్; కుయ. మాఅ; కువి. మాన్నినై; అను రూపాలు సోదర భాషల్లో ఉన్నాయి.

తె. üమాను + పు (ప్రేరణార్థకం) > üమానుపు మాన్పు.

తె. üమాన్పు + అమి > మాన్పమి. 'నివారించకుండుట' అని అర్థం.

**11.సలుపమి :-**

క. **జపహోమాధ్యయనంబులు**
**తపములు వ్రతములు లేని తరుణులు హరి స**
**త్కృప వడసి రన్నిగలిగియు**
**జపలత ( బొందితిమి భక్తి సలుపమి నకటా !** [39]

తె. üసలుపు/తె. üచలుపు నకు (1) కావించు, చేయు (2) కడపు అనేవి అర్థాలు. ఇది 'చను' ధాతువు యొక్క ప్రేరణ రూపం అని భద్రిరాజు కృష్ణమూర్తి తెలిపారు (*TVB*1219) * చల్- > సలుపు .

üసలుపు + అమి > సలుపమి. 'చేయకుండుట' అని అర్థం.

**5.6 - అవు :-**

భాగవతంలోని **- అవు** ప్రత్యయాంతాలు -

| | | |
|---|---|---|
| (1) ఇరవు | (2) చనవు | (3)తగవు |
| (4)తొడవు | (5) నగవు | (6)నెలవు |
| ( 7)పొడవు | | |

**1.ఇరవు:-**

సీ. **"శ్రీవత్స కౌస్తుభ శ్రీరమా చిహ్నంబు లురమందు రమ్యమైయిరవువడగ[40]. "**

ఈ పదానికి (1) స్థానం (2) ఇల్లు (3) స్థిరం (4) అనుకూలం అనే అర్థాలున్నాయి.

త. ఇరు (క్రియ) 'బ్రతుకు. ఉండు, కూర్చొను'; ఇరిట్టు 'స్థిర పరుచు'; ఇరువు 'నివాసము': ఇరుక్కై 'కూర్చొనుట, కూర్చొను స్థానం, నివాస స్థానము ; మ. ఇరిక్కుక 'కూర్చొను, ఉండు, నివసించు; ఇరిప్పు ' కూర్చొనుట. నివాసస్థానము'; ఇరుట్టిక, ఇరుట్టి, ఇరుట్టిం, ఇరుట్టు; క. ఇర్, ఇరు, ఇరు, ఇద్దు 'ఉండు, మిగులు', నివసించు, ఆలసించు; ఇరిసు = ఉండుటకు కారణమైనది. (*DED* 407)

పైపదాల పరిశీలన వల్ల మూ.ద్రా. భాషలో ఇది నామవాచకంగా, క్రియగా కూడ ఉన్నదని తెలుస్తున్నది. üఇర్ ధాతువు తెలుగులో వాడుకలో లేదు.*ఇర్ అని మూ.ద్రా ధాతువును భావించవచ్చు.

* ఇర్ + అవు > తె. ఇరవు. ఇందు ఉండుటకు అనుకూలము - ఇరవు. (అధికరణార్థం).

క. **జననాయక ప్రజ లిరవొం**

**దిన ధర్మము లెల్ల వాసుదేవార్పణ బు**

**ద్ధిని జేయవలయు నంటివి**

**యనయము న వ్వాసుదేవుడన ( గలడే మహిన్** [41]

అన్నచోట 'ఆచరించుట' అని అర్థం. నిఘంటువులలో ఈ అర్థంలేదు.

జ. ఇరవగు, ఇరవారు, ఇరవుకొను, ఇరవుకొలుపు, ఇరవుపడు, ఇరవొందు.

**2.చనవు :-**

ఉ. **మీ కరుణావలోకన సమేతులు(గా మము( జేయ (జిత్తముల్**

**దూ(కొనెనేని మా చనవు ద్రోయక యీ (దగు లోభ మోహముల్**

**గైకొని పుట్టు చోట నవ కంజ దళాక్షుని నామవిస్మృతిన్**

**బైకొన కుండ(జేయుట శుభం బగు మీ(ది మదీయ జన్మముల్.** [42]

తె. **ü** చనవు (వి.) (రూపాం.చనువు) = (1) పరిచయం (2) ప్రేమ (3) అధికారం, పెత్తనం, ధార్ష్యం (4) ఉచితత్వం (5) కోరిక, ప్రార్థన (6) అవకాశం (7) గొప్పదనం అనే అర్థాలున్నాయి. పై పద్యంలో కోరిక / ప్రార్థన అనే అర్థంలో ప్రయోగించబడింది.

తె. **ü**చను (అ.క్రి) కు (1) పోవు, దాడివెడలు (2) లేకపోవు (3) నశించు, తీఱు (4) నిష్ఫలమగు (5) చెడేపోవు (6) పర్యాప్తమగు (7) చచ్చు (8) అర్హమగు (9) శక్యమగు (10) చెల్లు, సాగు (11) ఒప్పు (12) ప్రసిద్ధం (13) ఒనగూడు (14) ప్రవర్తించు (15) నడచు (16) గతించు, కడచు అని అర్థాలు.

తె. **ü**చను + అవు = చనవు.

జ. చనవరి, చనవు, చనవురాలు, చనువెంచు, చనుమానము, చలుపు.

**3.తగవు :-**

క. **పొగడొందు జనని గానీ**

**తగవున వర్తించునట్టి దయితయకానీ**

**తగనుండని గృహమున నుం**

**టగు ( జక్రవిహీన రథము నందుంటరయన్**

చక్కని సూక్తి ముత్యము.

తగవు.(వి.) కు (1) యుక్తత (2) న్యాయం (3) కలహం (4) తీర్పు (5) ఉపకారం (6) వివాహాది శుభసమయాల్లోచ్చె కానుక (7) విధం, రీతి అనేవి అర్థాలు.పై పద్యంలో 'యుక్తంగా' అనే అర్థంలో ప్రయుక్తం.

సోదరభాషల్లో -

క్రియగా - త. తకు (తక్క్ -, తకు- ట్ట్-); మ. తకు; క.తగు (తక్క్-) తె.తగు,

నామవాచకంగా - త.తక్కతు 'యుక్తం'; తక్కోర్ 'గౌరవించదగిన'; మ.తక్క, తక్కవన్ 'యుక్తం'; తక్కమ్ 'తగినది'; తక్ అప్పన్ తండ్రి; క. తక్కు 'పెత్తనము, ప్రేమ, ఆకర్షణ; తక్కుమె 'తగినది'; తు. తక్క 'సరిపోయినది'. (*DED* – 2435)

మూ.ద్రా. * తకుక్ - > తక్ - వ్ - > తె. **ü**తగు (*TVB* 522)

తె. üతగునకు అర్థాలు - (1) యుక్తమగు (2) న్యాయమగు (3) సమర్థమగు(4) అనుకూలమగు (5) సమానమగు (6) ఒప్పు.

(1) తగునది (యుక్తం, న్యాయం, అనుకూలం అయనది) తగవు. (భావార్థం) = తీర్పు.

üతగు + అవు = తగవు / *తక్ + అవు = తగవు.

'తగవు' కు జగడం / గొడవ / కలహం అనే అర్థాలూ ఉన్నాయి.'తగవు' కు 'తీర్పు' అర్థం. అట్లే 'తీర్చవలసిన దానినీ ' (అంటే కలహాన్నీ) తగవు అన్నారు. అర్థాపకర్ష.

జ. తగవరి, తగవు, తగవుగోరి, తగవులాడు, తగుకత్తి.

**4.తొడవు:-**

ఆ. **హరుఁడు గళము నందు హాలాహలము వెట్టఁ**
**గప్పు గలిగి తొడవు కరణి నొప్పె**
**సాధురక్షణంబు సజ్జనునకు నెన్న**
**భూషణంబు గాదె భూవరేంద్ర !** [43]

ఇందు 'తొడవు' - భూషణం' అనే అర్థంలో ప్రయోగించబడింది. పద్య ఉత్తరార్థం దానినే సమర్థిస్తూ ఉంది.

తొడవు - (వి.) ఆభరణము.

సోదరభాషల్లో -

క్రియగా - త. తొటు (తొటువ్ -, తొట్ట్-) 'ధరించు'; తొటక్కు (తొటక్కి) 'ధరించు; క. తుడు / తొడు 'ధరించు'; తుడిసు, తుడియెసు, తొడసు, తొడిసు 'ఇతరులకు తొడుగు'; కొ. తొడ్ - (తొట్ట్); నా. తొఙ్ - (తొట్ట్-) ; గ. తొడ్గ్ = దుస్తులు ధరించు; తుట్ = వేసికొను; కువి. తుర్హ్నై; తె.తొడుగు, తొడు.

నామవాచకంగా :- త.తొట్టతు, తొటుప్పు = పాదరక్షలు; క. తుడుగె. తుడిగె, తుడగె, తొడగె, తొడిగే, తొడుగె, తొడ, తొడవు, తోడ = ధరించదగిన వస్త్రాలు, ఆభరణాలు.కువి.కొడు. (*DED* 2867) (*TVB* 625)

మూ.ద్రా * తొట్ - / *తుట్. / తె. üతొడు (గు) + అవు.

మూ.ద్రా. *తొట్ పై 'అవు' ప్రత్యయం చేరి 'తొడవు' అవుతుంది.

'üతొడు' నకు అర్థాలు - (1) ధరించు (2) కూర్చు . 'తొడగబడునది - తొడవు'. 'దీనిని తొడుగుదురు' - తొడవు (కర్మార్థకం) తొడగబడేప్రతీదీ తొడవు (దుస్తులు, చెప్పులు మొ॥కూడ) కావాల్సి ఉండగా అర్థగౌరవం చెంది - 'నగలు / భూషణాలు' అనే అర్థంలోనే ఈ పదం స్థిరపడింది.

జ. తొడవు, తొడగు, తొడుకొను, తొడుపు, తొడి.

**5.నగవు:-**

క. **మెల్లని నగవున నయనము**
**లల్లార్చి శరమ్ముఁవిల్లు నందిన మాత్రం**
**గుల్లలు నాఁచులు ‹ జిప్పలుఁ**
**బెల్లలునై జలధి పెద్ద బీడైయుండెన్** [44]

రామబాణం ఎంత శక్తిమంతమో ఈ పద్యం వలన తెలియవచ్చు.తె.üనగవు. (వి.) కు (1) నవ్వు (2) పరియాచకం

(3) ఆశ్చర్యం ,(విణ) (1) పరిహసపాత్రం (సూ.రా.ని) అని అర్థాలు

పై పద్యంలో రాముడు నగవుతో బాణంతీసాడు. ఆ నవ్వు పరిహాసపూర్వకం కావచ్చు. తన శక్తి తెలిసిన రాముడు సముద్రుని పరిస్థితిని ఊహించుకొని నవ్వియుండ వచ్చు.

సోదరభాషల్లో-

క్రియా రూపాలు -త. నకు(నకువ్ -, నక్క-) ; నజ్క, నజ్క 'ఎగతాళిచేయు'; మ.నకెక్క 'నవ్వు'; క.నగు, (నక్క్-) , నగె'నవ్వు'; తె.నగు, 'నవ్వు; నవ్వించు'; ప.నవ్-; నవిప్-, నవిత్- 'నవ్వించు'; గ.నగ్-, నగ్గ్;

నామవాచక రూపాలు -త. నక్కల్ 'నవ్వు'; నకల్ 'చిరునవ్వు'; నకార్ 'పళ్ళు కనిపించునట్లు నవ్వే నవ్వు'; నకాల్, నకాయ్ 'పెద్ద నవ్వు': నగు; నగెగాఅ 'విదూషకుడు'; తె.నగవు, నగుబాటు, నవ్వు;(*DED* – 2944–) (*TVB* 689)

మూ.ద్రా * నవ్- / * నక్-వ్-

* నవ్ పై 'ఉ' ధాత్వనుబంధం చేరి, సమీకరణము (*assimilation*) వలన 'నవ్వు' అవుతుంది.

* నక్ - 'ఉ' ధాత్వనుబంధం చేరి (3.2.14) 'నగు' ఔతుంది.

* నక్ - వ్ - యందు 'అ' ప్రత్యయం చేరి 'నగవు' అవుతుంది. (భాషాశాస్త్రదృష్ట్యా)

తె. **ü**నగు + అవు = నగవు - అవుతుంది. (వ్యాకరణపరంగా)

∴ నవ్వుటచే నవ్వు / నగుటచే నగవు. భావార్థకం.

జ. నగవరి, నగవు, నగవుటీగ, నగించు, నగింపు, నగిపించు, నగు(బాటు, నగుబాట్లపని.

**6.నెలవు:-**

సీ. **"ఇది నాకు <u>నెలవ</u>ని యేరీతిఁ బలుకుదు**
**నొకచోటనక నిండి యుండనేర్తు.** [45]

ఇది "వడుగా . . . . సంవాసస్థలం బెయ్యది? " అని బలిచక్రవర్తి అడిగిన ప్రశ్నకు సమాధానంగా 'వామన' రూపుడైన శ్రీమహా విష్ణువు వాగ్రూప సాక్షాత్కారం.ఇక్కడ పోతన 'నివాస స్థానము' అనే అర్థంలో దీన్ని పొందుపరిచాడు.

సోదరభాషల్లో -

త. నిలై 'శాశ్వతముగా ఉండు; (స్థిరపడు)'; మ. నిలెక్క; తు.నిలెవుని ; క.నెలసు; తెలుగు - నెలయు'ఉండు' అని క్రియా రూపాలు ,

నామవాచకాలు -త. నిలై 'నిలుకడ, ఉండుట; మ.నిల 'విశ్రామస్థలం,స్థాయి'; తు. ని లెవు 'ఇల్లు'; క.నెలె 'స్థానం'; తె.నెలవు.

మూ.ద.ద్రా. *నిలయ్ (*T.V.B* 762)

* నిలయ్ (3.2.3) > (ధాత్వనుబంధం - 'ఉ' చేరి) తె.**ü**నెలయు అవుతుంది. నెలయుటకు తగినది - నెలవు. (అధికరణార్థం)

**ü**నెలయు + అవు > నెలవు (ధాత్వనుబంధలోపము)

తె. **ü**నెలవు(వి)కు అర్థాలు -(1) ఉనికి (2) నివాసస్థానం (3) చోటు (4) ప్రదేశం (5) పరిచయం, స్నేహం (6) పట్టు, ఊఁత. (విణ.) (1) సుందరం (2) అలవాటైనది.

జ. నెక్కొను, నెక్కొల్పు, నెక్కోలు, నెల, నెలకట్టు, నెలకువ, నెలకొను, నెలకొలుపు, నెలవరి, నెలవీడు, నెలవు, నెలవుకొను, నెలవుకొలుపు, నెలవుపడు, నెలవుపఱుచు, నెలపొందు.

7.పొడవు:-

క. **ఉడుగని క్రతువుల వ్రతములఁ**

**బొడగనఁ జననట్టి పొడవు పొడవునఁ గుఱుచై**

**యడిగెడినట ననుబోటికి**

**నిడరాదె మహానుభావ! యిష్టార్థంబుల్.** [46]

వామనునికి దానమివ్వవద్దన్న గురువు శుక్రునితో పలికే బలి చక్రవర్తి పలుకులివి. ఈ పద్యం విష్ణుమూర్తి 'పొడవు'ను (గొప్పదన్నాన్ని) వామనుని వంటి 'కుఱుచై'న పద్యంలో నిబంధించాడు పోతన. ఈ పద్యంలో రెండు పొడవులు పక్క పక్కనే ఉన్నాయి. ఒకదాని అర్థం 'గొప్పదనం' కాగా- ఇంకోటి 'ఎత్తు' అనే అర్థంలో. ఇట్టి కుఱుచ పద్యాల్లో కూడ పోతన కవిత్వపు పొడవు పొడగనవచ్చు.

గురువుగారి మాటను తిరస్కరిస్తున్నా - తిరస్కారభావం బలిచక్రవర్తిలో లేకపోవడాన్ని 'మహానుభావ' పదం సూచిస్తుంది. 'ననుబోటికి' మాట ఆయన నమ్రతను సూచిస్తుంది. రాక్షసకుల శత్రువు ఐన మహావిష్ణువు 'పొడవు' ను పొగడుట, అంతకు మించి అతనికే యిష్టార్థాలను ఇవ్వబూడం - ఆయన 'పొడవు' ను సూచిస్తుంది. అసలు అదే అతని 'ఉడుగని వ్రతం'. (తద్వ్రతం). ఆయన ఆచరించిన 'ఉడుగనిక్రతువుల' ఫలంపుపొడ. ఇలా ఒక 'పొడవు' విష్ణుని సూచిస్తే, మరోటి బలిచక్రవర్తిని సూచిస్తుంది. ఒకటి 'భాగవతాన్ని' సూచిస్తే, మరోటి 'పోతన కవిత్వాన్ని' సూచిస్తుంది. ఒకటి ఆయన కవిత్వంలోని 'శబ్దాన్ని సూచిస్తే, మరొకటి అందలి అర్థాన్ని సూచిస్తుంది.

పొడవు కు అర్థాలు - వి. (1) ఎత్తు ఔన్నత్యం (2) దైర్ఘ్యం, నిడివి (3) గొప్పదనం (4) ఔన్నత్యం (5)ఉన్నతప్రదేశం (విణ.) (1) ఉన్నతుడు. ఉన్నతం, దీర్ఘం (2) గొప్పవాడు, గొప్పది (క్రి.విణ.)- మీదుగా, ఎత్తుగా, పెద్దదిగా.దీని రూపాంతరం పొడువు. (పొడువు - రూపాన్ని శ.ర. గ్రహించలేదు)

తె. üపొడుచు ధాతువుకు 'ఉదయించుట', 'ఎక్కుట' పోట్లాడుట' అనే అర్థాలు ఉన్నాయి. 'పైకెక్కు' అను అర్థం గల పొడుచుధాతువుపై 'వు' ప్రత్యయం చేరడం వల్ల 'పొడువు' అనేరూపం నిష్పన్నమౌతుంది. ('పొడుచు' ధాతువుపై 'అవు' చేరి అంత్య వర్ణములోపించి , üపొడుచు + అవు పొడవు అని సిద్ధిస్తుంది. పొడుచునది పొడవు.

**5.7. -ఇ:-** భాగవతంలోని **-ఇ**ప్రత్యయాంతాలు -

| | | | |
|---|---|---|---|
| (1) ఎంగిలి | (2)ఎలమి | (3)కుయ్యి | (4) చెయ్యి |
| (5) తడి | (6)దప్పి | (7)ముడి | (8) విరి |

1.ఎంగిలి :-

**వేలుపులటె నాకంటెను**

**వేలుపుమఱియెవ్వఁడనుచు వికవికనగి మా**

**వేలుపుల గోడలపై నో**

**హేలావతి ! నీ తనూజుడెంగిలి చేసెన్.** [47]

ఇవి చిన్ని కృష్ణుని చిలిపి చేష్టలను తల్లికి మొరపెట్టుకుంటున్న గోపికల నివేదనలివి.

'ఎంగిలి' జన్యంగా తె. üఎంగిలించు అను క్రియను ఒక దానిని సూ.రా.ని. పేర్కొన్నది. దీని అర్థాలు - (1)

తినగా మిగిలినది (2) భుక్తశేషాన్ని తినడం వల్ల కాని స్పృశించడం వల్ల కాని కలిగే దోషం (3) అపవిత్రం (4) అనుభవించబడింది.

సోదరభాషల్లో దీని సరూప పదాలు -

క్రియలుగా - త. ఎంచు (ఎంచి-) 'మిగులు, మిగుల్చు, కొఱవడు, గడపు'; ఎంచలి (-ప్ప్-, -ట్ట్-) 'అభియోగంమోపు, హీనపరుచు'; క. ఎంజలిసు 'ఎంగిలి చేయు'; కురుఖ్.- ఎంగ్ర్నా 'మిగులు, మిగుల్చు, అధిగమించు, తప్పించుకొను'; మాల్తో. ఎజ్గ, ఎజ్ర 'మిగులు'.

నామవాచకాలుగా - త. ఎచ్చమ్ 'మిగిలినది, భుక్తశేషం, లాలాజలం'; వెచ్చిల్ 'శరీరం నుండి విసర్జింపబడినది - ఉమ్మి, మూత్రం మొ॥; మ. ఎచ్చిల్ 'శేషం; కోట. ఎచ్ల్ 'ఎంగిలి'; తొద. ఇచిల్ 'ఉచ్ఛిష్టం, మృత / జాత - ఆశాచం'; క.ఎంజల్ 'ఎంగిలి; ( $DED-666.$)

పై పదాల పరిశీలన వల్ల మూల ద్రావిడ భాషలో *ఎంచ్-/ *ఎంక్- అనే క్రియాధాతురూపముండేదని ఊహించవచ్చు. దానిపై - ల- అనుబంధము చేరి, తెలుగులో- కృత్ప్రత్యయము -'ఇ' చేరి, సమస్వరత వల్ల- 'ఎంగిలి' అయిందని ఊహించవచ్చు. * ఎంచ్-/ * ఎంక్ -ల్- + ఇ = ఎంగిలి

' మిగిలినది, అపవిత్ర మైనది, విసర్జింపదగినది' -ఎంగిలి.

(దీన్ని *ఎంచెదరు- 'మిగులుస్తారు/అపవిత్రమని విసర్జిస్తారు' - ఎంగిలి. కర్మార్థకం.)

జ. ఎంగిలించు.

(ఈ పదం 'ఎంగిలి' ఒక వైశిష్ట్యం కలిగి ఉంది.

ఇదివరకే 'అనుభవింపబడట'. వల్ల 'మిగిలిన' 'ఇది' ఉపయోగించేందుకు అనువుకానిది - అని అర్థం.

కాగ - మూ.ద్రా క్రియా. రూ. ఎంగిలి - అగుటచే కాబోలు తెలుగువారు - ఆ క్రియను స్వీకరించలేదు. స్పృష్టశేషాన్ని తెలుగువాడు స్వీకరించడు కదా! నన్నయశేషాన్ని తిక్కన స్పృశించలేదు కదా!

కాగ, పై పద్యంలో కృష్ణుడు గోడలపై వేల్పులను ఎంగిలి చేయడం ఈ లోకాలన్నీ ఆయన నోటినుండి వెలువడినవియే అని సూచించేందుకు. లోకాలు - ఆయన ఉచ్ఛిష్టమైతే, వానిలోని - దైవసంకేతాలు కూడ భగవదుచ్ఛిష్టాలే కదా! (తర్వాత - తన నోటిలో పదునాల్గు లోకాలు చూపించడం - ఈ విషయమే స్పష్టం చేస్తుంది.

ఇందులో, 'ఎంగిలి' - చేసెన్ (కృదంతము + క్రియ) అని ప్రయోగించడం వల్ల లోకాలు, అందలి విషయాలు ఈ వరకే ఆయన 'ఎంగిలి' (భావానికి రూపం) అనీ, మనకు అర్థమయ్యేందుకుగాను మళ్ళీ 'చేసెను' - అని అర్థం. 'కృష్ణునిది బాల్య చేష్టకాద'ని పోతన సూచన.

**2.ఎలమి :-**

ఆ. **<u>ఎలమి</u> బ్రతుక నిచ్చయించిన వారికి**
**దేహమెల్లభంగిఁదీవు గాదె?**
**యచ్యుతుండు వచ్చి యర్థించె నేనియు**
**తన్ను నిచ్చునట్టి దాత గలఁడే?** [48]

తన అస్థికలను అడగలేక అడుగుతున్న దేవతలను సాంత్వన పరుస్తూ దధీచి పలికే పలుకులివి.

'ఆనందంగా బ్రతుకాలి' అనుకునే వారికి దేహంపై అన్నివిధాలా కోరికే / ఇష్టమే. సాక్షాత్తు విష్ణుమూర్తి వచ్చి అడిగినా తన దేహం ఇచ్చే దాత లోకంలో ఉండడు. ఐనా దధీచి లోకసామాన్యుడు కాడు. అందుకే ఆయనే తన ప్రాణత్యాగవిషయంలో దేవతలను ఓదారుస్తూ, ప్రోత్సహిస్తున్నాడు. లోకమంతా 'ఎలమిబ్రతుక నిచ్ఛయించునది' కాని తాను చావనైనా ఎలమి నుండువాడె.

తె.üఎలమి కి- (1) సంతోషం (2) అనుగ్రహం (3) ప్రేమ (4) వికాసం (5) వివేకం (6) వృద్ధి (7) ఉత్సాహం (8) ధైర్యం అనే అర్థాలున్నాయి. తె.üఎలము ను క్రియగా కుమారసంభవ కారుడు ప్రయోగించాడు.

సోదర భాషల్లో -

త. ఇలకు (ఇలకి-), ఇలంకు (ఇలంకి-) 'ప్రకాశించు'; మ. ఇలకుక; తె. ఎలము, అని క్రియగా,

త. ఎల్ = ప్రకాశం ;ఎల్లి సూర్యుడు, పగలు' అని నామవాచకంగా ప్రయోగాలు ఉన్నాయి.

(*DED*–707) (*TVB*–173)

తె.üఎలము + ఇ > ఎలమి. దీని (ఎలమి) చే ఎలముదురు ('ప్రకాశింతురు') - కాబట్టి ఎలమి. కరణార్థం.

పై ప్రయోగంలో పోతన (సాభిప్రాయంగా) ఉద్దేశ్యపూర్వకంగా 'ఎలమి' ని వినియోగించాడు. దానితో ఆయన సాధించదలచిన పరమార్థం ఎంతో ఉంది.

పైన తెలిపిన ఎనిమిది అర్థాలూ ఇక్కడ ధ్వనిస్తాయి.

తన ప్రాణాలను సంతోషంగా (1), ఉత్సాహంగా (7) ఇవ్వబూనడం - ఆయన ధైర్యాన్ని (8) ; దేవతల పట్ల ఆయనకున్న అనుగ్రహాన్ని (2), ప్రేమనూ (3) సూచిస్తుండగా ; ఆయనే ఓదార్చడం - తన వివేకాన్ని (5) దీనంతటివల్ల ఆయన కీర్తి వృద్ధినీ (6) సూచిస్తున్నాయి.

జ. ఎలమి, ఎలమికాఁడు.

**3.కుయ్యి:-**

క. **దీనుల <u>కుయ్యాలింపను</u>**
**దీనుల రక్షింప మేలు దీవన బొందన్**
**దీనావన! నీ కొప్పును. ౘ**
**దీన పరాధీన ! దేవదేవ! మహేశా!** [49]

మొఱ, ఆర్తధ్వని, దీనాలాపం - అని సూ.రా.ని. అర్థాలి 'కూయి' కుయి దీని రూపాంతరాలు.

సోదర భాషల్లో -

త. కూ 'కూయు'; కూవు 'మొఱవెట్టు'; కుయిల్ 'అరచు'; మ.కూ 'బిగ్గరగా ఏడ్చు'; క.కూగు, కూకు 'ఏడ్చు; కూ 'ఏడ్చు, పిలుచు'; గోం.కూస్-; కొలామి. కూయ్ -; నాయకి. కూగ్-; బ్రాహూయి. కూక్ ; తె. కూయు 'ఏడ్చు, అఱుచు, పక్షులు అఱుచు, పిలుచు' (*TVB* 300)

మూ.ద్రా. * కూయ్-/ * కూ-, * కూక్-.

* కూయ్ పై ధాతు అనుబంధం 'ఉ' చేరి - తె. కూయు కాగ- తె.üకూయు+ఇ =కూయి ; దీర్ఘంలోపించి కుయి; సమీకరణము చెంరి - 'కుయ్యి' అనేరూపాలు సిద్ధిస్తాయి. కూయబడునది కూయి / కుయి / కుయ్యి. (దీనిని కూయుదురు) (కర్మార్థకం).

జ. కుయ్యిడు-, కుయ్యోమొఱ్ఱో.

**4.చెయ్యి / చేయి :-**

తే. **వీరభద్రుండు విహత విద్వేషి భద్రు ౘ**
**డగుచు దన వేయి <u>చేతులు</u> మొగిచి వినయ**
**మెసగ నేనేమి సేయుద? నెఱుఁగ నాకు**
**నాన తిమ్మన్న నతని కయ్యభవుడనియె** [50]

దీని సరూపాలు సోదరభాషల్లో -

తౖకై = చెయ్య; (-ప్ప్ -, -ట్ట్-) 'చేతితో తినిపించు'; మ.కై, కయ్య; కోత. కయ్; తొద. తొయ్; క. కయ్, కయ, కయ్య, కెయ్; కొడగు, కయ్; తు.కై; కొలామి. కి- కెయ్; కొండ . కి ఉ. (*DED* 1683)

క్రియగా -

త.కై-ప్ప్-; కై-ట్ట్- 'చేతితో తిను'; చెయ్ - వ్-, -ట్- 'చేయు'; మ. చెయ్క 'చేయు'; కోత. గెయ్-, గొచ్-, కెయ్-, కెచ్-; తొద, కియ్-, కిస్-; క.కెయ్, కై.గెయ్ 'చేయు'; తె. చేయు; గ.కెయ్-;(*DED* 1628) (*TVB* – 477)

మూ.ద్రా. *కే-; మూ.ద.ద్రా., మూ.మ.ద్రా. *కేయ్. 'క' కారం చకారంగా మారి (3.2.14) 'ఉ' కారం ధాత్వనుబంధంగా చేరగా - 'చేయు' అనే ధాతు రూపం నిష్పన్నమౌతుంది.

తె. **ü**చేయు+ఇ > చేయి. దీర్ఘంలోపించి చెయి, సమీకరణం చెందగా చెయ్యి. చేయునది చెయ్యి. దీనితో పనులు చేస్తారు. బట్టి చెయ్యి. కరణార్థకం.

జ. చెయదము, చెయది, చెయువు, చెయువులసాకిరి, చే, చేఁత, చేతఁకత్తె, చేఁతకాఁడు, చేఁతగట్టు, చేకట్టు, చేకత్తి, చేకత్తికాఁడు, చేకలవాఁడు, చేకానుక, చేకురు, చేకుఱు, చేకూడు, చేకూరు, చేకూలి, చేకొను, చేగడియ, చేగలమెకము, చేగానుగు, చేగిండిచే గొడ్డలి, చేగోడి, చేచాఁచు, చేచాఁపు, చేత, చేతబట్టు, చేతప్పు, చేతమకు, చేతవులు, చేతాకు, చేదండ, చేదరి- సెనము, చేదివియ, చెదివ్వె, చేదుడ్డు, చేదోడు, చేదోడుపడు, చేపట్టు, చేపట్టుఁగుంచము, చేపడవ, చేపడు, చేపావడ, చేపుణికిళ్ళు, చేపెట్టె, చేపట్టు, చేబంతులు, చేబదులు, చేబాడిత, చేబాడిస, చేబిరుసులు, చేబుఱ్ఱ, చేబోడి, చేమిరి, చేమొగుచు, చేమొగుపు, చేమోడుచు, చేమోడుపు, చేయబెట్టు, చేయప్పు, చేయమ్ము, చేయలఁతి, చేయ, చేయంచు, చేయదోడు, చేలాగు, చేవదలు, చేవలఁతి, చేవాఁడి, చేవాడికాఁడు, చేవాటు, చేనిచ్చు, చేనిప్పు, చేవెలుగు, చేవ్రాలు, చేసరులు, చేసి, చేసేత. మొ॥

**5.తడి :-**

తె. **అలఘు రురుచర్మధారియై యలరుచున్న**
**తపసిఁ బొడగని శోషిత తాలుఁడగుచు**
**నెండి <u>తడి</u> లేని కుత్తుక నెలుఁగు డింద**
**మందభాషల డగ్గఱి మనుజవిభుడు -** [51]

పరీక్షిన్మహారాజు శమీకమహాముని వద్దకు అలసి వచ్చినప్పటి పద్యమిది.వేటచేత అలసిన పరీక్షిత్తు గొంతుతడి యారగా, గొంతు పెకలకుండగా - మందభాషలతో జింక చర్మన్ని- ధరించిన శమీకుని చూసి దగ్గరగా వెళ్ళాడు.

సహజ పండితుడైన అలఘు పోతన మహత్వం తెలియలేని కొందరు పాండిత్యంలో రాజులమనుకొని, ఎండి తడిలేని '(నీరసమైన)' మందభాషలతో (మూర్ఖపుమాటలతో) ఎలుగుడింద అరుస్తారు. కాని ఆయన 'శబ్దశాస్త్రవేది'. (10.పూ-763).

'తడి' కి - (1) తేమ. ఆర్ద్రత (2) ఆపద అనే అర్థాలున్నాయి. తె. ü తడియు కు 'ఆర్ద్రమగు' అని అర్థం.

సోదరభాషల్లో -

తొ.తొణ్చ్- 'చల్లనగు'; తొణ్-య్-; కోత- తయ్ణ్-; త.తణ్; మ. తణియుక; క.తణి 'చల్లనగు'. అనేవి క్రియా రూపాలు. క.తడి; త.తళి 'వర్షం'; మ.చళి; (*TVB* – 528)

మూ.ద్రా. *చల్-/ *చణ్- : *తళ్ -/ * తణ్-. ü తళ్ + ఇ > తడి. లేదా-

తె. ü తడియు + ఇ > తడి (కరణార్థకం) .దీనిచే తడియనగు → తడి. కరణార్థకం.

ఉ. తడి, తడితీయు, తడిపొడి, తడియారు, తడియొత్తు, తడిసుడి, తడుపు, తడిపుదాల్పు.

**6.దప్పి:-**

క. **హీనుఁడ। జండాలుండను**

**మానవకులనాథ ! దప్పి మానదు నవలం**

**బోనేర నీకుఁ జిక్కిన**

**పానీయము నాకుఁబోసి బ్రతికింపఁగదే.** [51]

ఇది రంతిదేవుని చరిత్రలోని పద్యం. 'దప్పి' శబ్దానికి (1) బడలిక (2) దాహం అనే అర్థాలున్నాయి. పై పద్యంలో స్పష్టంగా 'దాహం' అనే అర్థంలో ప్రయుక్తం. నాయకి. అడ్ 'దాహం' ; తె.దప్పి; గ.అణ్డ్ - 'దాహం' (*DED* – 95) డయ్- 'కృశించు'కొలామి అడ్డ్-(అట్ట్-) 'దప్పిగాను'; పర్జి. అండ్- 'ఆకలిగాను, దప్పిగొను'; కువి. దహ్- 'కృశించు'; తె.దయ్యు 'కృశించు', (*TVB* – 500)

మూ.ద్రా * ళ్ > తె.'డ' గా మారుతుంది. వర్ణవ్యత్యయం 'డయ్' అవుతుంది.

తె. ü డయ్యు+ఇ>( యకారస్థానంలో పకారాదేశం, ద్విత్వం)'దప్పి'.

∴ డయ్యుటచే కల్గునది డప్పి/దప్పి. దాని వలన (ü దయ్యువలన) జనించుటచే - దప్పి(అపాదానార్థం).

దప్పి+క >(స్వార్థంలో -క )దప్పిక(తద్ధితం).

ఉ. దప్పి, దప్పిక, దప్పిగొను.

**7.ముడి :-**

ఉ. **విందులమై నరేశ్వరుని వీటికి వచ్చితి మేము మాకు మా**

**మందలలోనఁ గట్టుకొన మంచి పటంబులు లేవు నీ ముడిన్**

**సుందర ధౌతచేలములు శోభిలు చున్నవి తెమ్ము నిన్ను మే**

**లందెడి నిమ్ము రాజుదెసనల్గురమో రజకాన్వయాగ్రణీ !** [52]

క. **విమలమతిఁ దలఁప నెవ్వని**

**బొమముడి మాత్రమున నిఖిల భూదేవీ భా**

**రము వాయునట్టి హరిపద**

**కమల మరందంబు గ్రోలు ఘనుఁడెవ్వాడో?** [53]

'ముడి'కి - (1) మూట (2) గ్రంథి (3) కోపాదులచే కలుగు బొమలమెలి (4) (ఎద్దు) మూపురం

(5) చెట్టులోనగువాని బుడిపి (6) సంధి. అనేవి అర్థాలు.

పై మొదటి పద్యంలో - 'మూట' అనే అర్థంలో, రెండవ పద్యంలో -'బొమలమెలి' అనే అర్థంలో ప్రయుక్తం.

సోదర భాషల్లో -

సరూపాలు -క.ముడి '(వెంట్రుకలు మొ॥ వానిని) కట్టు, తలలో పూలు పెట్టుకొను'; ముడు, మూటె 'తాడుముడి, మూట'; తు. ముడెయుని 'మడచు'; ముడెపిని, ముడెపుని; ముడియుని; ముటి; మ.ముట్టిక; అనేవి క్రియారూపాలు. నామవాచకాలుగా - క. ముడు, మూటె; తు.ముటి; తు.ముటి $(TVB-999)$

మూ.ద్రా. * ముళ్-త్-> * ముట్-.

* ముట్ + ఇ > ముడి. లేదా- తె. üముడుచు + ఇ > అనుబంధ 'చ' లోపం - ముడి.

∴ ముడుచుటచే ఏర్పడునది - ముడి. దీనిని ముడుచుదురు(కర్మార్థకం).

**8.విరి :-**

క. **అని మఱియుఁ బౌరకాంతలు**
**మునుకొని హరిరూపు నేత్రముల వెంటను లోఁ**
**గొని తాల్చిరి హృదయములను**
**జనిత ప్రమదమున <u>విరులు</u> సల్లుచు సధిపా !** [54]

'విరి' '(వి.) 'పుష్పము'; విణ-'(1) వికసించినది (2) వీడినది (3) విడిగా నున్నది (చిల్లరయైనది)' పైన 'పుష్పార్థంలో ప్రయుక్తం.

సోదర భాషల్లో - క్రియగా -

త. విరి (-వ్-, న్ట్-) 'విస్తరించు; మ. విరియుక; విరిక్క; విరిత్తుక 'తెరచు'; క. బిరి, బిరికు, బిరుకు, బిరవు, బిరువుః కొడగు. బిరి-; తు. బిరియుని; బిర్కుని ; బిచ్చుని; తె.విరియు; విప్పు;

నామవాచకంగా -

త. విరి; విరివు; మ.విరి, విరివు, విరిచ్చల్ ; క.బిరి; తె.విరి, విరివి; $(DED-4438)$ $(TVB-1172)$

మూ.ద్రా. * విర్-.'*విర్' పై ధాత్వను బంధం 'యు' చేరి, స్వర సమీకరణంచే 'üవిరియు' రూపం నిష్పన్నం.

üవిరియుకు అర్థాలు -(1) వికసించు (2) పుష్పించు (3) విడిపోవు (4) చెదరు (5) తొలగు (6) రాలిపోవు (7) రాలిపోవు (8) వివశమగు (9) అదృశ్యమగు (10) విరుగు (11) వ్యాపించు (12) పొంగు - అనేవి .

ü *విర్+ఇ > విరి; üవిరియు+ఇ = విరి (అనుబంధలోపం)

∴ విరియునది విరి. వికసించుటచే విరి. కర్త్రర్థకం.

జ. విక్కవిరియు, విరఁబడు, విరవాయు, విరాకులవిత్తు, విరి, విరిఁబోడి; విరికోటారపుజోడు, విరికిలించు, విరికొంతవేల్పు, విరిగొమ్మ, విరిచెండు, విరితీవబోడి, విరితేనియ, విరితేనె -, విరిదట్టు, విరిదలవాఁడు, విరినీరు, విరిపిడియము విరిపోటు, విరిపోటు సేయు, విరియబడు, విరియబాఱు, విరియబోము, విరియాట, విరియంచు, విఱివి, విరివింటదంట, విరివింటదొర, విరివింటివాడు, విరివిడి, విరివిలుకాడు, విరివిల్తుడు, విరివోడి, విరిసరి, విరులెత్తు.

**5.8.ఇక :-**

భాగవతంలోని - ఇక ప్రత్యయాంతాలు -

| | | |
|---|---|---|
| (1) ఆడిక | (2) ఈరిక / కె | (3) ఉనికి |
| (4) ఉబ్బరిక | (5) ఏలిక | (6) ఒడంబడిక |
| (7) ఒపిక | (8) కోరిక/కోర్కి కోర్కె | (9)చూడ్కి |
| (10) తూనిక | (11) పూనిక | (12) పోలిక/పోల్కి |
| (13) మచ్చిక | (14) మనికి | (15) వినికి |

**1. ఆడిక: -**

ఉ. **"అత్తలు మామలున్ వగవ <u>నాడిక</u> కోడక" . . . . .** [55]

దీనికి - (1) ప్రతిజ్ఞ (2) నింద / అపవాదు అనే అర్థాలున్నాయి.పై పద్యంలో 'నింద' అనే అర్థంలో ప్రయోగించబడింది.

'**ü**ఆడు' నకు (1) పలుకు (2) నిందించు (3) పాడు (4) ఆచరించు (5) నాటు అనే అర్థాలు

స.క్రి.గా; అ.క్రి.గా- (1) చలించు (2) ప్రవర్తించు (3) విహరించు (4) స్నానమాడు (5) క్రీడించు (6) నర్తించు (7) గుచ్చుకొను అనే అర్థాలున్నాయి.

సోదర భాషల్లో -

క. ఆడు ; కోత. - (ఆచ్-) ; త.ఆటు (ఆటి-); పై అన్ని అర్థాల్లో-; మిగిలిన భాషల్లో పై అ.క్రి. అర్థాల్లో ఈ ధాతువు ఉంది.

నామవాచకంగా -

క. ఆడి 'ఆట.మాట'; ఆడికె, ఆటికె 'చలనం, ఆట, మాట'; ఆడిగ 'ఆటగాడు, నటుడు'; ఆటు, ఆట 'కదలిక, ఆట, మాట'; తు.ఆడెలె 'చపల చిత్తుడు'; ఆట 'ఆట. మాట'; తె. ఆడిక 'నింద'; ఆట; $(DED-290)$

$(i)$ **ü**ఆడు+ఇక > ఆడిక. **ü**ఆడు కు స్థూలంగా 'మాట్లాడు' అని అర్థం. 'ఇక' చేరి, హీనార్థం పొంది - 'నింద / అపవాదు' అని అర్థం.అర్థోత్కర్ష లో - 'ప్రతిజ్ఞ' అని అర్థం.

$(ii)$ **ü** ఆడు+ట > ఆట. 'క్రీడించుట' - అర్థం. ∴ ఆడబడునది ఆడిక / ఆట. (కర్మార్థకం)

**ü**ఆడు జన్యాలు - ఆట, ఆటకత్తె, ఆటకాడు, ఆటకొలను, ఆటగీము, ఆటగొఱ్ఱు, ఆటచేడియ, ఆటడిగ్గియ, ఆటతిప్ప, ఆటతెఱవ, ఆటతోఁట, ఆటది, ఆటపట్టు, ఆటరి, ఆటవాడు, ఆటవిడుపు, ఆటవెలఁది, ఆడిక, ఆడికపడు, ఆడికోలు, ఆడిపోసికొను, ఆడుకొను.

**2.ఏలిక :-**

క. . . . . . **చని తన <u>ఏలిక</u> కంతయు . . . . .** [56]

దీనికి - (1) రాజు / యజమానుడు (2) భర్త అనేవి అర్థాలు. పై ప్రకరణంలో 'రాజు' అనే అర్థంలో ప్రయుక్తం.

üఏలు (స.క్రి.) '(1) పాలించు (2) పరిగ్రహించు' అనే అర్థాలున్నాయి.

సోదరభాషల్లో -

త. తళ్ (ఆళ్వ్ -, ఆంట్-) 'పాలించు, నిర్వహించు, అదుపుచేయు'; మ. ఆళుక; కోత. అణ్; తొద. ఒళ్-; క. ఆళ్ (ఆళ్డ్-) 'పొందు, కలుగు, పాలించు, స్వాయత్తీకరించు'; కొడగు - అళ్-; తు. ఆళుని;

నామవాచకంగా :-

త.ఆళన్, ఆళి 'పాలకుడు'; ఆళుకై 'పాలన '; ఆళ్వార్ ' దైవభక్తుడు, (గొప్ప పాలకుడు) ; ఆట్చి 'యాజమాన్యం, ప్రభుత్వం'; క. ఆళికె, ఆళ్కె 'పొందు, పాలన, ప్రభుత్వం'; తు. ఆళికె, ఆళువికె; $(DED-341)$

మూ.ద.ద్రా. * యాళ్ - $(TVB-191)$. * య > ఴ (3. 2. 24) ; * యాళ్ - > ఏల్. దీనిపై ధాత్వనుబంధం 'ఉ' చేరి 'ఏలు' సిద్ధమౌతుంది.

(*i*) తె. üఏలు + ఇక > ఏలిక. ∴ ఏలువాడు, ప్రజలను ఇతడు ఏలును. కర్త్రర్థకము.

(*ii*) తె. üఏలు +బడి > ఏలుబడి. ఏలబడునది 'పాలిత ప్రాంతం'.

ఏలు జన్యాలు :- ఏలిక, ఏలిక రాజనాలు, ఏలికసాని, ఏలినవాఁడు, ఏలినాతడు, ఏలుకొను, నేలుకొటి, ఏలుబడి.-

**3.ఓపిక :-**

ఉ. **<u>ఓపిక </u>లేక చచ్చిన మహోరగముం గొనివచ్చి కోపినై**
**తాపసు మూఁపుపై నిడిన దారుణ చిత్తుడ మత్తుడన్ మహా**
**పాపుఁడ మీరు పాపతృణపావకు లుత్తము లయ్యులార ! నా**
‡ „ ≡ò " Œ Ç =¶~¾ò – Q® „ ¬¡..ì~¡ ! qk Oz K³„ æ! [57]

విప్రశాపం తెలిసిన పరీక్షిన్మహారాజు - పశ్చాత్తాపంతో బ్రాహ్మణులతో పలికిన పలుకులివి.

ఓపిక (1) 'క్షమ, విసుగు లేకుండుట, (2) శక్తి, సామర్థ్యం.పై పద్యంలో 'క్షమ' అనే అర్థంలో ప్రయుక్తం.

సోదరభాషల్లో -

క. ఒయ్, ఒయున 'వహించు; త.ఉయ్; గోం.వోఇ-; కుయ. ఒప; కురుఖ్. హో- $(TVB-227)$

తె.ఓపు (అ.క్రి) (1) చాలు, సమర్థమగు (2) ఇష్టపడు (3) సహించు, ఓర్చు.

తె. üఓపు+ ఇక > ఓపిక ∴ ఓపుటచే - ఓపిక, (భావార్థం)

**4.కోరిక :-**

కోరిక, కోరికి, కోర్కి, కోర్కె, కొరికె అనునవి దీని రూపాంతరాలు.

క. **మునివర ! యే<u>కోరిక</u> నీ**
**మనమునఁ గావించి నను సమంచిత భక్తిన్**
**నెనరున ఁ బూజించితి నీ**
**కనయము నా <u>కోర్కె </u>సఫల మయ్యెడు జూమీ.** [58]

కర్దమ మహర్షికి సాక్షాత్కరించిన భగవంతుని పలుకులివి.ఇందులో - కోరిక, కోర్కె అనే రెండు రూపాలు లభించాయి.

సోదరభాషల్లో -త. కోరు (కోరి-) 'అభ్యర్థించు, అభిలషించు'; మ. కోరుక; క. కోరు, కోఱు; తు. కోరుని; తె. కోరు;

త. కోరిక్కై; మ. కోఱు; క. కోఱికె; తు. కోరికె, కోరిగె; తె. కోరిక, కోరికి, కోరికె (*DED* – 1848)

మూ.ద.ద్రా. * కో-ఱ్- < కోయ్-అర్-/ కోచ్-అఱ్- (*TVB* – 336)

*కోర్+ఉ+ఇక > కోరిక.

తె. üకోరు+ఇకి > కిరికి - మధ్యాచ్లోపంకాగ - కోర్కి.

తె. üకోరు+ఇకె > కోరికె - కోర్కె.

∴ కోరబడునది - కోరిక. దీనిని జనులు కోరుదురు. కర్మార్థకం.

క. **నావలన <u>కోర్కి</u> యూరక**

**పోవదు . . . . . . . . .**[59]

అనే పద్యంలో 'కోర్కి' ప్రయోగం ఉంది.

**5.తూనిక :-**

వ. . . . . . **ధనదు నిలయంబు <u>తూనిక .</u> . . . . .**[60]

'తూన్కి' దీనికి రూపాంతరం.'త్రాసుతో తూన్చుట' దీని అర్థంగా కోశాలు పేర్కొన్నాయి.పై వచన భాగంలో 'సమానం' అనే అర్థంలో వాడబడింది."దీనియందు సరిగఁదూగును. అధికరణార్థము" అనివర్ణులచిన సీతారామ శాస్త్రి. (బాలవ్యాకరణోద్యోతం - పు - 439)

ఈ విధంగా దీనికి (1) తూకం (2) సమానం (3) త్రాసు అనే అర్థాలు సిద్ధిస్తున్నాయి.

'తూగు' ధాతువుకు - అ.క్రి. (1) త్రాసునందు తూనికపడు (2) సమమగు (3) సిద్ధమగు (4) సమర్థమగు (5) చలించు (6) దుర్బలమగు (7) ఊగు (8) కూరుకు (9) సాగు- అనేవి అర్థాలు. దీని ప్రేరణార్థకం - üతూఁచు. సోదరభాషల్లో -

క. తూగు 'తూనిక పడు, ఊగు, కూరుకు'; తూఙ్కు 'వేలాడు, అల'; తూణ; తు. తూఙ్కుని, తూఙ్గుని 'చుట్టుకొను, కునుకు, వేలాడు, ఎగురవేయు'; తూకుని 'తూచు'; త. తుఙ్కు 'వేలాడు, ఊగు, కూరుకు'; తూక్కు 'తూగు, పోల్చు'; తూక్కమ్ 'నిద్ర'; మ. తూఙ్గుక, తూక్కు; కుయి. సుంజ; కువి. తూంగ్ -.

మూ.ద్రా *తూఁయ్-/ * చూఁయ్; *తూఁయ్-న్క్/- క్క్-, * తూఁయ్-న్చ్-.

పై పదాల పరిశీలనవల్ల - * తూఁయ్- న్క్ > తూఁగు;

*'తూఁయ్ -న్క్' లో 'క్' లోపించగా - üతూన్ (తూఁగునకు తూన్వాదేశము. వ్యాక.)

üతూన్ +ఇక > తూనిక

(*i*) తూగబడుటచే తూనిక - కర్త్రర్థం 'తూకం'.

(*ii*) తూచుటచే కల్గునది తూనిక - కర్మార్థం 'సమానత'.

(*iii*) దీనియందు సరిగ తూగును →తూనిక. అధికరణార్థం 'త్రాసు'.

తె. üతూఁగు జన్యాలు :- తూఁగాడు, తూఁగుటుయ్యాల, తూఁగుదీవి,తూఁగుపలక, తూఁగుమంచము, తూచు, తూకము, తూకు, తూకువ, తూకొను, తూనిక, తూనికవేయు, తూనికి, తూను, తూనుకోల, తూన్చు.

**6.పూనిక :-**

పూనికి - దీని రూపాంతరం.

క. **పుట్టించిన జనకుని మది (**
**బుట్టిన తలఁపెఱిఁగి వారు పూనిక ప్రజలం**
**బుట్టించు వ్రతముగైకొని**
**గట్టిగఁదప మాచరింపఁగా జనిరి వెసన్** [61]

దీనికి అర్థాలు -(1) ప్రయత్నము (2) ఉద్దేశము (3) పట్టుదల (4) విధము, రీతి - అనేవి.పై పద్యంలో 'పట్టుదల' అనే అర్థంలో ప్రయుక్తం.

పూను - ఊను (అ.క్రి.కు - (1) ఉద్యమించు (2) ప్రారంభించు (3) తలచు (4) వహించు (5) నియమం చేసికొను (6) నిర్మించు అనేవి అర్థాలు.

సోదరభాషల్లో -

క. పూణ్, పూడు; కోత.పూఛ్ - తొద. పూళ్; త.పూణ్; మ.పూట్టుక; పూణుక; కుయ, పూండ; మాల్తో, పూణ్-:

మూ.ద్రా. * పూణ్. * పూణ్-త్- > * పుట్ట్. * పూణ్ > తె. üపూను.

తె. üపూను+ఇక > పూనిక. ($TVB-840$)పూనుటచే పూనిక .(భావార్థము)

üపూను జన్యాలు - పూన్చు / పూంచు / పూఁచు, పూఁట, పూఁటకాపు, పూఁటవాఁడు, పూఁటవాటు, పూఁటవెట్టు, పూనించు, పూనిక, పూనికి, పూనుకొను, పూనుగాఁడి, పూనె, పున్కికాఁడు, పూన్చు, పూన్పు.

**7.పోలిక :-**

క. **పెనుపగు వర్షాకాలం**
**బునదిన నాయకుని వలన ( బొడమిన సలిలం**
**బనయముఁగ్రమ్మఱ గ్రీష్మం**
**బున సూర్యుని యందుఁజెందు పోలిక మఱియున్.** [62]

పోలికి/ పోల్కి దీని రూపాంతరం.వలె/ సదృశం / వంటి అనేవి దీని అర్థాలు.

'పోలు' ధాతువుకు (1) తగు, యుక్తమగు (2) శక్యం / సాధ్యం (3) కలుగు, సిద్ధించు (4) పొసగు (5) సమ్మతమగు (6) ఒప్పు (7) అనుకూలమగు (8) సాటియగు, సమానమగు, సరిపోలు అనేవి అర్థాలు.

దీని ప్రేరణరూపం - పోలుచు.

సోదరభాషల్లో -

క. పోల్, హోల్ 'సమానమగు'; త. పోల్ (పోణ్-ఱ్-) ; మ. పోలుక; కువి. పోలి -! క్రియా రూపాలు ($TVB-891$)

నామవాచకరూపాలు : త.పోలి 'సదృశమైనది ; పోలిమై'పోలిక'; మ.ఓల్, పోల, పోలె 'వలె'; క.పోల్. 'వలె'; పోల్కె, పోల్వె = వలె; (3758 $DED$)

మూ.ద.ద్రా. * పోల్. * పోల్ > తె. ü పోలు.

తె. üపోలు + ఇక > పోలిక. దీనిచే పోల్చబడును - పోలిక . (కరణార్థము)

జ.	పోని, పోలించు, పోలిక, పోలికి, పోలుబోలములు, పోలుచు, పోలుపొందు, పోలేఌ.

తే.	**కలలఁదోచిన వస్తుసంఘముల మేలు**
**కని కనుగొనఁగా లేని మనుజు <u>పోల్కి</u>. . .** [63]

**8.మచ్చిక :-**

క.	**చెచ్చెరఁగరినగరికి నీ**
**విచ్చేసిన నిమిషమైన వెయ్యేండ్లగు నీ**
**వెచ్చోటికి విచ్చేయక**
**<u>మచ్చిక</u>తో నుండుమయ్య ! మానగరమునన్** [64]

దీనికి - మచ్చిగ రూపాంతరం.(1) వలపు, (2) ప్రేమ (3) ఆసక్తి (4) భ్రమ (5) చనవు అనేవి అర్థాలు.

తె. **ü**మచ్చు (అ.క్రి) 'ఆకర్షించు, చనువు చేయు, మరుగు' అనేవి అర్థాలు.

సోదరభాషల్లో -

క. మర్చు.మచ్చు 'ఆరాధించు, ఆకర్షించు, చనువు చేయు; తు. మర్చుని 'మరులుగొను, మచ్చిక చేయు' (*TVB* – 933) క. మచ్చు 'ఆకర్షణ'; త. మర్చ 'మరులు / మోహం'.

మూ.ద్రా. * మర్ ధాతువుపై 'చు' అనుబంధంగా చేరి సమీకరణం వలన 'మచ్చు' ఔతుంది.

(*i*) తె. **ü**మచ్చు + ఇక > మచ్చిక. మచ్చునది (ఆకర్షించునది) కాన - మచ్చిక. కర్త్రర్థం.

(*ii*) తె. **ü**మచ్చు + ఉ > మచ్చు.మచ్చునది కాన - మచ్చు. కర్త్రర్థము.మృగాలు వలలో తగులుకొనేందుకు వలకు దగ్గరలో ఉంచే ఆహారం, ప్రలోభం - మచ్చు.

మ.	**గగనారణ్య చరాంధకారగజమున్ కాలాహ్వయవ్యాధుఁడ**
**చ్చుగఁగట్టం గమనించి <u>మచ్చిడుటకై</u> చూతాంకుర శ్రేణిచే**
**నొగిఁగల్పించిన కందుకం బనఁగఁ సూర్యుండంతవీక్షింపఁగాఁ**
**దగె మందప్రభతోడఁ పశ్చిమహాధాత్రీధరేంద్రంబునన్.** [65]

సూర్యాస్తమయవర్ణన ఇది.

**5.9. - ఇకి :-** భాగవతంలోని **- ఇకి**పత్యయాంతాలు -

1. ఉనికి	2.చూడ్కి	3.మనికి	4.వినికి

**1.ఉనికి:-**

ఆ.	**అంబరంబు మొలకు నడుగవు తిరిగెద**
**వింకఁ గలికి సేఁత లేల పుత్ర !**
**నిన్ను వంపవ్రాల్చ నేనేర ననియొ నీ**
**విట్టు క్రిందు మీఁదు నెఱుఁగ <u>కునికి</u>** [66]

దీనికి (1) ఉండుట (2) అవస్థ. దశ (3) జీవనం, బ్రతుకు (4) స్థానం - అనేవి అర్థాలు.పై పద్యంలో 'ఉండుట' అనే అర్థంలో ప్రయుక్తం.

సోదరభాషల్లో -

త. ఉళ్, ఉన్టు; మ. ఉళ్, ఉంటు; ఓత. ఒళ్; కొడగు. ఉళ్ళ్; తు.ఉళ్ళు; ఉండు; తె.ఉండు; క.ఉండు;

త.ఉళ్ళ 'ఉన్నది/ ఉన్నవాడు, సత్యం; 'ఉణ్మై 'ఉండుట';మ. ఉంటు; క. ఉంటు; తె. ఉనికి $(DED-599)$

పై పదాల పరిశీలన వల్ల-

$(i)$ మూ.ద్రా. *ఉన్ పై 'ఇకి' చేరి - 'ఉనికి' నిష్పన్నమౌతుంది.

$(ii)$ *ఉన్ + కువ > ఉంకువ. ఉండుటచే ఉనికి / ఉంకువ భావార్థం

జ. ఉంచు, ఉంట, ఉంపుడుకత్తె, ఉనికి, ఉనుకువ / ఉంకువ.

**2.చూడ్కి :-**

ఉ. **ఆడఁడు దన్ను దూషణము, లాశ్రమవాసులఁగాని వైరులం**
**గూడఁడు, కందమూలములు కూడుగఁదించు సమాధి చిత్తుఁడై**
**వీడఁడు లోని <u>చూడ్కులను</u>, విష్ణుని దక్కఁ బరప్రపంచముం**
E _È_È =ò^Î¾O_È „ Ì ÷A @Q®<Í Ɨ ~ŒÇŒH≮£[67]

సీ. **సురరక్షకుని ఁజూచు <u>చూడ్కులు</u>, <u>చూడ్కులు</u>.** [68]

పై పద్యంలోని 'చూడ్కులు' -'చూడ్కి' యొక్క బహు వచన రూపాలు.చూడికి/చూడ్కి '(1) దృష్టి, చూపు (2) కన్ను (3) విధం, రీతి'.పై మొదటి పద్యంలో 'దృష్టి' అనే అర్థంలో, రెండవ పద్యంలో 'కన్ను' అనే అర్థంలో ప్రయోగించబడింది.

' **ü**చూచు' కు (స.క్రి) (1) దర్శించు (2) ప్రతీక్షించు (3) విచారించు (4) తలచు (5) తెలిసికొను (6) పాటించు (7) కాపాడు (8) మన్నించు (9) లక్ష్యముగా గొను (10) చదువు (11) పరీక్షించు (12) వెదకు (13) తాకు (14) అనుభవించు (15) కావించు.అ.క్రి (1) యత్నించు (2) ఉత్సహించు మొ॥ అర్థాలున్నాయి.

సోదరభాషల్లో -

క. చుటి / సుటి 'లక్ష్యం ; చూపు 'దృష్టి; సుట్టు 'చూపెట్టు'; తు. సూపిని, తూపిని, హూపిని, త. చుట్టు; చూంటుక; కు. సూఅ; సూట; గోం. సూర్ -;

మూ.ద్రా. * చూ-/ * తూ-. $(TVB-451)$ పై పదాల పరిశీలన వల్ల '*చూ' - పైన -ట్- అనుబంధచేరినట్లుస్ఫురిస్తుంది.

* చూ-ట్- > తె. **ü** చూడ్+ఇకి > చూడ్కి అను రూపం సిదిస్తుంది. (మధ్య స్వరలోపం)

వ్యాకరణరీత్యా '**ü**చూచు' లోని రెండవ 'చు' అక్షరానికి 'డు' ఆదేశం. **ü**చూడు+ఇకి > చూడ్కి.

∴ $(i)$ చూడ బడుటచే - చూడ్కి - 'దృష్టి' భావార్థం

$(ii)$ వీనిచే చూచెదరు - చూడ్కులు 'కన్నులు' కరణార్థం.

తె.**ü**చూచు జన్యాలు - చూచాయ, చూడగలవాడు, చూడికి, చూపట్టగలది, చూపట్టు, చూపరి, చూపఱు, చూపించు, చూపు, చూపుడుబూట, చూపుడువ్రేలు, చూపోపమి, చూపోపు.మొ॥

**3.మనికి :-**

క. **భూతముల కెగ్గుసేసిన**
**భూతంబులు నీకు నెగ్గుఁబుట్టించె, వృథా**
**భూతమగు <u>మనికి</u> యెల్లను,**
ƒ¶` ¢^ Ë ?H* %Ãƒ =ò–ƒ çO^ Î ^ ĥ%8 [69]

ఇది కంసవధానంతరం కంసుని భార్యలు అతని శవం పైపడి ఏడుస్తూ పలికిన పలుకులివి. చక్కని సూక్తి ముత్యం.

'మన్కి' అనేది రూపాంతరం.దీనికి -' బ్రతుకు, ఉనికి, వాసస్థానం' అనేవి అర్థాలు.

'మను' (అ.క్రి.)కు - '(1) జీవించు (2) వృద్ధినొందు (3) నడుచుకొను (4) ఉండు (5) పుట్టు (6) ఒప్పు (7) ధన్యుడగు అనేవి అర్థాలు.

సోదరభాషల్లో -

త. మన్ను (మన్ని-) : మ.మన్నుక; తె. మను; పర్జి. మెన్-; గదబ. మన్-; కుయి. మన్బ- అనే క్రియారూపాలు;

త. మణ్ణల్; గో. మత్తోనా; తె. మనికి, మనుకువ అనే నామరూపాలు లభిస్తున్నాయి. (*DED* 3914)

పై పదాల పరిశీలన వల్ల- మూ.ద్రా. '*మన్'- గా ఊహించవచ్చు. దానిపై ఉకారానుబంధం చేరి **ü**మను సిద్ధిస్తుంది.

(*i*) తె.**ü**మను+ఇకి > మనికి. ∴ మనుటచే మనికి. కర్త్రర్థం

(*ii*) తె.**ü**మను+కువ > మనుకువ. ఇందు మనుదురు - మనుకువ. = నివాస స్థానం.అధికరణార్థం.

**4.వినికి :-**

క. **అఱువది నాలుగు విద్యలు**
**నఱువది నాలుగు దినంబు లంతన వారల్**
**నెఱవాదులైన కతమున**
**నెఱినొక్కొకనాఁటి <u>వినికి</u>న్నేర్చిరిలేశా ![70]**

'విన్కి' దీని రూపాంతరం. 'వినుట' అని దీని అర్థం.పై పద్యంలో బలరామకృష్ణులు ఒక్కో విద్య ఒక్కొక్క రోజు వినుటచే నేర్చుకున్నారని - 'వినుట' అనే అర్థంలో ప్రయోగించాడు.

సోదరభాషల్లో -

త. విణా (విణాయ్-) 'అడుగు, పరిశోధించు, చెవియొగ్గు, విను'; మ. వినవుక 'అడుగు'; కొలామి. విన్- 'విను; నాయకి. విన్-; పర్జి.వెన్; కొండ. వెన్-; కుయి. వెన్బ' విను'.

త. విణా 'ప్రశ్న'; తె. వినికి, వినికిడి, వినుకలి, వీను. (*DED* 4472)

పైవాని పరిశీలన వల్ల మూ.ద్రా. * విన్ - ధాత్వనుబంధం 'ఉ' చేరి -'**ü** విను' సిద్ధిస్తుంది.

(*i*) తె.**ü**విను + ఇకి ⇒ వినికి. ∴ వినుటచే - వినికి = వినుట -(భావార్థం)

(*ii*) తె. üవిను + ఇకి +ఇడి ⇒ వినికిడి (తద్ధితం).'వినికి' కి స్వార్థంలో ఇడిప్రత్యయంచేరి - వినికిడి.

కృదంతంపై కృదంతం రాదు. అంతేకాక 'ఇడి' అనే తద్ధిత - ప్రత్యయం కూడా ఉంది. కృదంతంపై తద్ధిత ప్రత్యయం చేరవచ్చు. కాబట్టి ఇది - తద్ధితాంతం.

(*iii*) తె. üవిను+కలి ⇒ వినుకలి / విన్కలి.

(అ) వినుటచే - వినుకలి 'వినుట'. భావార్థం

(ఇ) దీనిచే వినెదరు - వినుకలి 'చెవి. కరణార్థం

(ఉ) దీనిని వినెదరు - వినుకలి ' కీర్తి. కర్మార్థం.

(*iv*) üవిను+ఉ > వీను ఆద్యక్షరదీర్ఘం.

**5.10.** **- ఇదమ్ :-** భాగవతంలోని- **ఇదమ్** ప్రత్యయాంతాలు -

**(1).ఒప్పిదము (2) పన్నిదము**

**1.ఒప్పిదము**

వ. . . **అగ్గలంబు లగు సిగ్గులకు <u>నొప్పిదంబు</u>లగు తమ కనుఱెప్పల-**
**కడ్డంబు సేయుచు . . . .**[71]

దీనికి-(వి)(1) అందం (2) విధం (3) ఉత్సవం (4) అలంకారం (విశ.) (1) యోగ్యం, తగినది (2) ఒప్పునది. అనేవి అర్థాలు.పై వచనలలో 'తగినవి' అనే అర్థంలో ప్రయుక్తం.

'ఒప్పు' అనే శబ్దం ఉంది. ఇది -క్రియగా, నామవాచకంగా కూడ ఉంది. క్రియగా -(1) అ.క్రి.గా, (2) అ.క్రి. మరియు స.క్రి.గా వాచకంగా - (1) విశేష్యంగా (2) విశేషణంగా కూడ తెలుగులో ఒప్పుతుంది.

అ.క్రి.గా దీని అర్థాలు (1) తగు (2) ప్రకాశించు (3) ప్రశస్తమగు ; అ.క్రి., స.క్రి.గా -'అంగీకరించు' ;

వి.గా -(1)చక్కదనము, (2) విధము, రీతి (3) 'ఒప్పు' అనెడి గుణం (వ్యతిరేకం-తప్పు) (4) సుందరవస్తువు (5) అంగీకారం; విశ.గా - (1) విశ్వాసపాత్రం (2) సమతలం (3) యుక్తం.

సోదరభాషల్లో -

క. ఒప్పు; తు. ఒప్పియుని; కోత.ఒప్-; తొద, ఉప్; త. ఒప్పు; మ. ఒప్పిక్క అనే క్రియారూపాలు సోదర భాషల్లో ఉన్నాయి. (*TVB* – 210)

మూ.ద్రా. *ఒ-పైన 'ప' అనుబంధం చేరి 'ఉ' ధాత్వనుబంధం వలన తె. üఒప్పు నిష్పన్నమౌతుంది.

తె. üఒప్పు + ఇదము > ఒప్పిదము. ఒప్పునది - ఒప్పిదము. ( భావార్థం)

జ. ఒప్పందము, ఒప్పని తనము, ఒప్పనివాడు, ఒప్పమి, ఒప్పము, ఒప్పారు, ఒప్పించు, ఒప్పిదము, ఒప్పుకొను, ఒప్పుకోలు, ఒప్పుమిగులు, ఒప్పుమిగులు, ఒప్పులకుప్ప, ఒప్పులాఁడి.

**2.పన్నిదము :-**

'పందెము' దీని రూపాంతరం.

సీ. . . . . **ఏగురార్గుర చల్డు లెలమిఁ<u>బన్నిదమా</u>డి**
**కూర్కొని కూర్కొని కుడుచు నొక్కడు** [72]

మ. **అనిలో నన్ను నెదిర్చి బాహుబల శౌర్య స్ఫూర్తిఁబోరాడఁజా**
**లిన వీరుండొకఁడైనఁ బందెమునకున్ లేఁడయ్యె, .. .** [73]

దీనికి -(1)పణం () పట్టుదల అనే అర్థాలున్నాయి.

'**ü**పన్ను' కు అ.క్రి.గా - (1) సిద్ధపడు (2) తలపడు (3) ఉద్యమించు (4) అతిశయించు (5) వ్యాపించు; స.క్రి.గా (1) (వ్యూహమును) ఏర్పఱచు, సిద్ధపఱుచు (2) చేయు (3) నిర్మింపజేయు (4) పుట్టించు (5) కల్పించు (6) రచించు, నిర్మించు, చిత్రించు అని అర్థాలు.

సోదరభాషల్లో -

క. పణ్ణు 'సిద్ధపడు, సిద్ధపర్చు, ఏర్పఱుచు'; తు. పణిపుణి 'ఒక రూపునకు దెచ్చు'; త. పణ్ణు 'చేయు, పూర్తి చేయు; మ. పణ్ణుక;

మూ.ద్రా. *పణ్ - (*TVB* – 794) *పణ్ > ధాత్వనుబంధం 'ఉ' చేరి, సమీకరణం వలనల తె. 'పన్ను' నిష్పన్నమౌతుంది.

(*i*) తె.**ü**పన్ను + ఇదము ⇒ పన్నిదము

(*ii*) తె.**ü**పన్ను + అకము ⇒ పన్నకము

(*iii*) తె.**ü**పన్ను+ఆగము ⇒ పన్నాగము

(*iv*) తె.**ü**పన్ను + ఇక > పన్నిక

(*v*) తె.**ü**పన్ను + గడ > పన్నుగడ

(*vi*) తె.**ü**పన్ + ఇ > పని

ఒకే ధాతువు '**ü**పన్ను' పై ఇన్ని కృదంతాలు పుట్టడం ఈ ధాతువు - ప్రత్యేకత. వాటిలో ఐదు తెలుగులోకి ధాతువు పూర్తిగా పరిణమించిన తర్వాత చేరిన 'కృత్' లు. కాగ ఒకటి-మూల ధాతువు (తెలుగులోకి) పరిణామ దశలో ఏర్పడింది.

వీటిలో - 'పని'కి త.పడి; మ.పణి; కొడగు. పణి; కొండ. పణి అనే సరూపలు;'పన్నకము', 'పన్నిక' లకు - త. పణిక్కఌ్, పణిక్కమ్, పణిక్కు; మ. పణ్ణిక్క; క.పణ్ణిక, పణ్ణిగె -

అనే సరూపాలు ;'పన్నుగడ, పన్నాగము' లకు - క. పణ/గె; పన్నంగ; త.పణ్ణాగు; అనే సరూపాలు లభ్యమౌతున్నాయి. (*DED* – 3209)

అన్ని భాషలలోని '*పణ్' ధాతుజన్యరూపాలు, 'చర్య' అనే అర్థపరిణామాలుగా భావించవచ్చు.

(1) దీనికై పన్నుదురు (తలపడుదురు) పన్నిదము. ( సంప్రదానార్థము)

(2) పన్నబడుబునది - పన్నకము, పన్నిక, పన్నాగము, పన్నుగడ, పని -దానిని పన్నెదరు.(కర్మార్థం)

**5.11. -ఇమి :-** భాగవతంలోని-**ఇమి** ప్రత్యయాంతాలు -

(1) కూరిమి (2) తాలిమి (3) బలిమి (4) ముదిమి

**1.కూరిమి :-**

సీ. . . . . . . .

**నాథ ! నీ వరిగిన నా ప్రాణమున్నది**

**కూర్మియే యిది? యని కుందె నొకతె . . . .** [74]

క. **వినుముత్కృష్టుండగు ద**

**క్షునికిఁ దనూభవలలోనఁ గూరిమి సుతవై**

**నను నా సంబంధంబున**

**జనకునిచేఁ బూజ వడయఁ జాలవు తరుణీ!** [75]

ప్రేమ, స్నేహం, వాత్సల్యం, వలపు - అని అర్థాలు.'కూరుచు' ధాతుజన్యం -కూరిమి. üకూరుచు అనేది üకూడు యొక్క ప్రేరణార్థక రూపం.

తె. üకూరుచు (స.క్రి.) కు - (1) చేర్చు, కలుపు (2) కూడబెట్టు (3) పొందించు (4) రచించు కల్పించు - అని (అ.క్రి.) గా - (-) ఇష్టుడగు అని అర్థాలు.

సోదరభాషల్లో -

త. కూర్ 'గాఢంగా కోరు'; మ. కూఱుక 'ప్రేమించు'; క.కూర్ 'తలచు'; అను క్రియారూపాలు.

మ. కూఱ్, కూఱు 'ప్రేమ, కూఱ్టాన్ 'మిత్రుడు, ప్రేమికుడు, రక్షకుడు';క. కూర్పు, కూర్మె 'ప్రేమ'; తె. కూర్మి, కూరిమి అనే నామరూపాలు లభిస్తున్నాయి. $(DED-1577)$ పై వాటి పరిశీలన వల్ల మూ.ద్రా. * కూర్-/ కూఱ్ - అనే రూపం ఊహించవచ్చు.

తెలుగులో ధాత్వనుబంధం 'చు' చేరి తె. üకూరుచు నిష్పన్నమౌతుంది. తె. üకూరుచు పై 'మి' ప్రత్యయం చేరగా, ధాత్వనుబంధం లోపించి - 'కూర్మి' రూపం, సమస్వరతచే 'కూరిమి' రూపం నిష్పన్నమౌతాయి.

*కూర్+మి > కూర్మి. స్వరభక్తిచే కూరిమి.కూర్చునది - కలుపునది - కూరిమి. కర్త్రర్థకం.

**2.తాలిమి :-**

క. **మునుకొని లజ్జావనత వ**

**దనయై ప్రాణేశు కొంగు దాలిమి దూలం**

**బెనఁగొనియె వారకామిని**

**యనువున వినిషిద్ధ కర్మమం దభిముఖియై.**[76]

తే. **వెంద్రుకలు వీడఁబై చీర వ్రేలియాడ**

**తాల్మి కీలూడ రోషాగ్ని దర్పమాడ** [77]

'తాలిమి / తాల్మి' (1)' క్షమ / ఓర్పు (2) ధైర్యం / మనస్థైర్యం అనే అర్థాలు ,

తె. üతాలుచు (స.క్రి.) కు -(1) ధరించు (2) గ్రహించు (3) పొందు (4) వహించు (5) అవలంబించు అనే

అర్థాలున్నాయి.

సోదరభాషల్లో రూపాలు -

త.తాలు 'వహించు, సహించు, కష్టపడు, సమర్థమగు'; కోత. తల్ - 'ఆగు, వేచిచూచు'; క.తాల్, తాలు 'పట్టుకొను, తీసికొను, పొందు, గ్రహించు, స్వీకరించు, కలిగియుండు'; తు.తాలుని;

నామరూపాలు-తాళెమె, తాళుమె, తాళ్మె; తు.తాళ్మె .(*DED* – 2605)

పైవాటి పరిశీలన వల్ల మూ.ద్రా రూపం - '*తాళ్'- గా ఊహించవచ్చు. *తాళ్ - > తె. üతాలుచు ;

(*i*) తె. üతాలుచు + ఇమి > తాలిమి (ధాత్వనుబంధ 'చు' లోపం).తాల్చుటకు 'ధరించుటకు, వహించుటకు, అవలంబించుటకు' వలసినది అగుటచే తాలిమి. దీనిచే తాల్చెదరు - తాలిమి కరణార్థం.

(*ii*) తె. üతాలుచు+పు > తాలుపు ( 'చు' లోపం).తాల్చుటచే - అతడు - తాలుపు. కర్త్రర్థం.'తాల్చెడువాడు' అని అర్థం.

జ. తాలిమి, తాలిమికత్తె, తాలిమికాఁడు, తాలుపరి, తాలుపు, తాలిమిడు.

**3.బలిమి/బల్మి :-**

ఆ. **కర్ణ సింధురాజ కౌరవేంద్రాదుల**
**తలల పాగలెల్లఁ దడవి తెచ్చి**
**† ᐃ =°, ð ᑅ <u>బలిమి</u> నిచ్చితి ! విరటుని**
**పుత్రియడుగ బొమ్మ పొత్తి కలకు** [78]

మ. . . . . . . **దుష్కాలంబు నందేరమిం**
**చితి <u>బల్మిన్</u> వెలయాలి కైవడిని దుశ్శీల క్రియాలోలతన్.** [79]

'బల్మి/బలిమి' కి (1) బలం, సత్తువ (2) శౌర్యం, పరాక్రమం (3) బలాత్కారం (4) అతిశయం, పెంపు (5) ఔదార్యం అనేవి అర్థాలు.

పోతన బల్మి. బలిమి అనే రెండు రూపాలూ ప్రయోగించాడు. పై మొదటి పద్యంలో 'బలిమి' పదం 'బలం/ సత్తువ' అనే అర్థంలో ప్రయోగించాడు. తర్వాతి పద్యమందలి 'బల్మి' - 'బలాత్కారం' అనే అర్థంలోప్రయుక్తం.

తె. üబలియు కు (అ.క్రి) (1) వర్థిల్లు, పెరుగు, లావెక్కు, (2) అతిశయించు, అధికమగు (3) దట్టమగు, నిబిడమగు అనేవి అర్థాలు.

సోదరభాషల్లో రూపాలు -క. బల్, బలి 'లావెక్కు, పెరుగు, వర్థిల్లు'; తు.బలాపిని 'శక్తినొందు, కోలుకొను'; కోత. వల్చ్ -; త. వలి; మ.వల్లుక; గోం. వల్లే; మాల్తో. బల్చ్నే ; బ్రాహూయీ. బలున్ అనే క్రియా రూపాలు,

క. బల్మె (బలుమె), బలుహు, బలుపు; తు. బలిమే, బలుమే, బల్మే, త. వల్లం, వల్లమై, వల్లె 'శక్తి; వలిమ గొప్పదనం; అనే నామరూపాలు లభ్యమౌతున్నాయి. (*DED* – 4317)

పై వాటి పరిశీలన వల్ల మూ.ద్రా. రూపం * üవల్- గా భావించవచ్చు. *వల్- పూ 'ఇ' అనుబంధంగా చేరి (తెలుగులోనే కాక ఇతర భాషల్లో కూడ గమనించవచ్చు) ధాత్వనుబంధం 'యు' చేరగా తె. 'బలియు' రూపం నిష్పన్నం.

తె. üబలియు+ఇమి > (ధాత్వనుబంధంలోపించి) బలుపు ' పుష్టి, బలం. ∴ బలియుటచే బలిమి/బలుపు. బావార్థం.

'బలిమి' వైకృతచంద్రిక లో (తద్ధిత-31) బల అనే సంస్కృత శబ్దంపై స్వార్థంలో వచ్చే 'ఇమి' అనే తద్ధిత ప్రత్యయం చేరిన తద్ధితాంతమని పేర్కొనబడింది. కాగా 'బలియు' ధాతువు, తజ్జన్య 'బల్మి, బలిమే, వలిమ' వంటి సరూప కృదంతరూపాలూ ద్రావిడ భాషలందుండడం వల్ల ఇది తె.üబలియు జన్యమైన కృదంతమనుడమే సమంజసం.

**4.ముదిమి :-**

తె. **బడుగు ముసలెద్దు రోసిన పగిదినంత**
**నతఁడు నేవెంటలను సుఖంబందలేక**
**తాను పోషించుజనులు దన్ దనరఁబోవ**
**బ్రతుకు ముదిమియు మిక్కిలి బాధ పఱుప.** [80]

'ముదిమి' కి ముసలితనం అని అర్థము తె.üముదియు అ.క్రి.కు (1) వార్ధకం నొందు (2) శిధిలమగు, జీర్ణమగు అని అర్థాలు.

సోదరభాషల్లో రూపాలు -

త.ముతిర్ (-ప్-, -న్త్-) 'వార్ధకము నొందు, వయసుపైబడు, వికసించు'; మ. మూక్క; క.మూదు (ముత్త్); తు. ముదియుని; తోద. మూఫ్; అనే క్రియా రూపాలు ,

త. ముతుమై; కో.ముతి; క.ముది; మొ.నామరూపాలు లభిస్తున్నాయి. (*DED*4057) (*TVB*–1000)

మూ.ద్రా. * మచ్-/ *ముత్-, *మూ-.'*ముత్-' పై 'ఇ' అనుబంధం చేరి, ధాత్వనుబంధం 'యు' చేరగా - తె.üముదియు సిద్ధిస్తుంది.

(*i*) తె.üముదియు+మి > ముదిమి (ధాత్వనుబంధ 'యు' లోపం).

(*ii*) తె.üముదియు + ఇ > ముది. ముదియుటచే - ముదిమి, ముది. భావార్థం

(*iii*) తె.üముదియు + ఉక > ముదుక.ముదియుటచే - ముదుక.( కర్త్రర్థం)ఇతడు-ముదియును.

(*iv*) తె.üముదియు+సలి > ముదుసలి / ముసలి ('ద' కూడా లోపించింది).

జ. ముది, ముదిమి, ముదివాడు, ముదుక, ముదుసలి, ముద్ధి. (మతుబర్థంలో 'ముది' కి ఉపథాద్విత్వము - తద్ధితము. 'ముసలామె' అని అర్థము.)

**5.12. - ఉ:-** భాగవతంలోని -ఉ ప్రత్యయాంత కృదంతాలు -

| | | | |
|---|---|---|---|
| 1. అన్ను | 9. కూడు | 17.నుడుగు/నుడువు/నొడువు | 25. బెదరు |
| 2. అలరు | 10.కూరుకు | 18.పండు | 26. బొంకు |
| 3. ఉఱుము | 11.చదువు | 19.పట్టు | 27. బ్రతుకు |
| 9.4. ఉలుకు | 12.చిక్కు | 20.పలుకు | 28. మెచ్చు |
| 5. కట్టు | 13.తప్పు | 21.పొందు | 29. మెఱుము |
| 6. కన్ను | 14.తాఁకు | 22.పొక్కు | 30. మ్రొక్కు |
| 7. కప్పు | 15.దగ్గు | 23.పొత్తు | 31. వీనులు |
| 8. కుదురు | 16.నవ్వు | 24.పోరు | 32. వెల్గు/వెలుగు |

**1.అన్ను :-**

క. **ఓయమ్మ! నీ కుమారుఁడు**
**మాయిండ్లను బాలుపెరుఁగు మననీఁడమ్మా!**
**పోయెద మెక్కడికైనను**
**మాయన్నుల సురభులాన మంజుల వాణీ!** [81]

(ఈ పద్యంలోని 'అన్నుల' తె.వి.వి. భాగవతంలో 'అన్న'ల అని ఉంది. 'మందారమకరందాలు' గ్రంథంలో సి.నారె. అదే పాఠంపై వ్యాఖ్యానించారు. కాని- నాయని కృష్ణకుమారి సంపాదకత్వంలో వెలువడిన 'ఆం.ప్ర. ప్రభుత్వ పాఠ్యపుస్తకం - ఏడవ తరగతి- తెలుగువాచకంలో (1995 ప్ర.ముద్రణ) 'అన్నుల' అని ఉంది. కాగా దానిని ముద్రారాక్షసంగా భావించరాదు. పాఠ్యాంతంలోని అర్థాల్లో 'అన్నుల=అందమైన' అని ప్రత్యేకంగా ఎర్కొనబడింది. కాబట్టి - సంస్కరించబడిన ఆధునిక పాఠం - 'అన్నుల' స్వీకరించబడింది.

'అన్ను' కు (1) పారవశ్యం, (2) ఒప్పు (3) మదవతి, స్త్రీ (4) కన్య - అనేవి అర్థాలు.

` ³üఅన్ను (అ.క్రి) కు 'మత్తిల్లు', పరవశమగు' లనేవి అర్థాలు.

సోదరభాషల్లో రూపాలు -

త. అణ (-వ్-, -న్త్-) 'శోభిల్లు', 'భూషణమగు; అలంకరించు; మ. అణియుక' అలంకరించుకొను, 'అలంకరించు; కొడగు. అణి (అణివ్-, అణిజ్జ్ - ) 'ధరించు', (ఆభరణలు, పాట మొ॥) 'ఆనందించు; అనే క్రియారూపాలు,

త. అణి 'అలంకరణ', 'భూషణం, 'అందం', మ.అణి. 'అలంకరణ'; క. అణి. 'అందం', శోభ ,తు. అణి. qKÇä¼#ß<≥°e „ €KQH J} °â¢ ê(*DED* – 113) (*DED* – 98) అనే నామరూపాలు లభిస్తున్నాయి.

మూ.ద్రా * అణ్ > తె. ü అన్ను.

తె. üఅన్ను + ఉ > అన్ను. అన్నునట్లు (పరవశించునట్లు) ఉండుటచే అన్ను భావార్థం.

**2.అలరు :-**

క. **ఉల్లసిత కుచభరంబుల**
**నల్లాడెడి నడుముతోడ నలరుల దండల్**
**భిల్లి యొకతె హరికిచ్చెను**
**హల్లోహల కలితయగుచు నంగన కంటే.** [82]

అలరు (వి.) కు (1) పుష్పం (2) సంతోషం (3) ఒప్పు, శోభ అనేవి అర్థాలు.

తె.üఅలరు (అ.క్రి) కు (1) విరియు, విచ్చు (2) పూచు (3) వికాసం నొందు, శోభాయుక్తమగు (4) సంతోషించు (5) ఒప్పు (6) కలుగు, ఉదయించు, అనేవి అర్థాలు.

సోదరభాషల్లో రూపాలు -

క. అలర్, అరల్; త. అలర్; మ. అలరుక; మాల్తో. అల్ద్రే; అనే ధాతురూపాలు,

క. అలర్, అరల్; తు. అలరు; త. అలర్; మ.అలర్ అనేవి నామరూపాలు (*TVB* – 47)

పై పరిశీలన వల్ల మూ.ద్రా రూపం * అలర్ - గా ఊహించవచ్చు. * అలర్ > తె. üఅలరు.

తె. üఅలరు+ఉ > అలరు. ∴ అలరునది - అలరు - కర్త్రర్థం, (విరియునది / పూచునది = పువ్వు)

జ. అలరారు, అలరించు, అలరుఁబోడి, అలరుబంతి,అలరువిలుకాడు, అలరువిల్తుడు, అలరు విల్దాల్పు, అలరొందు.

**3.ఉఱుము:-**

క. **ఈ యుఱుములు నీ మెఱుములు**
**నీ యశని విశేషణములు నీ జలధారల్**
**నీ యాన తొల్లి యెఱుఁగము**
**కూ యాలింపం గదయ్య! గుణరత్న నిధీ!** [83]

'ఉఱుము' (వి) కు (1) మేఘధ్వని, గర్జనం (2) వీరహుంకారం అనేవి అర్థాలు. పై పద్యంలో 'మేఘ ధ్వని' అనే అర్థంలో ప్రయోగించబడింది. üఉఱుము (అ.క్రి.) కు 'గర్జించు' అని అర్థం.

సోదరభాషల్లో -

త. ఉఱుము; మ. ఉఱుంపుక; కుయి. రూంబ, రూమ, రుంజ; అనే క్రియారూపాలు. మ. ఉఱుంపల్; మొ. నామరూపాలు లభిస్తున్నాయి. ($TVB-123$)

తె. üఉఱుము + ఉ > ఉఱుము. ∴ ఉఱుమునది - ఉఱుము. కర్త్రర్థం.

**4.ఉలుకు :-**

వ. **అని యవ్విధంబున వెఱపు మఱపు నెఱుంగక, యులుకు చెడి**
**పలికెడు కొడుకు నుడువులు సెవులకు ములుకుల క్రియ నొదవిన . . . . . .** [84]

'ఉలుకు' (వి) కు (1) భయం (2) సంతాపం అనేవి అర్థాలు. పై వచన భాగంలో 'భయం' అనే అర్థంలో ప్రయోగించబడింది.

'ఉలుకు / ఉల్కు' (అ.క్రి) కు (1) భయపడు, బెదరు (2) ఉడుకు, అసూయపడు అనేవి అర్థాలు.

సోదరభాషల్లో రూపాలు -

త. ఉట్కు (ఉట్కి-); క. ఉలకు; అనే క్రియారూపాలు, త. ఉళుప్పు; అనే నామరూపం సోదరభాషల్లో లభిస్తున్నాయి. ($DED-603$)

తె. üఉలుకు + ఉ > ఉలుకు ∴ దీనిచే ఉలికెదరు - ఉలుకు. కరణార్థకం.

జ. ఉలికిపాటు.

**5.కట్టు :-**

వ. **అంత నందుఁడు వికసిత వదనార విందుండగుచు,**
**బట్టి కట్టు విడిచె.** [85]

'కట్టు'(వి)కు (1) బంధనం (2) బంధన సాధనమగు త్రాడు మొ. (3) మితి (4) ఆకృతివిశేషం, కూర్పు (5) కక్ష్య, గృహాంతర్భాగం (6) ఉడికిన కందిపప్పు మొ॥ వానిరసం.

తె.**ü**కట్టు (స.క్రి.) కు (1) బంధించు (2) ధరించుకొను (3) నిరోధించు (4) ఆరోపించు, మోపు (5) కలుగజేయు (6) కూడబెట్టు (7) కూర్చు (8) నిర్మించు (9) మూయు, కప్పు (10) చెల్లించు (11) విధించు (అ.క్రి.) కు (1) అగు, ఏర్పడు (2) నిబద్ధమగు అనేవి అర్థాలు.

సోదరభాషల్లో రూపాలు -

త. కట్టు 'బంధించు, నిర్మించు, ధరించు, కూడగట్టు, పెళ్ళాడు, మూయు, నిలువచేయు, సమానం చేయు'; కట్టుక, కెట్టిక్క; కోత. కట్ - (కచ్-); తొద. కొట్ -(కొట్స్-); క.కట్టు; కొడగు. కెట్ట్- ; తు. కట్టుని; కొలామి. కట్- (కట్ట్-); గదబ. కట్-; గొం. కట్- : - క్రియారూపాలు,

త. కట్టటమ్, కట్టణమ్ 'కట్టడం'; కట్టళై 'నియమం, నిబంధన'; కట్టై 'ఆనకట్ట'; మ. కెట్టు, కట్టు 'బంధనం', కట్ట; కెట్టకం 'ఇల్లు'; కోత.కట్ 'తాడు, కులపు కట్టు'; తొ. కొట్; క.కట్టు; గట్టు 'ఆనకట్ట'; కొడగు. కెట్టి; కట్టె; నాయకి. కట్ట; నామరూపాలు. $(DED-961)$

పై పరిశీలన వల్ల మూ.ద్రా రూపం * కట్ - గా ఊహించవచ్చు.

*కట్ > తె.**ü**కట్టు.

$(i)$ తె.**ü**కట్టు + ఉ > కట్టు. ∴ దీనిచే కట్టెదరు - కట్టు. కరణార్థం.

$(ii)$ తె.**ü**కట్టు + అ > కట్ట. దీనిని కట్టెదరు - కట్ట. కర్మార్థం. (ఒకటిగా చేర్చికట్టిన సముదాయము. (2) సేతువు)

$(iii)$ తె.**ü**కట్టు + అడ > కట్టడ.ఇది కట్టుటకు దోహదం చేయును. కట్టుటకై - కట్టడం. సంప్రదానార్థం. (ధర్మము, తీరు, స్వభావము)

$(iv)$ తె.**ü**కట్టు + అడ + ము > కట్టడము.దీనిని కట్టెదరు - కట్టడము. కర్మార్థం. (గృహాదికము, కూర్పు)

$(v)$ తె.**ü**కట్టు + అడి > కట్టడి. కట్టుట కొఱకు కట్టడి, కట్టిడి - సంప్రదానార్థం. (=నియతి, ఆజ్ఞ)

$(vi)$ తె.**ü**కట్టు + ఇడి > కట్టిడి.దీనిని కట్టెదరు 'కూడబెట్టుదురు' కట్టుగడ. కర్మార్థము. (కూడబెట్టినది = ధాన్యాదికము)

$(vii)$ తె.**ü** కట్టు + గడ > కట్టుగడ .

(అ) దీని యందు కట్టుబడుదురు. కట్టుబడి - అధికరణార్థం. = సేవచేయుటకై భృత్యులుమున్నగు వారికి శాశ్వతముగా ఇచ్చేమాన్యము.

(ఆ) దీనిని కట్టెదరు 'చెల్లిందరు' - కట్టుబడి - ఒక విధమైన పన్ను

$(viii)$ తె.**ü**కట్టు + బడి > కట్టుబడి.

$(ix)$ తె.**ü**కట్టు + ఉవ > కట్టువ.దీనిచే కట్టెదరు 'నిరోధించెదరు' - కట్టువ - (కరణార్థం )'కంచె.

$(x)$ తె.**ü**కట్టు + అన(ము) > కట్టనము / కట్నము.దీనిని కట్టుటకై (ధరించుటకై) ఇచ్చెదరు.(కర్మార్థం) కట్నము 'కానుకగా ఇచ్చెడి వస్త్రం' .

జ. కట్ట, కట్టడ, కట్టడచేయు, కట్టడము, కట్టడి, కట్టనము, కట్టించు, కట్టడి, కట్టిపెట్టు, కట్టుగొంబము, కట్టుగొంగు; కట్టుగొమ్మ, కట్టుగొయ్య, కట్టుగొఱ్ఱు, కట్టుగోక, కట్టుబోతు, కట్టుకథ, కట్టుకొను, కట్టుగడ, కట్టుగుండు, కట్టుగొఱ్ఱె, కట్టుదొన, కటుపడు, కట్టుపఱచు, కట్టుపాటు, కట్టుబండి, కట్టుబడి, కట్టుమట్టు, కట్టుమామిడి, కట్టుద్రాను, కట్టువ, కట్టువర్గము, కట్టెడ, కట్నము, కల్లుగుదియ, కట్లజెట్టి, కట్లదండ, కట్లపాము, కట్లపురుగు, కట్లబల్ల, కట్లమారి, కట్లసంచి, కట్లసరి.

**6.కన్ను:-**

సీ. **కమలేశుఁజూడని కన్నులు కన్నులే?**
**తను కుడ్య జాల రంధ్రములు గాక . . . .** [86]

'కన్ను' కు (1) నేత్రం, చూపు, దృష్టి (2) ఇంగితం, అభిప్రాయం (3) చెఱకు మొదలైనవాని కనుపు (4) వల మొ॥వాని రంధ్రాలు (5) (బండి) చక్రం (6) వంతెన ద్వారం (7) నెమిలి పురికన్ను

ఇది 'కను' ధాతుభవం. తె. üకను కు (స.క్రి) (1) చూచు (2) ప్రసవించు, బిడ్డనుకాంచు (3) తెలియు (4) పొందు (5) ఆశ్రయించు అనేవి అర్థాలు. తె. üకను ప్రేరణ రూపం / üకానుచు / కాంచు.

సోదరభాషల్లో రూపాలు -

ధాతు రూపాలు :-క.కణ్. కాణు (కణ్డ్). 'చూచు', కనిపించు'; తు. కాణు. 'చూపించు'; కో.కణ్ - / కాణ్ - (కడ్-) 'చూచు'; తొద. కోణ్ - (కోడ్-) త. కాణ్ -(కాణ్ట్-) 'చూచు', 'కనుగొను', (*TVB* – 247)

నామరూపాలు :-క.కణ్; తు. కణ్ణు. 'కన్ను' 'చనుమొన', 'నెమిలిపురికన్ను'; కోత.కణ్; తొద. కొణ్; త. కణ్; మ. కణ్, కణ్ణు (తుళు-అర్థాలు); (*DED* – 973)

పై పదాల పరిశీలన వల్ల అన్ని ద్రవిడ భాషల్లో రెండు విధాలైన ధాతురూపాలు * కణ్-/ * కాణ్ అనేవి ఉన్నట్లు తెలుస్తుంది.

* కణ్ - > తె. üకను; * కాణ్ - > కాను అని భావించవచ్చు.

తె. üకను ధాత్వర్థాలను రెండు విధాలుగా విభజించవచ్చు . ప్రథ వర్గం -(1) చూచు (2) తెలియు (3) ఆశ్రయించు ద్వితీయ వర్గం -(1) ప్రసవించు (2) పొందు.

'చూచు' బహిర్దృష్టి; కాగ; 'తెలియుట' అంతర్దృ ష్టి; 'ఆశ్రయించుట' కృపాదృష్టికై వెంపర్లాడుట. ఈ విధంగా ప్రథమ వర్గం అర్థాలు 'దృష్టికి' సంబంధించినవి.

చారిత్రికంగా :- కనులతో చూడబడువాడు / నయనా - నందకరుడు - బిడ్డ. ఈ విధంగా ü కను üకాను కు 'ప్రసవించు' అనే అర్థం కలిగింది. దీని అర్థవిస్తృతి - 'పొందు'. 'బిడ్డను పొందు' అనే విశేష అర్థం సాధారణీకరణం చెంది 'పొందు' అనే అర్థాన్ని పొందింది.

పై వాని ప్రథమవర్గం *TVB* – 247 వద్ద, *DED* – 973వద్ద పేర్కొనబడింది. ద్వితీయ వర్గార్థంతో విడిగా అవే పదాలు *TVB* – 248 వద్ద, *DED* – 974 వద్ద పేర్కొనబడ్డాయి. కాని, పై విశ్లేషణ ప్రకారంగా రెండు వర్గాల అర్థాలు ఒకే ధాతుజన్యాలని భావించవచ్చు.

(*i*) తె. üకను + ఉ > న ద్విత్వం - కన్ను .కనునది (చూచునది) - కన్ను 'నేత్రం'. కర్త్రర్థం

(*ii*) తె. üకను + ట > కంట చూచుట.కను. . . ట - = చూచుట - భావార్థం.

(*iii*) తె. üకానుచు + ఇక / ఉక > కానిక / కానుక.దానిని పొందెడువాడు దయతో కనుటకై (కృపాదృష్టి కొరకు) ఇవ్వబడే ద్రవ్యం. 'కానుక / కానికి'. దీనితో (కానుక/కానికతో) పొందేవాడు, ఇచ్చే వాడిని చల్లని చూపుతో చూచును/ కాంచును. కరణార్థం.

(*iv*) తె. üకానుచు + ఇకి > కాన్కి / కానికి.కనుటచే / కాంచుటచే - కాన్కి / కానికి. కరణార్థం 'చూపు'.

(*v*) తె. üకానుచు + పు > కానుపు / కాన్పు 'చూపు'.కనుటచే / కాంచుటచే - కానుపు.

(*A*) దీనిని కాంచుదురు/కనెదరు. కర్మార్థం. (1) ప్రసూతి (2) సంతానం (3) జ్ఞానం (4) అభిప్రాయం.

(*B*) దీనిచే కనెదరు / కాంచెదరు - కానుపు - 'దృష్టి' కరణార్థం.

**7.కప్పు :-**

వ. . . . . **ఱెప్పల <u>కప్పు</u> తప్పంద్రోచికొని, కనుఁగవకొలంకుల నలుఁగులు వెడలినచందంబున సంతసంబునం న్నీరు మున్నీరై పఱవ . . . . .** [87]

'కప్పు' (వి) కు - (1) ఆచ్ఛాదనం (2) ఇంటిపైకప్పు (3) మఱుఁగు, అడ్డపాటు అనేవి అర్థాలు.

తె. **ü**కప్పు (స.క్రి.)కు- (1) ఆచ్ఛాదించు, మఱుగుపఱుచు, గోపనం చేయు (2) చుట్టుకొను, పరివేష్టించు (3) బంధించు, మూయు (అ.క్రి.) వ్యాపించు, క్రమ్ము - అని అర్థాలు.

సోదర ద్రావిడ భాషల్లో -

ధాతురూపాలు -త. కప్పు (కప్పి-) (మేఘాల్లా) కమ్ముకొను; కవి (-వ్-, -న్త్-); మ. కప్పుక, కమ్ముక, కవియుక, కమియుక; కోత. కవ్చ్-; కోఫ్స్; క. కప్పు, కవి; తు. కబియుని; పర్జి, కప్స్-; కువి. కప్సి;

నామరూపాలు -

త. కవికై 'వంపు', 'గొడుగు'; కపిప్పు; కమ్మల్ 'మసక'; మ. కవియన్ 'దిండుకుతొడిగే తొడుగు', 'ఆచ్ఛాదనం'; క.కవి, కప్పు; (*DED*$-$1024).

పై పదాలు పరిశీలన వల్ల మూ.ద్రా రూపం ∗ కప్స్ - గా భావించవచ్చు.

∗ కప్స్ > తె. **ü** కప్పు.కప్పు + ఉ > కప్పు. కప్పునది - కప్పు ఇది వస్తువులను కప్పును. ( కర్త్రర్థం)

వేఱొక పదంగా 'కప్పు' ను సూచిస్తూ శ్రీ సూ.నిలో సజాతీయాలుగా - క. కప్పు; త. కఱుప్పు లను సూచించారు. కాని *DED* లో 1175 వద్ద ఇవి చూపబడ్డాయి. కాగ - దీనికి సూరాని సూచించిన అర్థాలు (1) నలుపు (2) చీకటి (3) దంతక్షయం (4) నీలం, నల్లనిది - అనేవి

∗ ఆ. **హరుఁడు గళమునందు హాలాహలము వెట్టఁ**
**<u>గప్పు</u> గలిగి తొడవు కరణి నొప్పి;**
**సాధురక్షణంబు సజ్జనునకు నెన్న**
**భూషణంబు గాదె? భూవరేంద్ర!**

- అన్న చోట 'కప్పు' - 'నల్లందనం ' అనే అర్థంలోనే ప్రయోగించబడినది.

∗ ఈ 'కప్పు'కు సోదర భాషల్లో -

త. కఱు (-ప్ప్ -, -త్త్-) 'నల్లనగు, కలుషితమగు'; అనే ధాతువు నుండి పుట్టిన -త. కఱుప్పు 'నల్లందనం; మ. కఱుప్పు; కొ. కర్ప్; తొ. కప్; క. కర్పు, కప్పు; తు. కప్పు; తె. కఱ, కఱి, కఱ్ఱి, కఱియ - అనేవి *DED*$-$1175 వద్ద లభించినవి.

పై అన్ని భాషల్లో ఉన్న వాని సామ్యంతో తెలుగులో కూడ అదే అర్థంలో 'కప్పు' చేరినది.

**8.కుదురు :-**

వ. **ఇట్లు కరిమకరంబులు రెండును నొండొండ సముద్దండ దండంబులై తలపడి, . . . . . ఇతరేతర సమాకర్షణంబులం గదలక, పదంబులు మొదలిపట్టు వదలక <u>కుదురై</u> యుండుచు,. . . .** [89]

'కుదురు' కు - (విణ)గా 'స్థిరం /కదలనిది' అని, (వి.) (1) పాదు, ఆలవాలము (2) మొదలు, మూలం (3) వంశం (4) ఆస్పదం స్థానం, ఆశ్రమం, ఆధారం (5) నెలవు, ఉనికి పట్టు (6) అగసాలెవాని కుంపటి (7) చుట్ట కుదురు (8) నిలుకడ, స్థైర్యం అని అర్థాలు.పై వచనంలో 'నిలుకడ' అనే అర్థంలో ప్రయోగించబడింది.

'üకుదురు' (అ.క్రి) కు (1) కుదురుపడు నెలకొను (2) సరిపడు, పొసగు (3) స్థిరపడు (4) లభ్యమగు, దొరకు (5) చక్కబడు, బాగుపడు (6) ఉపశమిల్లు, మాను - అని అర్థాలు.

సోదరభాషల్లో -

ధాతురూపాలు -త. కుతిర్ (-వ్-, -న్త్-) 'స్థిరపడు', 'నిర్ణారణ చేయు', కోత. కుదిద్ - (ఇత్-) 'భూమియందు స్థిరంగా పాతు'; క. కుదురు. 'చక్కబడు', 'రోగంనుండి తేరుకొను', (తెలుగు అర్థాలన్ని); తు. కుదురిని 'రోగం నుండి విముక్తుడగు';

నామ రూపాలు -

మ.కుతిర్; క.కుదురు, కుద్రి; తు. కుది; (*DED* – 1421)

పై పదాల పరిశీలన వల్ల- అన్ని భాషల్లో 'కుదిర్ / కుతిర్' అనే క్రియా రూపాలుండటం - మూ.ద్రా రూపం- *కుతిర్ గా భావించవచ్చు.

* కుతిర్ → 'తె. కుదిర్' - పై ధాత్వనుబంధం 'ఉ' చేరి, 'స్వరాకర్షణ' వల్ల- ఉపధా 'ఇ' 'ఉ' గా మారి, తె.üకుదురు రూపం నిష్పన్నమౌతుంది.

(*i*) తె.üకుదురు + ఉ కుదురు. ∴ కుదురుగా ఉండుటచే - కుదురు( కర్త్రర్థం, కరణార్థం)

(*ii*) తె.üకుదురు + ఇక కుదిరిక (స్వరాకర్షణ)కుదురునది కుదిరిక .( భావార్థం)

(*iii*) తె.üకుదురు + ఉవ కుదువ (అంత్యాక్షర లోపం ).దీనిచే అప్పువ్యవహారము కుదురును - కుదువ 'తాకట్టు' (కరణార్థం)

**9.కూడు :-**

క. **బిడ్డలకు బుద్ధి సెప్పని**
**గ్రుడ్డికిఁ బిండంబు వండుకొని పొండిదె పైఁ**
**బడ్డాఁడని భీముండొఱ**
**గొడ్డెము లాడంగఁ <u>గూడు</u> గుడిచెద వధిపా.** [90]

గాంధారీ ధృతరాష్ట్రుల దేహావసాన సమయంలో విదురుడు వారితో పలికిన పలుకులివి.

'కూడ' (వి) కు - (1) అన్నం (2) తిండి అని అర్థాలు. తె.üకుడుచు (కుడ్చు) (స.క్రి.) కు- (1) 'తిను', (2) 'త్రాగు' (3) (సుఖదుఃఖాదులు) అనుభవించు, పొందు, చెందు' - అనేవి అర్థాలు.

సోదర భాషల్లో -

ధాతురూపాలు -క. కుడి 'త్రాగు'; తు.కుడుచుని; కొడగు. కుడి; కో. కుడ్య్ - (కుడ్చ్-); త. కుటి ' త్రాగు', ఉచ్ఛ్వసించు, 'పీల్చుకొను'; మ.కుటిక్క 'త్రాగు' -; *TVB* – 286)

నామరూపాలు :-

క. కుడి, 'పానము'; కూళ్ 'అన్నము', 'తిండి'; తు. కూరు, కూలు, కూళు, 'అన్నం'; కోత. కు- 'అన్నం; త. కుటి 'పానము; కూళ్; తిండి, గంజి, జావ; మ. కూళ్, 'అన్నము'; కూఅమ్, 'ప్రసాదం; (*DED*–1592)

మూ.ద.ద్రా. * కుట్ - అని భద్రిరాజు సూచించారు. బహుశా మూ.ద్రా. *కుళ్, అయి ఉండవచ్చు.

'*కుట్' పై ధాత్వనుబంధం 'చు' చేరి తె. 'üకుడుచు' సిద్ధమౌతుంది.

(*i*) తె. üకుడుచు + ఉ > అంత్య (అనుబంధ లోపం) లోపం, ఆదిస్వర దీర్ఘం (లోపదీర్ఘం - కావచ్చు) > కూడు. కుడుచునది 'తినునది' అగుటచే కూడు. జనులు దీనిని కుడుతురు - కూడు -( కర్మార్థం.)

(*ii*) తె. üకుడుచు + ఇ > కుడి.కుడువబడునది కుడి'ఆహారపదార్థం'. (కర్మార్థం)

కుడిచే చెయ్యి > కుడిచెయ్యి (వృత్తిలో 'చే' లోపం).ఆ 'కుడిచెయ్యి' వైపు - కుడి - 'కుడి భాగం / వామేతరం లక్ష్యార్థ పరిణామం')

(*iii*) üకుడుచు + పు > కుడుపు.కుడువ బడునది - కుడుపు, = తిండి.( కర్మార్థం)

పై మూడు పదాలు భావార్థకాలు కూడ.

కుడుచు జన్యాలు - కుడి, కుడినీరు, కుడిపించు, కుడిముట్టు, కుడియడుగు పరువడి, కుడియోరభృంగి, కుడిపరి, కుడుపు, కూడు, కూడు జన్యాలు - కూటితిప్పలు, కూటినీళ్ళు, కూడు నీరు.

.

**10.కూరుకు :-**

ఆ. **అసురవరులు సురల నదరించి బెదిరించి**
**నాక మేలుచున్న నాఁటనుండి**
**కన్న కడుపు గాన కంటఁ గూరుకు రాదు**
**గడుపుపొక్కు మాన్పి కావవయ్య** [91]

ఇది బలిచక్రవర్తి బలుపు ("బలి జగముల నెల్ల బలియుచునున్నాడు" -భాగ-8-471) ను, అకృత్యాలను అదితి విష్ణుమూర్తికి నివేదించుకుంటుంది. కూరుకు కు 'నిద్ర' అని అర్థం. పై పద్యంలో అదే అర్థంలో ప్రయుక్తం.

తె. üకూరు (అ.క్రి) కుఁ 'నిద్రించు', (2) 'కనులు మూతపడు' (3) కాంతి మంద్యం నొందు' అని అర్థాలు. దీనికే 'కు' అనుబంధంగా చేరి కూరుకు రూపమౌతుంది.

సోదరభాషల్లో -

ధాతురూపాలు -తు. కూరుని, కూలుని; తొద. క్విక్స్-; కుయి. కోర; గొం. కూర్క్-; పర్జి. కూర్క్ 'తలఊపు'; కురుఖ్, కూర్-; మ.కూచుక. (*TVB*^304) మూ.ద్రా. * కూడ. > మూ.మ.ద్రా. * కూర్-క్- అని భద్రిరాజు పేర్కొన్నాడు.

తెలుగులో - మూ.మ.ద్రా. రూపమైన *'కూర్-క్- అందలి 'క్' అనుబంధం చేరిన రూపం, చేరని రూపం రెండూ ఉన్నవి.

తె. üకూరుకు + ఉ > కూరుకు / కూర్కు . ∴ కూరుకుట చే కూరుకు - భావార్థము.

జ. కూరుకుపాటు, కూర్కువాఁడు, కూరుకొను.

**11.చదువు :-**

క. **"చదివించిరి నను గురువులు**
**సదివితి ధర్మార్థముఖర శాస్త్రంబులు నేఁ**
**జదివినవి గలవు పెక్కులు,**
**<u>చదువులలో</u> సారమెల్లఁ జదివితిఁదండ్రీ!"** [92]

తే. **" . . . . చక్రహస్తుని బ్రకటించు <u>చదువు చదువు</u>"**[93] **. . . .**

పై పద్యంలో 'చదువు' అనేది క్రియగా, నామవాచకంగా కూడ ప్రయోగించబడింది. పై పద్యంలో బహువచనంలో, క్రింది పద్యంలో ఏకవచనంలో ప్రయుక్తం.

దీనికి సమానమైన ధాతు రూపాలు ఇతర ద్రావిడ భాషల్లో లభించ లేదుక. చదురు, చెదురు 'నేర్పరితనం' ; తు.చదువు 'నేర్పు' అనే రెండు పదాలు మాత్రం లభిస్తున్నాయి. *DED*(1920) ప్రకారం ఈ శబ్దాలు అన్నీ సంస్కృతంలోని 'చతుర'- శబ్దభవాలు.

తె. **ü**చదువు + ఉ > చదువు.∴ చదు బడునది. దీనిని చదివెదరు. (కర్మార్థము)

జ. చదువరి.

**12.చిక్కు :-**

ఉ. **"చిక్కక యూశుఁడై యెదిరిఁ <u>జిక్కు</u>లఁ బెట్టెడి మాయలానికిన్**
**జిక్కి కృతార్థులై మరుని <u>చిక్కు</u>లఁ జొక్కి లతాంగులుండగా . . ."**[94]

ఈ పద్యంలో 'చిక్కు' అనేది క్రియగా, నామవాచకంగా కూడా ప్రయోగించబడింది. కాగా, క్రియగా 'ఒకే' అర్థంలో, నామవాచకంగా రెండు వేర్వేరు అర్థాల్లో ప్రయోగించబడింది.

తె. **ü**చిక్కు కు అర్థాలు - (1) ఆగిపోవు, (2) 'అట్టెనిలిచియుండు' (3) 'కట్టువడు' (4) 'పట్టువడు', 'దొరకు' (5) 'లొంగు', 'వశమగు' (6) 'తగులుకొను', (7) 'ఇమిడియుండు' - అనేవి.

నామవాచకంగా - (వి) - ।'మెలిక' (2) 'బంధం' (3) 'ముడి' (4) 'పట్టు' (5) 'కష్టం' (6) 'సంశయం అని అర్థాలు.

సరూపాలు - త. చిక్కు; మ చిక్కు; క. సిక్కు, సిర్కు, సిల్కు; కొడగు. చిక్క్ - ; తు. సిక్కుని, అక్కుని; (*DED*.2060) సాహిత్యవంతమైన నాలుగు భాషల్లో క్రియగా, నామవాచకంగా కూడా అవే (ఒకే) రూపాలు. మిగిలిన భాషల్లో 'క్రియ' గా మాత్రం ఉంది. అర్థాలు అన్ని భాషల్లో సమానమే.

పై పరిశీలన ఆధారంగా మూ.ద.ద్రా రూపం '*చిల్-' గా భావించవచ్చు. మూ.మ.ద్రా. రూపం '*చిల్-క్-' అని తెలియవస్తుంది.* చిల్-క్- >తె.**ü**చిక్కు పరముఖ సమీకరణం వలన 'ల్' 'క్' గా మారింది.

తె. **ü**చిక్కు + ఉ > చిక్కు.∴ దీని యందు చిక్కెదరు - చిక్కు అధికరణార్థం.

పై పద్యంలో 'ఎదిరి చిక్కుల బెట్టెడి' అనే చోట 'కష్టం' అనే అర్థంలో 'మరుని చిక్కుల జొక్కి ' అనేచోట 'బంధం ' అనే అర్థంలో ప్రయోగింపబడింది.

జ. చిక్కంటి, చిక్కంటు, చిక్కంటె, చిక్కించు, చిక్కుజీరు, చిక్కుడు, చిక్కుతాళము, చిక్కు త్రిక్కులు, చిక్కుపడు, చిక్కుపురువు, చిక్కులమారి, చిక్కువాపు, చిక్కోల.

**13.తప్పు:-**

తే. **". . . . . తండ్రి కైవడిఁ జేసిన తప్పు ( గాఁచు. . . ."**[95]

తప్పు (అ.క్రి.) కు. 'అపచారం చేయు' (2) 'హానిచేయు' (3) 'తొలుగు' (4) 'పొరపడు' (5) 'దొరకకుండు' (6) 'చెదరు' (7) 'మించిపోవు' (8) 'జాఱు' (13) 'చెడు' (14) 'మరణించు': అని,

(స.క్రి) గా. (1) 'దాఁటు' (2) 'వదలు' (3) 'తొలగించుకొను' (4) 'కోల్పోవు' (5) 'మఱచు' : అని

(వి) నామంగా - 1 'అపరాధం' (2) 'లోపం' (3) బొంకు (4) నిష్ఫలం అనేవి అర్థాలు. ఇక సోదరభాషల్లో -

త.మ.క. తప్పు (క్రియగా, నామంగా కూడ), కోత. తప్-; కొడగు. తప్ప్ - ; తుళు. తప్పావుని అనే క్రియా రూపాలు, తు.తప్పు, కయ. దప; కువి. దబ్బు అనే నామ రూపాలు లభిస్తున్నాయి. (*DED* 2498)

మూ. * తప్- : * తప్-ప్ - >తె.**ü**తప్పు . తె.**ü** తప్పు + ఉ > తప్పు . తప్పుటచే తప్పు . కరణార్థం.

జ. తప్పు; తప్పుజూచు, తప్పుఁదార్చు, తప్పుఁద్రాగు, తప్పుఁదొక్కు, తప్పుద్రోచు, తప్పుఁబలుకు, లప్పక, తప్పుకుండ,తప్పుడుగు, తప్పుదాటు, తప్పనడుచు, తప్పనిదారి, తప్పనాడు, తప్పరించు, తప్పాడు, తప్పించి, తప్పించు, తప్పిదము, తప్పిదారు, తప్పుకొను, తప్పుకోలు, తప్పుచేయు, తప్పుడు, తప్పుడువడు, తప్పుతెరువు, తప్పుదల, తప్పుదారి, తప్పుదెబ్బలు, తప్పునీళ్ళు, తప్పుపని, తప్పువట్టు, తప్పువడు.

**14.తాఁకు:-**

సీ. . . . . **"దనుజాధముఁడు మొన<u>తాఁకు</u> దప్పించెనో?** [96] **. . . ."**

తాఁకు (అ.క్రి) కు - (1) 'కలుగు (2) 'కృశించు' (3) స.క్రి- 'ఒరచుకొను'; ఉభయంగా - (1) 'తగులు' (2) 'కొట్టు' (3) 'తలపడు'; నామంగా - (1) 'తలపటు' (2) 'దెబ్బ' (3) 'గాయము' (4) 'విసుగు' అనేవి అర్థాలు.

సోదరభాషల్లో రూపాలు -

త. తాక్కు; మ. తాక్కుక; క. తాకు, తాగు, తాంగు; తు. తాకుని, తాగుని; కోత తాక్-; కురుఖ్. తక్-; మాల్తో. తక్-; అనే సరూపాలు (*TVB* 554) లభిస్తున్నాయి

* తాయ్ - న్క్ - / క్క్ -. దీనిలోని మధ్యాక్షరాలు లోపించి, తెలుగులో తె.**ü**తాఁకు నిష్పన్నమైంది.

తె.**ü**తాఁకు + ఉ > తాఁకు. తాఁకబడునది - తాఁకు (ఒక్కతాఁకునన్‌తాఁకెను) - 'దెబ్బ'

, జ. తాఁకించు, తాఁకుడు, తాకుడువేకి, తాఁకుదప్పులు, తాఁకుదల, తాఁకుదెంచు, తాఁకులాడు, తాఁకొను, తాఁకోర్చు, తాఁచునామవాచకంగా - 'కాసంచేయు ' అనే అర్థాల్లో మాత్రేమే ఉంది .

క. దగ్గు; కొలామి. దగ్-, దగ్గ్; నాయకి. ఢగ్-; గొండి. ఢగానా - అనే రూపాలు మాత్రమే సోదరభాషల్లో (*DED* – 2399)లభిస్తున్నాయి.

**15.దగ్గు:-**

ఆ. **"వగరు పుట్టె నంతఁ బెగలె దంతంబులు**
**నుక్కిసయును <u>దగ్గుఁ</u> బిక్కటెల్లె . . . . "**[97]

'దగ్గు' క్రియగా, నామవాచకంగా - 'కాసంచేయు ' అనే అర్థాల్లో మాత్రమే ఉంది

క. దగ్గు; కొలామి. దగ్-, దగ్గ్; నాయకి. ఢగ్-; గొండి. ఢగానా - అనే రూపాలు మాత్రమే సోదరభాషల్లో (*DED* – 2399)లభిస్తున్నాయి.

**ü**దగ్గు + ఉ > దగ్గు . ∴ దగ్గబడునది - దగ్గు. దీనిని దగ్గెదరు - (కర్మార్థం)

జ. దగ్గుత్తిక.

**16.నవ్వు:-**

మ. **"నరుమాటల్విని నవ్వుతో నుభయ సేనామధ్యక్షోణిలో [98]. . . ."**

üʻనవ్వు' - (అ.క్రి.)కు (1) హసించు (2) సంతోషించు; అని (స.క్రి) గా- (1) వెక్కిరించు (2) పోలు; అనీ వి.గా - (1) హాసం (2) పరిహాసం (3) వింత అనేవి అర్థాలు.

సోదరభాషల్లో రూపాలు -

త. నకు (నకువ్-, నక్క్), మ.నకెక్క; క.నగు (నక్క్-), నగె; తునకెరుని; ప.నవ్ - అనే క్రియారూపాలు.

త. నక్కల్ 'నవ్వు', 'పరిహాసం', 'కాంతి'; నకల్ 'చిరునవ్వు'; నకార్ 'పగలబడినవ్వు'; నకాల్, నక్తె 'నవ్వు', క.నగు; ప.నవజెరి. అనే నామరూపాలు లభిస్తున్నాయి (2944 *DED*)

మూ.ద్రా. * నవ్ - * నక్ - వ్ -.

మూ.ద్రా. *నక్ - వ్ - లోని 'క్' లోపించి, పరముఖసమీకరణం చెందితే 'üనవ్వు' నిష్పన్నమౌతుంది. అందులోని అనుబంధం చేరనపుడు *నక్ > తె. üనగు అవుతుంది.

తె. üనవ్వు + ఉ > నవ్వు. ∴ నవ్వబడునది నవ్వు దీనిని నవ్వెదరు - కర్మార్థం.

జ. నవ్వారు, నవ్వించు, నవ్వు(బాటు, నవ్వుకొను, నవ్వుచేయు, నవ్వుటాల, నవ్వుదేఱు, నవ్వుపడు, నవ్వుపఱచు, నవ్వులబండి, నవ్వులాట.

**17.నుడుగు / నుడువు / నొడువు / నుడి :-**

వ. **". . . .పలికెడి కొడుకు నుడువులు సెవులకు ములుకుల క్రియ [99]**
**నొదవిన . . . . "**

ఆ. **"మత్స్యరూపియైన మాధవునుడుగులు**
**తలచికొనుచు . . . . ."[10]**

దీనికి (స.క్రి) (1) 'చెప్పు' (2) 'మాటలాడు' (3) 'జపించు', (4) 'నేర్పు' (5) 'చదువు' అనే క్రియార్థాలు.

నామంగా - (1) 'మాట' (2) 'లోకోక్తి' అని అర్థాలు.

సోదరభాషల్లో రూపాలు -

త.నొటి: మ.నొటిక్క; క.నుడి; తు.నుడియుని తనే సజాతిరూపాలు లభించాయి. (*TVB* 733) ఇవే క్రియా రూపాలు, నామరూపాలు కూడా.

మూ.ద.ద్రా. *'నొట్-ఇ' గా భద్రిరాజు గారి ఊహ. * నొట్-ఇ > నుడి దీనిపై 'వ్' అనుబంధం చేరి, స్వరాకర్షణ వలన - నొడువు, నుడువురూపాలు ఏర్పడ్డాయి. తెలుగులో 'గ' 'వ' ల వినిమయం సాధారణమే. 'నుడుగు' సిద్ధిస్తుంది

తె. ü నుడుగు + ఉ > నుడుగు. ∴ నుడుగబడునది - నుడుగు. భావార్థం. 'మాట'.

జ. నుడుగుతేడు, నుడుగుల చెలి, నుడుగువాలు, నుడువరి, నుడువరితనము, నుడువుల నన(బో(డి, నుడువుల పడతుక.

**18.పండు :-**

వ. **". . . . పిందె పూఁప దోరగాయ <u>పండు</u> గెలల తండంబుల . . . ."**[101]

'üపండు' (అ.క్రి) కు - (1) 'ఫలించు' (2) 'కలుగు' (3) 'నెగ్గు' (4) 'ముగియు' అని, విణ.గా - (1) 'పక్వమయినది' (2) 'ముసలిది' అని అర్థాలున్నాయి.

సోదరభాషల్లో -

త.పళుఁను; మ. పంటు; క. పణ్; తు. పండుని; గోండి, పండ్-; కొలామి. నా పర్జి. పండ్-; కురుఖ్. పాఁన్; మాల్టొ. ‡} ̈Ð(*TVB* – 787) అనే క్రియా రూపాలు లభిస్తున్నాయి.

మూ.ద్రా. *పళ్- న్త్- > పణ్ - ట్-. * పణ్ - ట్- లోని 'ట్' శ్వాసీకరణం చెంది, డ్‌గా మారుతుంది.

* పణ్ - ట్ - > పణ్డ్ >తె. üపణ్డు / పండు.

(*i*)తె. üపండు + ఉ > పండు . ∴ పండునది పండు . భావార్థం.

(*ii*)తె. üపండు + ట > పంట. ∴ పండునది పంట . భావార్థం.

**19.పట్టు :-**

శా. **'పుట్టంధువు, పెద్దవాఁడవు, మహాభోగంబులా లేవు, నీ**
**<u>పట్టె</u>ల్లం జెడిపోయె, దుస్సహజరాభారంబు పైఁగప్పె, నీ**
**చుట్టాలెల్లను బోయి రాలు మగఁడున్ శోకంబునన్ మగ్నులై**
**కట్టా! దాయల పంచనుండ ( దగవే? కౌరవ్యవంశాగ్రణీ!** [102]

అనేక అర్థాలున్న పదమిది. స.క్రి. గా - (1) 'గ్రహించు', (2) 'ఆక్రమించు' (3) 'ఆశ్రయించు', 'ఊతగాగొను', (4) 'ఊఁదు', (5) 'మర్దించు' (6) 'అదుము' (7) 'ధారణచేయు' (8) 'తలంచు' (9) ' నిలువు' (10) 'గుట్టము మొ॥వానిని తోలు (110 'ప్రతిజ్ఞ) పూను', (12) 'ప్రారంభించు' (3) 'సోఁకు' (14) 'అనుసరించు' (15) ' చేరు' (16) 'తాఁకు' మొ 36 అర్థాలు.

స.క్రి., అ.క్రి.గా - (1) 'కడచు' (2) 'వ్యయమగు' (3) 'పంతగించు', (4) స్వస్థమగు' (5) 'చెలరేఁగు' (6) 'ఇముడు' మొ. అర్థాలు, వి.గా - (1) 'గ్రహణం' (2) ' పట్టుదల' (3) 'ఉనికిపట్టు' (4) 'చోటు' (5) 'ఉనికి' (6) 'అవకాశము' (7) 'వైశాల్యం (8) 'ధైర్యం' (9) 'సంగతి' (10) 'సందర్భం' (11) 'సమయం' (12) 'పరిమితి' (13) 'రీతి', (14) 'ఊఁత' (15) 'హేతువు' (16) 'ఇల్లు' (17) 'బంధుత్వం మొ. విణ.గా- (1) 'అర్వం' (2) 'ధృఢం' (3)'నిజం' (4) 'అధికం' మొ. అర్థాలు లభిస్తున్నాయి. ఈ అర్థాలు అన్నీ చాలా వరకు లోక వ్యవహారంలో నేటికీ ఉన్నవే.

సజాతి పదాలు - త. పఱ్ఱు (పఱ్ఱి) (క్రి.నా), పఱ్ఱమ్ 'గ్రహింపు', పఱ్ఱీ; మ.పఱ్ఱు, పఱ్ఱుక, పఱ్ఱి, పఱ్ఱిక్క, కో. పట్, పటి, తొ.పట్ -, క.పట్టు, పత్తు, పర్తు; తు.పత్తుని; కురుఖ్ పట్నా (*DED* 3320)

మూ.ద్రా. * పట్ - 'ఉ' అనే తెలుగు ధాత్వనుబంధం చేరగా, అంత్య శ్వాసానికి, ద్విరుక్తం కలిగి 'తె.ü పట్టు' నిష్పన్నమౌతుంది.

üపట్టు + ఉ > పట్టు.

∴ పట్టబడునది పట్టు. భావార్థం 'ఊఁత, ఆశ్రయం, అని అర్థం. ఆ అర్థంలోనే పై భాగవత ప్రయోగం.

జ. పట్టుకాఁడు, పట్టించు, పట్టించుకొను, పట్టింపు, పట్టిచ్చు, పట్టిముట్టాడు, పట్టుగొమ్మ, పట్టుఁగొమ్ము, పట్టుకట్టు, పట్టుకొఁడు, పట్టుకొను, పట్టుకొల్పు, పట్టుదల, పట్టుపటాంగము, పట్టువడు, పట్టుపఱుచు, పట్టుబడి, పట్టుసారువ.

**20.పలుకు :-**

క. **<u>పలుకు</u>ల నగవుల నడపుల**

**నలుకల నవలోకనముల నాభీరవధూ**

**కులముల మనముల తాలిమి**

**కొలుకులు వదిలించు ఘనునిఁగొలిచెద మదిలోన్.** [103]

పలుకు (స.క్రి.)కు - 1. వచించు 2. నిందించు 3. ఆక్షేపించు 4. ఉచ్చరించు 5. (కథ-మొ.) చెప్పు 6. చర్చించు 7. తెలియబఱుచు 8. బెదరించు 9. పొగడు. అనీ

(అ.క్రి.) గా 1. ప్రతివచనమిచ్చు 2. కూయు 3. పాడు; వి. గా - 1. మాట 2. ఆజ్ఞ 3. ప్రశంస 4. నింద 5. ప్రశ్న 6. కూఁత 7. కోరిక;వరం - అని అర్థాలున్నాయి.

సజాతి పదాలు - క్రియగా - త. పలుక్కు; మ.పణిక్క; తు.పణ్పిని; మొ. రూపాలు లభిస్తున్నాయి.

మూ.ద్రా. *పాళ్ - / పాణ్ -.

తె.üపలుకు + ఉ > పలుకు.పలుకబడునది - పలుకు. భావార్థం. మాట అని అర్థం.

జ. పలికించు, పలుకమి, పలుకరించు, పలుకరింత, పలుక రింపు, పలుకాడు, పలుకుగలికి, పలుకుజింకలకొలికి, పలుకు జెలి, పలుకుఁదత్తడి, పలుకుఁ దొయ్యలి, పలుకుదోడు.

**21.పొత్తు :-**

తే.    **ఒక్క శయ్యాసనంబున నుండి, గన్న**

**తండ్రికైవడిఁజేసిన తప్పుఁగాఁచు**

**హస్తములువట్టి <u>పొత్తున</u> నారగించు**

**మనుజవల్లభ! మాధవు మఱవరాదు.** [104]

క.    **ఇత్తెఱఁగున మృగజాతుల**

**<u>పొత్తులు</u> మే మెఱఁగ మనుచు....**[105]

పొత్తు (అ.క్రి.) కు ఒకదానితో ఒకటి కలియు అని అర్థం. వి. 1. స్నేహం 2. సహవాసం 3. అన్నపానాదుల్లోని కలయిక 4. సహభోజనం 5. సంబంధం 6. ఉమ్మడి 7. పొందిక.

పొత్తుకు సజాతి పదాలు - త.పొతు, పొతుమై; మ.పొతు; క.పుదు, పుదువు అనే నామరూపాలే కన్పిస్తున్నాయి. తెలుగులో కూడ శబ్దరత్నాకరంలో విశేష్యంగా మాత్రమే అర్థాలు ఇవ్వబడ్డాయి. టివిబిలో కూడా దీన్ని ధాతువుగా గుర్తించ లేదు. కాని సూ.రా.ని. లో మాత్రం అ.క్రి.గా పేర్కొని, పై అర్థం, కవి ప్రయోగం చూపారు.

తె. పొత్తు + ఉ > పొత్తు . ఇది మొదటి పద్యంలో 'సహభోజనం' అనే అర్థంలో, రెండవ పద్యంలో 'స్నేహం' అనే అర్థంలో ప్రయోగించబడింది.

ఈ పొత్తుకు వివిధ తద్ధిత ప్రత్యయాలు చేరి, తద్ధితాంత రూపాలు సిద్ధమౌతున్నాయి. అవి -

1. పొత్తు + ఇక (స్వార్థమున) > పొత్తిక. కూడిక, కలయిక అని అర్థం.
2. పొత్తు + కత్తె. > పొత్తుకత్తె స్నేహితురాలు.
3. పొత్తు + కాఁడు > పొత్తుకాఁడు. స్నేహితుడు.
4. పొత్తు + ఆలు > పొత్తుటాలు. వారాంగన.

జ.    పొత్తుగలయు, పొత్తుగుడుచు, పొత్తుగొను, పొత్తుచేయు, పొత్తుపడు...

**22.పొక్కు :-**

ఆ. **అసురవరులు సురల నదిరించి బెదిరించి**

**నాకమేలుచున్న నాఁట నుండి**

**కన్న కడుపు గాన కంటఁ గూరుకు రాదు**

**గడుపు <u>పొక్కు</u> మాన్పి కావవయ్య..** [106]

పొక్కు (అ.క్రి.) కు 1. శోకించు 2. పరితపించు 3. బొబ్బలెక్కు 4. (వార్తాదులు) బయలుపడు 5. బెదరు; వి.గా. 1. బాధ 2. బొబ్బ 3. జనశృతి విశేషం అనే అర్థాలున్నాయి.

ఇది పొగులుకు రూపాంతరమని భద్రిరాజు పేర్కొన్నారు. మూ.ద్రా. *పొక్ - .

*పొక్ - పై తెలుగు ధాత్వనుబంధం '-ఉ' చేరి, 'క' కారమునకు ద్విత్వం వచ్చి తె. ü'పొక్కు' నిష్పన్నమౌతుంది.

తె. üపొక్కు + ఉ > పొక్కు.పొక్కునది పొక్కు (కర్త్రర్థం) 'బొబ్బ'.దీనిచే ప్రజలు పొక్కెదురు. పొక్కు 'బాధ'. కరణార్థం.

పొక్కు + ఇడి (స్వార్థంలో) > పొక్కిడి - బీట (తద్ధితం).'పల్లకిబొంగునందలి - (పేడులేచుట) దోషవిశేషము'.

జ. పొక్కిపడు, పొక్కుడు, పొక్కెత్తు.

**23.పోరు :-**

సీ. **పొలఁతుల వాలు జూపుల యంద చాంచల్యమ బలల నడుముల యందలేమి**

**కాంతాలకములంద కౌటిల్య సంచారమతివల నడుపులయందజడిమ**

=ò Q® Î „ ṫ~Ƿƒ ⊨ò † Ç^ Î „ Ô ="OQ®Œä¼K Ȩò † Ç^ Î <u>పోరు</u>

**పడతుల రతులంద బంధ సద్భావంబు సతులఁబాయుట యందు సంజ్వరంబు**

తే. ప్రియులు ప్రియురాండ్ర మనముల బెరసి తార్పు
లంద చౌర్యంబు వల్లభులా త్మసతుల
నాఁగి క్రొమ్ముళ్ళు పట్టుటం దక్రమంబు
రామచంద్రుడు పాలించు రాజ్యమందు.

ఇది రామరాజ్యాన్ని వర్ణించే పద్యం. రామరాజ్యంలో 'లేమి' అన్నదే లేదు. అన్నీ ఉన్నాయా? అంటే ఔనంటాడు - పోతన్న.

"చాంచల్యం, లేమి, కౌటిల్యం, పోరు, జడిమ, పీడనం, బంధం, జ్వరం, చౌర్యం, అక్రమాలు - ఇవి కూడా ఉన్నాయా? అని ప్రశ్నిస్తే - పాపం పోతన్న ఏమంటాడు? లేవు అంటే వీటి లేమి ఉంది కదా? అని రాముణ్ణి ఓడించినవాడౌతాడు. ఉన్నాయి - అందామా? రామరాజ్యం గొప్పతనమేంటి? - అందుకే పోతన తెలివిగా వీటన్నింటికీ సమాధానాలు చెప్పాడు. ఈ పద్యం ఎందరో ప్రబంధ (పండిత) కవులకు మార్గదర్శకం.

పోరు (అ.క్రి.) కు 1. యుద్ధం చేయు (కలహించు) 2. క్షుద్బాధ మొ. వానితో శిశువులు) ఏడ్చు. స.క్రి. గా. 1. ఏదిరించు 2. బాధను కలిగించు వి.గా. 1. కలహం, యుద్ధం 2. శిశువులు ఎడతెగకుండా చేయురోదనం అనేవి అర్థాలు.

దీని సజాతీయ రూపాలు - త. పోరు (క్రి.,నా.); మ.పొరుక (క్రి), పోర్ (నా); క.పోర్, పోరు; తు. పోరియుని (క్రి), పొర్డు (నా); కోత, పోర్ (నా); కుయి, ప్రాహ్ప (క్రి), పోరు (నా)

మూ.ద. ద్రా., మూ.మ. ద్రా. పోర్ -.

* పోర్ > తె. **ü**పోరు. తె. **ü**పోరు + ఉ > పోరు : పోరు + ఇమి > పోరిమి

(1) పోరబడునది - పోరు, 'యుద్ధం' - భావార్థం.

(2) దీనితో పోరుదురు - పోరితం - 'యుద్ధపాటవం' - కరణార్థం.

దీని నుండి పుట్టిన తద్ధితం -

పోరు + ఇతము > పోరితం (స్వార్థంలో).1. యుద్ధం, కలహం, స్పర్థ అనేవి దీని అర్థాలు.

జ.	పొసపోరు, పోరాటం, పోరాడు, పోరించు, పోరిడు, పోరితమాడు, పోరితము, పోరిమి, పోరుదిండి, పోరుపెట్టు, పోరాడ్డు.

**24.పొందు :-**

ఆ.	**ఎల్లతనువులందు నిరవొందు తనతోడుఁ**

**బొందు సేసినట్టి <u>పొందు</u> కాని**

**<u>పొందు</u> వొంద లేఁడు పురుషుండు గుణముఁదా**

**గుణినిఁ బోలె నట్టి గుణి భజింతు.** [108]

పొందు (స.క్రి.) కు 1. ప్రాపించు 2. రతియందు కలియు 3. (సమిష్టిగా) కూడు 4. తాఁకు 5. చేరు 6. ప్రేమించు; అ.క్రి. గా 1. స్నేహం చేయు 2. ఏకమగు 3. పొసఁగు 4. చేరు 5. సంగమించు 6. తగులుకొను.

వి.గా. 1. పొందిక 2. పొత్తు, స్నేహం 3. చనవు 4. కలయిక 5. అనుకూల్యం 6. నెలవు 7.తోడ్పాటు 8. ప్రాప్తి 9. సంధి, ఒడంబడిక 10. వలపు 11. పద్ధతి 12. ఉపాయం13. మార్గం.

విణగా - 1. స్నేహితుడు 2. అనుకూలుడు 3. యుక్తం అనేవి అర్థాలు.

దీని సజాతీయ శబ్దాలు -

త. పొరుంతు; మ.పొరున్నుక; క.పొందు, హొందు, పొర్దు, పొద్దు, హద్దు; తు.పొర్దుని; పర్జి. పొర్చ్; కురుఖ్. పురుమ్; కుయి. పొమ్బ.

మూ.ద్రా. *పోర్-; మూ.మ.ద్రా. *పొర్-ఉంత్.

* పొర్-ఉంత్ లో 'రు' లోపించి, త కారం శ్వాసీకరణంచెంది, '-ఉ' అనే తెలుగు ధాత్వనుబంధం చేరగా- తె.üపొందు సిద్ధిస్తుంది.

తె.üపొందు + ఉ > పొందు. భావార్థం.

తె.üపొందు + తనము (వృత్తిని వర్ణలోపం) > పొంతనము. భావార్థం.

తె.üపొందు + ఇక > (పొందిక. భావార్థం).

**25.బొంకు :-**

ఆ. **సూనృతంబ కాని సుడియదు నా జిహ్వ**

**బొంకఁ జాల నాకు <u>బొంకు</u> లేదు**

**నీ తృతీయ పదము నా శిరమున**

**నెలవు సేసి పెట్టు నిర్మలాత్మ** [109]

బొంకు (అ.క్రి.) కు అబద్ధమాడు; విశేష్యంగా - 1. అసత్యం 2. కల్లతనం 3. తప్పు, పొరపాటు; అనే అర్థాలున్నాయి.

సోదరభాషల్లో - క.బొంకు; తు.బొంకుని; త.పొక్కం; మ. పొక్కర్.

* పొయ్ - క్క్ : ప కారం శ్వాసీకరణం చెంది 'బ' కారంగా మారి తెలుగులోతె. üబొంకు రూపం సిద్ధిస్తుంది.

తె. üబొంకు + ఉ > బొంకు.బొంక బడునది - బొంకు'అబద్ధం' . భావార్థం. పై పద్యంలో అదే అర్థం.

బొంకు పై 'అరి' (తద్ధిత) ప్రత్యయం మతుబర్థంలో చేరగా, బొంకరి అనే తద్ధితాంత రూపం సిద్ధిస్తుంది. - బొంకువాడు అని అర్థం.

జ. బొంకులాఁడి, బొంకులాఁడి.

**26.బ్రతుకు/బతుకు :-**

ఆ. **కైటభారి భజన గలిగి యుండని వాఁడు**

**గాలిలోన నుండి కదలు శవము**

**కమలనాభుపదము గనని వాని <u>బ్రతుకు</u>**

**పసిడికాయలోని ప్రాణి బ్రతుకు.** [110]

తె.üబ్రతుకు (అ.క్రి.) కు 'జీవించు' అని అర్థం.

జీవనం, జీవనోపాయం (బ్రతుకుదెరువు) ఉనికి, అనే అర్థాలు నామరూపానికి.

సోదరభాషల్లో -

త.వాళ్‌త్తు : మ. వాఴుక; క.బాళ్‌, బాఴు, బర్దుకు, బఝ్దుఝ్కు; బదుకు, బదకు, బదికు, బదుంకు; తు. బదుకుని - అనే క్రియారూపాలు.

త. వాట్కై, వతుక్కు; మ.వాళ్‌, వాఴు, వాళ్‌త్తుక; క.బదుకు, బదకు, బర్దుకు; తు.బదుకు మొ. నామరూపాలు లభిస్తున్నాయి.అన్ని భాషల్లో దరిదాపు సమానరూపాలున్నాయి.

తె.üబ్రతుకు + ఉ > బ్రతుకు. బ్రతుక బడునది - బ్రతుకు. భావార్థం.

**27.బెదరు/బెదురు :-**

క. **పదముల సంకెల లిడుకొని**

**మదిఁ దలఁకుచు శూరసుతుఁడు మందుఁడు వోలెన్**

**<u>బెదరు</u> గల రీతి దేహము**

**గదలించుచు నొదిఁగియుండె గఱువతనమునన్.** [111]

బెదరు (అ.క్రి.) కు 1. భయపడు 2. వెనుదీయు అని, వి.గా. 1. భయం 2. సంకోచం 3. అవిశ్వాసం 4. అధైర్యం అని అర్థాలు.

సోదరభాషల్లో -

త. వితఋ; క.బెదఱ్, బెదఋ; తు.బెదరు, బెదురు అనే క్రియా, నామరూపాలు లభిస్తున్నాయి.మూ.మ./ద.ద్రా.*వెత్ - అర్.

'వ' 'బ' గా మారి, త, ద గా మారగా - *వెతర్ >తె.üబెదరు నిష్పన్నమౌతుంది.

తె.üబెదరు + ఉ > బెదరు ' భయం'. భావార్థం.

జ. బెదరఁబాఱు, బెదరించు, బెదరింపు, బెదరుగొడ్డు, బెదరుపడు, బెదరుపోతు.

**28.మెచ్చు :-**

**నిజము వలికె నితడు నిర్మలాచారుండు**

**మేలు మేలు నాకు మెచ్చు వచ్చె.** [112]

మెచ్చు కు (స.క్రి.) 1. పొగడు 2. గారవించు 3. లక్ష్యపెట్టు 4. గణించు - అని; (అ.క్రి.) 1. సంతోషించు - అని అర్థాలు.

నామవాచకంగా - విశేష్యంగా - 1. పొగడ్త 2. పొగడు వాడు 3. బహుమానం 4. సంతోషం 5. అద్భుతం అని, విశేష్యంగా - పొగడదగినది అని అర్థాలు.

సోదరభాషల్లో - త. మెచ్చు; క.మెచ్చు/మచ్చు; తు. మెచ్చుని; అనే క్రియారూపాలు. తమిళ కన్నడ భాషల్లో మెచ్చు అనే నామరూపాలు లభిస్తున్నాయి.

మూ.ద్రా. *మెయ్ పై -చ్ అనే ధాత్వనుబంధం చేరి.తె. üమెచ్చు అనే రూపం సిద్ధిస్తుంది.

ఇక్కడ మూ.ద్రా. ధాత్వంత -య్ లోపించి, ధాత్వను బంధానికి ద్విత్వం వచ్చింది.

1.తె. üమెచ్చు + ఉ > మెచ్చు.మెచ్చుట వలన మెచ్చు(భావార్థం).

2.తె. üమెచ్చు + పు > మెప్పు.మెచ్చుట వలన మెప్పు (భావార్థం).

జ. మెచ్చించు, మెచ్చుకొను, మెచ్చుగొల్పు, మెచ్చులాడి, మెచ్చులాడు, మెచ్చులు సేయు, మెచ్చువచ్చు, మెచ్చువడు, మెప్పించు, మెప్పు, మెఱమెచ్చు.

**29.మెఱుము :-**

**ఈయుఱుములు నీ మెఱుములు**

**నీ యశని విఘోషణములు నీ జలధారల్**

**నీయాన తొలియెఱుగము**

**కూయాలింపంగదయ్య గుణరత్న నిధీ.** [113రీ]

మెఱుము (అ.క్రి.) కు మెఱుచు, తళుక్కని ప్రకాశించు, అని విశేష్యంగా - మెఱుపు, విద్యుత్తు అనీ అర్థాలు.

సోదరభాషల్లో - క.తు.మెఱె; కొలామి. మెర్ప్ -; అనే క్రియారూపాలు. త.మెరుకు; క.మెరుగు; అనే నామరూపాలున్నాయి.కురుఖ్‌లో - మెఱ్ఖా 'ఆకాశం', 'స్వర్గం' అనే అర్థాల్లో ఉంది.

మూ.ద్రా. *మెఱ్ మీద ము ధాత్వనుబంధం చేరి, సమస్వరత వల్ల తె.ü మెఱుము నిష్పన్నమౌతుంది. తె.üమెఱుము + ఉ > మెఱుము. మెఱుమునది మెఱుము. కర్త్రర్థం.

**30.మ్రొక్కు :-**

వ. **... నమ్రభావంబున <u>మొక్కు</u> చెల్లించె...** [114]

మ్రొక్కు / మొక్కు (అ.క్రి., స.క్రి.) కు నమస్కరించు అని అర్థం.

విశేష్యంగా - 1. నమస్కారం 2. దేవునికి అర్పించేందుకు నిర్ణయించబడిన వస్తువు - అని అర్థాలు.

సోదరభాషల్లో - క.మొళ్గు, ముళ్గు; కుయి. మ్రొంగ; గోం. ముర్స్ - ; ప. మొఙ్క్-, ముర్గ్-; మాల్తో. ముర్స్-; అనే క్రియారూపాలు లభిస్తున్నాయి. క.మొఋ్గు, మొక్కు అనే నామరూపం లభిస్తుంది.

మూ.ద్రా. * మొళ్-అఙ్క్-/మొళ్-అక్క్-. మొళ్-అక్క్ >తె.üమొక్కు / మ్రొక్కు.

తె.üమ్రొక్కు + ఉ > మొక్కు.మొక్కుబడేది - మొక్కు. దీనిని మొక్కెదరు. కర్మార్థం.

తె.üమ్రొక్కు +బడి >మొక్కుబడి.దీనిని మొక్కెదరు. కర్మార్థం.

జ. మ్రొక్కించు, మ్రొక్కుడు, మ్రొక్కుబడి, మ్రొక్కులదేవర, మ్రొక్కులయ్య, మ్రొక్కువేయు.

**31.వీనులు :-**

మ. **అపశబ్దంబుల గూడియున్ హరిచరిత్రాలాపముల్ సర్వపా**

**పపరిత్యాగము సేయుగావున హరిన్ భావించుచుం బాడుచున్**

**జపముల్ సేయుచు <u>వీనులన్</u> వినుచు నశ్రాంతంబు కీర్తింపుచున్**

**దపసులు సాధులు ధన్యులౌదురుగదా తత్వజ్ఞ! చింతింపుమా.** [115]

తె.üవిను (స.క్రి.) కు ఆకర్షించు అని అర్థం. వీనులు శబ్దానికి చెవులు అని అర్థం.

తె.üవిను + ఉ > వీను. వీనిచే వినెదరు - వీనులు 'చెవులు' - కర్త్రర్థం.

'ఉ' ప్రత్యయం చేరినప్పుడు ఆద్యచ్చుకు దీర్ఘం రావడం దీని ప్రత్యేకత. (మిగిలిన వివరాలకు చూ. వినికి)

**32.వెలుఁగు/వెల్గు :-**

ఆ. **మినుకుచుండు మునులమేని వెలుఁగు** [116]

వెలుగు (అ.క్రి.) కు 1. ప్రకాశించు 2. జ్వలించు 3. ఒప్పు 4. ప్రసిద్ధికెక్కు 5. ప్రతిఫలించు 6. విజృంభించు అని అర్థాలు. విశేష్యంగా - 1. ప్రకాశించు 2. కిరణం 3. ఎండ అని అర్థాలు.

సోదరభాషల్లో - త. విళంకు, విళక్కు; మ.విళణ్ణుక, వెళుక్క; క. బెళగు; తు.బెళగుని; కో.వెళ్గ్- ; అనే క్రియారూపాలు, త.విళక్కు, క.బెళగు; తు.బెళగు; అనే నామరూపాలు లభిస్తున్నాయి.

మూ.ద్రా. * వెళ్ - పై ధాత్వనుబంధం 'గు' చేరి, సమస్వరత వల్ల -తె.üవెలుగు - రూపం నిష్పన్నమౌతుంది.

తె.üవెలుగు + ఉ > వెలుగు. వెలుగునది - వెలుగు . కర్త్రర్థం.

**5.13 - ఎ :-**

**- ఎ** అనే కృత్ప్రయాంతం భాగవతంలో ఒక్కటే లభించింది.అది జంకె.

**జంకె :-**

ఉ. **కింకలు ముద్దు బల్కులును గెంపు గనుంగవ తియ్య మోవియున్**

**<u>జంకె</u>లు తేటి చూపు లెక సక్కెములున్ నెలవంక బొమ్ములున్**

**గొంకక వీడనాడుటలు గూరిమియుం గల కాంత గూడుటల్**

**అంకిలి లేక జన్మఫల మబ్బుట గాదె కురంగలోచనా!** [117]

తె.üజంకు/జనుకు (అ.క్రి.) కు 1. బెదరు 2. వెనుదీయు 3. చలించు 4. దిగబడు అని; విశేష్యంగా - 1.భయం 2. సంకోచం అని అర్థాలు.

సోదరభాషల్లో -

త.చంకు; క.జంకిసు అనే క్రియారూపాలు, క.జంకె, జంకణె అనే నామరూపాలు లభిస్తున్నాయి.

*చణ్ అనే మూ.ద్రా. క్రియాధాతురూపంపై - క్ - అను బంధం చేరి,తె.üజంకు/జనుకు నిష్పన్నమౌతుంది.

నిఘంటువుల్లో జంకు అని దంత్యరూపం కనిపిస్తుండగా భాగవత ప్రయోగం మాత్రం జంకెలు అని తాలవ్యంగానే ఉంది.

(1) తె.üజంకు + ఎ > జంకె. దీనిచే జంకెదరు - జంకె-'బెదరింపు', కరణార్థం.

(2) తె.üజంకు + ఎన > జంకెన.దీనిచే జంకెదరు -జంకెన - 'బెదరింవు, కరణార్థం.

(3) తె.üజంకు +ఉ >జంకు.దీనిచే జంకెదరు'బెదురు'.కరణార్థం.

ఈ విధంగా - ఇంతవరకు భాగవతంలోని 13 అజంత కృత్ప్రత్యయాలు, అవి చేరిన 100 కృదంతాలు వ్యాఖ్యానించ బడినాయి. వాటి వివరాలు కింద పొందుపరుస్తున్నాను.

**భాగవతంలో లభించిన అజాది కృదంతాలు - సంఖ్య**

| | | |
|---|---|---|
| (1) - అ - 12 | (2) - అడి - 01 | (3) - అన - 01 |
| (4) - అర - 02 | (5) - అమి - 11 | (6) -అవు - 07 |
| (7) -ఇ - 08 | (8) -ఇక - 15 | (9) -ఇకి - 04 |
| (10) -ఇదం - 02 | (11) -ఇమి - 04 | (12) -ఉ - 32 |
| (13) -ఎ - 01 | **లభించిన మొత్తం - <u>100</u>** | |

# పాద సూచిక

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | భాగ | 7 - 199 | 32. | భాగ | 8 - 199 |
| 2. | భాగ | 10 పూ 491 | 33. | భాగ | 3 - 965 |
| 3. | భాగ | 3 - 39 | 34. | భాగ | 6 - 281 |
| 4. | భాగ | 2 - 115 | 35. | భాగ | 3 - 385 |
| 5. | భాగ | 6 - 57 | 36. | భాగ | 4 - 399 |
| 6. | ఆంధ్ర భాషార్ణవము | 2 - 115 | 37. | భాగ | 8 - 581 |
| 7. | గురు బాల ప్రబోధికా - అమరకోశం | 2 - 30 | 38. | భాగ | 4 - 493 |
| 8. | గురు బాల ప్రబోధికా - అమరకోశం | 2 - 26 | 39. | భాగ | 10 పూ 871 |
| 9. | భాగ | 10 పూ 381 | 40. | భాగ | 5 - 43 |
| 10. | భాగ | 6 - 320 | 41. | భాగ | 4 - 573 |
| 11. | భాగ | 8 - 389 | 42. | భాగ | 3 - 526 |
| 12. | భాగ | 3 - 885 | 43. | భాగ | 8 - 247 |
| 13. | భాగ | 10 పూ 977 | 44. | భాగ | 9 - 280 |
| 14. | భాగ | 8 - 59 | 45. | భాగ | 8 - 552 |
| 15. | భాగ | 8 - 646 | 46. | భాగ | 8 - 590 |
| 16. | భాగ | 8 - 103 | 47. | భాగ | 10 పూ 312 |
| 17. | భాగ | 10 పూ 703 | 48. | భాగ | 6 - 353 |
| 18. | భాగ | 10 పూ 707 | 49. | భాగ | 8 - 133 |
| 19. | భాగ | 1 - 441 | 50. | భాగ | 4 - 109 |
| 20. | భాగ | 10 పూ 1708 | 51. | భాగ | 1-455 |
| 21. | భాగ | 6 - 717 | 52. | భాగ | 10 పూ 1254 |
| 22. | భాగ | 10 పూ 991 | 53. | భాగ | 3 - 95 |
| 23. | భాగ | 8 - 719 | 54. | భాగ | 10 పూ 1250 |
| 24. | భాగ | 10 పూ 24 | 55. | భాగ | 10 పూ 991 |
| 25. | భాగ | 8 - 719 | 56. | భాగ | 10 ఉ భా 510 |
| 26. | భాగ | 10 పూ 937 | 57. | భాగ | 1 - 497 |
| 27. | భాగ | 6 - 265 | 58. | భాగ | 3 - 751 |
| 28. | భాగ | 8 - 353 | 59. | భాగ | 1 - 125 |
| 29. | భాగ | 1 - 102 | 60. | భాగ | 9 - 229 |
| 30. | భాగ | 8 - 184 | 61. | భాగ | 6 - 242 |
| 31. | భాగ | 7 - 63 | 62. | భాగ | 4 - 954 |

| | | |
|---|---|---|
| 63. | భాగ | 3 - 1040 |
| 64. | భాగ | 1 - 251 |
| 65. | భాగ | 10 పూ 1287 |
| 66. | భాగ | 10 పూ 375 |
| 67. | భాగ | 1 - 464 |
| 68. | భాగ | 7 - 169 |
| 69. | భాగ | 10 పూ 1384 |
| 70. | భాగ | 10 పూ 1409 |
| 71. | భాగ | 10 ఉ భా 800 |
| 72. | భాగ | 10 పూ 494 |
| 73. | భాగ | 10 ఉ భా 321 |
| 74. | భాగ | 10 పూ 1062 |
| 75. | భాగ | 4 - 74 |
| 76. | భాగ | 3 - 469 |
| 77. | భాగ | 10 పూ 147 |
| 78. | భాగ | 1 - 363 |
| 79. | భాగ | 3 - 475 |
| 80. | భాగ | 3 - 972 |
| 81. | భాగ | 10 పూ 328 |
| 82. | భాగ | 10 పూ 792 |
| 83. | భాగ | 10 పూ 904 |
| 84. | భాగ | 10 పూ 172 |
| 85. | భాగ | 10 పూ 415 |
| 86. | భాగ | 7 - 170 |
| 87. | భాగ | 8 - 667 |
| 88. | భాగ | 8 - 247 |
| 89. | భాగ | 8 - 55 |
| 90. | భాగ | 1 - 311 |
| 91. | భాగ | 8 - 484 |
| 92. | భాగ | 10 - 166 |
| 93. | భాగ | 10 - 169 |
| 94. | భాగ | 10 పూ 1005 |
| 95. | భాగ | 1 - 367 |
| 96. | భాగ | 8 - 376 |
| 97. | భాగ | 6 - 61 |
| 98. | భాగ | 1 - 219 |
| 99. | భాగ | 8 - 705 |
| 100. | భాగ | 8 - 705 |
| 101. | భాగ | 8 - 447 |
| 102. | భాగ | 1 - 308 |
| 103. | భాగ | 1 - 223 |
| 104. | భాగ | 1 - 367 |
| 105. | భాగ | 9 - 600 |
| 106. | భాగ | 8 - 484 |
| 107. | భాగ | 9 - 334 |
| 108. | భాగ | 6 - 215 |
| 109. | భాగ | 8 - 641 |
| 110. | భాగ | 2 - 51 |
| 111. | భాగ | 10 పూ 145 |
| 112. | భాగ | 8 - 661 |
| 113. | భాగ | 10 - 904 |
| 114. | భాగ | 8 - 649 |
| 115. | భాగ | 1 - 95 |
| 116. | భాగ | 8 - 703 |
| 117. | భాగ | 10 ఉ.భా. 265 |

# శ్రీమదాంధ్ర మహాభాగవతంలో

## హలాది కృత్ప్రత్యయాలు

గత అధ్యాయంలో అజాది కృత్ప్రత్యయాలు పరమైన రూపాలను విశ్లేశించగా, ఈఅధ్యాయంలో హలాదికృత్ప్రత్యయాలను విశ్లేశిస్తున్నాను.

### 6.0. భాగవతంలో హలాది కృత్ ప్రత్యయాలు -

| | | |
|---|---|---|
| (1) -క | (2) -కడ | (3) -కలి |
| (4) -గడ | (5) -గు | (6) -ట |
| (7) -టు | (8) -త | (9) -దల |
| (10) -ప | (11) -పి | (12) -పు |
| (13) -పురం | (14) -బడి | (15) -మర |
| (16) -ము | (17) -వ | (18) -వడి |
| (19) -వలి | (20) -వి | (21) -వు |
| (22) -సట | (23) -సలి | (24) -సు |

### 6.1. -క:-

భాగవతంలోని - క ప్రత్యయాంత కృదంతాలు -

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. | అలుక, అల్క | 2. | ఎలుక | 3. | కలఁక |
| 4. | కానుక | 5. | కిన్క (కినుక) | 6. | కూక |
| 7. | తునుక | 8. | నడక | 9. | పోక |
| 10. | మలక | 11. | ముదుక | 12. | మునుక |
| 13. | మూఁక | 14. | మెలక | 15. | వంక |
| 16. | వ్రక్క | | | | |

**1.అలుక, అల్క :-**

ఉ. **"వారని యల్కతో ఁవారిజ నాభుడు . . . .[1] "**

క. **"పలుకుల నగవుల నడపుల**
**నలుకల నవలోకనముల . . . . [2]"**

తె.**ü**అలుగు అనే క్రియా ధాతుజన్యం - అలుక / అల్క. తె.**ü**అలుగు/అల్గు (1.క్రి.) కు (1) కోపపడు, (2) పగగొను (3) హానిచేయు అనే అర్థాలున్నాయి.

దీనికి కన్నడలో మాత్రమే సజాతిరూపం లభిస్తున్నది. క.üఅలుగు 'నిరసించు' (*TVB* – 52)

తె.üఅలుగు + క > అలుక. 'క' పరమైనపుడు ధాత్వంతానికి లోపం కలుగుతుంది. మధ్య స్వరలోపం జరిగి - అల్క.

üఅలుగు + కువ > అలుకువ. ∴ అలుగ బడునది అలుక/అలుకువ భావార్థం.వీటికి -(1) కోపం (2) పగ అనేవి అర్థాలు.

పై మొదటి పద్యంలో అల్క - ప్రళయ కోపం, పగ. కాగా రెండవ పద్యంలోని అలుక - 'ప్రణయకోపం', నటనాత్మకమైన కోపం.

**2. ఎఱుక :-**

మ. **తను హృద్భూషల సఖ్యమున్ శ్రవణమున్ దాసత్వమున్ వందనా**
**ర్చనముల్ సేవయు నాత్మలో <u>నెఱుక</u>యున్ సంకీర్తనల్ చింతనం**
**బనునీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరిన్నమ్మి స**
**జ్జనుడై యుండుట భద్రమంచుఁ దలఁతున్ సత్యంబు దైత్యోత్తమా!** [3]

తె.üఎఱుఁగు/ఎర్గు అనే క్రియాధాతుజన్యం - ఎఱుక. తె.üఎఱుగు (స.క్రి.) కు -(1) తెలియు (2) నేర్చు (3) అనుభవించు అనేవి అర్థాలు.

సజాతీయరూపాలు -

త.అఱి; మ.అఱియుక; క.అఱి, అఱిపు; -కోత. అయ్ర్-; తొద. అఱ్య్ - అనే క్రియా రూపాలు, త.మ. అఱిప్పు, అఱివు; తు. అఱుహు అనే నామారూపాలు లభిస్తున్నాయి. (*TVB* – 172)

దీని మూలరూపాలు -మూ.ద్రా * చేట్ / *చాట్ > మూ.మ.ద్రా. * ఏట్ / *ఆట్ - అని భద్రిరాజు గారు పేర్కొన్నారు.

'*ఏత్' లో ఆదిస్వరం హ్రస్వత్వం పొంది '*త్'. 'ఱ్' గా పరిణమించి, 'గ' కారం అనుబంధంగా చేరడం వల్ల తె. üఎఱుగు రూపం నిష్పన్నమౌతుంది.

üఎఱుగు+క> ఎఱుక.

∴ (*i*) ఎఱుగ బడునది - ఎఱుక. దీనిని ఎఱుగుదురు. కర్మార్థం - 'తెలివి' అని అర్థం.

(*ii*) ఎఱుగజేయునది - ఎఱుక. దీనిచే ఎఱుగుదురు. కరణార్థం.'చిహ్నం (గుర్తు)', 'సోదె', 'జోస్యం' అనేవి అర్థాలు.

తె.üఎఱుగు + కువ > ఎఱుకువ. కర్మార్థం. 'తెలివి' అర్థం.

ఎఱుక +త> ఎఱుకత (స్త్రీ వాచక తద్ధితం-'త') 'ఎఱుక జెప్పెడు స్త్రీ. ఎఱుక గలది' - ఎఱుకత (కులవాచకం) (మత్వర్థీయం). ఎఱుకసాని, ఎఱుకలసాని. ఇటువంటివే.

జ. ఎఱిగించు, ఎఱుక చేయు, ఎఱుకపఱుచు. మొ॥

**3.కలఁక :-**

ఆ. **కడిఁది వ్రేఁగు మానెఁ గరగిరి కిటినాగ**
**కమఠములకుఁ బ్రజల <u>*కలఁక*</u>మానె**

**రామచంద్రవిభుఁడు రాజేంద్రరత్నంబు**

**ధరణి భరణరేఖఁ దాల్చునపుడు[4]**

తె.**ü**కలఁగు క్రియాధాతుజన్యం కలఁక . తె.**ü**కలఁగునకు (అ.క్రి.) (1) చెదరు (2) వ్యాకులమగు (3) కలుషమగు (4) (కన్ను) కలఁక రోగం కల్గినదిఅగు (5) భయపడు (6) కామవికారం నొందు అనే అర్థాలు ఉన్నాయి.

సజాతీయరూపాలు -

త.కలంకు, కలక్కు; మ. కలఙ్ఙక ; కలక్కుక; క. కలంకు, కలకు; తు.కలంకుని; కుయి. గ్లాహ్ప; కురుఖ్. ఖలఖ్-; మాల్తో. కలగ్-; అనే క్రియారూపాలు, లభిస్తున్నాయి. ($TVB-260$)

మూ.ద్రా. * **ü**కల్ - ధాతువుపై -'అల్'- అనే బంధం చేరగా - తె **ü**కలంగు నిష్పన్నమౌతున్నది. దీని నుండి (1) కలఁక (2) కలఁకు (3) కలఁకువ (4) కలఁత అనే కృదంతాలు జనిస్తాయి.

(1) కలఁక కు సరూపాలు - త. కలక్కమ్; మ. కలక్కమ్; (2) కలఁకు సరూపాలు - తమ కలక్కు; క.కలకు; కోత. కల్క్-; తు. కలంకు, కళంకు; ($DED-1096$) అనేవి లభిస్తున్నాయి. మొత్తానికి సోదరభాషల్లో అన్నింటిలో ఈ ధాతుజన్య కృదంతాలు ఉన్నాయి.

($i$)తె.**ü**కలఁగు+క > కలక; ($i$)తె.**ü**కలగు+కువ > కలకువ; కలఁగునట్లు చేయునది. దీనిచే కలత చెందెదరు - కలఁక, కలఁకు, కలఁకువ, కలఁత .(కరణార్థం)

కలఁకకు అర్థాలు - 1 వ్యాకులత 2 కాలుష్యం 3. కలంకం 4. పాపం 5. కామవికారం అని అర్థాలు. మిగిలిన వాటికి కూడ ఇవే అర్థాలు. పై పద్య సందర్భంలో ఈ అర్థాలన్నీ చెప్పవచ్చు.

జ. కలఁకదేఱు, కలఁకపాటు, కలఁకపాఱు, కలఁగబడు, కలఁగబాఱు, కలఁగించు, కలఁచియాడు, కలఁచు, కలఁతపడు, కలగొను

**4.కానుక / కాన్క :-**

క. **"బంధులు పౌరులు దెచ్చిన**

**గంధేభహయాదులైన <u>కానుకలు</u> దయా**

**సింధుడు గైకొనె నంబుజ**

**బంధుఁడు గొను దత్తదీప పంక్తులభంగిన్ [5]"**

'కానుక' శబ్దం తె.**ü**కను నుండి జనించిందని ($DED$1209) తెలుస్తున్నది.

సోదర భాషల్లో -

త. కాణ్కై 'విజ్ఞానం', కణికై 'ఉపాయనం (బహుమతి'); మ. కాణుక 'చూచు', కాణిక్క 'ప్రదర్శించు', 'ఉపాయనం'; క.కాణ్కె, 'చూపు, ఉపాయనం; తు.కాణికె, కాణిగె ' ఉపాయనం'.

పై సజాతీయ రూపాల వలన 'చూచు' అనే అర్థం కలిగిన '**ü**కను' నుండి 'కానుక' నిష్పమైందనడంలో సందేహం లేదు (కనుధాతు సంబంధ వివరాలకు "కన్ను" వద్ద చూడండి)

తె.**ü**కను +క > కానుక. ఆదివృద్ధి ఇందులోని విశేషం. మధ్యస్వరలోపం జరిగి - కాన్క. కనుట కొరకు (తన త్యాగాన్ని / అభిమానాన్ని ప్రదర్శించేందుకు) ఇవ్వబడింది కానుక . 'ఉపాయనం' (సంప్రదానార్థం) (కర్మార్థం అని కూడ చెప్పుతారు).కానిక అనే రూపాంతర ముంది.

కాన్క, కానుక, కానిక అనే ఈ మూడు రూపాల్లో కాన్క అనే రూపమే ప్రాచీనమై ఉండవచ్చు. 'క' ప్రత్యయం పరమైనపుడు ధాత్వంత హల్లు (త,గ,చ,య,వ) లోపించినట్లు, ఇక్కడ ధాత్వంతమైన అచ్చు 'ఉ' లోపించి ఉండవచ్చు. తెలుగులో ఒకటి లోపించినపుడు దాని సమీప స్వరానికి దీర్ఘం రావడం సహజం. దాన్నే లోపదీర్ఘం అంటారు.

ఆ విధంగా -కను+క → కన్+క →కాన్ + క > కాన్క - అయ ఉంటుంది తర్వాత మధ్య స్వరాగమం వల్ల కానుక, కానిక రూపాలు కావచ్చు.

**5.కిన్క/కినుక/ -కింక :-**

ఉ. **" <u>*కింకలు*</u> ముద్దుబల్కులను గెంపుగనుంగవ తియ్య మోవియున్**

**జింకెలు తేటి చూపు లెకసక్కెములున్ నెలవంక బొమ్మలున్**

**గొంకక వీడనాడుటలుఁ గూరిమియుం గల కాంత గూడుటల్**

**అంకిలి లేక జన్మఫల మబ్బుటగాదె కురంగలోచనా![6]"**

వ. **" . . . . .కోపోద్దీపితమానసుండై . . . <u>*కినుకం*</u> ద్రోక ద్రొక్కన**

**మహోరగంబు నోజన్ రోజుచు[7] . . . . "**

మ. **. . . . కనుగ్రేవన్ మిణుగుర్లు చాలఁగొడమంగాఁ <u>*గిన్కమైఁ*</u> దోఁకఁద్రొ**

**క్కిన కృష్ణోరగరాజు మాడ్కి . . . .**

పై పద్యాల్లో క్రమంగా కింక, కినుక, కిన్క అనే రూపాలు లభించాయి. ఇవి తెüకినియు ధాతుజన్యాలు. తె. üకినియు (అ.క్రి., స.క్రి)కు (1) కోపించు (2) ద్వేషించు (3) అలుగు అనే అర్థాలున్నాయి.

సోదర భాషల్లో -

త. చినవు; మ.చినిక్క; క.కినిసు అనే క్రియా రూపాలు, త. చిణమ్; మ.చినిప్పు; క.కినిసు అనే నామ రూపాలు (*TVB* – 282) లభ్యమౌతున్నాయి.

మూ.ద్రా. * కిన్-పై ఇయు అనుబంధం చేరి తెలుగులో తె. üకినియు నిష్పన్నమౌతుంది.

తె. üకినియు+క → కిన్ + క → కిన్క / కింక. మధ్య స్వరాగమం వల్ల 'కినుక అనే రూపం సిద్ధిస్తుంది.

∴ (1) కినియు బడునది కినుక / కిన్క/ కింక.( భావార్థం)(1) కోపం (2) అలుక (3) ద్వేషం అనేవి అర్థాలు.

(2) దీనిచే కినియుదురు - కింక. (కరణార్థం) 1 కోపం 2. బాధ (పీడ) 3. రోగం, తెగులు అని అర్థాలు.

తె. üకినియు + ఉ > కినుపు.ధాత్వంత లోపం, స్వరసమత జరిగి - 'కినుపు' రూపం సిద్ధిస్తుంది. దీనికే 'కోపం' అనే అర్థం.

**6.కూఁక :-**

క. **నాకొడుకును నా కోడలు**

**నే కతమునఁబెనఁగఁ బాము నీతఁడు వైవం**

**గోక లెఱుంగక పాటినఁ**

**<u>*గూఁక*</u>లిడె న్నీసుతుండు గుణమె? గుణాఢ్యా![9]**

తె. üకూయు ధాతుజన్యం కూఁక. తె.üకూయు (అ.క్రి.) కు 1. అఱచు 2. మొఱపెట్టు అని; స.క్రి.గా - 'వదరు' అని అర్థాలు.

సజాతీయరూపాలు -

త. కూవు, కుయిల్; మ. కూ-, కూక్కుక; క. కూగు, కూకు; తు.కూగుని; కుయ కూప్క; గొం. కూస్; కొలమి కుయ్-, కూగ్-; నా.కూగ్-; పర్జీ. కూయ్ -; మాల్తో. కూక్ -; బ్రా. కూక్, కూక్ - కన్నో - అనే క్రియా రూపాలు, (*TVB* – 300)

త. కూ, కూ-కూ, కూచ్చల్, కూవల్; మ. కూకల్, కూవల్, కూవల్, కూప్పు; క.కూ, కూగు, కూకు, కూకలు;

కోలామి కుయ్; అనే నామరూపాలు (*DED*–1551) లభిస్తున్నాయి.

పై పరిశీలన వలన మూ.ద్రా. రూపం *కూ-/ *కూయ్-/ *కూక్- గా పునర్నిర్మించవచ్చు.

*కూయ్ > తె. **ü**కూయు.తె.**ü**కూయు + క > కూఁక. కూయబడునది- కూఁక, (భావార్థము) దీనికి (1) కూఁత 2. అఱపు 3. కూయు 4. కేకలు (వేయు) 5. చీవాట్లు అనేవి అర్థాలు.

* కూయ్ + త > కూఁత. దీనికీ పై నిర్వచనమే .అర్థాలు మొదటినాలుగు.

జ. కూకరించు, కూఁకవేటు, కూఁత, కూఁత, కూఁతకైదువు, కూఁతనేల, కూఁతపట్టు, కూఁతపట్టునేల, కూఁతవేటుమేర.

**7.తునుక / తున్క :-**

తే. **తివిరి దేదీప్యమానమై తేజరిల్లు**
**నర్భకుని వజ్రధారల నడిచె నేడు**
**దునుకలుగ వాఁడు దునిసియుఁ దునక దునకఁ**
**జెడక నొక్కొక్క బాలుఁడై చెలఁగుచున్న**[10]

'తునుక' శబ్దము **ü**తునుఁగు నుండి జనించింది. దీని అర్థాలు 1. తెగు, విఱుగు, చినుగు, 2. చెడు, నశించు. సజాతి రూపాలు - త. తుణి (-వ్-, -న్త్-); మ. తుణియుక; అనే క్రియారూపలు, త.తణుక్కై, తుణిక్కై, తుణుక్కు; మ. తుణి; క.తుణక, తుణకు, తుణుకు, తుళకు; న. తుంకె; (*DED* 2707) అనే నామరూపాలు లభిస్తున్నాయి. త.మ.లలో మాత్రమే క్రియారూపాలు ఉండగా, మిగిలిన భాషల్లో మాత్రం క్రియారూపం నశించి, కేవలం కృదంత రూపాలు మాత్రమే మిగిలాయి. కాగ, తెలుగులో మాత్రం క్రియారూపం, కృదంతరూపం రెండూ లభిస్తున్నాయి. ఐనప్పటికీ 'తునుఁగు క్రియ తెలుగులో కూడ వాడుకలో లోపించింది.

**8.పోక : -**

పోబడునది - పోక. భావార్థం. 1. గమనం 2. ప్రవర్తన 3. నాశనం మొ.నవి.

(2) పోవు + కడ > పోకడ. పోబడునది - పోకడ. భావార్థం. 1. గమనం 2. ప్రవర్తనం 3. నీతి, మర్యాద 4. మరణం 5. నాశం

(3) పోవు + కు > పోకు . పోబడునది - పోకు. భావార్థం 1. ప్రవర్తన 2. వృత్తం (చరిత్ర). ఈ రూపానికి బహువచనాంతంగ మాత్రమే ప్రయోగాలున్నాయి.

(4) పోవు + బడి > పోబడి. గమనం. భావార్థం.

తద్ధితాంత రూపాలు :

1. పోక+ఇరి > పోకిరి. స్వార్థం 'దుశ్శీలుడు' అని అర్థం.

త.మ. పోక్కిరి, క.పోకరి, తు.పోకిరి, పోకురి - అనే సజాతీయ రూపాలు కూడా లభిస్తున్నాయి.

2. పోకిరి + ఈఁడు > పోకిరీడు. స్వార్థం. 'దుఃశీలుడు'.

3. పోకలు + ఆఁడి > పోకలాఁడి. స్త్రీవాచకం. 'కపటశీల'.

4. పోకలు + ఆఁడు > పోకలాఁడు. పుంవాచకం. 'కపటశీలుడు'.

5. పోకు + ఇళ్ళు > పోకిళ్ళు. స్వార్థం. బహువచనాంతం.

6. పోకిళ్ళ + మారి > పోకిళ్ళమారి. మతుబర్థం. 'దుష్టశీలుడు.'.

**9 .మలక /మలఁక :-**

చ. **<u>మలకలు</u> మా ప్రచారములు. మా ముఖముల్ విషవహ్ని ఘోరముల్...**

క. **ఆ చీకటి వెను దగిలిన**

**ప్రాచీదిశ నుండి గంతు పరువున రవి భ**

**ర్మాచలము <u>మలఁక</u> త్రోవను**

**వేచనియెంగాక నిలిచి వఱుగక యున్నే[14]?**

మలఁక తె.üమలఁగు నుండి పుట్టింది. కోశాలలో నిర్బిందు రూపం లేదు. కాని పోతన వ్రాసిన పై మొదటి పద్యంలో ఖండబిందువు లేదు. అది తెలుగు విశ్వవిద్యాలయం వారు పరిష్కృత పాఠంగా ఉదహరించారు .

తె.üమలఁగు (అ.క్రి.) కు 1. వెనుకకు మరలు 2. పక్కకు దిరుగు 3. వంకరగా తిరుగు 4. తొలఁగు 5. చుట్టుకొను 6. తిరుగు 7. వర్తిల్లు 8. క్షీణించు 9. క్షోభ పడు 10. మండు 11. సంకోచించు అనే అర్థాలున్నాయి.

సోదర భాషల్లో -

త.మలర్; క. మలగు; కొలామి. మలయ్ -;తు.మలెఌని; మ.మలరుక అనే క్రియారూపాలు లభిస్తున్నాయి.

మూ.ద్రా. *మల్ - పై ధాత్వనుబంధం - న్క్ - చేరగా, శ్వాసీకరణ, ఉత్వములచే తె.üమలగు నిష్పన్నమౌతుంది.

(1) తె.üమలఁగు + క > మలఁక (మలక)

మలఁగు నది మలఁక. (భావార్థం) ' వంకరయైనది, వలయం, మెలిక'. పై రెండు పద్యాలలోనూ

'వంకరయైనది' అనే అర్థంలోనే ప్రయోగించబడింది.

(2) మలఁగు + అ > మలఁగ .'సరకులు మలఁగుటకు (వర్తిల్లుటకు) ఉపకరించును'.

దీనియందు సరుకులు మలఁగును. (అధికరణార్థము) 'ఎద్దుపై గంతతోడి సరకు గోనె'.

**10.ముదుక :-**

వ. **... ముమ్మూర్తుల <u>ముదుక</u> వేల్పు[15] .....**

క. **తనకడుపున నొక వెఱవున**

**గొనగొని జిములను నిముడుకొనియెడి <u>ముదుకం</u>**

**డని మిషుల జనని కడుపునఁ**

**దనుగతిఁ గడునడఁగి మడఁగి తనరెన్ బెడగై[16].**

ఈ ముదుక శబ్దం విశేషణంగా, విశేష్యంగా కూడ ఉన్నది. పై మొదటి పద్యంలో విశేషణంగా, రెండవ దానిలో విశేష్యంగా ప్రయోగింపబడింది. ఇది తె.üముదియు నుండి ఉద్భవించింది.

తె.üముదియు (అ.క్రి.) కు 1. వార్థక్యం పొందు 2. జీర్ణమగు అనేవి అర్థాలు.

సజాతీయ రూపాలు -

త. ముతిర్ (-వ్-, -న్త్-), మూ (-ప్ప్-, -త్త్-); మ. మూక్క; క.ముదు (ముత్త్ -); తు.ముదియుని; అనే క్రియారూపాలు లభిస్తున్నాయి.(TVB 1000)

త. ముతు 'పాత', ముతుమై 'ముదిమి', మూత్తార్ 'పెద్దాయన', మూత్తాళ్ 'పెద్దామె'; మ.ముతు, ముతుక్కన్, ముతుమ; కోత, ముద్, ముద్క్; క.ముది, ముదుకు; కొడగు. ముది, ముదికె; తు. ముది, ముదు, ముదియె, మొ. నామరూపాలు లభిస్తున్నాయి.(DED 4057)

మూ.ద్రా. *మూ-/ *మూచ్-/ *మూత్-.

*మూత్ - పై తెలుగు ధాత్వనుబంధం -యు చేరగా, ఉచ్చారణ సౌలభ్యం కోసం 'ఇ' చేరి, ముదియు నిష్పన్నమైంది.

(1) తె.ü ముదియు + ఇ > ముది. (భావార్థం) 'ముసలితనము'.

(2 తె.ü ముదియు + క > ముదుక 1. ముదుకఁడు.ముదిసినవాడు(కర్త్రర్థం). 'ముసలివాడు ,గొప్పవాడు'.

(3) తె.üముదియు + ఇమి > ముదిమి. భావార్థం.' ముసలితనం'.

(4) తె.üముదియు + ఇ > ముద్ది (కర్త్రరం) 'ముసలామె'.

**11.మునుక :-**

క. **కట్టా! తల<u>మునుక</u>లునై**

**దట్టపు విరహాగ్ని శిఖలు తరుణుల వేఁప**

**న్నెట్టుం బలుకవు చూడవు,**

**కట్టిఁడివి గదా కుమార! కరుణోదారా![17]**

తె.üమునుఁగు నుండి పుట్టినది - మునుక.

తె.üమునుఁగు (అ.క్రి.) కు 1. స్నానం చేయు, మునకవేయు2. (జలాదులందు) మగ్నమగు 3. క్రుంగు, అడఁగు 4. అస్తమించు 5. ఆవృతమగు 6. సక్రమగు 7. నశించు 8. తీఱు 9. నాటు అనే అర్థాలున్నాయి.

సోదర భాషల్లో - త.ముఙ్కు; మ. ముఙుకుక; క.ముఙుగు, ముణిగు; తు.ముళుగుని, ముఙుగని; కో. మూళ్గ్ -; కుమి. ముజ; అనే సజాతీయ క్రియారూపాలు లభిస్తున్నాయి.(TVB 1004)

మూ.ద్రా. *మూళ్ - / *మూన్ -

*మూన్ - పై 'క్' అనుబంధం చేరి, హ్రస్వత, శ్వాసీకరణాలు జరిగి , తె.üమునుఁగు నిష్పన్నమైంది.

తె.üమునుఁగు + క > మునుక.

మునుఁగ బడుటచే మునుక -(భావార్థం) 'నీటియందు మగ్నము'.

**12.మూఁక :-**

వ. **అట్టియెడ సకల రాజలోకంబున గృష్ణుని విభవంబు**

**చూపోవక, యసంఖ్యంబులగు <u>మూఁక</u>లు గట్టి[18]....**

తె.ü మూఁగు నుండి జనించినరూపం - మూఁక. తె.ü మూగు (స.క్రి.) కు 'ఆవరించు', చుట్టుకొను అని; (అ.క్రి.గా) 1. ముసురు 2. గుంపుగూడు 3. అతిశయించు 4. వ్యాపించు - అని అర్థాలు.

సజాతీయ రూపాలు - త. మూయ్, మూచు; క.ముకఋ, ముక్కఋ; అనే క్రియారూపాలు.

త.మూక్కై అనే నామరూపం లభిస్తున్నాయి.(DED 4128)

మూ.ద్రా. *మూ- పై -న్క్ అనుబంధం చేరి, శ్వాసీకరణం చెంది , తె.ü మూఁగు నిష్పన్నమౌతుంది.

తె.ü మూఁగు + క > మూఁక.మూఁగునది - మూక(కర్త్రర్థం). 1.' సేన 2. సమూహం'.

జ. ముక్కడిమూఁక, మూఁక విప్పు, మూఁగంబాఋ, మూఁగబడు, మూఁగతీఁట, మూఁగపోత, మూగికొను.

**13.మొలక :-**

వ. **మొగంబునం జిఋనగవు <u>మొలక</u>లొత్త, గృహమేధికి**

**మేధావి యిట్లనియె[19]...**

తె.ü మొలచు ధాతువు నుండి పుట్టింది - మొలక.

తె.ü మొలచు (అ.క్రి.) కు 1. వృక్షాది స్థావరాలు, సంతోషాది మనోధర్మాలు - పుట్టు 2. ఆవిర్భవించు, ప్రత్యక్షమగు 3. ప్రాప్తించు అనే అర్థాలు ఉన్నాయి.

సజాతీయ రూపాలు - త. ముళై; మ.ముళెక్క; క.ముళె; తు.ముళెయుని, ముళెవుని, ముళియుని, అనే క్రియారూపాలు.(TVB- 1057 )

త.ముళై 'మొలక', ముళరి 'తామర'; మ.ముళ; క. ముళి - అనే నామ రూపాలు లభిస్తున్నాయి.

మూ.ద్రా. *మూళ్ -/ *ముళ్ - వ్ - . *ముళ్ > తె.ü మొలచు.

తె.üమొలచు + క > మొలక. మొలచునది మొలక.(కర్త్రర్థం). అంకురం విశేషంగా - లేత (చిన్న) అని అర్థం. పై వచనంలో చిన్న అనే అర్థంలోనే ప్రయోగించబడింది.

(*ii*) తె.üమొలచు+వ >మొలువ ' మొలక '.

జ. మొలకకట్టు, మొలకకెంపు, మొలకబంగారు, మొలక బేడలు, మొలకలెత్తు, మొలతెంచు, మొలవబెట్టు, మొలవేయు

**14.వంక :-**

సీ. **... ప్రసన్నతనొంది కుబ్జ మువ్వంకల.**[23]..

వంక < తె.üవంగు. తె.ü వంగు (అ.క్రి.) కు 'వక్రమగు' అని అర్థం.

వంక(వి) కు 1. వక్రత 2. వంపు 3. చెడుపని 4. తప్పు 5. సెలయేఱు అని అర్థాలు.

సోదరభాషల్లో - త. వణంకు, వణక్కు, వణర్, వళై; మ.వణంకుక, వళెక్క; క.బగ్గ, బంకు, బళ్ళ, బళుకు, బళుంకు; కోత. వగ్ -; కుయి. పల్గ; కువి. వంగ్ -; అనే క్రియారూపాలు.

త. వాంకల్, వాక్కు 'వంక', వాణ్ణల్ 'విరమణ'; క.బాగు 'వంక; అనే నామరూపాలు లభిస్తున్నాయి.

(TVB-1122)మూ.ద్రా. *వణ్ - క్ - .

*వణ్ - క్ - > తె.üవంగు

(1) తె.üవంగు + క > వంక.(భావార్థం)

(2) తె.üవంగు + అర > వంకర. (భావార్థం)

(3) తె.üవంగు + ఇయ > వంకియ 'అంకుశం'. ఏనుగును వంగునట్లు చేయునది(కర్త్రర్థకం). ఈ ప్రత్యయమునెవ్వరూ పేర్కొనలేదు.

తద్ధితం : -వంక + ఇ > వంకి. మతుబర్థంలో ఇ ప్రత్యయం.వంక గలది.1. వంకకత్తి.2.వంకి / వంకీ 'స్త్రీలు ధరించే ఆభరణం'.

**15.వీఁక :-**

క. **చెలికాని పాటు కనుఁగొని**

**బలిసఖుడగు జంభు డతుల బాహా శక్తిన్**

**జెలితనము సాలనెఱపుచు**

x □°x □°=°x **<u>వీఁకఁ</u> దాఁకె నిర్జరనాథున్.**[20]

క. **<u>వీఁక</u> చెడి ఘనగదాహతిఁ**

**దోఁకయుఁగదలింపలేక**[21]**....**

తె.**ü**వీఁగు నుండి పుట్టిన కృదంతం - వీఁక. తె.**ü**వీఁగు నకు 1. ఉత్సహించు 2. నిక్కు 3. యుద్ధం నుండి పాఱు 4. భయపడిపాఱు 5. చలించు 6. తొలఁగు 7. వెనుదీయు 8. ఒదిగియుండు 9. శిథిలమగు 10. ప్రసిద్ధికెక్కు 11. విసరు (వీచు) - అనేవి అర్థాలు.

తె.**ü**వీఁగునకు సజాతీయ రూపాలు - త.వీ(వీ-న్త్-); క.బీగు, బీ; కుయి. విహ; అనే రూపాలు లభిస్తున్నాయి.(TVB- 1177)

మూ.ద్రా. *వీ - > తె.**ü**వీఁగు.

తె.**ü**వీఁగు + క > వీఁక. వీఁగ బడునది - వీఁక (వీగుట)(భావార్థం). దీని అర్థాలు 1. ఉత్సాహం 2. పరాక్రమం 3. బలం 4. గర్వం 5. సాహసం 6. విజృంభణం 7. ఔదార్యం 8. ఔన్నత్యం 9. వంగుట 10. విహారం 11. దైన్యం 12. యుద్ధం నుండి పాఱుట 13. సామ్యం 14. ప్రభావం 15. విధం

పై వాటిలో మొదటి పద్యంలో' పరాక్రమం' అనే అర్థంలో, రెండవ పద్యంలో 'బలం' లేదా 'ప్రభావం' అనే అర్థంలో ప్రయుక్తం.

**16.వ్రక్క :-**

సీ. **"వక్ష కవాటంబు <u>వ్రక్క</u>లు సేయుచో**

**ఘన కుటారంబుల కరణ నొప్పు**[22]**..... "**

తె.**ü**వ్రచ్చు నుండి జనించింది - వ్రక్క.

తె.**ü**వ్రచ్చు (స.క్రి.) కు 1. భేదించు 2. పెకలించు 3. హింసించు 4. పిసుకు - అనేవి అర్థాలు.

సజాతీయ రూపాలు - త.వళి, వళువు; క.బళి, బొళి; కుయి, వ్రప్క అనేవి.

తె.**ü**వ్రచ్చు + క > వ్రక్క. ద్విరుక్తత ఇందలి ప్రత్యేకత.వ్రచ్చునది - వ్రక్క. (కర్త్రర్థం) - 'ఖండ' ముక్క'.

**6.2. -కడ :-** భాగవతంలోని - కడ ప్రత్యయాంత కృదంతం ఒక్కటె -అది -

**నిలుకడ :-**

క. **త్రిగుణ ప్రధానకంబులు**

**నగునవతారములు పూర్ణమై వెలసిన యా**

**జగదుత్పత్తిస్థితి లయ**

**నిగమముల విధంబు వాని నిలుకడలు దగన్.**[24]

తె.üనిలుచు నుండి జనించింది నిలుకడ. తె.üనిలుచు (అ.క్రి.) కు 1. నిలువబడు 2. ప్రతిష్ఠించు 3. వర్తించు 4. నివసించు5. శేషించు 6. ఆఁగు 7. ఓర్చు 8. కలుగు 9. పాదుకొను10. తీఱు 11. జీవించు 12. (యుద్ధాదులందు) వెనుదీయకుండు,13. జీవంతో నుండు 14. ఉదయించు 15. వృద్ధినొందు16. విశ్రమించు మొదలైన అర్థాలున్నాయి.

సజాతీయ రూపాలు - త.నిల్ (నిన్-ఌ్-); మ. నిల్క్;క.నిల్, నిలు, నిల్లు; తు.నిల్పుని; కోత. నిల్-1నిన్-;మొదలైన క్రియారూపాలు లభిస్తున్నాయి.(TVB- 727 )

త.నిలువై. నిలైప్పు; మ.నిల్పు, నిలవు; క.నిల, నిలవు,నిలు, నిలువు; తు. నిలగడె, నిల్గడె; మొదలైన నామ రూపాలు లభిస్తున్నాయి.(DED - 3043)

పై వాటి పరిశీలన వల్ల మూ.ద్రా. క్రియాధాతురూపం *నిల్ - గా ఊహించవచ్చు. *నిల్-పై 'చు' ధాత్వనుబంధం చేరి, తె.üనిలుచు నిష్పన్నమౌతుంది.

(1) తె.üనిలుచు + కడ నిలుకడ > నిలుకడ.నిలబడునది - నిలుకడ. (భావార్థం) 1. 'ఉత్థానం' 2. స్థిరత్వం.

దీనియందు నిలిచెదరు - నిలుకడ(అధికారణార్థం).1. నివాస స్థానం 2. ధైర్యం 3. పట్టుదల .

(2) తె.üనిలుచు + వు > నిలువు.నిలబడునది - నిలువు. (భావార్థం) 'ఉత్థానం'.

**6.3. -కలి :-** భాగవతంలోని - కలి ప్రత్యయాంత కృదంతం ఒక్కటె -అది -

**వినుకలి :-**

సీ. **"అనవుడు నాతనికనియె భూకాంతుండు వినుకలి కలిగినట్టి.[25].."**

తె.üవిను ధాతుజన్యం వినుకలి. తె.üవిను (స.క్రి.) 'ఆకర్షించు'.

సజాతీయ రూపాలు - త.విన్ 'ప్రశ్నించు'; వినవు 'ప్రశ్నించు', విను;త.మ. వినవుక; కొత. వెన్ -; తొద.పిన్ -; కుయి. వెన్‌బ;కువి. వెన్; నాయకి. విన్-; అనే క్రియారూపాలు లభిస్తున్నాయి.

త.విణ - ప్రశ్న; సజాతీయ నామ రూపం లభించింది.(TVB - 1171 )(DED 4472 )

పై వాటి పరిశీలన వల్ల మూ.ద్రా. రూపం *విన్ -/ *వెన్ - గా ఊహించవచ్చు.*విన్ >తె.üవిను.

(1) తె.üవిను + కలి > వినుకలి

(అ) వినబడునది - వినుకలి (భావార్థం) 'శ్రవణం', 'కీర్తి'

(ఆ) దీనిచె వినెదరు - వినుకలి (కరణార్థం) 'చెవి'

(2) విను + ఇకి > వినికి. భావార్థం - 'శ్రవణము'.

(3) విను + ఉ > వీను - 'చెవి' కర్త్రర్థం.

తద్ధితం :వినికి + ఇడి (స్వార్థం) > వినికిడి. 'వినుట'.

**6.4.కువ :-** భాగవతంలోని - కువ ప్రత్యయాంత కృదంతాలు -

1. అడకువ 2. కలంకువ, కలఁకువ (చూ.కలఁక)

3. తెలుకువ 4. తేఁకువ 5. మెలకువ

**1.అడఁకువ :-**

తరల. **పుడమి నిట్టక నిల్వనంబడి పొక్కుచుం గడుదీనయై**

**యడఁకు వేమియు లేని వాక్కుల నావురంచు విలపమం**

**దెడరు తోప భృశాతురోన్నతి నేడ్చినన్ విని భీతితో**

**గడుపు బిట్టవియంగ భూపతి కాంత గ్రక్కున నేగుచున్** [26]

అడఁకువ కు రూపాంతరం అణఁకువ. ఇది తె.üఅడఁగు/ తె.üఅణఁగు నుండి పుట్టింది. అడఁగు (అ.క్రి.) కు 1. దిగబడు, క్రుంగు 2. నమ్రమగు, లొంగు 3. ఇముడు 4. దాఁగు 5. నిరుద్ధమగు 6. అదృశ్యమగు 7. నశించు అనే అర్థాలున్నాయి.

సజాతీయ రూపాలు - త.అటంకు; అటక్కు; మ. అటణ్ణుక, అటక్కుక, అటెక్క; క.అడగు, అడంగు; తు.అడెంగుని,అడెపుని, అడేయుని, అడేవుని; కుయి. ఆట్వ -1 అఙ్వ; అనే క్రియారూపాలు.(TVB-6 )

మ.త. అటక్కమ్; కోత. అఙ్కమ్; తొద. ఒడ్కమ్; క.అడక; కొడగు. అడక; అనే నామరూపాలు లభిస్తున్నాయి.(DED 56 )

పై వాటి పరిశీలన వల్ల మూ.ద్రా. ధాతురూపం *అట్-న్క్- గా పునర్నిర్మించవచ్చు.

*అటంక్ > తె.üఅడఁగు.

తె.üఅడఁగు + కువ > అడఁకువ.అడఁగుటయే - అడఁకువ. భావార్థం 1. వంగుట2. నమ్రత 3. గర్వం లేకపోవడం అనేవి అర్థాలు

జ. అడఁగఁగట్టు, అడఁగఁద్రొక్కు, అడఁగారు, అడఁగించు, అడఁగిమడఁగి, అడఁచు.

**2.కలంకువ, కలఁకువ :-**

సీ. **“.... దిక్కులఁగౌవిరి విరిసెను దవిలి వార్ధుల _కలంకువ_లుమానె[28]...”**

సీ. **“.... కర మొప్ప జలధులఁ _గలఁకువ_లుడిగెను[29]..”**

కలంకువ, కలఁకువ ఇవి రెండు రూపాలు. ఇవి కలఁగు నుండి జనించాయి.

కలగు + కువ >కలఁకువ . కలఁగబడునది - కలఁకువ. భావార్థం 'కలత, సంక్షోభం'

(విశేష వివరాలకు 'కలఁక' చూడండి)

**3.తెఱకువ :-**

చం. **"ఎఱుఁగడు వీఁడు నా భటుడొకించుకయైన మనంబులోపలన్**

**<u>తెఱకువ</u> లేక నీ జనకుఁదెచ్చె[27]..."**

తె.üతెఱచు అనే క్రియాధాతువు నుండి జనించింది 'తెఱకువ'.తె.üతెఱచు (స.క్రి.) కు 1. వివృతం చేయు 2. తొలగించు (అ.క్రి.) 3. బయలువడు అనే అర్థాలున్నాయి.

(1) తె.üతెఱచు + కువ > తెఱకువ.అజ్ఞానాన్ని తెఱచునది =తొలగించునది - తెఱకువ'జ్ఞానం / తెలివి' (కరణార్థం).

(2) తె.üతెఱచు + అ >తెఱ.తెఱవదగినది/తొలగించదగినది 'యవనిక '(కర్మార్థం).

**4.తేఁకువ :-**

క. **ఆ పాపల విహరణములు**

**తీపులు పుట్టింప మరఁగి <u>తేఁకువ</u> లేకా**

**గోపాల సతులు మక్కువ**

**నే పనులును మఱచియుండి రీక్షణపరులై[30]**

తె.üతేఁగు ధాతుభవం తేఁకువ. తేఁగు (అ.క్రి.) కు 'భయపడు, వణకు' అని అర్థాలు.

దీనికి సజాతీయ రూపాలు టి.వి.బి.లో కాని, డి.ఇ.డి.లో కాని లభించలేదు.

తె.üతేఁగు + కువ > తేఁకువ. తేఁగుటయే - తేకువ(భావార్థం) 'భయం, జంకు' అని అర్థాలు. అర్థ విపరిణామాల వల్ల కలిగిన అర్థాలు 1. ధైర్యం 2. గర్వం 3. ఉత్సాహం, సంతోషం 4. దృఢ సంకల్పం 5. బింకం 6. వివేకం 7. మర్యాద, గౌరవం 8. హద్దు, మేర 9. ఓర్పు అనేవి అర్థాలు.

**5.మెలఁకువ :-**

క. **"పోరుదురు గికురు వొడుచుచు**

**దూఱుదురు భయంబులేక తోరపుటిరువుల్**

**జాఱుదురు ఘనశిలాతటి**

**మీఱుదురెన్నంగరాని <u>మెలఁకువ</u>ల నృపా![31]"**

తె.**ü**మెలఁగు ధాతు జన్యం మెలఁకువ. తె.**ü**మెలఁగు (అ.క్రి.) కు1. ప్రవర్తించు 2. ఉండు 3. తిరుగు 4. ప్రాకు 5. వ్యాపించు 6. ప్రవహించు 7. వీఁచు అనేవి అర్థాలు.

సజాతీయ రూపాలు - క.మిళిర్; కొలామి. మెలాగ్ - ; మెల్గ్-; అనే క్రియా రూపాలు లభిస్తున్నాయి.

మూ.ద్రా. రూపం *మెల్ - . *మెల్ - పై - న్క్ - అనుబంధం చేరి, తెలుగులో **ü**మెలఁగు అనే రూపం నిష్పన్నమౌతుంది.(TVB - 1039)

తె.**ü** మెలఁగు + కువ > మెలకువ.దీనియందు ప్రజలు మెలఁగుదురు (అధికరణార్థం) 'మేల్కొనుట' అని అర్థం. మెలఁకువ కు అర్థాలు : 1. వర్తనం 2. భద్రంగా వర్తించుట 3. జీవనం 4. సంచారం 5. ధైర్యం 6. చోటు 7. నేర్పు 8. నాట్యగతి విశేషం

జ. మెలఁకువ, మెలఁకువకాడు, మెలఁకువపడు, మెలఁగాడు, మెలఁగించు, మెలపు, మెలన.

**6.5. -గడ : -** భాగవతంలోని - గడ ప్రత్యయాంత కృదంతం ఒక్కటె -అది -

**చేరుగడ :**

సీ. **"ఆశ్రిత శ్రేణికేయధిపతి పాదరాజీవ యుగ్మంబులు <u>చేరుగడ</u>లు[32]"...**

చేరుగడ - తె.**ü**చేరు నుండి పుట్టింది. తె.**ü**చేరు(అ.క్రి.) కు1. సమీపించు 2. లభించు 3. కలుగు 4. సిద్ధించు 5. ప్రవేశించు 6. ఒఱగు 7. వశమగు

స.క్రి. గా - 1. పొందు 2. సమీపించు 3. ఆశ్రయించు 4. అంటు అని అర్థాలు.

సజాతీయ రూపాలు - త. చేర్; మ. చేరుక; క. సేర్,సార్; కోత. చేర్ -, చేడ్ -; గోండి. సేఁ -; అనే

క్రియా రూపాలు.

త. చేర్క్కై 'చేరిక', చేర్త్తి 'చేరిక', చేర్పు 'స్థలము, నివాసము';మ. చేర 'సమీపం', చేరిక, 'చేరిక', చేరుమానమ్ 'అందరు ఒక్క దగ్గర చేరుట', చేర్చ, చేర్ప్పు, చేర్వ్వ; క. సేరికె 'చేరిక', సేరువె, సేర్వె; తు. సేరిగె, సేర్వె; మొదలైన నామరూపాలు లభిస్తున్నాయి.(TVB - 478 )(DED 2312 )

పై వాటి పరిశీలన వల్ల మూ.ద్రా. *చేర్ - అని ధాతువును ఊహించవచ్చు. *చేర్ - >తె.üచేరు.

(1) తె.üచేరు + గడ > చేరుగడ.

(అ) చేరబడునది చేరుగడ. (కర్త్రర్థం) 'సమీపం'

(ఇ) ఆర్తులకు చేరదగినది = పొందదగినది 'శరణం' (కర్మార్థం).

(2) తె.üచేరు + ఇక > చేరిక(భావార్థం) 'సమీపం, మైత్రి'.

(3) తె.üచేరు + బడి > చేరుబడి (భావార్థం) 'సమీపం'.

(4) తె.üచేరు + వ > చేరువ (భావార్థం) 'సమీపం'

(5) తె.üచేరు + పు > చేర్పు / చేరుపు (భావార్థం) 'సమీప స్థలం'.

**6.6. -గు :-** భాగవతంలోని - గు ప్రత్యయాంత కృదంతాలు -

(1) పెరుగు (2) మెఱుగు (3) వెఱగు

**1.పెరుఁగు :-**

క. **"ఏ తెంచి చూచి చెలఁగుచు**

**నేతులఁ <u>బెరుఁగు</u>లను బాల నీళ్ళను వెన్నం**

**బ్రీతి వసంతములాడిరి**

**యాతురులై సరస భాష లాడుచు గొల్లల్"[33].**

పెరుఁగు అను కృదంతంతె.üపేరు నుండి ఉద్భవించింది.

తె.üపేరు (అ.క్రి.) కు 1. అతిశయించు 2. దట్టమగు 3. గడ్డకట్టు, తోడుకొను అని అర్థాలు.

దీని సజాతీయ రూపాలు - మ. పిరియుక 'పెరుఁగుగా తోడుకొను', పిరన్నుక; క.పేఱ్ (పెత్త్-) 'దట్టమగు, గడ్డకట్టు' తోడుకొను'; తు. పెర్పుని; అనే క్రియారూపాలు.

త. పెరుకు, పిరై 'దధి'; కోత. పెప్; తొద. పెప్ 'తోడు' (పాలలో వేయునది); క. హెప్పు 'తోడు' ; తు. పెర్పు 'తోడు'; కొలామి. పెరెగ్, పెర్గ్; అను నామరూపాలు లభిస్తున్నాయి.(DED 3621 )

పై వాటి పరిశీలన వల్ల మూ.ద్రా. ధాతురూపం *పేర్' గా ఊహించవచ్చు.

*పేర్ > తె.üపేరు.

తె.üపేరు + గు > పెరుఁగు. '-గు' అనే కృత్ప్రత్యయం పరమైనప్పుడు ధాత్వంత లోపం జరుగుతుంది. కాగ 'యు, చు' వంటి ధాత్వంతాలకే జరుగుతుంది. ఈ ధాతువులో అట్టి అవకాశం లేనందున, దానికి ప్రత్యామ్యాయంగా ఆద్యచ్చునకు హ్రస్వత కలిగింది. అదీ విశేషం.

పేరునది = తోడుకొనునది - పెరుగు (కర్త్రర్థం)'దధి'.

**2.మెఱుఁగు, మెఱుంగు, మెఱుము : -**

సీ. **... "వాన కురిసెను మెఱుఁగులు దెసల మిర్మిట్లు గొలిపె[34]..."**

వ. **.... మేఘజాలంబులు హృషీకేశుని కేశంబులు. మెఱుంగులు విశ్వేశ్వరుని శ్మశ్రువులు[35].....**

క. **ఈ యుఱుములు నీ మెఱుములు**

**నీ యశని విఘోషణములు నీ జలధారల్**

**నీయాన తొల్లి యెఱుఁగము**

**కూయా లింపంగదయ్యా! గుణరత్న నిదీ[36]!**

మెఱుఁగు, మెఱుంగు, మెఱుము అనే ఈ శబ్దాలుతె.ü మెఱయు నుండి జనించాయి. తె.üమెఱయు (అ.క్రి.) కు 1. ప్రకాశించు 2. ఒప్పు 3. వెల్లడియగు 4. విజృంభించు 5. ఉద్యమించు 6. ప్రసరించు అనేవి అర్థాలు.

సజాతీయ రూపాలు - క. మెఱె; మిఱుగు; తు. మెఱెయుని; కొలామి. మెర్ప్-; నాయకి. మెర్ప్; గదబ. మెర్చ్; మాల్తో. మెర్గ్ అనే క్రియా రూపాలు.(TVB- 1035 )(DED 4163 )

త. మిరుకు; మ. మెరుకు, వెరుక్కు; క. మిఱు; తు. మెరె అనే నామరూపాలు లభిస్తున్నాయి.

(1) తె.üమెఱయు + గు > మెఱుఁగు, మెఱుంగు.

(2) తె.üమెఱయు + ము / మెఱుము + ఉ > మెఱుము.

మెఱయునది మెఱఁగు, మెఱంగు, మెఱుము(కర్త్రర్థం)‘ మెఱుపు, కాంతి (మేఘ కాంతి)’

**3.వెఱఁగు/వెరఁగు :-**

క. **“అని <u>వెఱఁగు</u> నొంది పావన**

**తనువొందిన యట్టి వికచ తామర సాక్షున్**

**ముని యోగ జన త్రిదశా**

**వనదక్షున్ దనుజ కరటివర హర్యక్షున్”**[37].

వెఱఁగు - తె.üవెఱచు భవం. తె.üవెఱచుకు (అ.క్రి.) 1. భయపడు 2. ఆశ్చర్యం కలిగించు 3. సంకోచించు 4. నమ్రంగా ఉండు అనేవి అర్థాలు.

సజాతీయ రూపాలు త. విత్తై (విఅ-న్త్-); మ.విరెక్క;క.బెచ్చు, బెర్చు; తు. బెరగుని; కోత. వెర్న్-; అనే క్రియారూపాలు.(TVB - 1191)

త. విత్తైప్పు, విఱుమై; క.బెఱగు; తు.బెఱగు అనే నామ రూపాలు లభిస్తున్నాయి.(DED 4470 )

పై వాటి పరిశీలన వల్ల మూ.ద్రా. ధాతువు *వెత్-వ్-గా ఊహించవచ్చు.

*వెత్- > తె.üవెఱచు.

(1) తె.üవెఱచు + గు > వెఱఁగు.వెఱచబడుటచే వెఱుగు(భావార్థం). 1. ఆశ్యర్యం 2. ఆశ్చర్యం అనేవి అర్థాలు.

(2) తె.üవెఱచు + అ > వెఱ. భావార్థం 1. భయం 2. ఆశ్చర్యం 3. నిశ్చేష్టత.

6 .7. **ట : -**

భాగవతంలోని - ట ప్రత్యయాంత కృదంతాలు -

(1) అలసట (2) ఆట (3) చెమట (4)తివుట (5) తీట

(6) తేట (7)పాట (8) మంట (9)వేట

**1.అలసట :-**

ఆ. **<u>అలసటయు</u> లేక యఖిలార్థములు గల్గు**[38]**...**

అలసట అనే ఈ కృదంతం తె.üఅలయు నుండి పుట్టింది.తె.üఅలయుకు (అ.క్రి.) 1. శ్రమపడు 2. విసుగు 3. తడయు, విలంబంచేయు అని అర్థాలు.అలసట (వి) కు శ్రాంతి, అలపు అని అర్థాలు.

సోదరభాషల్లో - త. అలు, అలచు; మ. అలయుక, అలసుక; క. అలసు; తు. అలసుని, అలపుని, అలెయుని, అనే క్రియారూపాలు.

త.అలచల్ 'బద్ధకం', అలైచు; మ.అలసల్; క. అల; తు. అలసు 'ముసలి', అలసళు 'అలపు'; పర్జీ. అలచ్ 'రోగం'; కుయి. అలారి; మాల్తో. అలెసి 'చెమట'; అనే నామరూపాలు లభించాయి.(TVB -46 )

మూ.ద్రా. *అల్ - ధాతువుపై యు ధాత్వనుబంధం చేరి తె.üఅలయు నిష్పన్నమౌతుంది. కాగ, ఈ అలసట అనే కృదంతం మాత్రం తెలుగులోని ధాతురూపానికి పూర్వమే సిద్ధమైందని భావించాలి.

పైన సూచించిన త.మ. క. భాషల్లో ధాతువుల్లో సు/చు అనే అనుబంధం చేరిన రూపాలున్నాయి. అందువల్ల - (1)అల - స్ - +ట - తె.üఅలసట. అలయుటచే - అలసట (భావార్థం).

(2) తె.üఅలయు + త - అలత. (భావార్థం)

(3) తె.üఅలయు + పు - అలపు. (భావార్థం).

(4) తె.üఅలయు + ఇక - అలయిక. భావార్థం.

ఒకే ధాతువు నుండి పుట్టిన - నాలుగు కృదంతాలు ఒకే అర్థాన్ని ఇచ్చేవి. ఇదీ ఇక్కడి విశేషం.

**2.ఆట :-**

క. **ఓటమితో నెల్లప్పుడు**

**పాటవమున బనులు సేసి బాలుర తోనే**

**<u>యాట</u>లకు బోకనొక జం**

**జాటంబును లేక భక్తి సలుపుదు నసఘా!**[39]

తె.üఆడు (స.క్రి.) క్రీడించు.ఆడు + ట - ఆట .ఆడబడునది - ఆట. (భావార్థకం) - 'క్రీడ.'

(విశేష వివరాలకు - ఆడిక చూడండి).

**3.చెమట :-**

ఈ పదం తె.üచెమరు నుండి పుట్టినది.తె.üచెమరు ధాతువు హరి వంశంలో 'చెమటతో తడియు' అనే అర్థంలో వాడబడింది. తె.üచెమరుచు అని రంగనాథరామాయణం, మనుచరిత్రలలో వాడబడింది.

తె.üచెమరు లోని 'రు' లోపించి 'ట' ప్రత్యయం చేరుతుంది. అంత్యవర్ణలోపం వల్ల ఇది 'ఆడ్వాది' గణంలో చేరదగినది.

తె.üచెమరు/తె.üచెమర్చు - 'చెమట'.చెమ్మ అనేపదం కూడ తె.üచెమరు భవమని భద్రిరాజు పేర్కొన్నారు.తుళు లోని సిమ్మ, తెమ్మ శబ్దాలు 'చల్లదనం'ను తమిళంలో చెమ్మల్ శబ్దం జలార్థాన్ని బోధిస్తున్నాయి.సంస్కృతంలోని *సిమ్ జన్యరూపంగా *చిమ్ అనేది ద్రవిడ భాషల్లో స్వీకరించబడింది అని, తెలుగులో అది చెమ్‌గా మారి, అరు ప్రత్యయం అనుబంధమై తె.ü చెమరు ధాతువు ఏర్పడింది అని టివిబి 406 లో సూచించబడింది.తేమ శబ్దం తెలుగులో శైత్యార్థంలో ప్రసిద్ధం.చెమరు/ చెమర్చు > చెమట,చెమ్మ,తేమ .

సీ. **... తుహినాంశు కళలతో దులదూగ చెయ్యులు**

**<u>చెమట</u> గ్రొన్నెత్తురు సేయుమేను[40]...**

**4.తివుట :-**

సీ. **... ఆమ్నాయ విహిత కర్మాచారములు కల్గి**

**<u>తివుటయై</u> వర్తించు దేవగణము[41]....**

తివుట < తె.üతివురు. తె.üతివురు (అ.క్రి.) కు 1. అంగీకరించు 2. వేగిరపడు 3. యత్నించు 4. అతిశయించు 5. తిరుగు 6. కోపించు 7. మారుమేగు 8. ప్రవర్తించు అని తివుట (వి) కు 1. కోరిక 2. ఉత్సాహం అని అర్థాలు.

త. తీవిరి అనే క్రియారూపమొక్కటే సోదరభాషల్లో లభిస్తుంది. ఇది సంస్కృతంలోని తీవ్ర శబ్ద భవమని భద్రిరాజు పేర్కొన్నారు.(TVB- 573 )

తె.ü తివురు + ట - తివుట . దీనిచే తివురుదురు - తివుట 'ఉత్సాహం' (కరణార్థం).

ఈ తివుట అనే కృదంతం భాగవతంలో వివిధ (3-869, 3-871, 4-11, 4-366, 4-383) ప్రదేశాల్లో సీస పద్యంలోనే ప్రయోగించబడింది. అదీ దీని విశేషం.

**5.తీట :-**

**మ. అమృతోత్పాదనయత్నులై...**

**... భ్రమణ వ్యాజత వీపు <u>తీట</u> శమియింపంజేయగా నారదా!**[42]

ఇది కోశాల్లో తీట అని సానుస్వారంగా పేర్కొనబడింది.

తె.**ü**తీడు నుండి పుట్టిన రూపమిది.తె.**ü**తీడు (స.క్రి.)కు 1. పదును పెట్టు (తీక్షణం చేయు) 2. పళ్ళునూరు 3. కన్నీరు కార్చు 4. మెలిపెట్టు అని అర్థాలు. తీట (వి) కు 1. దురద 2. గజ్జి అని అర్థాలు.

సోదరభాషల్లో - త.తీణ్టు 'పదునుపెట్టు',' మైలపరచు.తీట్టు; మ.తీణ్ణుక 'స్పృశించు'' అంటుకొను' ; క.తీడు,' పదునుపెట్టు','రద్దు', 'నొక్కిచంపు', 'స్పృశించు' ; తు.తీడుని, తీణ్టు, సీన్టు, కోత. తీట్-రుద్దు; కొ.దీట్-; నా.ధీట్- తుడుచు అనే క్రియాపదాలు, త. తీట్టు అనే నామరూపం లభిస్తుంది.(TVB- 575 )

మూ.ద్రా. *తీన్ట్-/ *తీట్ట్- .

*తీణ్ణ్-> తె.**ü**తీడు. ఈ ధాతువు తెలుగులోకి రాకముందే తీట అనే కృదంతం తెలుగులో ప్రవేశించింది.

*తీణ్ణ్ + ట >తె.**ü** తీట. దీనిచే తీడెదరు - కరణార్థం.

**6.తేట :-**

**ఆ. భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు**

**శూలికైన దమ్మిచూలికైన**

**విబుధ జనుల వలన విన్నంత కన్నంత**

**తెలియవచ్చినంత <u>తేట</u> పఱుతు**[43]

తేట < తె.**ü**తేఱు. తె.**ü**తేఱు (అ.క్రి.) కు 1. కలుగు 2. తోచు 3. ప్రసన్నత చెందు 4. తెప్పిటిల్లు 5. నిర్మలమగు 6. తుష్టినొందు 7. నిపుణుడగు 8. సఫలమగు 9. ఉడుగు 10. ముగియు అనీ,

తేట (వి) కు 1. తేరిన మజ్జిగ మొదలైన ద్రవపదార్థం, సారం 2. నిర్మలత్వం 3. వికాసం 4. ఉత్కృష్టకాంతి 5. తీరు (విణ) 1. తేరినది 2. స్పష్టం 3. ఇంపైనది అని అర్థాలు.

సోదరభాషల్లో - త.తేఉ, తేఌ; మ.తేఉక, తేఌక; క.తేట్-, తేట్చ్; తొ.తోట్; గో.తేడ్-, తొ.తేల్-; అనే ãĦ ₵~¶‡□ □(TVB- 614 )త.తేఌల్ 'స్వచ్ఛత'; మ.తేఉల్; అనే నామరూపాలు లభిస్తున్నాయి.

మూ.ద్రా. *తేట్ - / *తే-ల్-/ *తే-ట్-.

*తే-ల్- తె.üతేఉ. తేట - తెలుగులోకి క్రియాధాతు ప్రవేశానికి ముందే ప్రవేశించిన కృదంతం.

తేట్ + ట > తె.ü తేట. తేఉనది తేట -(కర్త్రర్థం).

జ. తేట, తేటగీతి, తేటగొను, తేటచలములు, తేటతెల్ల, తేటతెల్లమి, తేటపడు, తేటపఉచు, తేటి, తేటిచూచు, తేటిచూపు, తేఉకొను, తేఉగడ, తేఉచు.

**7.పాట :-**

క. ***... గంధర్వుల పాటలు[44]...***

తె.üపాడు నుండి పుట్టిన కృదంతం - పాట. తె.üపాడు (స.క్రి.) కు 1. గానం చేయు 2. కీర్తించు 3. వేలంలో సంఖ్యను బిగ్గరగా అరచు అని అర్థాలు.

సోదరభాషల్లో - త. పాటు; మ.పాటుక; క.పాడు; హాడు;కోత. పాట్వ్- పశుపక్ష్యాదుల్లా ధ్వని చేయు; తొ. పోట్; గోం. వాట్; కొలామి. పాడ్-; నాయకి. పాట్-; ప.పాడ్-, మొదలైన క్రియారూపాలు లభిస్తున్నాయి.

త.పాటల్ 'పాట', పాటి 'పాడేవాడు', సంగీతం లోని శృతి; పాట్టు 'పాడుట', పాట, సంగీతం; మ.పాటి; పాట్టు; క.పాట; ప.పాట; గ.పాటె; అనే నామరూపాలు లభిస్తున్నాయి.(DED3348)

మూ.ద్రా. *పాట్ - మీద ధాత్వనుబంధం 'ఉ' చేరి , తె.üపాడు నిష్పన్నమైంది.

తె.üపాడు + ట > పాట.దీనిని పాడెదరు - 'పాట' (కర్మార్థం).

**8.మంట :-**

ఆ. **మోము జేవురింప ముడివడ బొమదోయి**

**చూపువెంట మంట సుడి గొనంగ**

**పెదవులదర బండ్లు పెటపెట గొఉకుచు**

**దక్షుడాగ్రహించి తపసి బలికె[45]**

మంట < తె.üమండు. తె.üమండు (అ.క్రి.) 1. ప్రజ్వలించు 2. (అగ్ని స్పర్శం వలె) గాయం మొ. చురుక్కుమని బాధ కలిగించు 3. వాడియగు 4. మిక్కిలి కోపించు 5. బాధపడు 6. విజృంభించు అనీ

మంట (వి) 1. జ్వాల 2. ద్వేషం 3. కినుక 4. చురుక్కుమను బాధ అని అర్థాలు.

సోదరభాషల్లో - త. మంటు, మటు; గోం. మడ్గ్-; మా.మాండ్-; అనే క్రియారూపాలు లభిస్తున్నాయి. నామ రూపాలు లేవు.(TVB- 939 )

మూ.ద్రా. *మంట్ -తె.üమండు

(1)తె.üమండు + ట > మంట . మండునది 'మంట'. (కర్త్రర్థం)

(2) తె.üమండు + అ > మండ . దీనిని మంటలో మండింతురు - మండ - 'తప్తలోపం'. (కర్మార్థకం)

మంట + మారి > మంటమారి. తద్ధితం.

మంటమారి + తనం >మంటమారితనం. తద్ధితం. (భావార్థంలో తనం)

జ. మంట, మంటగలియు, మంటగలుపు, మండపప్పు, మండించు, మండిపడు, మండుకొను, మండునెల, మండువేసవి.

**9.వేట :-**

శా. **"ప్రారంభంబున <u>వేట</u> వచ్చి ధరణీపాలుండు మా తండ్రిపై[46]..."**

తె.üవేయు (స.క్రి.) అనే ధాతువు కు వివిధ అర్థాలు ఇరవై సూ.ని. పేర్కొన్నది.వాటిలో- తెగగొట్టు / నరుకు / ఖండించు, అనీ, బాణాన్ని ప్రయోగించు అనీ, కొట్టు / ప్రవహించు అనీ అర్థాలు ఇవ్వబడ్డాయి.

సోదరభాషల్లో -కన్నడ. బేసె, దెబ్బ; కుయి. వేప (వేట్-) కొట్టు; కువి. వే, కొట్టు అనే అర్థాలు ఉన్నాయి.

బాణాలు వేయడం వల్ల, అడవిలోని క్రూర మృగాలను కొట్టేందుకు వెళ్ళడం వల్ల వేట అయింది అని చెప్పవచ్చు (కరణార్థకం)

అంటే తె.ü వేయు > వేట.ధాతు - అంత్యాక్షర లోపం, 'ట' ప్రత్యయం.

కాగ, ఈ పదంలోని అర్థాను స్వార సాధనకు వేరొక ధాతువును ఆశ్రయించాల్సి వచ్చింది.

తె.üవేగు (అ.క్రి.) కు క్లేశపడు / బాధపడు అనే అర్థముంది. దీనినుండి పుట్టిన వేచు నకు 'వేగునట్లు

చేయు' / బాధ పెట్టు అని అర్థం.అడవిలోని జంతువులను వేచుట కు వెళ్ళుటచే 'వేట' కావచ్చును (కరణార్థకం)

తె. üవేచు >వేట

కాగ, ఈ అర్థంలోనే నిరనుస్వారంగా కూడ భారతంలో (భార. విరా. 3.44) ఒక ప్రయోగముంది.

**6.8.- టు :-** భాగవతంలోని -టు ప్రత్యయాంత కృదంతాలు -

(1) ఓటు (2) కాటు (3) చేటు (4)తూటు (5) పాటు

(6)పోటు (7)వాటు (8) వ్రేటు

**1.ఓటు :-**

క. **భూరి లయ జలధి నిద్రిత**

**నారాయణ నాభికమల నాళమున నజుం**

**డారయబుట్టె ననుట నిజ**

**మో రాజీవాక్ష! పుట్ట నోటు దలంపన్.**[47]

ఓటు <తె. üఓడు. ఓటు (వి) 'అపజయం' అని అర్థం.

(విశేష వివరాలకు - ఓటమి చూడండి)

**2.కాటు :-**

ఆ. **నిష్ఠురోగ్ర సింహనినదంబుతో నింగి**

**మ్రింగుభంగి నోరు మిగులఁ దెఱచి**

**కఱవరాఁగ నతఁడు కాటు దప్పించిన**

**దన్నె నెగసి తురగ దానవుండు.**[48]

కాటు < తె. üకఱచు. తె. üకఱచు (స.క్రి.) కు - 1. కాటువేయు. కొరుకు 2. ముక్కలు చేయు 3. గుచ్చుకొను 4. పండ్లు మొ. వాటితో పట్టుకొను అని అర్థాలు.

కాటు(వి) కు 1. కఱచుట 2. కఱచుట వలన కలిగిన గాయం అని అర్థాలు.

సోదర భాషల్లో - త. కఱి; మ. కటిక్క; క.కర్చు; తు.కజెపుని; కోత.కర్చ్-; కుమి. కస; అనే క్రియారూపాలు.(TVB -257)

త.కఱి, కటి; మ.కటి, క.కడి; తు.కడెపుని; బ్రా. గట్; అనే నామరూపాలు లభిస్తున్నాయి.

మూ.ద్రా. *కత్ - > *కట్ - ; పద మధ్య తకారం కొన్ని ద్రావిడ భాషల్లో 'ఱ'గా మారుతుంది. తెలుగులో ఇది ఎక్కడా కన్పించదు. ఐనా ఇది మాత్రం అటువంటిదే.

*కట్ >తె.ü కఱచు. ('చు' అనే ధాత్వనుబంధం చేరగా)

తె.ü కఱచు + టు > కాటు. ఆద్యక్షర శేషానికి దీర్ఘం.కఱచుటచే కాటు. భావార్థం.

**3.చేటు :-**

తే. **భావ తత్త్వార్థవేదులు భాగవతులు**

**బ్రహ్మవాదానువాదులు భాగవతులు**

**సిరులు దనరంగ నెన్నడు <u>జేటు</u> లేని**

**పదవి నొప్పారువారు వో భాగవతలు.**[49]

చేటు < తె.ü చెడు. చెడకు (అ.క్రి.) 1. నశించు 2. కొల్లపోవు 3. చచ్చు 4. తగ్గు 5. దురవస్థను పొందు 6. దూరమగు 7. మలినమగు 8. భయపడు 9. వ్యర్థమగు అని అర్థాలు. చేటు(వి)కు 1. నాశం 2. చావు 3. అశుభం అని అర్థాలు.

సోదర భాషల్లో - త. కెటు; మ. కెటు; తో. కొర్చ్-;క. కెడు, కిడు; కొడగు. కెడ్-; తు. కెడగుని; కొలామి. కిట్ - అనే క్రియారూపాలు.

త. కెట్ట, కెట్టవన్, కెట్టవల్, కెటుతల్, కెటుతి, కేటణ్, కేటి, చెటి; మ. కెటుతి, కెటుమ్మ, కేటు, కేటన్, చెటి;క.కెట్ట, కెట్టి, కెడక, కెడిక, కెడుక, కిడుక, కెడకి, కెడికె, కెడుకి;తు. కెడుకు, కెడ, కెడకు, కేడగె, కెడింగె, సెట్టి, సెట్టె, సెట్టు, హెట్టు, సెడి (DED 1614 )మొ. నామరూపాలు లభిస్తున్నాయి.

మూ.ద్రా. *కెట్ - > తె.ü చెడు.

తె.ü చెడు + టు > చేటు. లోపదీర్ఘం . చెడుటచే చేటు.( భావార్థం)

జ. చెడగొట్టు, చెడనాడు, చెడిది, చెడిప, చెడుగట్టు, చెడ్డ, చెఱపన, చేట, చెఱుచు, చెఱుపరి, చెఱపు,

చేటు, చేటకాలం, చేటుపడు, చేటుపాటు, చేట్లకొాఱవి, చేడ్పడు, చేడ్పాటు.

**4.తూట్లు :-**

**'భరమగుచున్న దుర్వ్యసన భాజనమై ఘన దుఃఖ మూలమై**

**యరయఁగఁ బెక్కుతూట్లు గలదై [50]....''** -

అనుచోట 'శరీరం నవ రంధ్రాత్మకం' అనే అర్థంలో వాడబడింది.ఈ పదం 'తూఁటు' శబ్దం యొక్క బహువచన రూపం.

తె. üతూఱు కు -' ప్రవేశించు' అని అర్థం.

సోదర భాషల్లో -క. తూఱు ' ప్రవేశించు'; త. తుఱు ' చేరు, ప్రవేశించు'; మ. తూరుక 'లోపలికి నెట్టు'.

తె. üతూఱు ని కొందరు దూఱు గా సరళాదిగా గ్రహిస్తారు.తె. üతూఱు > తూఁటు.'ఱు' లోపం. ఆద్యక్షర శేషమునకు దీర్ఘం.

ఈ తె. üతూఱు ధాతువునకు మూ.ద్రా. రూపాలు *తూట్ -, *తుట్-', *తూ-' అవుతాయని భద్రిరాజు పేర్కొన్నారు.

ఈ ధాతువు నుండి పుట్టినవే - తూపు 'బాణం';తూము 'చెరువులలో నీరు వెడలెడి మార్గం'.

'తూఁటు' శబ్ద జన్యాలైన శబ్దాలు - తూఁటు కట్టు 'రంధ్రం పడు'; తూఁటు పడు ' రంధ్రము పడు'; తూఁటులు పుచ్చు; తూటులు సేయు; తూటువోవు అనునవి.

(చూ. తూర్పు)

**5.పాటు :-**

క. **బంధ విమోచనుఁ డీశుఁడు**

**బంధింపంబెనంగు జనని పాటోర్చి సుహృ**

**ద్బంధుడు గావున జననీ**

**బంధంబునఁ గట్టువడియెఁ బాటించి నృపా![51]**

పాటు <తె.**ü** పడు. తె.**ü**పడు (అ.క్రి.) కు 1. పతితమగు 2. శ్రమపడు 3. భంగపడు 4. శయనించు 5. చచ్చు 6. అస్తమించు 7. మూర్ఛిల్లు 8. మునుగు 9. పూను 10. లొంగు 11. అగు 12. నిలుచు 13. తటస్థించు 14. ప్రసరించు 15. ఎక్కు 16. తగులుకొను 17. ప్రవేశించు (స.క్రి.)గా 1. పొందు 2. అనుభవించు 3. అనుసరించు అని అర్థాలు.

పాటు (వి) కు 1. పతనం 2. కష్టం 3. ఆపద 4. సముద్రపు పొంగు తీసిపోవుట 5. మరణం 6. దుస్థితి 7. మంచి స్థితి (విణ) గా 1. అర్ధం 2. సమానం అని అర్థాలు.

సోదర భాషల్లో - త. పటు; మ.పటుక; క.పడు; కో.పట్-; తొ.పఙ్-; పర్జి.పడ్; కొలామి.పడ్-; అనే క్రియారూపాలు.

త. పటుక్కై-; పాటు, ప్పాటై; మ.పట, పటుప్పు, పటప్పు; క.పడువ పడవల్, పడవల్, పడవు, పాటు, పాటి; తు.పడ, పడ్డయి; మొ. నామరూపాలు లభిస్తున్నాయి.(DED 3190)మూ.ద్రా.* పట్- > తె.**ü**పడు.

తె.**ü**పడు+టు > పాటు. లోపదీర్ఘత . వీనిని (పాట్లు) పడుదురు - పాటు - 'కష్టం - కర్మార్థకం.

ఈ పాటు శబ్ద పల్లవంగా కూడ ఉపయోగించబడుతుంది.అటువంటి ప్రయోగాలు భాగవతంలోనూ ఉన్నాయి. అవి -

| | | | |
|---|---|---|---|
| అలపు | + పాటు | > | అలపాడు (భాగ. 9.274) |
| అడ్డము | + పాటు | > | అడ్డపాటు (భాగ. 9.404) |
| ఏర్పడు | | > | ఏర్పాటు (భాగ. 6.177) |
| ఓటమి | + పాటు | > | ఓటమిపాటు (భాగ. 8.57) |
| కప్పరము | + పాటు | > | కప్పరపాటు (భాగ 6-194) |
| తల | + పాటు | > | తలపాటు (భాగ. 10-ఉ.381) |
| తొట్రు | + పాటు | > | తొట్రుపాటు (భాగ. 11-92) |
| నగు | + పాటు | > | నగుబాటు (భాగ. 2-220) |
| వీడు | + పాటు | > | వీడుపాటు (భాగ. 9-30) |

వెడగు + పాటు > వెడగుపాటు (భాగ. 6-44)

**6.పోటు :-**

తె.**ü**పొడుచు కు - (స.క్రి.) గ్రుచ్చు, గ్రుచ్చి చంపు, క్రుమ్ము, ఛేదించు, విసరు, కఱచు, క్రుక్కు, చంపు, కొట్టు, ఆను, రాచు, పందెము వైచు, ముద్రించు, తెలుపు, యుద్ధము చేయు, ఋణము చేయు, అపహరించు (అ.క్రి.) ఉదయించు, పుట్టు, పాఱు అనే అర్థాలు తెలుగులో ఉన్నాయి.

క. పొడె. హోటి, హోట్రి 'కొట్టు, బాణం వేయు, నరుకు'; తు. పొడియుని 'చితకగొట్టు'; పొడి; పుడపుని 'ముక్కలు చేయు'; పుడిపుని ' పోట్లాడు'; పొట్టు ' గాయపడిన', త. పొటి 'ముక్కలు చేయు'; ప్లుటై 'కొట్టు'; మ. పొటియుక 'చితకగొట్టు'; పొటి 'పొడి'; కువి - 'ప్లుఫ్'-, ప్లూ.(TVB - 871 )

దీని మూ.ద్రా. రూపం * పోట్ -/ *పోళ్ - ట్-; చాలా భాషల్లో ఈ పదాంతమున 'ళ్' చేరింది. సూక్ష్మంగా 'రంధ్రము చేయు' అని అర్థం పోళ్ - పో-ళ్, త. పొ- పొట్టు పదాల వలన తెలుస్తుంది.

తె.**ü**పొడుచు > పోటు

ఆద్యక్ష శేషానికి దీర్ఘం 'టు' ప్రత్యయం.

పొడుచు - జన్యపదాలు :- పొడుపు, పొడుపుఁగొండ, పొడుపుమేలు, పొడుము కాయ, పొడువ, పొడువడు, పొడువు, పొడుగు, పోటి, పోటు, పోటిగాడు.

'పోటు' జన్యాలు :- పోటన బంతి, పోటరి, పోటుకాఁడు, పోటుగంటి, పోటుగుంజ, పోటుగొను, పోటుదార, పోటుబంటు, పోటుమగడు, పోటుముట్టు, పోటులాడు, పోట్లాట, పోట్లావు.

**7.వాటు :-**

చ. **జలము బలంబు ధైర్యమును శౌర్యము వ్రేటును <u>వాటు</u> జూపుచున్.**[53]

వాటు <తె.**ü**వైచు. వయిచు అని రూపాంతరం. దీనికి (స.క్రి.)1. విసరివేయు 2. పడవేయు 3. దరింపజేయు 4. కొట్టు 5. ప్రయోగించు 6. ఎగురవేయు 7. పాఱవేయు 8. వదులు 9. తొలగించు 10. విసరు 11. ఎత్తిపట్టు 12. కప్పు 13. (కనురెప్ప) మూయు 14. నిర్మించు 15. (ఱంకె) వేయు 16. అదుము 17. అడ్డంపెట్టు 18. ముడుచు 19. పందెం ఒడ్డు అని అర్థాలు. వాటు (వి) కు 1. వైచుట 2. దెబ్బ 3. విధం అని అర్థాలు.

సోదర భాషల్లో - త. వై - త్త్ -; మ. వెక్క; క. బయ్-; కోత. వయ్-; గోం.బై-మొ. క్రియారూపాలు.

త.వైప్పు; మ. వెప్పు; క.బయ్కె; అనే నామ రూపాలు లభిస్తున్నాయి.(TVB - 1205 )(DED 4565 )

మూ.ద్రా. *వయ్ - / * వెయ్ -.* వయ్ - పై ధాత్వనుబంధం చు చేరి తె.ü వయిచు నిష్పన్నమౌతుంది. తె.ü వయిచు + టు > వాటు . లోప దీర్ఘత. దీనిని వైతురు - వాటు 'దెబ్బ' (కర్మార్థకం)

**8.వ్రేటు :-**

తె.üవ్రేయు ధాతువుపై 'టు' ప్రత్యయం చేరగా 'వ్రేటు' పదం సిద్ధిస్తుంది. 'వేటు' అనునది దీని రూపాంతరం.

తె.üవేయు ధాతువే నాగరికీకరణము వలన 'వ్రేయు' రూపం పొందినది అని, 'ఏటు' రూప సామ్యముతో 'వ్రేటు' రూపము ఏర్పడియుండునని భద్రిరాజు కృష్ణమూర్తి అభిప్రాయపడిరి.

'వ్రేటు' పదమునకు దెబ్బకొట్టు అని అర్థం. (వేయు వివరాల కొరకు చూ. వేఁట)

తె.üవ్రేయు > వ్రేటు.

సాధారణంగా 'య' కారాంత ధాతువుల నిష్పాదక పదాలు 'య' స్థానంలో 'త' లేదా 'ప' ను ఆదేశంగా పొందుతాయి. ఉదా. పోయు > పోత; మేయు > మేత; మొ. కాని ఈ ప్రత్యేకమైన ధాతువునకు 'ట' వస్తుంది. కాబట్టి ఇది 'ట' అనేది వ్రేయు (వేఁ, వేట్, వేల్-+-అట్-) కావచ్చు నని, కాని వానికి ఆధారాలులేవని భద్రిరాజు పేర్కొన్నారు.(TVB - 1211 )

**"గద సారించి మదా సురేంద్రుడు సమగ్ర క్రోధుఁడై మాధవ**

**గుదియన్ వ్రేసిన <u>వ్రేటు</u>**[54]..."

అని తె.üకొట్టు అనే అర్థంలో తె.üవ్రేయు భవంగానే ప్రయోగించబడింది.

**6.9. -త :-** భాగవతంలోని -త ప్రత్యయాంత కృదంతాలు -

(1) ఊఁత (2) కూఁత (3)చేఁత (4) పూఁత (5) మేఁత

(6)మోఁత (7)మ్రోఁత (8)రోఁత

**1.ఊఁత :-**

ఉ. **కానని వాని <u>నూఁత</u>గొని కాననివాడు విశిష్ట వస్తువుల్**

**గానని భంగి**[55]**.....**

ఊఁత <తె.üఊఁదు. ఊఁదు (స.క్రి.) కు 1. గ్రహించు 2. అవలంబించు3. మోపు 4. నొక్కు

5. పూను అని అర్థాలు. ఊత(వి) కు 'ఆధారం' అని అర్థం.

సోదర భాషల్లో - త. ఊన్ఱు; మ. ఊన్నుక; క. ఊఱు; తు. ఊండుని;కురుఖ్. ఊద్ - ; మాల్తో. ఊదుర్ - అనే క్రియారూపాలు అవే నామరూపాలుగా లభిస్తున్నాయి.(TVB - 142)

మూ.ద్రా. *ఊన్ - త్ >తె.üఊఁదు.

తె.üఊఁదు + తజ్ > ఊఁత.దీని యందు ఊనెదరు - ఊఁత 'ఆధారం' (అధికరణార్థం)

జ. ఊఁత, ఊఁతకోల, ఊఁతగొను, ఊఁతము, ఊఁతయిచ్చు.

**2.కూఁత :-**

క. **నిబ్బరపు దప్పిమంటలు**

**ప్రబ్బిన ధృతి లేక నేత్ర పదహస్తంబుల్**

**గొబ్బున వివృతములుగ నా**

Q® ÄQ®K Ç# ß ÷**<u>కూఁతఁ</u> గూలెన్ నేలన్.**[56]

కూఁత <తె.üకూయు. కూఁత (వి) కు 1. అఱపు 2. మొఱ 3. ప్రలాపం అని అర్థాలు.

(విశేష వివరాలకు చూ. కూకలు)

**3.చేఁత :-**

సీ. **.... సృష్టి యెవ్వని <u>చేఁత</u>చే జనించు**[57]...

చేఁత <తె.ü చేయు. చేఁత (వి) కు 'చేయుట' అర్థం.

(వివరాలకు చూ. చెయ్యి)

**4.పూఁత :-**

తే. **కడగి మై<u>పూఁత</u> సాంధ్యరాగంబుగాగ**[58]**...**

పూఁత <తె.üపూయు. పూయు (స.క్రి.) కు 1. అలదు 2. మెత్తు అని అర్థాలు. పూత (వి) కు 1.

అలదుట 2. అంగరాగం అని అర్థాలు.

సోదర భాషల్లో - త. పూచు; మ. పూచు, పూయుక, క.పూసు; తు.పూజుని అనే క్రియారూపాలు త.పూచు; క.పూసు అనే నామరూపాలు సోదరభాషల్లో లభిస్తున్నాయి.(TVB - 841)(DED -3569 )

మూ.ద్రా. *పూ -.

*పూ - >తె.üపూయు. తె.üపూయు + తజ్ > పూఁత.దీనిని పూయుదురు - పూత.'అంగరాగం' (కర్మార్థకం)

**5.మేఁత:-**

తె.üమేయు నుండి పుట్టింది ఈ శబ్దం. మేయు(ట) - పశువులు - పచ్చిక మొ. తిను (ట) అనే అర్థాన్నిచ్చె ధాతువు.

సోదర భాషల్లో - క.మే-/ మేయ్ (మేడ్-) = మేపు; తు. మేపిని, మేపుని; కొ. మేయ్ -; మేచ్-; తొ. మీయ్ - (మీస్-); మీచ్-; త. మేయ్ (మేయ్-న్త్-); మేయల్ = మేపుట; మ. మేయ్క, మేయ్త్తుక; కువి. మేయ్-. మే-; గో. మేఈ.(TVB -1044 )మూ.ద్రా. *మేఁయ్ - < *మెచ్ - .

తె.üమేయు + త . మేయబడునది - కాబట్టి అది - మేఁత (కర్మార్థకం).

**"అడవుల <u>మేఁత</u> మేసి మనమన్యుల కెన్నడు నెగ్గ సేయక[59]..."**

-అనే ప్రయోగంలో 'మేసి' అనే క్త్వార్థంతో ఈ కృదంతం అదే ధాతుజన్యమనుట స్పష్టం.

యు లోపం. తజి ప్రత్యయం.జిత్ అగుటచే, బిందు పూర్వకత్వం.దీర్ఘము మీద సాధ్య పూర్ణము లేనందువల్ల అర్థాను స్వారము > మేఁత

జ. మేఁతకాఁడు, మేఁతరి, మేఁతరీడు.

**6.మోఁత :-**

క. **బరువైన కొడుకు <u>మోత</u>ఁను**

**వెరవిడి యిలమీద బెట్టి వెఱచి జననిదా**

**ధరగావఁ బుట్టిన మహా**

**పురుషుడు గాఁబోలు ననుచు బుద్ధి దలంచెన్.**[60]

మోఁత <తె.üమోయు. మోయు (స.క్రి.) కు 1. వహించు 2. తాకు అని అర్థాలు. మోఁతకు 1. వహించుట 2. బరువు అని అర్థాలు. సోదరభాషల్లో - దీని పర్యాయాలు లభించలేదు.

తె. తె.üమోయు + తఌ > మోఁత. దీనిని మోసెదరు - మోఁత - 'బరువు' - కర్మార్థం.

**7.మ్రోఁత :-**

మ. **అదరెన్ గొండలతోడ భూమి గృహతారానీకముల్ మింటిపై**

**బెదరెన్ దిక్కుల మారు మ్రోఁత లెసగెన్**[61]**....**

తె.üమ్రోత <మ్రోయు. మ్రోయు (అ.క్రి.) కు 1. శబ్దించు 2. కూయు, అఱచు 3. రొదసేయు 4. బోధించు అని అర్థాలు.మ్రోఁత(వి) కు 'ధ్వని' అని అర్థం.

సజాతి రూపాలు - త. ముఱంకు; మ. మఱన్నుక; కోత. ముర్వ్-;క. మొఱగు; అనే క్రియారూపాలు,

త. ముఱక్కమ్, ముఱవు, ముఱా; మ. ముఱక్కమ్, మొఱి;క. మొఱగు; అనే నామరూపాలు లభిస్తున్నాయి.(DED - 4092 )

మూ.ద్రా. *మోఱ్ - అయ్ - >తె.üమ్రోయు. తె.üమ్రోయు + తఌ > మ్రోత.

తె.üమ్రోయు + తఌ > మ్రోత. మ్రోగునది మ్రోఁత - ధ్వని. కర్త్రర్థం.

**8.రోఁత :-**

చ. **ఇలువడి సున్నచేసి హృదయేశుల సిగ్గులు వుచ్చి యత్తమా**

**మలనెరియించి సోదరుల మానము సూఱలు పుచ్చి తల్లిదండ్రుల**

**రుచి మాన్చి బంధులకు రోఁత యొనర్చుచు జారవాంఛలన్**

**వలనఱి సత్కులాంగనలు వత్తురె? లోకులు సూచి మెత్తురె?**[62]

రోఁత <తె.üరోయు. రోయు (అ.క్రి.) కు 1. అసహ్యించు 2. సంకోచించు (స.క్రి.) గా 1. అసహ్యించుకొను 2. విడుచు 3. నిందించు 4. వెదకు 5. ప్రవేశించు 6. భావించు అని అర్థాలు.

రోఁత(వి) కు 1. జుగుప్స 2. రోతఁ కలిగించు పదార్థం3. నింద అనేవి అర్థాలు.

సోదరభాషల్లో - త. ఒఋ; క. రోసు అనే క్రియారూపాలు, త. ఒరుప్పు; క. రొచ్చు, రొజ్జు అనే నామ రూపాలు లభిస్తున్నాయి.(DED - 857)

మూ.ద్రా. *ఒఋయ్ > *ఒఋయ్ > తె. üరోయు. వర్ణవ్యత్యయం.

తె. üరోయు + తజ్ > రోఁత. దీనిచే రోయుదురు - రోఁత 'జుగుప్సావహ విషయం' కరణార్థం.

**6.10. -దల : -** భాగవతంలోని - క ప్రత్యయాంత కృదంతాలు -

(1) చొరుదల (2) వెలిదల

**1.చొరుదల :-**

వ. **.... ఆ పురుషోత్తముండ ప్పెనురేయి <u>చొరుదల</u> యందు[63]....**

చొరుదల < తె. üచొచ్చు. చొచ్చు (అ.క్రి.) కు 1. యత్నించు 2. ప్రారంభించు 3. సిద్ధమగు 4. పోవు 5. సంభవించు 6. వచ్చు 7. అంగీకరించు అనే అర్థాలు. చొరుదల (వి) కు 'ప్రారంభం' అని అర్థం.

సోదరభాషల్లో - త. తుర (< తొర < చొర); క.చుర్చు అనే క్రియారూపాలు లభించాయి.(TVB 480)

మూ.ద్రా. *చోర్ - > తె. üచొచ్చు. ఈ చొచ్చు ధాతువుకు -చొరు - తో కూడ కొన్ని రూపాలున్నాయి.

చొరు + దల > చొరుదల.చొచ్చునది - చొరుదల - ప్రవేశం. కర్త్రర్థం.

**2.వెలిదల :-**

సీ. **.... ఫణిరాజ ఫణిరాజి మణిగణ విస్ఫూర్తి**

**సుషిరంపు <u>వెలిదల</u> చూపినట్లు[64]....**

**6.11. - ప :-** భాగవతంలోని - ప ప్రత్యయాంత కృదంతం -

**మురిపము** :-తే. **... బర్హిసంఘములకు <u>మురిపములు</u> గఋపు[65]....**

మురిపము <తె.ü మురియు. తె.üమురియు (అ.క్రి.) కు 1.కులుకు 2. సంతోషించు 3. గర్వించు 4. తిరుగు 5. ప్రకాశించు అని అర్థాలు.

మురిపము (వి) కు 1. నడకయందలి కులుకు 2. సౌందర్యం3. శృంగార గర్వం 4. సంతోషం అని అర్థాలు.

సోదరభాషల్లో - త. మురై; క. మురు్క; అనే క్రియారూపాలు,త. మురువల్; క. మురుకు అనే నామ రూపాలు లభిస్తున్నాయి.(TVB - 1008 )

మూ.ద్రా.*ముట్ - > తె.üమురియు. మురియుటచే మురిపము(భావార్థం).దీనికి మురిపెము అనే రూపాంతరం ఉంది.

ఉ. **.... ఆ <u>మురిపెంబు</u> లాతగవు[66]....**

- అని మరిపెము ప్రయోగం కూడ ఉంది.

**6.12.- పి :-** భాగవతంలోని - పి ప్రత్యయాంత కృదంతాలు -

(1) తెఱపి (2) దప్పి (3)నొప్పి

**1.తెఱపి :-**

క. **మందునకు మందబుద్ధికి**

**మందాయువునకు నిరర్థ మార్గునకును గో**

**వింద చరణారవిందమ**

**రందముఁ గొనఁ <u>దెఱపి</u> లేదు రాత్రింబవలున్.[67]**

తె.üతెఱచు > తెఱపి. తెఱచు (స.క్రి.) కు 1. వివృతం చేయు2. (తెఱచుటకై) తొలగించు 3. బయలువడు అని అర్థాలు.

తెఱపి (వి) కి 'దేశ కాలాల్లో అవకాశం, ఎడం, సందు' అని అర్థం. తె.ü తెఱచు + పి > తెఱపి.

**2.దప్పి :-**

సీ. **.... ధరణీశ్వరుఁడు పేరు <u>దప్పి</u>తో నారాత్రి[68]....**

తె.üదయ్యు > దప్పి.తె.üదయ్యు / తె.üడయ్యు (అ.క్రి.) కు 1. బలహీనమగు2. అలసిపోవు అని

అర్థాలు. దప్పి (వి) కి 1. శ్రమ 2. దాహం అని అర్థాలు.

సోదరభాషల్లో - కొలమి. దయ్ - ; కువి. దహ్ -, డైయూ - ;అనే క్రియా రూపాలు మాత్రమే లభించాయి.(TVB - 500)

మూ.ద్రా. రూపం*అళ్ - ; మూ.ద్రా.* ళకారం వర్ణవ్యత్యయం చెంది, పదాది దకారంగా మారుతుంది.

*అళ్ >తె.üదయ్యు. (ధాత్వనుబంధం యు చేరి, ద్విత్వం అయ్యింది.)

తె.üదయ్యు + పి > దప్పి. దీనిచే దయ్యుదురు - దప్పి. కరణార్థం.

**3.నొప్పి :-**

క. **వ్యాధులు దప్పులు నొప్పులు**

**బాధలు చెడి విశ్వకర్మ భావిత దనుజా**

**రాధిత సుతలాలయమున**

**నేధితవిభవమున నుండు నితడందాఁకన్.**[69]

నొప్పి < తె.üనొచ్చు. నొచ్చుకు (అ.క్రి.) 1. బాధపడు 2. శ్రమపడు 3. నశించు 4. చనిపోవు అని అర్థాలు. నొప్పి (వి) కి 'బాధ' అని అర్థం.

సోదరభాషల్లో - తు. నోపిని, నోపుని, నోయిపిని; క. నొయ్, నో, నొయ్యు, నోయు; త. నో; మ. నోక; కుయి. నోవ; గోం. నోఇ; కురుఖ్. నుంజ్; మాల్తో. నుంజ. అనే క్రియా రూపాలు.

త.నో; కుయి. కువి. నోమెరి, నోహి అనే నామరూపాలు లభిస్తున్నాయి.(TVB - 770 )

మూ.ద్రా.*నోఁయ్ - / *నో-;

*నోఁయ్ + చు > తె.üనొచ్చు.

(1)తె.ü నొచ్చు + పి > నొప్పి . దీనిచే నొచ్చెదరు - నొప్పి.(కరణార్థం).

(2)తె.ü నొచ్చు + వి > నొవ్వి / నోవి.

(3) తె. **ü**నొచ్చు + వు > నొవ్వు / నోవు.

ఈ రెండింటికీ పై నిర్వచనమే.

తద్ధింతాంతాలు :

(1) నొవు + అరి (మతుబర్థంలో అరి) > నోవరి 'వ్యాధి కలవాడు'.

(2) నోవు + ఇక (వ్యతిరేకార్థంలో / అభావార్థంలో ఇక) > నోవిక 'అనుకూలం'.

ఇక ప్రత్యయం అభావార్థంలో లక్షణకారులు పేర్కొనలేదు. కాని ఇక్కడ మాత్రం అభావార్థమే. ఇక ప్రత్యయం అభావార్థంలో కూడ ప్రయోగింపబడుతుందని ఇక ముందు చెప్పవచ్చు.

**6.13. - వు :-** భాగవతంలోని - వు ప్రత్యయాంత కృదంతాలు -

| | | | |
|---|---|---|---|
| (1) ఆర్పు | (2) ఇంపు | (3) ఊర్పు | (4) ఏపు |
| (5) కానుపు | (6)కాపు | (7)గెలుపు | (8) చూపు |
| (9)తలంపు | (10)తార్పు | (11)తీపు | (12)తూర్పు |
| (13)తెంపు | (14)నడపు | (15)నెఱపు | (16)పంపు |
| (17)పఱపు | (18)పెంపు | (19)పొడుపు | (20)పొలుపు |
| (21)బలుపు | (22)మఱపు | (23)మెలపు | (24)మోపు |
| (25)వంపు | (26)వగపు | (27)వలపు | (28)వాపు |
| (29)వెఱపు | (30)వేల్పు / వేలుపు | | |

**1.ఆర్పు :-**

క. **గుఱ్ఱముల పరువు మెచ్చని**

**నఱ్ఱులఁ గట్టిన రథమ్ము నంద ప్రముఖుల్**

**కుబ్జల <u>యార్పులు</u> చెలఁగఁ**

**దొబ్బులగమి వెంటనంటఁ దోలి రిలేశా![70]**

ఆర్పు < తె.üఆర్చు. తె.üఆర్చు (అ.క్రి.) / అఱుచు . అఱుచు అని అర్థం.

ఆర్పు (వి) కు 1. అఱపు, కేక 2. సింహనాదం అని అర్థాలు.

సోదరభాషల్లో - త. ఆర్, అరఱ్రు; మ. అరుక, ఆర్త్తుక; క. ఆరు;తు. ఆర్కుని; కోత. ఆర్-; కుయి. ఆర్ప; పర్జి. ఆర్ - అనే క్రియారూపాలు లభిస్తున్నాయి.(TVB -68)

మూ.ద్రా. *ఆర్ - ; *ఆర్ - > తె. ఆర్చు

తె.üఆర్చు + పు > ఆర్పు. ఆర్చబడునది - ఆర్పు . భావార్థం.

**2.ఇంపు :-**

తరల. **... ఆహారిహేల *లింపగు* నేలలన్.[71]**

ఇంపు <తె.üఇంచు. తె.üఇంచు (అ.క్రి.) కు 1. ప్రియమగు 2. సంతోషించు 3. ఒప్పు 4. అభిలషించు - అనీ; ఇంపు / ఇంబు / ఇమ్ము (వి) కు 1. తీపి 2. ఆనందం 3. అందం 4. వలపు అనీ, విణ.గా ప్రియం అని అర్థాలు.

సోదరభాషల్లో - క.ఇన్-/ఇనె 'తియ్యదనం'; తు. ఇంపు 'ఆహ్లాదకరం'; త. ఇణి 'తియ్యనైన', ఇణ్ 'తీపిపదార్థం'; మ. ఇణియ 'తీపి పదార్థం' అనే నామరూపాలు మాత్రం లభించాయి.

మూ. మ. ద్రా. *ఇన్ - ; *ఇన్ - > తె.üఇంచు .

తె.üఇంచు + పు > ఇంపు. ఇంచుటచే - ఇంపు( భావార్థం).

ఇంపు + ఇతము (స్వార్థంలో ఇత ప్రత్యయం - తద్ధితం) > ఇంపితము.

**3.ఊర్పు :-**

ఉ. **వచ్చిన సర్పవైరిగని వ్రాలకలేచి మహా ఫణావళుల్**

**విచ్చి దృగంచలంబుల నవీన విషాగ్ని కణంబులొల్కగా**

**నుచ్చల దు(గ్రజిహ్వాలు మహోద్ధతిఁ (దిప్పుచు నూర్పులందుఁగా**

**ర్చి చ్చెగయంగఁ బాఱ గఱచెన్ విహగేం(దు నహీం(దుఁడు(గ్రతన్.**[72]

ఊరుపు / ఊర్పు < తె. üఊర్చు.తె. üఊర్చు (అ.(క్రి.) కు 'నిశ్వసించు' అని అర్థం.

ఊర్పు (వి) కు 'శ్వాస / ఊపిరి' అని అర్థం.

సోదరభాషల్లో - త. ఉయిర్; క. ఉసిర్; కురుఖ్. ఉజ్జ్ - జీవించు; మాల్తో. ఉజ్ - (బతుకు; అనే (క్రియారూపాలు.

త. ఉయిర్పు 'శ్వాస'; మ. ఉయిర్; క.ఉసిర్; తు. ఉసురు, ఉసులు; కుయి. ఊకురి అనే నామరూపాలు □a □ ೀ ಆ ò .(TVB - 148 )

మూ.(ద్రా. *ఉచ్-/*ఉయ్; మూ.మ.(ద్రా. *ఉచ్-ఇర్-/*ఉయ్-ఇర్.మూ.మ.(ద్రా. *ఉచ్ = ఇర్ > తె. üఊర్చు

తె. üఊర్చు + పు > ఊరుపు / ఊర్పు. (మధ్య స్వరలోపం).

ఊర్పు + (స్వార్థంలో) ఇరి (తద్ధితం) > ఊపిరి. (మధ్యవ్యంజనలోపం) నిట్టూర్పు అనే (ప్రయోగం కూడ భాగవతంలో ఉంది.

**4. ఏపు :-**

క. **చూపుల గగనము (మింగుచు**

**నేపున దివి భువియు నావ లీవల సేయన్**

**రూపించుచు దనుజేం(దుడు**

**(ప్రాపించెను దివిజనగర పథము నరేం(దా!**[73]

ఏపు < తె. ü ఏచు.తె. ü ఏచు (అ.(క్రి.) కు 1. అధికమగు 2. బలియు 3. కలుగు 4. చెలరేగు అని అర్థాలు.

ఏపు (వి) శబ్దానికి 1. అతిశయం 2. అభ్యుదయం 3. ఉత్సాహం 4. విజృంభణ 5. గర్వం 6. విలాసం 7. విధం అని అర్థాలు.

సోదరభాషల్లో - త. ఏన్తు; కుయి. ఎప; అనే క్రియారూపాలు లభిస్తున్నాయి. త.ఏ. పెరుగు అనే నామవాచకం లభించింది.(TVB - 180 )

మూ.ద్రా. *ఎయ్ / * ఏయ్ -. *ఏయ్ - >తె.üఏచు.

తె.ü ఏచు + పు > ఏపు. దీనిచే ఏ చెదరు - ఏపు. కరణార్థం.

జ. ఏ పడఁచు, ఏపారు, ఏపు, ఏపుమాపు, ఏపురేఁగు

**5. కానుపు :-**

ఆ. **కడుపు బరువుగాఁగఁ గొడుకుల గనుకంటె**

**తల్లి కొకఁడు చాలు బల్లిదుండు**

**త్రిదశగణము గన్న యదితి కానుపు దీర్చి**

**చిన్ని మేటి వడుగు గన్నయట్లు.**[74]

కానుపు <తె.üకానుచు - కానుపు 'సంతానం'

(వివరాలకు - కానిక చూ.)

**6. కాపు :-**

సీ..... **ఘనమృగాదనములు గాపుగా లేళ్ళతో**[75]....

కాపు < తె.üకాచు. కాచు (అ.క్రి.) కు 1. ప్రతీక్షించు 2. మన్నించు 3. రక్షించు అని అర్థాలు.

కాపు (వి) - రక్షణ; (విణ) రక్షకుడు.

సోదరభాషల్లో -

త. కా- 'రక్షించు'; మ. కాక్కుక; కువి. కా-; క.కా.కాయ్; తు. కాపుని; కోత. కావ్-;కొలామి. కయ్-; గోం. కేప్ - మొదలైన క్రియారూపాలు.

క. కాపు 'రక్షణ'; అనే నామరూపం లభించాయి.(TVB - 271 )

మూ.ద్రా. కా-. *మూ.ద్రా. *కా >తె.ü కాచు.

(1)తె. కాచు + పు > కాపు. కాచువాడు - కాపు. (కర్త్రర్థం).

(2)తె.üకాచు + వలి > కావలి 'కాచుట - 'కావలి' - 'రక్షణ'. భావార్థం.

(3)తె.üకాచు + కోలు > కాచికోలు - భావార్థం.

తద్ధితాలు :- కాపు + అరి (కర్త్రర్థంలో) > కాపరి. కాపుకాడు, కావలి - కాఁడు, కావలివాఁడు.

కాపు + గడ > కాపుగడ; రక్షణ (స్వార్థంలో గడ)

**7.గెలుపు / గెల్చు :-**

వ. **.... <u>గెలుపుఁ</u> దలంపులు బెట్టిదంబులై[76]....**

శా. **నీవే పోటరివే? సురేంద్ర! తెగడ న్నీకేల <u>గెల్పోటముల్?</u>[77]....**

గెలుపు / గెల్పు < తె.üగెలుచు. తె.üగెలుచు (స.క్రి.) కు 'జయించు' అని అర్థం.గెలుపు (వి) 'విజయం'.

సోదరభాషల్లో - త. కెలి; కోత. గెల్ - ; క. గెల్, గెలి;తు. గెలిపుని, గెల్పుని అనే క్రియారూపాలు.

త. కెలిప్పు 'విజయం'; కోత. గెల్ 'లక్ష్యం'; క. గెల, గెలవు, గెలు, గెలుపు, గెలుహ, గెల్ల 'విజయం', తు. గెలుకై, గెల్పు. అనే నామరూపాలు లభిస్తున్నాయి.(DED 1641 )

మూ. మ.ద్రా. మూ.ద.ద్రా. *గెల్ - / *వెల్. *గెల్ - > తె.üగెల్చు.

తె.ü గెల్చు + పు > గెలుపు . గెల్చుటయే - గెలుపు 'విజయం' -( భావార్థం).

(2)తె.ü గెల్చు + అ > గెలువము. (భావార్థం)

(3)తె.ü గెల్చు + వడి > గెలువడి .( భావార్థం)

తద్ధితాలు :

గెలుపు + అరి > గెలుపరి / గెల్పరి. కర్త్రర్థం.

గెలుపు + కాఁడు > గెలుపుకాఁడు. కర్త్రర్థం.

తె.üగెలుచు లోని చు లోపించి, గెలు + అ ఉండగా ఉత్తునకు అచ్చుపరమై వ ఆదేశంగా వచ్చింది. ఇది సంస్కృత యణాదేశ ప్రక్రియ.

**8.చూపు :-**

సీ. **.... చూడడే నా పాటు చూపుల జూడక**

**చూచువారలఁ గృపఁ జూచువాఁడు[78]....**

చూపు < తె. üచూచు. చూపు (వి) శబ్దానికి1. దర్శనం 2. దృష్టి 3. కనపడుట 4. కన్ను అని అర్థాలు.

(విశేష వివరాలకు చూ. చూడ్కి)

**9.తలంపు / తలఁపు :-**

ఆ. **అనఘ! విను రసజ్ఞులై వినువారికి**

**మాట మాటకధిక మధురమైన**

**యట్టి కృష్ణకథన మా కర్ణనము సేయ**

**దలఁపు గలదు మాకు ( దనివి లేదు.[79]**

తలపు < తె. üతలచు. తె. üతలచు (అ.క్రి.) కు 1. యుక్తాయుక్త విచారణ చేయు 2. విచారించు; స.క్రి. కు 1. ఊహించు 2. అనుకొను 3. సంకల్పించు 4. చేయు 5. స్మరించు 6. స్తుతించు అనేవి అర్థాలు.

తలపు (వి) శబ్దానికి 1. తలచుట 2. అభిప్రాయం 3. ఆలోచన 4. సంకల్పం, కోరిక 5. వలపు 6. తెలివి అనేవి అర్థాలు.

సోదరభాషల్లో - దీనికి సజాతీయ క్రియాపదం లేదు.కేవలం తెలుగులోనే ఈ క్రియ ఉంది. మిగిలిన భాషల్లో తల అనే పదముంది. *తల్ - తె. üతలచు.

(1) తె. üతలచు + పు > తలపు. తలచబడేది - తలపు. దీనిని తలతురు.కర్మార్థం.

(2) తె. üతలచు +అ > తల. దీనిచే తలతురు - తల. (కరణార్థం)

**10.తార్పు :-**

తే. **ప్రియులు ప్రియురాండ్ర మనముల బెరసి తార్పు**

**లంద చౌర్యంబు, వల్లభులాత్మసతుల**

**నాఁగి క్రొమ్ముళ్ళు వట్టుటం దక్రమంబు**

**రామచంద్రుడు పాలించు రాజ్యమందు.** [80]

తార్పు <తె.üతార్చు.తె.üతారుచు /తె.üతార్చు (స.క్రి.) కు 1. చేర్చు, కూర్చు 2. నిర్మించు 3. దగ్గరగా తీయు 4. ఆకర్షించు మొదలైనవి అర్థాలు. తార్పు (వి) - అమరిక, కూర్పు.

తె.üతార్చు + పు > తార్పు.

తె.üతార్చుట - తార్పు.(భావార్థం)

**11.తీపు :-**

క. **ఆ పాపల విహరణములు**

**<u>తీపు</u>లు పుట్టింప మరఁగి తేఁకువలే కా**

**గోపాల సతులు మక్కువ**

**నేపనులును మఱచియుండి రీక్షణపరలై.**[81]

తీపు < తె.üతీయు. తె.üతీయు (అ.క్రి.) కు 'క్షీణించు' అని, (స.క్రి.) కు 1. ఆకర్షించు 2. విడదీయు 3. తెఱచు మొదలైన అర్థాలున్నాయి. తీపు (వి) శబ్దానికి 'తీవ్రవేదన' అర్థం.

సోదరభాషల్లో - త.తీ(-వ్-,-న్త్-), తీయ్ (-వ్-, -ంత్-) 'కాల్చు, ఉడికించు;కోత. తీ.య్ - 'కాల్చు, మాడ్చు'; తొద. తియ్ -; క.తీ 'కాలు'; అనే సజాతీయ క్రియా రూపాలు.

త.తీ. 'మంట, దీపం, వేడి, కోపగించినవాడు', తీయల్, తీచల్ 'వండబడినది'; మ. తీ 'మంట', క. తీ 'మంట', సీ 'కాలినది'; తు. తూ.సు 'మంట'; అనే నామరూపాలు లభిస్తున్నాయి.(DED 2672 )

మూ.ద్రా.* తీ - >తె.üతీయు

(1)తె.üతీయు + పు > తీపు . తీయుటచే తీపు - 'వేదన'. భావార్థం.

(2)తె.ü తీయు + త > తీత.(భావార్థం)

తె.üతీయు జన్యం కాని తీపు అనే వేరొక పదానికి 1. మధురం 2. ఇష్టం 3. ప్రేమ అనేవి అర్థాలు. పై పద్యంలో 'వేదన' అనే అర్థంలో ప్రయోగించబడగా, 'మధురం, ఇష్టం' అనే అర్థంలో కూడ భాగవత ప్రయోగముంది. అది -

క. **ఆ పాలవెల్లి కూఁతురు**

**తీపులఁ జూపులను దోఁగి తిలకించి బ్రజల్**

**చేపట్టిరి సంపదలను**

**బ్రాపించెను మేలు జగము బ్రతికె నరేంద్రా!**[82]

**12.తూర్పు :-**

శా. **.... వెలికిన్ వచ్చెన్ నిశాంతోల్ల స**

**న్మాహాత్మ్యంబున దూర్పునం బొడుచునా మార్తాండు చందంబునన్.**[83]

తూర్పు <తె.üతూఱు /తె.ü దూరు. తె.üతూఱు / దూరు (అ.క్రి.) కు1. ప్రవేశించు 2. చొచ్చు అని అర్థాలు. తూర్పు (వి) శబ్దానికి ప్రాగ్దిశ అని అర్థం.

త. తూఱు 'చేరు, ప్రవేశించు', మ. తూరుక లోపలికి నెట్టు;క. తూఱు 'ప్రవేశించు'; అనే క్రియా పదాలు,

క. తూఱు - అనే సజాతీయ నామ రూపం సోదరభాషల్లో లభిస్తున్నాయి.(TVB - 592 )

మూ.ద్రా.*తూట - :*తూట్ - > తె. తె.üతూఱు / దూరు.

తె.üతూఱు + పు > తూరుపు / తూర్పు . దీనియందు సూర్యుడు తూఱును / దూరును - తూర్పు. (అధికరణార్థం)

(2)తె.üతూఱు + పు > తూపు.ఇది శరీరములందు దూరును / తూఱును - తూపు 'బాణం'. కర్త్రర్థం.

(3) తె.üతూఱు + ము > తూము . దీనియందు నీరు తూఱును - తూము 'నీరు వెడలు మార్గం' (అపాదానార్థం)

**13.తెంపు :-**

క. **గోవులకున్ బ్రాహ్మణులకు**

**దేవతలకు నెల్ల ప్రొద్దుఁ దెంపున గీడుం**

**గావించు పాప మానస**

**మే విధమునఁ బుట్టకుండ నే వారింతున్.**[84]

తెంపు < తె. **ü**తెగు. తె.**ü**తెగు (అ.క్రి.) కు 1. భిన్నమగు 2. మరణించు 3. నశించు 4. ముగియు 5. విరమించు అని అర్థాలు. తెంపు (వి) శబ్దానికి 1. తెగుట 2. తెంచుట 3. తెగువ, సాహసం అని అర్థాలు.

సోదరభాషల్లో - మ. తికయుక, తికెక్క 'ముగియు';క.తెగె, తెగు; తు. తెక్కుని; కొలామి. తిక్-; నాయకి. తిక్క్-; అనే క్రియారూపాలు లభిస్తున్నాయి.తెంపు 'శారీరక దారుఢ్యం', ధైర్యం, శక్తి, అనే నామరూపం లభించింది.(TVB - 597)(DED 2813) మూ.ద్రా. *తెక్ -.

*తెక్ ->తె.**ü**తెగు.తె.**ü**తెగు > తెంపు / తెంచు (ప్రేరణార్థంలో)

(1)తె.**ü** తెగు + పు > తెంపు . తెగుటయే తెంపు 'సాహసం'(భావార్థం)

(2) తె.**ü**తెగు + ట > తెగుట( భావార్థం)

(3) తె.**ü**తెగు + డు > తెగుడు - తెగుట( భావార్థం)

(4)తె.**ü** తెగు + దల > తెగుదల 'అంతం'. (భావార్థం)

(5) తె.**ü**తెగు + బడి > తెగుబడి ' తెగుట, దుక్కి, అమ్మకం' (భావార్థం)

(6)తె.**ü** తెగు + వ > తెగువ 'సాహసం' ( కరణార్థం)

తద్ధితాంతాలు :

(1) తెగువ + దారి (అంత్యవర్ణలోపం) > తెగుదారి 'సాహసికుడు, దాత' (మతుబర్థంలో దారి ప్రత్యయం).

(2) తెగువ + అరి > తెగువరి 'దాత' మతుబర్థం.

(3) తెంపు + అరి > తెంపరి 'శూరుడు, కఠినం'. మతుబర్థం.

(4) తెంపు + ఇ > తెంపి, 'వితంతువు' మతుబర్థం.

**14.నడపు / నడుపు :-**

క. **పలుకుల నగవుల నడపుల**

**నలుకల[85]....**

సీ. **..... కాంతాలకము లంద కౌటిల్య సంచార**

**మతివల నడుపుల యంద జడిమ[86]....**

తె.üనడచు + పు > నడపు, 'నడక' - భావార్థం.

(విశేషాలకు చూ. నడక)

**15.నెరపు :-**

వ. **...నెరపునం జనుదెంచి[85].....**

నెరపు< తె.üనెరయు.తె.üనెరయు (అ.క్రి.) కు 1. అతిశయించు2. వ్యాపించు 3. చెదరు 4. నెరవేరు 5. తప్పించుకొను అనీ; నెరపు/నెఱపు (విణ) శబ్దానికి 'అధికం', 'వ్యాప్తం' అని అర్థాలు.

సోదరభాషల్లో - త.నిరై, నిర, నిరట్టు; కొలామి, నిరయ్ అనే క్రియారూపాలు లభించగా,

త. నిరప్పం, నిరవు; అనే నామరూపం లభించింది.(TVB - 758)(DED 3041)

మూ.ద్రా. *నిర్ - . *నిర్ - > తె.üనెఱయు

(1)తె.ü నెరయు + పు > నెరపు - నెరయుట, అధికం - భావార్థం.

(2) తె.üనెరయు + అ > నెర - 1. గొప్పది 2. నేర్పరి - భావార్థం.

(3)తె.ü నెరయు + ఇక > నెరయిక 'నెరయుట' - భావార్థం.

(4) తె.üనెరయు + అవు > నెరవు 'సమృద్ధి' - భావార్థం.

తద్ధితాంతాలు :

(1) నెరవు + అరి > నెరవరి 'నేర్పరి'. మతుబర్థం.

(2) నెరవు + ఇడి > నెరవిడి 'ఆధిక్యం' స్వార్థం.

**16.పంపు :-**

మ. **వరయోగీశ్వరా! దేవహూతియును నీ వామాక్షి మత్పుత్రి దా**

**వరలావణ్య గుణాఢ్యులన్ వినియు నెవ్వారిన్ మదింగోరదా**

**తురయై నారదు పంపునన్ మిము వరింతున్నంచు నే తెంచె నీ**

**తరుణీ భిక్ష పరిగ్రహింపుము శుభోదాత్త క్రియాలోలతన్.** [88]

పంపు < తె.**ü**పనుచు. తె.**ü**పనుచు (స.క్రి.) కు 1. ఆజ్ఞాపించు 2. విధించు అనీ;

పంపు (వి) శబ్దానికి 1. ఆజ్ఞ 2. విధి అని అర్థాలు.

సజాతీయ రూపాలు - త. పని (-ప్ప్-, -త్త్-) 'పలుకు, నిర్ధారించు, ఆజ్ఞాపించు; మ.పనిక్క 'పలుకు'; త.పంపిణి 'చెప్పు, తెలుపు, వ్యాఖ్యానించు, బోధించు అనే క్రియారూపాలు.

త.పణి, పణిప్పు; క.పనవు 'సంకేతస్థానం' అనే నామరూపాలు లభిస్తున్నాయి.(DED 3212)

మూ.మ.ద్రా., మూ.ద.ద్రా. *పణ్-. పణ్- >తె.**ü**పనుచు.

తె.**ü**పనుచు + పు > పంపు( భావార్థం).

**17.పఱపు :-**

సీ. **ఉజ్జ్వలంబై శతయోజనంబుల**

**పొడవును పంచసప్తతి యోజనములఁ**

**బఱపును గల్గి**[89]**.....**

క.	**.... తద్వృత్తాంతమెల్ల వెలఁదులు నంతః**

**పురవాసలుఁ జెప్పిన విని,**

**<u>పఱపు</u>గ నిట్టూర్పు లెసగ[90]...**

పఱపు < తె.üపఱచు . తె.ü పఱచు (స.క్రి.) కు 1. ప్రసరింపజేయు, వ్యాపింపజేయు 2. నడిపించు అని అర్థాలు.

పఱపు (వి) శబ్దానికి 1. వైశాల్యం 2. ఆధిక్యం 3. వెడల్పు 4. సమత 5. శయ్య అని అర్థాలు.

పై మొదటి పద్యంలో 'వైశాల్యం' అనే అర్థంలో, రెండవ పద్యంలో 'అధిమైన' అనే అర్థంలో ~~ఈ~~ కృదంతం ప్రయోగించబడింది.

సోదర దీని సజాతీయ రూపాలున్నా ~~ఈ~~ అర్థంలో లేవు. తెలుగులో మాత్రమే ~~ఈ~~ అర్థాల్లో ~~ఈ~~ క్రియారూపం, కృదన్తం కనిపిస్తున్నాయి.

తె.üపఱచు + పు > పఱపు.

(1) పఱచబడేది - పఱపు (మొదటి నాలుగు అర్థాలు) భావార్థం.

(2) దీనిని పఱతురు - పఱపు / పఱుపు (సమస్వరత) 'శయ్య' - కర్మార్థం.

**18.పెంపు :-**

సీ.	**..... ఎవ్వని లావున నీ మేన దేవేంద్రు పీఠార్థమున నుండు <u>పెంపు</u>ఁగంటి[91]....**

పెంపు < తె.üపెరుగు. తె.ü పెరుగు (అ.క్రి.) కు 1. ఎదుగు 2. ఉప్పొంగు 3. పూను 4. కలుగు 5. ఔగు అని అర్థాలు. పెంపు (వి) శబ్దానికి 1. అతిశయం 2. గొప్పతనం 3. గౌరవం 4. ఉత్సాహం 5. ఎత్తు అని అర్థాలు.

సోదరభాషల్లో - త. పెరుకు, మ. పెరుక్కు, కొలామి. పెర్గ్-; నాయకి. పెర్గ్-; క.పెర్చు; మొ. క్రియారూపాలు, త.పెరు, పెరుమ్, పేర్, పెరిటు 'గొప్ప, పెద్ద' మ. పెరు, పేర్; క.పెద్ద, పెద్ది, పెంపు, మొ. నామ రూపాలు లభించాయి.(DED 3613)

మూ.ద్రా. *పెర్-/ *పేర్- >తె.üపెరుగు. (పెరుగు > పెంచు > పెంపు)

(1) తె.üపెరుగు + పు >పెంపు . పెరిగినది - పెంపు 'గొప్పదనం' (కర్త్రర్థం)

(2) తె.üపెరుగు + కువ > పెక్కువ (భావార్థం).

తద్ధితాలు :

(1) పెంపు + అరి > పెంపరి (మతుబర్థంలో అరి) 'గొప్పవాడు'.

(2) పెంపు + అఱు > పెంపఱు 'తక్కువపడు' (హీనార్థంలో అణు)

**19.పొడుపు :-**

క. **తెలతెల వాఱిన వనములఁ**

**గలకల మని పలికె పక్షి గణమెల్లెడలన్**

**మిలమిలని ప్రొద్దుపొడుపున**

**ధళధళయను మెఱుగు దిగ్వితానము నిండెన్.**[92]

పొడుపు < తె.üపొడుచు. తె.üపొడుచు / తె.üపొడ్చు (స.క్రి.) కు 1. గుచ్చు 2. కుమ్ము 3. ఛేదించు 4. విసరు 5. కఱచు 6. కుక్కు 7. చంపు 8. పాతు, నాటు 9. మోదు 10. ఊను 11. రాచు 12. (పందెం) వేయు; (అ.క్రి.) కు 1. పోట్లాడు 2. ఉదయించు 3. పుట్టు 4. పాఱు అని అర్థాలు. పొడుపు (వి) శబ్దానికి 1. ఉదయం 2. పోటు 3. కుట్టు అనేవి అర్థాలు.

సోదరభాషల్లో - త. పొటి (-ప్పి-, -త్తి-); మ. పొటియుక; క.పుణ్ము, పొణ్ము, హోమ్ము, ఉణ్ము; అనే క్రియారూపాలు. మ.పొటిక్క 'మొలక'; తు. పొజిలు 'క్రిమి, మొలక, మొక్క' అనే నామరూపాలు లభిస్తున్నాయి.

మూ.ద్రా. *పొట్ - . (DED 3668) *పొట్ - > తె.üపొడుచు.

(1) తె.üపొడుచు + పు > పొడుపు . పొడువబడునది - పొడుపు 'ఉదయం'. భావార్థం.

(2) తె.üపొడుచు + ము > పొడుము . పొడుచుట వలన పుట్టునది - పొడుము 'చూర్ణం' అపాదానార్థం.

(3) తె.üపొడుచు + ఇ > పొడి - చూర్ణం

(4) తె.üపొడుచు + వ > పొడువ . పొడువదగినవాడు - పొడువ 'దుష్టుడు, నిష్టుడు'(వీనిని పొడుతురు) కర్మార్థం.

**20.పొలుపు / పొల్పు : -**

తే. **<u>పొలుపు</u> దీపింప నిత్యవిభూతి నాయ**

**కుఁడవు భవగవంతుఁడవు ననఘుఁడవు నీవు**

**మత్కృపం బిష్ట నీ కభిమత మటంటి**

**వీశ! భవదీయ చారిత్ర మెఱుఁగ దరమె?**[93]

పొల్పు అనే ప్రయోగం కూడ భాగవతంలో (భాగ. 3-428) ఉంది.పొలుపు / పొల్పు< తె.üపొలుచు . తె.üపొలుచు / పొల్చు (అ.క్రి.) కు 1. గోచరించు 2. సాక్షాత్కరించు 3. బయలువడు4. వ్యాపించు 5. వీచు 6. కలుగు 7. ఉదయించు8. ప్రకాశించు 9. స్థిరమగు అని అర్థాలు.

పొలుచు (వి) శబ్దానికి1. ఒప్పు (అందం, శోభ, కాంతి...) 2. ఉల్లాసం 3. జాడ 4. పెంపు 5. ఆకృతి 6. మర్యాద 7. పరిమళం 8. ప్రతాపం అని అర్థాలు.

సోదరభాషల్లో - త. పొలి; తు. పొలి; అనే క్రియారూపాలు; త. పొలివు 'వికాసం, అందం'; పొఱ్పు 'అందం' అనే నామరూపం లభించాయి.(TVB - 886 ) మూ.ద్రా. * పొల్-/ *పొన్- .

*పొల్ - > తె.üపొలుచు.

తె.ü పొలుచు + పు > పొలుపు. భావార్థం.

**21.బలుపు :-**

క. **చారుతరధర్మరాశికి**

**భారకుఁడగు కృష్ణుఁడాత్మ పదమున కేగన్**

**భారకుఁడు లేక యెవ్వనిఁ**

**జేరెను ధర్మంబు <u>బలుపు</u>సెడి మునినాథా.**[94]

బలుపు <తె.üబలియు. దీనికి 1. బలం 2. పుష్టి 3. బడాయి 4. ఏపు 5. అతిశయం అని అర్థాలు.

(వివరాలకు చూ. బలిమి)

**22.మఱుపు :-**

ఉ. **.... నా <u>మఱపున్</u> సహింపుమట[95]....**

మఱపు <తె.ü మఱచు.

తె.üమఱచు (స.క్రి.) కు 1. విస్మరించు 2. మాను అని, అ.క్రి. గా 'పొరపడు' అని అర్థాలు.

మఱపు (వి) శబ్దానికి 1. విస్మృతి 2. ఒడలెఱుగనితనం 3. మూర్ఛ 4. పొరపాటు 5. అజ్ఞానం అని అర్థాలు.

త. మఱ (-ప్ప్-, -ంత్-); మ. మఱయుక; కోత. మర్వ్-, మర్చ్-; తొద. మఴ్-; క. మఱె, మఱసు, మఱయిసు, మఱిసు; తు. మదపుని, మరపుని, మరెపుని; కొలామి. మద్-; మొ. సజాతీయ క్రియారూపాలు; త.మఱతి, మఱప్పు, మఱల్, మఱలి, మఱవి, మఱైవు; మ.మఱవు, మఱెప్పు, మఱప్పు, మఱలి, మఱవి, మఱైవు; మ.మఱవు, మఱెప్పు, మఱప్పు; క.మఱె, మఱ, మఱపు, మఱవు, మఱహు; మ. నామరూపాలు లభిస్తున్నాయి.(TVB -945)(DED 3897) మూ.ద్రా., మూ.ద.ద్రా *మత్-వ్-.

*మత్ - > తె.üమఱచు (చ. త్>ఱ్).

తె.üమఱచు + పు > మఱపు. మఱవ బడేది - మఱపు. (భావార్థం)

(2) తె.üమఱచు + కువ > మఱకువ అజ్ఞానం భావార్థం.

(3)తె.üమఱచు + గు / వు > మఱుగు / మఱువు 'చాటు'.(పర స్వరాకర్షణ)

**23.మెలపు :-**

చ. **కలఁగకుఁడీ వధూజనులు కంపము నొందకుఁడీ వ్రజేశ్వరుల్**

**తలఁగకుఁడీ కుమారకులు తక్కిన వారలు రాలవానచే**

**నలయకుఁడీ పశువ్రజము నక్కడ నక్కడ నిల్వ నీకుఁడీ**

**<u>మెలపున</u> మీకు నీశ్వరుడు మే లొసఁగుంగరుణార్ద్ర చిత్తుఁడై.[97]**

మెలపు< తె.üమెలయు. తె.üమెలయు /తె.ü మెలియు (అ.క్రి.) కు 1. ఉండు 2. జాగరూకతతో ఉండు 3. పెనగు అనేవి అర్థాలు. మెలపు (వి) అనే కృదంతానికి 1. అప్రమత్తత 2. నేర్పు 3. సౌందర్యం 4.

మార్దవం 5. ప్రమోదం 6. నడక 7. కదలిక 8. స్థైర్యం 9. మెల్లందనము 10. విధం, రీతి అనేవి అర్థాలు.

సజాతీయరూపాలు - త.మిళిర్; మ.మిటయుక; క.మిళిర్; తు.మెలియుని; కువి. మ్లింగా; కువి. మ్రిఫ్ -; పర్జి. మిల్కిప్-; అనే క్రియారూపాలు.

క.మిళిర్, మెళ్ళ; తు.మలవె; అనే నామరూపాలు లభిస్తున్నాయి. (TVB -1040)(DED 3989)

మూ.ద్రా. *మిళ్ - / * మిణ్ -. *మిళ్ - > తె.ü మెలయు

తె.üమెలయు + పు > మెలపు . మెలయుటచే - మెలపు 'జాగరూకత'.(భావార్థం).

(2)తె.üమెలయు + త > మెలఁత . మెలయునది (జాగరూకతతో ఉండునది) మెలఁత 'స్త్రీ' కర్త్రర్థం.

తద్ధితం -

మెలఁత + ఉక > మెలఁతుక. 'స్త్రీ'. స్వార్థంలో ఉక ప్రత్యయం.

**24. మోపు :-**

సీ. **చక్రికి మ్రొక్కని జడుని యౌదలనున్న**

**కనక కిరీటంబు కట్టె మోపు...**

మోపు < తె.üమోచు /తె.ü మోయు. తె.üమోచు (స.క్రి) కు 1. వహించు 2. ఎత్తికొను 3. స్పృశించు 4. ఆక్రమించు 5. పొందు 6. పోషించు అనీ; మోపు (వి) శబ్దానికి 1. మోచుట 2. కట్ట 3. సమూహం 4. మూట 5. బరువు 6. బాధ్యత అని అర్థాలు.

సోదరభాషల్లో - 1. త.మో. పూనుకొను, వాగ్దానం చేయు; క. మోఱు మోయు; కువి. మోచ్ - అనే క్రియారూపాలు. త.మొయ్ంచు భుజం, మోతు 'గడ్డిమోపు'; క.మోపు 'భారం'; కొలామి. మోప్ 'బరువు' అనే నామరూపాలు లభిస్తున్నాయి.(TVB - 1058)

మూ.మ.ద్రా., మూ.ద.ద్రా. *ముయ్ - / * మోయ్-.

*మోయ్ - >తె.üమోచు / మోయు

తె.ü మోయు + పు > మోపు. మోయబడేది. దీనిని మోయుదురు - మోపు 'భారం' కర్మార్థం.

(2) తె.üమోయు + త > మోఁత . మోయబడేది. మోఁత 'భారం' - కర్మార్థం.

(3) తె.**ü**మోయు > (ప్రేరణార్థంలో) మోపు. మోపు + దల > మోపుదల 'ఆరోపణం.

(4) తె.**ü**మోయు > మోపు + ఇక > మోపిక 'భారం'.

తద్ధితాలు :

(1) మోపు + అరి > మోపరి 'భారం కలవాడు'. మతుబర్థంలో అరి.

(2) మోపరి + ఈఁడు > మోపరీఁడు. స్వార్థంలో.

(3) మోపు + కాఁడు > మోపుకాఁడు. మతుబర్థం.

**25.వంపు :-**

సీ. ... **సరివారిలోపలఁ దల<u>వంపు</u> చేసి**[99]...

వంపు < తె.**ü**వంచు. తె.**ü**వంచు (స.క్రి.) కు 1. వంగజేయు 2. లొంగజేయు 3. క్రమ్మరించు 4. పోగొట్టు 5. వడ్డించు అని అర్థాలు. వంపు (వి) శబ్దానికి 1. వంగుట 2. వంకర, వక్రత 3. పక్క.

తె.**ü**వంగు > తె.**ü**వంచు+పు >వంపు. (వివరాలకు చూ.వంక)

**26.వగపు :-**

వ. **... శోకాతురులైన వారల <u>వగపు</u> మానిచి మన్నించె**[100]**....**

వగపు <తె.**ü**వగచు. వగపు (వి) 'దుంఖం', 'కీడు'.

**27. వలపు :-**

సీ. **... గళములు నివురుచుఁ బ్రేమతో నెఱపు <u>వలపు</u>**[101]

వలపు < తె.**ü**వలచు. తె.**ü**వలచు (స.క్రి.) కు 1. అపేక్షించు 2. మోహించు; (అ.క్రి.) కు 1. తగు 2. సమర్థుడగు అని అర్థాలు. వలపు (వి) శబ్దానికి 1. కోరిక 2. మోహం అని అర్థాలు.

సోదరభాషల్లో - త. ఒల్. ఒల్లు (ఒల్ల్ - ఇణ్-) 'అంగీకరించు'; మ. ఒల్లుక 'ప్రేమించు'; క. ఒలి, ఒలె 'ప్రేమించు'; తు. ఒలపుని; అనే క్రియారూపాలు;

క. ఒల్ 'ఇష్టం' అనే నామరూపం లభిస్తున్నాయి. (TVB - 1139)

మూ.ద్రా. *వల్-/ఒల్ -. *ఒల్-/వల్- >తె.üవలచు.

తె.üవలచు + పు > వలపు. వలచుటయే వలపు 'ఇష్టం, కోరిక' భావార్థం.

తె.üవలచు + అ > వల 'వలపు' భావార్థం.

**28.వాఁపు :-**

క. **ఊపిరి వెడలక కడుపున**

**<u>వాఁపో</u>దవినఁ[102]...**

వాఁపు <తె.üవాఁచు. తె.üవాఁచు (అ.క్రి.) కు 1. మిక్కిలి అపేక్షించు2. వాయించు 3. రోగంతో ఉబ్బు అని అర్థాలు. వాఁపు (వి) శబ్దానికి 'రోగంతో శరీరం లావగుట' అర్థం.

సోదరభాషల్లో - త. వాయ్ 'నిండు, పోగుచేయు'; మ. వాయ్క్క 'నీరెక్కు'; క. బా.బాయు; తు. బాపుని; కోత. వావ్-; మొ. క్రియారూపాలు;

తు.బాపు 'వాపు'; గోండి. వడ్డీ; కురుఖ్. బయా 'ఉబ్బు, ఉప్పెన'; మొదలైన నామరూపాలు లభిస్తున్నాయి.(TVB - 1146 )

మూ.ద్రా.*వాయ్ - . *వాయ్ - > తె.ü వాచు / తె.üవాఁచు

(1) తె.üవాఁచు + పు > వాపు. వాచినది వాపు. భావార్థం.

(2) మూ.ద్రా.*వాయ్ -+త >వాత .వాచినది వాపు. భావార్థం.

తద్ధితాలు -

(1) వాఁపు + ఇ (మతుబర్థంలో) > వాఁపి 'వాపు గలవాడు'.

(2) వాఁపు + ఇరి (స్వార్థంలో) > వాఁపిరి 'మిక్కిలి కాంక్ష'.

(3) వాఁపిరి + కొట్టు (మతుబర్థంలో) > వాఁపిరి గొట్టు 'వాపిరివాడు'.

**29.వెఱపు :-**

వ. **... ఆ రాచపాపనికి వివిధోపాయంబులం బురుహితుండు**

<u>వెఱవు౯</u> **జూవుచు రాజసన్నిధింబాపి**[103]**....**

వెఱపు < తె.**ü**వెఱచు.తె.**ü** వెఱచు (అ.క్రి.) 'భయపడు. సంకోచించు'. వెఱపు (వి) 'భయం'.

సోదరభాషల్లో - త. వెరువు ; మ. వెరులుక; క.బెర్చు, బెచ్చు; కొడగు. బొరద్-; అనే క్రియారూపాలు;

త. వెరు 'భయం', వెరుట్చి 'భయం', సిగ్గు, సంకోచం, విఱప్పు; మ. విరత్తల్; క. బెప్పళ, బెప్పు, అనే నామరూపాలు లభిస్తున్నాయి.(DED 4519)

మూ.మ.ద్రా., మూ.ద.ద్రా. *వెట్-వ్-

*వెట్ - > తె.**ü** వెఱచు.

తె.**ü**వెఱచు + పు > వెఱపు . వెఱచుటయే వెఱపు. (భావార్థం)

తె.**ü**వెఱచు + మఱ > వెఱమర 'భయం' -( భావార్థం)

తద్ధితాలు-

(1) వెఱపు + అరి (మతుబర్థంలో) > వెఱపరి 'భయం కలవాడు'.

(2) వెఱపు + ఇ౯డి (హీనార్థంలో) > వెఱపి౯డి 'భయం లేని వాడు'.

**30.వేల్పు / వేలుపు :-**

క. <u>**వేలుపు**</u> **లటె నా కంటెను**

<u>**వేలుపు**</u> **మఱి యెవ్వ౯డనుచు వికవిక నగి మా**

<u>**వేలుపుల**</u> **గోడపై నో**

**హేలావతి! నీ తనూజు డెంగిలి చేసెన్.**[104]

వేల్పు / వేలుపు < వేలుచు. వేల్చు / వేలుచు (స.క్రి.) హోమము చేయు అని అర్థం. వేల్పు / వేలుపు 'దేవత, జోస్యం'.

సోదరభాషల్లో - త.వేళ్ 'ఆహుతిచ్చు, పెళ్ళాడు'; మ.వేళ్క; క.బేళ్ అనే క్రియారూపాలు;

త.వేళ్ 'పెండ్లి', వేళ్వి 'ఆహుతి, పెండ్లి. వేట్టల్ 'పెండ్లి'. వేట్టాణ్, వేట్టోణ్, 'భర్త', వేట్టాళ్ 'భార్య'; మ.

వేళ్వి, వేట్వి 'ఆహుతి'; వేళి, వేళ్వి 'పెళ్ళి, భార్య, వధువు'; అనే నామ రూపాలు లభిస్తున్నాయి.(DED 4561) మూ.మ.ద్రా., మూ.ద.ద్రా. * వేళ్ -.

*వేళ్- > తె. వేలుచు . ఈ క్రియా రూపం సాహిత్య వంత భాషల్లో మాత్రమే ఉండడం గమనించదగిన విషయం.

తె.üవేలుచు + పు > వేలుపు.వీరి కొరకు వేల్చెదరు - వేలుపులు 'దేవతలు' - సంప్రదానార్థం.

**6.14. పురం :-** భాగవతంలోని -పుర ప్రత్యయాంత కృదంతం -

**కాపురము :-**

క. **కసవుగల దిరవు పసులకు**

**లసదద్రి నదీ మహీజ లతికావళిఁ బెం**

**పెసఁగును <u>గాపురము</u>నకును**

**బొసఁగును బృందావనంబు పొదఁడచ్చుటికిన్.** (-భాగ. 10పూ.422)

తె.üకాచు + పురము > కాపురము. ఈ తె.üకాచు ధాతువు , తె.üకాఁగు యొక్క ప్రేరణార్థకం.

కాఁచు/ కాగునట్లు చేయు, 'తపింపజేయు' .

(1) తె.üకాఁచు + పురం > కాఁపురము. కాగజేయునది - కాపురము, సంసారము ప్రజలను కాఁగ జేయునని భావము. (కర్త్రర్థం).

(2) తె.üకాఁగు + ఉ > కాఁగు / క్రాఁగు . దీనియందు నీరు కాఁగును - కాగు 'పెద్ద బాన' (అధికరణార్థం).

(3)తె.ü కాఁగు + క > కాఁక . కాగునది - కాఁక 'తాపం, బాధ'.( భావార్థం)

జ. కాఁగు + గడ > కాగడా 'కరదీపిక'.

**6.15. - బడి :-** భాగవతంలోని - బడి ప్రత్యయాంత కృదంతం -

**చెల్లుబడి :-**

క. **<u>చెల్లుబడి</u> గలిగి యెవ్వఁడు**

**తల్లికిఁ దండ్రికిని దేహధనముల వృత్తుల్**

**సెల్లింపఁడట్టి కష్టుఁడు**

**ప్రల్లదుఁడా మీఁద నాత్మఫలలాశి యగున్.**[105]

చెల్లుబడి < తె.üచెల్లు.

తె.üచెల్లు (అ.క్రి.) కు 1. తగు 2. సరిపోవు 3. సమర్థుడగు 4. సిద్ధించు 5. నెగ్గు 6. చచ్చు 7. నశించు 8. (అప్పు) తీరు 9. గతించు 10. ముగియు 11. శక్యమగు 12. జరుగు 13. ఒప్పు 14. వ్యయమగు 15. వశమగు 16. చెందు అని అర్థాలు.

చెల్లుబడి (వి) కి 1. సాగుబడి, అధికారం 2. సమర్థత విణ 1. నెగ్గిన 2. చెందిన అని అర్థాలు.

సోదరభాషల్లో - త. చెల్; మ.చెల్క; క.సల్ సల్లు; తు. సల్లుని; కోత. చల్ - (చద్-) 'దైవప్రార్థన, చెల్లు, తగు అనే క్రియారూపాలు లభిస్తున్నాయి.(TVB - 474)(DED 2286)

త. చెలవు, చెలికై; మ.చెలవు 'ఆదాయం, వ్యయం'.చెలవన్ 'దుబారా మనిషి', చెలవి (స్త్రీలింగం); కోత. చల్వ్, చెల్వ్; క.సల, సలవు, సలహువికె, సలికె, సలిగె, సలుహ, సలిగే; మొ.నామరూపాలు లభిస్తున్నాయి.

మూ.ద్రా. *చల్ - .  *చల్ - > తె.ü చెల్లు

తె.üచెల్లు + బడి > చెల్లుబడి. చెల్లునది - చెల్లుబడి. (భావార్థం)

**6.16. - మర :-** భాగవతంలోని -మఱ ప్రత్యయాంత కృదంతాలు -

(1) పడమర  (2)వెఱమర

**1.పడమర :-**

సీ. **పూర్వ వాయువులు ప్రభూతంబులై వీచె**

**<u>బటమట</u> నింద్రచాపంబు తోఁచె**[106]**...**

పడమర < తె.üపడు.

తె.ü పడు (అ.క్రి.) కు 1. పతితమగు 2. శ్రమపడు 3. భంగపడు 4. శయనించు 5. చచ్చు 6. అస్తమించు 7. సొమ్మసిల్లు 8. మునుగు 9. ప్రయత్నించు 10. లొంగు అని అర్థాలు.

పడమర (వి) కు 'పశ్చిమ దిక్కు' అని అర్థం.

త.పటు 'నశించు, చచ్చు'; మ.పటుక 'పతనమగు'; క.పడువు, పడవల్, 'పశ్చిమం'; అనే నామరూపాలు □a‹□ºë Œ ò .(DED 3190)మూ.ద్రా. *పట్ - .

*పట్ - > తె.**ū**.పడు

(1) తె.**ü**పడు + మర > పడుమర / పడమర . దీనియందు సూర్యుడు పడును (అస్తమించును) - పడమర. (అధికరణార్థం)

(2) తె.**ü**పడు + టు > పాటు (చూ.పాటు)

(3) తె.**ü**పడు + క > పడక.దీనియందు జనులు పడుదురు (శయనింతురు) -' పడక శయ్య'. అధికరణార్థం.

(4)తె.**ü**పడు+ ఎ >పాడె.పడినవారిని (చచ్చినవారిని/శవాన్ని) ఉంచునది-పాడె'శవవాహనము' అధికరణార్థం.

**2.వెఱమర :-**

చ. **<u>వెఱమర</u> లేని మేటిబలు వీరుఁడు**[107]...

(వివరాలకు చూ. వెఱపు)

ఈ ప్రయోగం కేవలం పోతన ప్రయోగం. ఏ కోశంలో లభించలేదు.

**6.17. - ము : -** భాగవతంలోని -ము ప్రత్యయాంత కృదంతం -

**నోము :-**

తరల..... **నులుసు లేక ఫలించె నోచిన <u>నోము</u>లెల్లను నీవయై.**[108]

నోము < తె.**ü**నోచు. నోచు (స.క్రి.) కు 'వ్రతమాచరించు' అర్థం.

నోము(వి)కు వ్రతం, యజ్ఞం, వ్రతఫలం అనేవి అర్థాలు.

త.నోల్; మ.నోల్క; క.నోన్, నోను అనే సజాతీయ క్రియారూపాలు; త.నోంపు; మ.నోమ్పు; క.నోమ్పు అనే నామరూపాలు సోదరభాషల్లో లభిస్తున్నాయి.(TVB -775)మూ.ద్రా. *నో-/ *న్-.

*నో-/ *న్- > తె.üనోచు.

(1)తె.üనోఁచు + ము > నోము. దీనిని నోచెదరు - నోము 'వ్రతం'( కర్మార్థం)

(2) తె.üనోఁచు + త > నోఁత . నోచుటయే - నోఁత. (భావార్థం)

**6.18. - వ :-** భాగవతంలోని -వ ప్రత్యయాంత కృదంతాలు -

(1) ఎక్కువ (2) కూటువ (3) చేరువ (4)తక్కువ

(5) తెగువ (6) త్రోవ (7) నెవ్వ

**1.ఎక్కువ :-**

సీ. **.... <u>ఎక్కువ</u> తక్కువ నెన్నఁడు నొందక**

**నిర్గుణత్వంబున నెఱియు ఘనుఁడు[109]...**

ఎక్కువ<తె.üఎక్కు. తె.üఎక్కు (అ.క్రి.) కు 1. అధిష్ఠించు 2. పైకిపోవు 3. ప్రసరించు 4. ఇష్టమగు 5. అధికమగు 6. సంభవించు 7. నెఱవేఱు 8. ఎదుర్కొను 9. స్పష్టపడు 10. ఆవేశించు అని; ఎక్కువ (వి) కు ఆధిక్యం అనీ అర్థం.

సోదరభాషల్లో - త. ఎక్కు; మ. ఎక్కుక; క.ఎక్కు; తు. ఎక్కల్యుని; కొండ. ఎక్-; కుయి. ఎకసి, ఎంగసి అనే క్రియారూపాలు, క.ఎక్కటిగ 'అధికుడు', ఎక్కటె 'ఆధిక్యం', ఎక్కె, ఎక్కళి, ఎగ్గళ, అధికం అనే నామ రూపాలు లభిస్తున్నాయి. (TVB- 150)(DED 655) మూ.ద్రా. *ఎయ్ - క్క్ -.

*ఎయ్ - క్క్-> తె.ü ఎక్కు.

(1) తె.üఎక్కు + వ > ఎక్కువ.( భావార్థం)

(2) తె.üఎక్కు + వ > (సరళీకరణం, అద్విరుక్తత) ఎగువ. ఎక్కదగినది - ఎగువ.( భావార్థం)

దీని ప్రయోగం కూడ భాగవతంలో ఉంది. అది -

క. **కసిమసగి యసుర విసరములసిలితికల సురల <u>నెగువ</u> నసువులు వెడలం[110]...**

**2.కూటువ :-**

ఉ. **ఈరని లోకులం గినిసి యొగ్గులు వల్కనివాడు గోరికల్**

**గోరనివాడు <u>గూటువ</u>ల గూడనివాడు వృథాప్రపంచమున్**

**జేరనివాడు దైవగతిఁజేరిన లాభము సూచి తుష్టుడై**

**నేరనివాని చందమున నేర్పులు సూపెడువాడు వెండియున్.**[111]

కూటువ <తె. **ü**కూడు.

తె.**ü**కూడు (అ.క్రి.) కు 1. గుమిగా జేరు 2. కలిసియుండు 3. కలుగు 4. సమకూడు 5. సాధ్యమగు 6. తగు 7. సమర్థమగు 8. సంబంధించు; (స.క్రి.) గా 1. పొందు 2. కలుపు, సంకలితం చేయు; (స.క్రి., అ.క్రి.) గా 1. చేరు, కలియు 2. సంభోగించు - అని అర్థాలు.

సోదరభాషల్లో - త.కూటు; మ.కూటుక; క.కూడు; తు.కూడుని; కో.కూట్-; తొ. కూటు; మ.కూటుక; క.కూడు; తు.కూడుని; కో.కూట్-; తొ.కూట్-; కువి. కూడి-కి-; కుర్ఖ్-ఖోండ్-; అనే క్రియారూపాలు లభిస్తున్నాయి.(TVB - 299)

త.కూట. కూటల్ 'కూటమి, సంభోగం'; కూటుతలై, విజయం; కూట్టమ్, కూట్టర్, కూట్టల్, కూట్టళణ్, కూట్టళై; మ.కూట, కూటి, కూట్టు, కూట్టమ్, కూట్టళం, కూట్టళి; క.కూడ, కూడళ్, కూడికె, కూడువికె, కూడుహ, కూడుదలె, కూట, కూరు; కొడగు, కు-ట, వివాదం, కు-టి 'గుంపు', తు.కూడ 'సహా', కూడిగె 'కూడిక', కూట; అనే నామరూపాలు లభిస్తున్నాయి.(DED 1562 )

మూ.ద్రా.*కూన్ట్ - / *కూట్ట్ - ; దీని నుండే సం. కూటః నిష్పన్నమైంది.

*కూట్ట్ - > తె.**ü**కూడు. తెలుగులో ధాతువు కంటే ముందే ప్రవేశించిన కృదంతమిది. దంత్యోష్ఠ్యమైన వకారంతో సామ్యమున్న ఉకారాగమం.

(1) తె.**ü**కూట్ + వ > కూటువ. దీనియందు కూడెదరు - కూటువ - గుంపు, సాంగత్యం, (అధికరణార్థం)

(2) తె.**ü**కూడు + అమి > కూటమి. దీనియందు కూడెదరు - కూటమి 'గుంపు' (అధికరణార్థం).

(3) తె.**ü**కూడు + అము > కూటము.దీనియందు కూడెదరు - కూటము. 'చావడి, సభాభవనం, సంభోగం'

(4) తె.**ü**కూడు + అవు > కూటువు - కూటువ

(5) తె. **ü**కూడు + ఇక > కూడిక . దీనిచే కూడెదరు. కరణార్థం.

(6)తె. **ü** కూడు + అలి > కూడలి . దీనియందు కూడెదరు (అధికరణార్థం)

(7)తె. **ü** కూడు + దల > కూడుదల. కూడునది - కూడుదల - లాభం (కర్త్రర్థం)

జ. కూటమి, కూటము, కూటువ, కూటువమూక, కూటువసరులు, కూటువు, కూడ, కూడబడు, కూడబాఱు, కూడబెట్టు, కూడములు, కూడిక, కూడిమాడు, కూడివచ్చు, కూడుకొను, కూడుదల.

**3.చేరువ :-**

వ. **... కొలంకుల సమీపంబల, గిరుల<u>చేరువ</u>ల, సెలయేఱుల**

**చెంతల[112]....**

తె. **ü**చేరు + వ > చేరువ

(1) చేరుటకు అనువైనది - చేరువ 'సమీపం'( భావార్థం).

(2) దీనియందు జనులు చేరేదరు - చేరువ 'సంఘము, కలయిక, (అధికరణార్థం).

(3) శత్రు సైన్యంను పరలోకానికి చేరునట్లు చేయునది / చేయువాడు - చేరువ 'సేన, సేనాధిపతి' (కర్త్రర్థం).

తద్ధితం :-

మ. **చెలువల్లవ్వల నున్న వల్లభులపై చిత్తంబులం గూర్తురు**

**త్కలికం జేరువ వారికంటే[113]...**

చేరువ + వాడు > చేరువవాడు 'సమీపమందున్నవాడు'(వివరాలకు చూ.చేరుగడ)

**4.తక్కువ :-**

సీ. **.... ఎక్కువ <u>తక్కువ</u> నెన్నఁడు నొందక[114]**

**తక్కువ < తె. ü తక్కు.**

తె. **ü** తక్కు (స.క్రి.)కు 1. విడుచు, మాను (అ.క్రి.)కు 1. మిగులు 2. తొలగు 3. పోవు 4. న్యూనమగు

అని అర్థాలు. తక్కువ (వి) కు న్యూనత, లాఘవం అర్థాలు.

సజాతీయ రూపాలు - త.తంకు; మ.తణ్ణుక, తంచుక; క.దక్కు అనే క్రియారూపాలు లభిస్తున్నాయి.

మూ.ద.ద్రా.*తంక్-/ *తక్క్-. (TVB - 520)

*తక్క్ - > తె.üతక్కు.

(1)తె.üతక్కు + వ > తక్కువ న్యూనత.( భావార్థం)

(2) తె.üతక్కు + అ > తక్క (అవ్యయం) . తక్కినది (మిగిలినది) - తక్క. భావార్థం.

దీని భాగవత ప్రయోగం -

**క. భవములకు మందు చిత్త**

**శ్రవణానందము ముముక్షుజనపదము, హరి**

**స్తవము పశుఘ్నుడు దక్కను**

**జెవులకు దనివయ్యె ననెడి చెనఁటియుగలడే![115]**

(3) తక్కు + అటి > తక్కటి 'మిగిలినది' -( భావార్థం)

(4) తక్కు + డు > తక్కుడు 'తక్కుట, విడుచుట' (భావార్థం)

**5.తెగువ :-**

క. **పగవాడు మడియ నోపును**

**దెగడేనియు నెదురుపడఁడె తెగువ నరులకుం**

**దెగినయెడఁ బగఱ మీదను**

**బగ గొనఁదగ దనుచు మానెఁ బ్రాభవ శక్తిన్.[116]**

తె.üతెగు + వ > తెగువ. దీనిచే తెగెదరు - తెగువ 'సాహసం' (కరణార్థం).

ఈ కరణార్థంలోనే - 1. సాహసం 2. ఔదార్యం 3. ఏర్పాటు4. వాడి (పదను, తీక్షణత) అని అర్థాలు.

(వివరాలకు చూ. తెంపు)

**6.త్రోవ :-**

వ. **తనకుఁ ద్రోవయిమ్మని వేడిన, నదియు మార్గంబు సూపకమిన్నందిన[117]...**

త్రోవ < త్రోచు. త్రోచు (త్రోయు) (స.క్రి.) కు 1. నెట్టు 2. పడవేయు 3. నిరాకరించు 4. ఉల్లంఘించు 5. త్యజించు 6. దాటు, కడచిపోవు 7. వెడలగొట్టు 8. తొలగించు 9. వెళ్ళించు 10. నశింపజేయు 11. నొక్కు; (అ.క్రి.) కు 1. ఉబుకు 2. ముసురు 3. మించు 4. నడచు అని అర్థాలు. త్రోవ (వి) కు 1. మార్గం 2. ఉపాయం, సాధనం 3. గతి, దిక్కు 4. జోలి, సంబంధం అని అర్థాలు.

సజాతీయ రూపాలు - త. తుర; మ. తురత్తుక; పర్జి. తుర్క్ప్ -; కుయి. త్రోప అనే క్రియారూపాలు లభిస్తున్నాయి.(TVB - 655)

మూ.ద్రా. *తుర్ - అ - / *తొర - అ -.

ఇది మూ.ద్రా. నుండి తెలుగులోకి క్రియారూపం ప్రవేశించక ముందే చేరిన కృదంతం. తొర - వర్ణవ్యత్యయం చెంది, అ - అనుబంధం చేరి, (ఉ+అ) > వ కాగా త్రోవ అనే రూపం నిష్పన్నమౌతుంది.

తె.üత్రోచు + వ > త్రోవ. దీనియందు జనులు త్రోచెదరు (నడచెదరు) - త్రోవ మార్గం. అధికరణార్థం.

తెలుగులో త్రొక్కు అనే మరో క్రియా ధాతువుంది.దాని నుండి త్రోవ నిష్పన్నమైనదంటే బాగుంటుంది.తె.üత్రొక్కు + వ > త్రోవ (లోపదీర్ఘం).జనులు దీనిని త్రొక్కెదరు - త్రోవ మార్గం. కర్మార్థం.

తద్ధితం :-

త్రోవ + అరి > త్రోవరి 'బాటసారి', మతుబర్థం.

7.నెవ్వ :-

సీ. **అనఘాత్మ! నీవును నబ్జనాభుండును**

**పరికింప బ్రాహ్మణాభాసులైన**

**వారల యెడల నెవ్వలను నుపేక్షింపరట[118]....**

నెవ్వ < తె.üనెవులు.

తె.üనెవులు (అ.క్రి.) బాధనొందు నెవ్వ (వి) కు1. దారిద్ర్యం 2. శ్రమ 3. వ్యథ అనేవి అర్థాలు.

సోదరభాషల్లో - త.నెకు; కోత. నెగ్ - అనే క్రియారూపాలు, త. ఎవ్వమ్, ఏవల్; క.నెవులు, నెగులు అనే నామరూపాలు లభిస్తున్నాయి.(DED 3094) మూ.ద.ద్రా. *నెవ్ - వ్ - .

*నెవ్ - > తె.ü నెవులు.

తె.üనెవులు + వ > నెవ్వ.దీనిచే జనులు నెవులుదురు (బాధనొందెదరు) - నెవ్వ. (కరణార్థం)

**6-19. - వడి** : - భాగవతంలోని -వడి ప్రత్యయాంత కృదంతం -

**నడవడి :-**

క. **నడవడి కొఱగా కున్నను**

**బడుగైనఁ గురూపియైన బామరుడైనన్**

**జడుడైన రోగియైనను**

**విడుచుట మర్యాద కాదు విభునంగనకున్.**

నడవడి <తె.ü నడచు. నడవడి (వి) ప్రవర్తన. (వివరాలకు చూ. నడక)

**6.20. -వలి: -** భాగవతంలోని -వలి ప్రత్యయాంత కృదంతం -

**కావలి :-**

వ. **... ఎల్ల కార్యంబులకుఁ గావలియగు నా పురుషోత్తముండు[120]...**

కావలి < తె.üకాచు. కావలి 'రక్షణ'. (వివరాలకు చూ. కాపు)

**6.21. - వి : -** భాగవతంలోని -వి ప్రత్యయాంత కృదంతాలు -

(1) ఈవి (2) తనివి (3) తెలివి

**1.ఈవి / ఈగి :-**

క. **ధాత్రిని హాలికునకు సు**

**క్షేత్రము బీజములు లెస్స చేకుఱు భంగిం**

**జిత్రముగ దాత కీవియు**

**బాత్రము సమకూఱునట్టి భాగ్యము కలదే.**[121]

ఈవి < తె.üఇచ్చు. తె.üఇచ్చు (స.క్రి.) కు 1. ఒసగు 2. అధీనం చేయు 3. ప్రకటించు 4. త్యజించు అని అర్థాలు. ఈవి (వి) కి 1. దానం 2. వరం 3. బహుమానద్రవ్యం 4. త్యాగం అని అర్థాలు.

సజాతి రూపాలు :- త.ఈ; కొలమి. సీ -; క. ఈ; పర్జి. చీ-; కుయి. సీవ; కువి.హీ-; మాల్తో. చియ్- అనే క్రియారూపాలు; త.ఈకై 'బహుమానద్రవ్యం', ఈకైయన్ 'దాత', ఈవు 'ఈవి', ఈవన్ 'దాతన్; కుయి. జీవ 'ఇచ్చుట' - అనే నామరూపాలు లభిస్తున్నాయి.(DED 2138 )

మూ.ద్రా.* చియ్ - / *చీ -.

*చియ్ - వర్ణవ్యత్యయం చెంది, తెలుగు ధాత్వనుబంధంచు చేరి, ఇచ్చు నిష్పన్నమౌతుంది.

తె.üఇచ్చు + వి > ఈవి (లోపదీర్ఘం) / ఈగి (వ >గ).ఇచ్చుటకై - ఈవి 'బహుమాన ద్రవ్యం, త్యాగం, వరం, దానం' సంప్రదానార్థం.

తద్ధితాలు :- ఈగి + కాడు > ఈగికాడు 'త్యాగి' మతుబర్థం.

ఈవి + అరి > ఈవరి 'దాత' మతుబర్థం.

**2.తనివి :-**

ఆ. **అనఘ! వినురసజ్ఞులై వినువారికి**

**మాటమాట కధిక మధురమైన**

**యట్టి కృష్ణకథన మాకర్ణకము పేయ**

**దలపు గలదు మాకు దనివి లెదు.**[122]

తనివి <తె.ü తనియు. తనియు (అ.క్రి.) 'తృప్తిపడు'. తనివి (వి) తృప్తి. తనివు - రూపాంతరం.

సజాతీయ రూపాలు - త. తణి, క.తణి అనే క్రియారూపాలు; క.తణిపు; తు.తణు అనే నామరూపాలు లభిస్తున్నాయి.(TVB - 531)

మూ.ద.ద్రా. *తణ్ - . *తణ్ - > తె. తనియు

తె.üతనియు + వి > తనివి.తనియుటయే - తనివి. భావార్థం.

**3.తెలివి :-**

తే. **తెలిసి మిక్కిలి దమలోన దెలివి నొంది**[123]...

తెలివి < తె.üతెలియు.తె.ü తెలియు (స.క్రి.) కు 1. ఎఱుగు 2. తలచు (అ.క్రి.) కు 1. ఎఱుకపడు 2. తేటపడు 3. నిద్ర నుండి లేచు 4. వికసించు 5. తేఱుకొను 6. నమస్కరించు అని అర్థాలు.

తెలివి (వి) కి 1. జ్ఞానం 2. గ్రహణశక్తి 3. తేఱుట 4. సంతోషం 5. వికాసం 6. ప్రకాశం 7. మెలకువ 8. అంగీకారం అని అర్థాలు.

సజాతీయ రూపాలు - త.తెళ్; మ. తెళియుక; క.తిళి, తిళిసు; కువి. తెల్గ్ - అనే క్రియారూపాలు;

త.తెళి; మ.తెళి; క.తిళి; తు.తిళి అనే నామరూపాలు లభిస్తున్నాయి.(TVB - 607)మూ.ద్రా. *తెళ్. *తెళ్ > తె.ü తెలియు.

తె.üతెలియు + వి > తెలివి . తెలియుటయే - తెలివి 'జ్ఞానం'.( భావార్థం)

తద్ధితాలు -

తెలివి + కత్తె > తెలివికత్తె. మతుబర్థం.

తెలివి + కాఁడు > తెలివికాడు. మతుబర్థం.

తెలివి + ఇడి > తెలివిడి. స్వార్థం.

**6.22. - వు :-** భాగవతంలోని -వు ప్రత్యయాంత కృదంతాలు -

| | | | |
|---|---|---|---|
| (1) కెడవు | (2)కొలువు | (3)చావు | (4)తడవు |
| (5)తెరువ | (6)పుట్టువు | (7)పొడువు | (8)మనువు |

**1.కెడవు :-**

క. **విడువిడుడని ఫణి పలుకగ**

**గడుభరమున మొదలగుదురు గలుగమి కెడవై**

**బుడబుడ రవమున నఖిలము**

**వడవడ వణకగ మహాద్రి వనధి మునింగెన్.**[124]

కెడవు < తె. **ü**కెడయు. కెడయు (అ.క్రి.) కు 1. విరిగిపడు 2. తెగు 3. మరణించు 4. పాయు, ఎడమగు అని అర్థాలు. కెడవు (వి) 'పతనం'.

సోదరభాషల్లో - త. కిట, కిటప్పు; మ. కిటక్క, కటత్తుక; క. కెడె; తు. కెడగుని అనే క్రియారూపాలు.

త. కిటక్కై, కిటత్తల్; మ. కిట, కిటప్పు; క. కెడవు, కెడహు, కెడివు, కెడపు; కొడగు. కెడకె 'శయ్య' అనే నామరూపాలు లభిస్తున్నాయి.(DED 1277)మూ.ద్రా.*కెట్ - / *కిట్ .

* కెట్ -తె.**ü**కెడయు

(1) తె.**ü**కెడయు + వు > కెడవు. కెడయుటయే - కెడవు. (భావార్థం)

(2) తె.**ü**కెడయు + ఇక >కెడయిక - 'పాటు, మరణం'( భావార్థం)

**2.కొలువు :-**

సీ. .... **అమరులు కొలువుండునట్టి <u>కొలువు</u>**[125]....

కొలువు/ కొల్వు <తె.**ü** కొలుచు. కొలుచు (స.క్రి.) కు 1. ఉపాసించు 2. సేవించు 3. నమస్కరించు

అని అర్థాలు.కొలువు (వి) కు 1. సేవ, పరిచర్య 2. ఆస్థానం, రాజసభ 3. స్థానం అని అర్థాలు.

సోదరభాషల్లో -త. కొలు; మ. కొలు అనే క్రియారూపాలు లభించాయి.(TVB - 328)మూ.ద.ద్రా.*కొల్ -.

* కొల్ - తె.üకొలుచు.

(1) తె.üకొలుచు + వు > కొలువు. దీనియందు తమ స్వామిని కొలుతురు - కొలువు 'రాజసభ'. అధికరణార్థం. భావార్థం. సేవ

(2) తె.üకొలుచు + వు > కొలువు. కొలుచుట - కొలువు 'సేవ, నమస్కారం'. భావార్థం.

తద్ధితాలు :-

(1) కొలువు + కాడు > కొలువుకాడు 'సేవకుడు'. మతుబర్థం.

(2) కొలువు + డు + కాడు >కొలువుడుకాడు 'సేవకుడు' మతుబర్థం.

**3.చావు :-**

చ. **... ఎన్నటికి జావును బుట్టువు లేదు వీరికిన్.**[126]

చావు <తె.üచచ్చు. తె.üచచ్చు (అ.క్రి.) 'మృతినొందు'. చావు (వి) 'మృతి'.

సోదరభాషల్లో - త. చా - ; మ. చాక; క.సాయ్,సాయు; తు. సైపిని; తొద, సొయ్-; కువి. హా-; పర్జీ.చయ్.అనే క్రియారూపాలు;

త. చావు; మ. చాక్కు; క.సావు; అనే నామరూపాలు లభిస్తున్నాయి.(TVB - 403 )

మూ.ద.ద్రా. మూ.మ.ద్రా. *చాయ్ - / *చయ్-(DED 2002 )

చచ్చు + వు > చావు. భావార్థం.

**4.తడవు :-**

తే. **ఉండుమన రాదు గురుడవు యోగి విభుడ**

**వరయ మొదవును బిదికినయంత**

<u>**తడవు**</u> **గాని యొక దెస నుండవు కరుణతోడ**

* ÿ æ Í ` Çã_ □=ò Hëë÷* è¡ <u>**తెరువు.**</u>[127]

తడవు < తె. **ü**తడయు. తడయు (అ.క్రి.) 1. ఆలస్యం 2. ఆలస్యమగు అని అర్థాలు. తడవు (వి) కు 1. ఆలస్యం 2. అవకాశం 3. కాలం, తఱి, సేపు, పై పద్యంలో ఈ మూడవ అర్థంలోనే ప్రయుక్తం.

సోదరభాషల్లో - త. తటు; మ. తటయుక; క.తడె; తు. తడెయుని; కోత. తడ్వ్ - అనే క్రియారూపాలు;

త.తటుప్పు, తటుక్కల్; తటవు 'కారాగృహం'; క. తడప, తడపు, తడవు; తు. తడవు అనే నామరూపాలు లభించాయి.(DED 2460 ) *తళ్-/ *తణ్-, *తళ్-త్- / *తట్-.

*తట్- . తె. **ü**తడయు

తె. **ü**తడయు + వు >తడవు. భావార్థం.

**5.తెరువు :-**

**(**పై పద్యంలోనే ఈ కృదంతానికీ ఉదాహరణ ఉంది)

తెరవు < తె. **ü**తిరుగు. తె. **ü**తిరుగు (అ.క్రి.) కు 1. సంచరించు 2. ప్రవర్తించు మొ. అర్థాలు. తెరువు (వి) కు 1. మార్గం 2. ధర్మం 3. సాధనం అని అర్థాలు.

త. తిరి; మ. తిరియుక; క.తిరిగు; తు. తిరింగుని; కుయి. తిర్గ; మొ. సజాతీయ క్రియారూపాలు లభిస్తున్నాయి.(TVB -572)

త.తెరు 'వీధి, మార్గం'; మ.తెరు; అనే సజాతీయ నామరూపాలు లభిస్తున్నాయి.(DED 2818 )

తె. **ü**తిరుగు జన్యంగా తెరువు ఏ కోశంలోనూ ఏకోశానా పేర్కొన బడకపోయినా దాన్ని సాధించవచ్చు. తిరుగు కు తిరువు అనే రూపాంతరం ఉంది. తెలుగులో గ-వ ల వినిమయం సహజం.

తిరువదగినది - తెరువు అని సాధించవచ్చు. ఇకారం ఎకారంగా మారడం భాషాశాస్త్ర సిద్ధమే.
తె. **ü**తిరుగు + వు > తెరువు.

1) దీనియందు జనులు తిరిగెదరు - తెరువు 'మార్గం'.( అధికారణార్థం)

2) దీనియందు జనులు తిరుగాలి (ప్రవర్తించాలి) - తెరువు 'ధర్మం' (అధికారణార్థం).

ఈ విధంగా అర్థసామ్యం, శబ్ద సామ్యం ఉండడం వల్ల తెరువు < తె. **ü**తిరుగు.

**6.నెలవు :-**

సీ. **"ఇది నాకు <u>నెలవ</u>" ని యే రీతిబలుకుదు**[128]..

తె.üనెలయు > నెలవు.

తె.üనెలయు (అ.క్రి.) కు 'ఉండు' అని అర్థం. నెలవు (వి) కు 1. ఉనికి 2. వాసస్థానం 3. స్థానం 4. ప్రదేశం 5. పరిచయం 6. ఊత 7. వ్యాపించుట అని అర్థాలు.

సోదరభాషల్లో క్రియగా- త.నిలై; మ.నిలెక్క; క. నెలసు; తు.నిలెవుని అనే రూపాలు.

నామవాచకంగా - త.నిలై 'నిలబడుట, ఉనికి'; మ. నిల 'స్థానం', స్థితి; క.నిలె; తు.నిలెవు 'నివాస స్థానం' - అనే రూపాలు లభిస్తున్నాయి.(TVB -762 )

మూ.ద్రా. *నిలయ్ - తె.üనెలయు.

1. తె.üనెలయు + వు > నెలవు . దీనియందు నెలయుదురు - నెలవు.( అధికరణార్థం)

2. తె.üనెలయు + అ > నెల/నేల . దీనియందు నెలయుదురు - నెల 'స్థానం, ఉనికి పట్టు' (అధికారణార్థం)

3.తె.ü నెలయు + కువు > నెలకువ. పై అర్థమే.

తద్ధితం :- నెలవు + అరి > నెలవరి 'కాపురముండు వాడు, పరిచితుడు'.

**7.పుట్టువు :-**

ఆ. **జనులకెల్ల శుభము సాంఖ్యయోగము దాని**

**వలన ధర్మనిష్ఠ వలన నైన**

**నంత్యకాలమందు హరిచింత సేయుట**

**<u>పుట్టువు</u>నకు ఫలము భూవరేంద్ర!**[129]

పుట్టువు < తె.üపుట్టు. తె.üపుట్టు (అ.క్రి.) కు 1. జన్మించు 2. మొలచు 3. కలుగు 4. దొరకు 5. గోచరించు 6. ఏర్పడు అనేవి అర్థాలు. పుట్టువు కు 'జన్మ' అర్థము.

సోదరభాషల్లో - క.పుట్టు, హుట్టు, ఉట్టు; తు.పుట్టుని; కోత,పుట్-, తొద.ఉట్ - ; గోం. పుట్ట్ -

మొదలైన క్రియారూపాలు లభిస్తున్నాయి.క.పుట్టు, హుట్టు, ఉట్టు అనే నామరూపం లభించింది.(TVB - 832)(DED 3501)  మూ.ద్రా. *పుట్ > తె. ü పుట్టు.

1)తె. ü పుట్టు + ఉ > పుట్టు 'జన్మము' భావార్థం.

2) తె. üపుట్టు + క >పుట్టుక.

3) తె. üపుట్టు+వు > పుట్టువు.

4)తె. ü పుట్టు + వ > పుట్టువ.

అన్నీ ఒకే అర్థంలోని కృదంతాలు.

**8.పొడవు :-**

సీ. **భూర్భువ స్వర్లోకములకంటె**

**బొడువున గడు నొప్పు సత్య లోకంబునందు**[130]**....** (చూ. పొడుపు)

(అవు ప్రత్యయాంతంగా చెప్పాను.చూ.పుట 137)

**9.మనువు :-**

సీ. **మనువు నిత్యము కాదు మరణంబు నిజమని**[131]...

మనువు < తె. üమను. తె. üమను (అ.క్రి.) కు 1. బ్రతుకు 2. పెరుగు 3. నడుచుకొను 4. ఉండు 5. పుట్టు 6. ఒప్పు 7. ధన్యుడగు అనేవి అర్థాలు. మనువు (వి) కు 1. బ్రతుకు 2. జీవనోపాయం (వృత్తి) 3. నడత 4. కాపురం 5. పెండ్లి 6. మగడు అని అర్థాలు. ఈ అర్థాలన్నీ బ్రతుకు యొక్క అర్థవిపరిణామాలే.

బ్రతుకు అర్థసంకోచం చెంది - వృత్తి (బ్రతుకుటకు ఉపాయం). బ్రతికే తీరు - నడత. కలిసి బ్రతుకుట - కాపురం. కాపురానికి అవసరమైన తంతు - పెండ్లి. కలిసి బ్రతుకువాడు - మగడు.

త. మన్ను - ఇణ్ -, మణ్ణు; కుయి. మన్బ; కువి. మన్-; పర్జి. మెన్- మొదలైన క్రియారూపాలు.

త.మణై 'ఇల్లు', భార్య అనే నామరూపం లభించాయి.(TVB -941)మూ.ద్రా. *మన్ >తె. ü మను.

(1) తె.üమను + వు >మనువు 'బ్రతుకుట' భావార్థం.

(2) తె.üమను+ఉ >మన్ను.దీనియందు జనులు మనుదురు/జీవింతురు.అధికరణార్థం.

**6.23. -సలి :- ముసలి :-**

వ. **... సుద్యుమ్నుండు <u>ముదుసలియై</u>, ప్రతిష్ఠాన పురంబు విడిచి[133]...**

సీ. **<u>ముసలి</u> తాపసి బట్టి మొగి నెత్తుకొని పోయి[134]...**

ముదియు + సలి > ముదుసలి (యు లోపం)/ముసలి (దియు లోపం).

**6.24. - సు: - నులుసు:-**

నులుసు - నులియు. నులియు (అ.క్రి.) కు 1. పొడియగు 2. వడకు 3. మెలిపెట్టు అనేవి అర్థాలు. నులుసు (వి) కు 'శేషము, మిగులు' అని శ్రీ సూ.రా.ని., న్యూనత అని శ.ర., నిష్ఫల మని బ్రౌ. అర్థాలు తెలిపాయి.

క. నుళ్గు ; తు. నులియుని; త.నుణి అనే క్రియారూపాలు; తు.నులి 'ముక్క'; త.నుణి 'పొడి' అనే నామరూపాలు లభించాయి. మూ.ద్రా. *నూ-ల్- తె. నులియు.

నులియు + సు - నులుసు. పై పద్యంలో 'నిశ్శేషంగా' అనే ప్రకరణార్థాన్ని గ్రహించవచ్చు.

ఇంత వరకు 24 హలాది కృత్ప్రత్యయాలను ,అవి చేరిన 116 కృదంతాలను చక్కగా వ్యాఖ్యానించాను.ఇంతటితో కృదంత వ్యాఖ్యానం సమాప్తమైంది.వీటిని చివరి అధ్యాయంలో విశ్లేశిస్తాను.

**భాగవతంలో వ్యాఖ్యానించిన హలాది కృదంతాలు - సంఖ్య -**

| | | | | | |
|---|---|---|---|---|---|
| (1) -క | - 16 | (2) -కడ | - 01 | (3) -కలి | - 01 |
| (4) - కువ | - 05 | (5) -గడ | - 05 | (6) -గు | - 01 |
| (7) -ట | - 03 | (8) -టు | - 08 | (9) -త | - 08 |
| (10) -దల | - 02 | (11) -ప | - 01 | (12) -పి | - 03 |
| (13) -పు | - 30 | (14) -పురం | - 01 | (15) -బడి | - 01 |
| (16) -మర | - 02 | (17) -ము | - 01 | (18) -వ | - 07 |
| (19) -వడి | - 01 | (20) -వలి | - 01 | (21) -వి | - 03 |
| (22) -వు | - 09 | (23) -సలి | -01 | (25) -సు | - 01 |

**వ్యాఖ్యానించిన మొత్తం 116**

# పాద సూచిక

| | | |
|---|---|---|
| 1. | భాగ | 10 ఉ 515 |
| 2. | భాగ | 1 - 223 |
| 3. | భాగ | 7 - 167 |
| 4. | భాగ | 9 - 332 |
| 5. | భాగ | 1 - 245 |
| 6. | భాగ | 10 ఉ 265 |
| 7. | భాగ | 10 ఉ 300 |
| 8. | భాగ | 3 - 757 |
| 9. | భాగ | 10 పూ 324 |
| 10. | భాగ | 6 - 521 |
| 11. | | |
| 12. | | |
| 13. | భాగ | 10 పూ 689 |
| 14. | భాగ | 10 పూ 1293 |
| 15. | భాగ | 8 - 667 |
| 16. | భాగ | 8 - 469 |
| 17. | భాగ | 10 పూ 999 |
| 18. | భాగ | 10 ఉ 1101 |
| 19. | భాగ | 8 - 570 |
| 20. | భాగ | 8 - 359 |
| 21. | భాగ | 8 - 361 |
| 22. | భాగ | 7 - 297 |
| 23. | భాగ | 10 పూ 1277 |
| 24. | భాగ | 3 - 252 |
| 25. | భాగ | 6 - 46 |
| 26. | భాగ | 6 - 449 |
| 27. | భాగ | 10 పూ 956 |
| 28. | భాగ | 3 - 830 |
| 29. | భాగ | 4 - 29 |
| 30. | భాగ | 10 పూ 297 |
| 31. | భాగ | 10 పూ 429 |
| 32 | భాగ | 1-255 |
| 33. | భాగ | 10 పూ 181 |
| 34. | భాగ | 3 - 600 |
| 35. | భాగ | 2 - 89 |
| 36. | భాగ | 10 పూ 904 |
| 37. | భాగ | 3 - 699 |
| 38. | భాగ | 8 - 175 |
| 39. | భాగ | 1 - 102 |
| 40. | భాగ | 6 - 518 |
| 41. | భాగ | 3 - 869 |
| 42. | భాగ | 2 - 144 |
| 43. | భాగ | 1 - 17 |
| 44. | భాగ | 4 - 376 |
| 45. | భాగ | 6 - 250 |
| 46. | భాగ | 6 - 473 |
| 47. | భాగ | 10 పూ 557 |
| 48. | భాగ | 10 పూ 1168 |
| 49. | భాగ | 6 - 186 |
| 50. | భాగ | 3 - 994 |
| 51. | భాగ | 10 పూ 386 |
| 52. | భాగ | 6 -177 |
| 53. | భాగ | 10 ఉ భా - 381 |
| 54. | భాగ | 3 - 659 |
| 55. | భాగ | 7 - 182 |
| 56. | భాగ | 10 పూ 225 |
| 57. | భాగ | 8 - 10 |
| 58. | భాగ | 3 - 727 |
| 59. | భాగ | 7 - 61 |
| 60. | భాగ | 10 పూ 261 |
| 61. | భాగ | 10 పూ 226 |
| 62. | భాగ | 10 పూ 976 |

| | | |
|---|---|---|
| 63. | భాగ | 8 - 714 |
| 64. | భాగ | 6 - 17 |
| 65. | భాగ | 10 పూ 1687 |
| 66. | భాగ | 1 - 406 |
| 67. | భాగ | 1 - 392 |
| 68. | భాగ | 9 - 165 |
| 69. | భాగ | 8 - 663 |
| 70. | భాగ | 10 పూ 892 |
| 71. | భాగ | 10 పూ 424 |
| 72. | భాగ | 10 పూ 702 |
| 73. | భాగ | 8 - 444 |
| 74. | భాగ | 8 - 683 |
| 75. | భాగ | 9 - 599 |
| 76. | భాగ | 8 - 55 |
| 77. | భాగ | 8 - 353 |
| 78. | భాగ | 8 - 87 |
| 79. | భాగ | 1 - 46 |
| 80. | భాగ | 9 - 334 |
| 81. | భాగ | 10 పూ 297 |
| 82. | భాగ | 8 - 289 |
| 83. | భాగ | 8 - 369 |
| 84. | భాగ | 1 - 489 |
| 85. | భాగ | 1 - 223 |
| 86. | భాగ | 9 - 334 |
| 87. | భాగ | 10 పూ 223 |
| 88. | భాగ | 3 - 774 |
| 89. | భాగ | 4 - 137 |
| 90. | భాగ | 4 - 225 |
| 91. | భాగ | 1 - 363 |
| 92. | భాగ | 10 ఉ 998 |
| 93. | భాగ | 3 - 565 |
| 94. | భాగ | 1 - 51 |
| 95. | భాగ | 9 - 115 |
| 96 | .భాగ | 9 - 521 |
| 97. | భాగ | 10 పూ 910 |
| 98. | భాగ | 2 - 51 |
| 99. | భాగ | 6 - 134 |
| 100. | భాగ | 1 - 174 |
| 101. | భాగ | 8 - 39 |
| 102. | భాగ | 10 పూ 478 |
| 103. | భాగ | 7 - 155 |
| 104. | భాగ | 10 పూ 312 |
| 105. | భాగ | 10 పూ 1389 |
| 106. | భాగ | 10 పూ 751 |
| 107. | భాగ | 10 పూ 660 |
| 108. | భాగ | 10 పూ 129 |
| 109. | భాగ | 8 - 691 |
| 110. | భాగ | 8 - 146 |
| 111. | భాగ | 1 - 514 |
| 112. | భాగ | 10 పూ 724 |
| 113. | భాగ | 10 పూ 1471 |
| 114. | భాగ | 8 - 691 |
| 115. | భాగ | 10 పూ 5 |
| 116. | భాగ | 8 - 559 |
| 117. | భాగ | 9 - 279 |
| 118. | భాగ | 4 - 160 |
| 119. | భాగ | 10 పూ 978 |
| 120. | భాగ | 8 - 174 |
| 121. | భాగ | 8 - 588 |
| 122. | భాగ | 1 - 46 |
| 123. | భాగ | 6 - 270 |
| 124. | భాగ | 8 - 199 |
| 125. | భాగ | 1-347 |
| 126. | భాగ | 6-698 |
| 127. | భాగ | 523. |
| 128 | భాగ | 8-552 |

| | | |
|---|---|---|
| 129. | భాగ | 2 - 5 |
| 130. | భాగ | 3 -352 |
| 131. | భాగ | 1 -391 |
| 132. | భాగ | 10 -పూ-129 |
| 133 | భాగ | 9 - 32 |
| 134. | భాగ | 9 - 60 |

# శ్రీమదాంధ్ర మహాభాగవతంలో

# తద్ధితాంతాలు

నామవాచకాలపై చేరే ప్రత్యయాలు తద్ధిత ప్రత్యయాలు.అటువంటి ప్రత్యయాలు చేరిన భాగవతంలోని తద్ధితాంతాలు ఈ అధ్యాయంలో వ్యాఖ్యానించబడుతున్నాయి.

**7.0. భాగవత ప్రయుక్త తద్ధిత ప్రత్యయాలు:-**

| | | | | |
|---|---|---|---|---|
| 1. -అ | 2.-అడి | 3.-అము | 4.-అరి | 5.-అలి |
| 6.-ఆడు | 7.-ఆలు | 8.-ఇ[1] | 9.-ఇ[2] | 10.-ఇక |
| 11.-ఇడ | 12.ఇదం | 13.-ఇం | 14.-ఈ | 15.-ఉక |
| 16.-ఎడు | 17.-క | 18.-కతి | 19.-కా | 20.-త |
| 21.-ంత | 22.-తనం | 23.-న | 24.-ని | 25.-బంటి |
| 26.-మి | 27.ఊక | | | |

ఇవి చేరిన భాగవతంలోని తద్ధితాంత రూపాలను విశ్లేషిస్తున్నాను.

**7.1. - అ :-**

-అ ప్రత్యయం మతుబర్థంలో వచ్చే తద్ధిత ప్రత్యయం[1]. భాగవతంలో -అ ప్రత్యయాంతాలైన పదాలు నాలుగు లభించాయి. అవి

1. చెలువ 2. నెయ్యము 3. మగువ 4. వరవుడము

**1.చెలువ :-**

క. **పలుకులు మధురసధారలు**

**దలపులు నానాప్రకారదావానలముల్**

**సెలుములు సాలావృకములు**

**చెలువల నమ్మంగ వేద సిద్ధాంతములే.**[2]

చెలువు అనే పదానికి 1. అందము 2. ప్రియము అని అర్థాలు.

త. చెల్వు; చెల్వం సంపద, అందం, ఆనందం; మ. చెల్లం సంపద; క.చలు, చలువె, చలువు, చల్వ, చల్వు, చలువికె, చల్వికె, చెలువ, చెలువు, చెల్వ, చెల్వు, చెలువికె, చెల్వికె, అందం, ప్రియం; తు. చెలువికె, అనే సజాతీయ పదాలు లభిస్తున్నాయి. ( D.E.D. -2291)

చెలువు + అ > చెలువ 'అందం కలది, ప్రియమైనది'.

ఈ పదం మూడు లింగాల్లో ప్రయోగించబడుతుంది.

పుం . చెలువు + అ + డు > చెలువుడు 'ప్రియుడు, భర్త, అందగాడు'.

స్త్రీ. చెలువు +అ > చెలువ 'అందమైన స్త్రీ, భార్య'.

నపుం. చెలువు + అ + ము > చెలువము 'అందం, క్షేమం, రీతి'.

తెలుగు అ ప్రత్యయం చేరగా తమిళ కన్నడ భాషల్లో - ఇ ప్రత్యయం చేరింది.

త. చెల్వి ' సంపన్నురాలు, అధికారిణి, లక్ష్మి'.

క. చలుమి, చలువి, చలువతి, చలువె, చల్వి, చెల్వి, చెల్వె'చక్కని శరీర సౌష్ఠవం గల స్త్రీ'.

పై పద్యంలో 'అందమైన స్త్రీ/ప్రియురాలు' అనే అర్థంలో ప్రయోగించబడింది.

**2.నెయ్యము :-**

క. **ఇయ్యెడ నీ కంఠంబునకు**

**నీయురగ శవంబు దెచ్చి యిటు చేర్చిన యా**

**యయ్య నిఁక నేమి సేయుదు?**

**<u>నెయ్యంబులు</u> లేవు సుమ్ము నృపులకుఁ దండ్రీ!**[3]

నెయ్యము అనే పదానికి సంస్కృత పర్యాయం స్నేహం.

స్నేహం అనే మాటకు 'నూనె (చమురు) అనే అర్థం ఉంది. నెయ్ అనే ద్రావిడ పదానికి కూడ 'చమురు' అని అర్థం. చమురులో అంటుకునే (జిడ్డు) లక్షణం ఉంటుంది. స్నేహంలో కూడా ఆ లక్షణం ఉంటుంది. జిడ్డు అనేది ఒక పట్టాన వదిలేది కాదు. స్నేహం కూడా ఇద్దరు వ్యక్తులను అలా కలుసుకునేలా (అతుక్కునేలా?) చేస్తుంది.

నెయ్ + అ + ము > నెయ్యము - 'స్నేహం, ప్రేమ, సంతోషం, ఆసక్తి, చుట్టరికం, ప్రియం'.

నెయ్ + అమి > నెయ్యమి 'నెయ్యం'.

నెయ్ + అ + డు > నెయ్యుడు 'స్నేహితుడు'.

నెయ్ + అ + ఆలు > నెయ్యురాలు 'స్నేహితురాలు, ఇష్టురాలు'.

నెయ్ + అరి > నెయ్యరి 'స్నేహితుడు, స్నేహితురాలు'.

అనే రూపాలు కూడ తెలుగులో ఉన్నాయి.

సోదరభాషల్లో -త.నే 'ప్రేమ, దయ, ఆకర్షణ'; నేయమ్ 'ప్రేమ, భక్తి, మంచి, లాభం' నేచన్ 'స్నేహితుడు, భక్తుడు' అనే రూపాలు లభిస్తున్నాయి.( D.E.D. -2977)

**3.మగువ :-**

సీ. **మనకు వేల్పులకును....**

**...... మన యెడఁ గందునో మగువ? యనుచు[4]....**

సోదర భాషల్లో - త. మక, మకవు 'శిశువు'. మకన్ 'కుమారుడు'.మకళ్ 'కూతురు'.

క. మగువు - శిశువు. మగ 'కొడుకు'. మగళ్ 'కూతురు'.( D.E.D. -3768)

పై పరిశీలన వలన తెలుగులో వాడుకలో లేకున్నా మగువు 'శిశువు' అని, అది కలది మగువ 'స్త్రీ' అని ఊహించవచ్చు.

మగువు + అ > మగువ. 'స్త్రీ, భార్య'.పై పద్యంలో 'స్త్రీ' అనే అర్థంలోనే ప్రయోగించబడింది.

**4 . వరవుడము :-**

వరవుడు అనే పదానికి 'దాసుడు, సేవకుడు' అని అర్థం. ఇది భరట శబ్ద భవమని కోశాలు పేర్కొంటున్నాయి. వరవుడు + అ + ము > వరవుడము - 'దాస్యం'. ఇక్కడ -అ ప్రత్యయం భావార్థంలో ప్రయోగించబడింది.

**7.2. అడి :-**

**1. సందడి :-**

సీ. **కోలాహలము మాని ....**

**.... సందడి బడకురు సాధ్యులార[5]....**

"సందోరడిః వ్యతిరేకే'' అంటూ సూత్రాంధ్ర వ్యాకరణంలో చిన్నయసూరి పేర్కొన్నారు.[6]

సందు + అడి > సందడి 'ఒత్తిడి, సమూహం, అల్లరి, ఇరుకు'. ఏ అర్థమైనా 'సందులేని (వ్యవధానం లేని)' తనాన్నే సూచిస్తుంది.

**7.3. అము :-**

ఇది మతుబర్థంలో వచ్చే తద్ధిత ప్రత్యయం.[7]

**1. పెండ్లము/ పెండ్లాము:-**

క. **కడుకొని పెండ్లముఁ జంపని**

**కొడుకుల బెండ్లాముఁ జంప గురుఁ డానతి యే**

**నడుగులకు నెఱిఁగి రాముం**

**డడు గిడకుండంగఁ ద్రుంచె నన్నలఁ దల్లిన్.**[8]

పెండ్లము, పెండ్లాము అనే రెండు ప్రయోగాలూ ఈ పద్యంలోనే ఉన్నాయి.

పెండ్లి + అము > పెండ్లము 'భార్య'

పెండ్లి + ఆము > పెండ్లాము ' భార్య'

**7.4. అరి :-**

మతుబర్థంలో వచ్చే ప్రత్యయం. దీనిని ఎందరో వైయాకరణులు పేర్కొన్నారు.[9] ఈ అరి ప్రత్యయాంత పదాలు భాగవతంలో 16 లభించాయి. అవి క్రమంగా -

| | | |
|---|---|---|
| 1. ఆలరి | 2. ఒంటరి | 3. కల్ల |
| 4. కాపరి | 5. జాలరి | 6. తక్కరి |
| 7. తగవరి | 8. తూఁటరి | 9. తెంపరి |
| 10. తెరువరి | 11. నగవరి | 12. నిజమరి |
| 13.. నేర్పరి | 14. పోటరి | 15. బేలరి |
| 16. మేటరి | | |

**1.ఆలరి :-**

ఉ. **చాలుఁబురే! సరోజభవ! సత్ప్రథవృత్తిఁ దొఱంగి కూఁతు ని**

**ట్లాలరివై రమింప హృదయంబునఁ గోరుట ధర్మరీతియె?**

**బేలరి వైతి నీ తగవు పెద్దతనంబును మంటిపాలుగా**

**శీలము వోవఁ దట్టిమిటు సేసినవారలు మున్ను గల్గిరే?**[10]

ఆలము అనే శబ్దానికి 'అలక్ష్యం, అస్వీకార్యం, అసత్యం' అని అర్థాలు. ఇవన్నీ చెడుకు సంబంధించినవి. ఇవి కలవాడు ఆలరి.

ఆలము + అరి > ఆలరి 'దుష్టుడు, మూర్ఖుడు'

ఆలము + ఉడి > ఆలుడి 'మంచినడత' (వ్యతిరేకార్థంలో - ఉడి. ఇది - ఇడి వంటి ప్రత్యయంగా గ్రహించవచ్చు).

**2.ఒంటరి :-**

మత్తకోకిల. రంతు సేయుచు....

**...... అనరాని యొంటరి యాదరించు మముంగృపన్.**[11]

ఒండు, ఒంటి శబ్దాలు ఒక్క వ్యక్తిని సూచించేవి.

త. ఒంటి; క. ఒంటి; తు.ఒంటి; తె.ఒంటి అని సోదర ద్రావిడ భాషల్లో లభిస్తున్నాయి.( D.E.D. -834)

ఒంటి శబ్దానికి ఏకాకి, అసహాయుడు, ఏకాకితనం అని అర్థాలు.

ఒంటి + అరి > ఒంటరి 'ఏకాకి'.

ఒంటి + అరి + కాడు > ఒంటరికాడు.

ఒంటి + అరి + ~~ఈఁడు~~ > ఒంటరీఁడు.

**3.కల్లరి :-**

ఆ. **మంచివారికెల్ల మంగళ ప్రదవయ్యు**

**_గల్లరు_లకు మేలు గాని యట్టి**

**తనువులెన్నియైన దాల్చి లోకములకు**

**సేమ మెల్ల ప్రొద్దు సేయుదీవు.**[12]

త.కళ్ళం; క.కళ్; తు.కళ్ళ; తె.కల్ల 'అసత్యం, మోసం, నేరం, హాని'.అదికలవాడు - కల్లరి.

కల్ల + అరి > కల్లరి - 'అసత్యం పలుకువాడు, మోసగాడు, దుష్టుడు, అపరాధి'.

కల్ల + అరి + ~~ఈడు~~ >కల్లరీడు.

దీనికి పర్యాయాలు సోదర భాషల్లో - త.కళ్లణ్, మ.కళవన్,కళ్లన్; క.కళ్ల, కళ, కళతి (ఆడుదొంగ) మొ. రూపాలు లభిస్తున్నాయి.( D.E.D. -1156)

**4.కాపరి :-**

ఉ. **_కాపరి_ లేని గొఱ్ఱియుల కైవడిఁ గంటక చోరకోటిచే**

**నేపఱియున్న దీభువన మీశుడు కృష్ణుడు లేమి**[13]**...**

కాపు అంటే 'రక్షణ'. అది గల వాడు కాపరి. కాపు + అరి > కాపరి 'రక్షకుడు'.

(వివరాలకు 'కాపు' చూడండి)

**5.జాలరి :-**

ఆ. **వలలుఁ దారు నింకవచ్చి _జాలరి_ వేఁట**

**కాఱు నేఱుఁ గలఁచి**[14]**...**

సంస్కృతంలోని జాలమ్ అనే శబ్దం నుండి పుట్టింది తె.జాల.జాల అనగా 'చేపలను

పట్టేవల' అని అర్థం. అది కలవాడు జాలరి.

జాల + అరి > జాలరి 'చేపలను పట్టువాడు'. పై పద్యంలో కూడా ఈ అర్థమే స్పష్ట మౌతుంది.

జాల + కాడు > జాలకాడు.

**6.తక్కరి :-**

క. **ముద్దుల తక్కరి బిడ్డడు**

**మద్దుల గూల్పంగదలచి మసలక దా నా**

**మద్దికవయున్న చోటికి**

**గ్రద్దన ఱోలీడ్చుకొనుచు గడకన్ జనియెన్.**[15]

తక్కు అనే శబ్దానికి 1. విలాసం, కులుకు 2. వంచన 3. మాయ, జిత్తు 4. అసత్యం అని అర్థాలు.

తక్కు + అరి > తక్కరి 'వంచకుడు, మాయలాడు, విలాసవంతుడు'.

తక్కు + అరి + ఈడు > తక్కరీడు.

తక్కు + ఇడి > తక్కిడి (స్వార్థంలో).

తక్కులు + ఆడి > తక్కులాడి.

తక్కులు + ఆడు > తక్కులాడు.

**7. తగవరి :-**

**నళినదళ లోచనుఁడు దము**

**దెలిపిన సద్ధర్మ పద్ధతిని దగవరులై**

**యిలఁ బరిపాలింపుచు సుఖ**

**ముల నుండిరి మహిత నిజవిభుత్వము లలరన్.**[16]

తగవు + అరి > తగవరి 'తగవు యుక్తత, న్యాయం, కలహం, తీర్పు

ఉపకారం....''. తగవు 'న్యాయం' కలవాడు తగవరి - న్యాయశీలుడు

(వివరాలకు చూ. తగవు)

**8.తూటరి :-**

ఉ. **ఏటికి జాలిబొంద? నరులీక్రియ కృష్ణుని కీర్తనంబు పా**

**పాటవులం దహింపగల దొటకు సందియమేల? యిప్పుడీ**

**తూఁటరి దోసకారి పెనుదోషి యజామిళుడంత మొందుచుం**

**బాటిగ విష్ణు నామమును బల్కుచు గేవలముక్తి కేగడే?**[17]

తూఁట + అరి > తూఁటరి. తూఁట 'దుష్టుడు'.

తూటరి 'దుష్టుడు'స్వార్థంలో అరి. తూఁడరి అనే రూపాంతరం కూడ దీనికి ఉంది.

**9.తెంపరి :-**

క. **చంపినఁ జచ్చెద ననుచును**

**గంపింపక యోరి పలువ! కఠినోక్తు లనన్**

**గుంపించెద చావునకున్**

**దెంపరివై పదరువాని తెఱునఁ గుమతీ!**[18]

తెంపు + అరి > తెంపరి. తెంపు 'సాహసం'. అది కలవాడు తెంపరి.

(వివరాలకు చూ. తెంపు)

**10. తెరువరి :-**

క. **అని తలపోసి.... మింటి తెరువరులు మొఱులిడ**[19]**...**

తెరువు 'దారి'. దారి కలవాడు - తెరువరి.

తెరువు + అరి > తెరువరి - బాటసారి.

(వివరాలకు చూ. తెరువు)

**11.నగవరి :-**

క. **నగవుల విద్యల పోడిమి**

**నగుబాటుగఁజేయనేర్పు నగవరి యంతన్[20]....**

నగవు 'నవ్వు'. నవ్వుగలవాడు - నగవరి. నగవు + అరి > నగవరి.

(వివరాలకు చూ. నగవు)

**12. నిజమరి :-**

క. **పలికిన పలుకులు పలుకఁడు**

**కలఁచు న్నవ కాంతఁజూచి కడుసంచలుడై**

**నిలిచిన చోట న్నిలువడు**

**నిలువెల్లను గల్ల కామి <u>నిజమరి</u> గలడే?[21]**

నిజము 'సత్యము'. నిజము + అరి > నిజమరి 'సత్యవంతుడు'.

నిజము + అరి + తనము > నిజమరితనము 'సత్యశీలత, పాతివ్రత్యం'.

**13. నేర్పరి :-**

మత్తకోకిల : **నీపయిన్ రతి సేయుచుందురు <u>నేర్పరుల్</u> సతతప్రియో**

**ద్దీపకుండవు గాన[22]...**

నేర్పు 'ప్రావీణ్యం, చతురత'. నేర్పు + అరి > నేర్పరి' చతురత కలవాడు, ప్రవీణుడు'.

**14. పోటరి :-**

శా. **నీవే <u>పోటరి</u>వే సురేంద్ర?**[23]**....**

పోటు 'దెబ్బ, బాధ, పోరు, శౌర్యం, పొంగు', పోరగలవాడు, శౌర్యం కలవాడు పోటరి.

పోటు + అరి > పోటరి 'శూరుడు'.

(వివరాలకు చూ. పోటు)

**15.బేలరి :-**

(ఆలరి పదం వద్ద ఇచ్చిన పద్యమే ఇక్కడ కూడా లక్ష్యం)

సం. భేలః > తె. బేల. బేల 'మూఢుడు, భీరుడు'.

బేల + అరి > బేలరి 'మూర్ఖుడు'.

**16. మేటరి :-**

శా. **జ్యోతిశ్శాస్త్రము కెల్ల <u>మేటరి</u>వి తేజోమూర్తి వాశాంత వి**

**ఖ్యాత స్ఫూర్తిని బ్రహ్మబోధనుడ వాకర్ణింపు నాపల్కు ని**

**ర్ణీతుండైన గురుండు మానవులకున్ విప్రోత్తముండంద్రు నీ**

**చాతుర్యంబున నీ కుమారులకు సంస్కారంబుగావింపవే.**[24]

మేటి శబ్దానికి 'గొప్పవాడు, ప్రభువు, శ్రేష్ఠుడు' అని అర్థాలు.

మేటి + అరి > మేటరి (స్వార్థంలో) శ్రేష్ఠుడు.

**7.5 - అలి :-**

**తొయ్యలి :-**

క. **నీ యల్లుడితడు భార్గవు**

**డయ్యా! జారుండుగాఁడు హర్షము తోడ**

**న్నెయ్యంబునిల్పుమంచును**

**<u>దొయ్యలి</u> సర్వంబు దండ్రితోవినిపించెన్.**[25]

ఈ పదానికి మాతృకగా కోశాలు ఏ పదాన్నీ పేర్కొనలేదు. కాని దీని పరిశీలన వల్ల వ్యుత్పత్తి సాధించవస్తుంది.

త. తైయల్ 'సౌందర్యం, స్త్రీ'; మ. తైయల్ 'సుందరమైన స్త్రీ'; తె. తొయ్యలి - స్త్రీ.

ద్రావిడ భాషల్లో స్త్రీ వాచక ప్రత్యయం 'అళ్' ప్రసిద్ధం. పై పదాలను పరిశీలిస్తే తమిళంలో 'సౌందర్యం, స్త్రీ' అనే రెండు అర్థాలు, మళయాళంలో ఆ రెండర్థాలూ ఒక్కటియైనాయి. తెలుగులోకి వచ్చేప్పటికి సాధారణీకరణం జరిగింది. ఈ క్రమంలో పై పదంలో రెండు భాగాలను గుర్తించవచ్చు.

1. తై 2. అళ్. మొదటిపదం సౌందర్యం సూచకం, కాగా రెండవది స్త్రీ ప్రత్యయం. ఈ విధంగా విశ్లేషిస్తే -

త.తై 'మొలక'; మ.తై 'మొలక'; తె. తీగ 'లత' (2859) స్త్రీని 'లతాంగి అని కృశాంగి' అని వర్ణించడం కవి సమయం. పై పదాల వల్ల లేతదనం, కోమలత్వం సూచించబడ్డాయి. కాబట్టి త.మ. తైయల్, తె. తొయ్యలి 'లతాంగి' అని అర్థం చెప్పవచ్చు. ఇక్కడ లతాంగిత్వం సౌందర్యం సూచకం. అందుకే అక్కడ 'సౌందర్యం' అనే అర్థం చెప్పారు.

ప. తయల్ (పుం.లిం.), తయట్ (స్త్రీ. లిం.); కుయి, తియోరి అనే పదాలకు 'తేలిక' అని అర్థం.( D.E.D. -2516)

దీనివల్ల - *తై అనే మూ. ద్రావిడ పదంపై - అలి (అలు, ఆలువలె) అనే ప్రత్యయం చేరి 'తొయ్యలి' అనే రూపం నిష్పన్నమైందని చెప్పవచ్చు.

**7.6 -ఆడు :-**

మతుబర్థంలో వచ్చే తద్ధిత ప్రత్యయమిది. ఇది పుంలింగంలో బహువచనం కంటే పరంగా వస్తుంది.[26]

**1. ముద్దులాడు :-**

సీ. **వీడఁటే! నందుని వెలదికి జగమెల్ల**

**ముఖమందు జూపిన ముద్దులాడు**[28]**....**

ముద్దుకు సజాతి పదాలు - త. ముత్తు, ముత్తమ్; మ. ముత్తం, ముత్తి, ముత్తు; క.ముత్తు, ముద్దు; కొడగు. ముత్త, తు.ముత్త, ముత్తు, ముద్ద, ముద్దు; కొలామి. ముద్ అనే రూపాలు లభిస్తున్నాయి. 'చుంబనం, మనోజ్ఞం, ప్రేమాస్పదం' అనేవి అర్థాలు.( D.E.D. -4063)

(1) ముద్దు + ల + ఆఁడు > ముద్దులాఁడు 'అందమైన వాఁడు'.

(2) ముద్దు+ల+ఆఁడి > ముద్దులాఁడి 'అందగత్తె'.

**2.వన్నెలాఁడు :-**

మ. **త్రిజగన్మోహన నీలకాంతి తను వుద్దీపింపఁ బ్రాభాత నీ**

**రజ బంధు ప్రభమైన చేలము పయిన్రంజిల్ల నీలాలక**

**వ్రజ సంయుక్త ముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప**

**మా విజయుంజేరెడు వన్నెలాఁడు మది నావేశించు నెల్లప్పుడున్.**[27]

వన్నె అనే శబ్దానికి 1. రంగు 2. కాంతి 3. చక్కదనం 4. బంగారం యొక్క మేలిమి 5. విలాసం 6. అలంకారం 7. ప్రసిద్ధి 8. వర్ణన 9. విధము అనేవి అర్థాలు.

(1) వన్నె + ల + ఆఁడు > వన్నెలాఁడు 'అందగాడు, విలాసవంతుడు'.

(2) వన్నె + ల + ఆఁడి > వన్నెలాఁడి 'అందగత్తె'.

(3) వన్నె + కాఁడు > వన్నెకాఁడు 'అందగాడు'.

(4) వన్నె + కత్తె > వన్నెకత్తె 'అందగత్తె'.

**7. 7. -ఆలు :-**

ద్రావిడ భాషల్లో - ఆళ్ అనేది స్త్రీ వాచక ప్రత్యయం. అదే తెలుగులో - అలు, ఆలు గ పరిణమించింది.ఈ - ఆలు అనేది మతుబర్థంలో, స్వార్థంలో, భావార్థంలో వస్తుంది. - ఆలు తో ఉన్న పదాలు భాగవతంలో-

| | | |
|---|---|---|
| 1. ఇల్లాలు | 2. కొమరాలు | 3. చూలాలు |
| 4. జవరాలు | 5. పురుటాలు | 6. వెలయాలు |
| 7. ముద్దరాలు | 8. వింతరాలు | 9. వెలయాలు |
| 10. శుభాత్మురాలు | | |

**1.ఇల్లాలు :**

సీ. **ఎండ కన్నెరుగని యింద్రుని యిల్లాలు**

**పలుపంచలను జాలివడియె నేడు**[29]....

ఇల్లు + ఆలు > ఇల్లాలు 'గృహిణి, భార్య'.

త. ఇల్లాళ్ ఇక్కడ మతుబర్థంలో ప్రత్యయం వస్తుంది 'ఇల్లుగలయావిడ / ఇంటి అధికారిణి' అని అర్థం. అర్థం సంకోచించి 'భార్య' అనే అర్థం స్థిరపడింది.( D.E.D. -420)

**2. కొమరాలు :-**

ఆ. **చాలముద్దరాలు జవరాలు గొమరాలు**

**నీ శుభాత్మురాలి కెవ్వడొక్క**

**మగడు? సెప్పుమనిన**[30]....

కొమరు శబ్దానికి 'మనోజ్ఞత' అర్థం. కొమరు + ఆలు > కొమరాలు.

వృత్తిలో అంత్యలోపం. 'అందమైనది' అనే అర్థమే అర్థవ్యాకోచం చెంది 'స్త్రీ' అనే అర్థంకలిగింది.

**3.చూలాలు :-**

క. **అన్న యిల్లాలి జూలాలిని మమతాఖ్యన్[31]...**

చూలు 'గర్భం, సంతానం'.

క., మ., త. చూల్ ' గర్భం' ; త. చూలి (చూల్+ఇ) గర్భిణీ స్త్రీ.( D.E.D. -2255)

తె.చూలు + ఆలు > చూలాలు 'గర్భిణి'. మతుబర్థం.

చూలు + ఇ > చూలి 'సంతానం' (అపాదానార్థం)

**4. జవరాలు :-**

క. **నవకంబగు ప్రాయంబున**

**జవరాండ్ర గరంచు మేని చక్కదనంబున్**

**శివతరముగఁ గృపసేయుడు**

**దివిజాధిప వైద్యులార! దీవింతు మిమున్.[32]**

సం. యౌవనమ్ > ప్రా. జవ్వనం > తె. జవ్వనము.

జవ్వనము + ఇ > జవ్వని 'యువతి'.

జవ్వని + ఆలు >జవరాలు 'యువతి'. స్వార్థంలో - ఆలు. వృత్తిలో అంత్యలోపం.

**5.పురుటాలు :-**

క. **పురుటాలికి పది దినములు**

**పురుడు ప్రవర్తించి రెలమిఁ బుణ్యపు గరితల్.[33]**

త. పురుటు; క. పురుడు; తె. పురుడు 'జాతాశౌచం'.( D.E.D. -3519)

పురుడు + ఆలు > పురుటాలు 'బాలెంతరాలు'. మతుబర్థం.

పురుడు + ఆలు > పురుటి + ఆలు > పురుటాలు / పురుటియాలు.

**6. ప్రియురాలు :-**

క. **.... భగవంతుడగు శివుండు తన ప్రియురాలి వేడుకల కొఱకు నిట్లనియె.**[34]

సం. ప్రియ 'ఇష్టమైన'. ప్రియ + ఆలు > ప్రియురాలు 'ఇష్టమైన స్త్రీ'

**7.ముద్దరాలు :-**

క. చాలముద్దరాలు[35]

సం. ముగ్ధా > ప్రా. ముద్ధ > ముద్ద 'అమాయిక'.

తె.ముద్ద + ఆలు > ముద్దరాలు - 'అమాయకురాలు' - స్వార్థంలో.

(ముద్దరాలు ' మనోజ్ఞమైనది'. శ.ర.)

**8. వింతరాలు :-**

సీ. **.... ముంగొంగుపసిఁడియై మూల్గు పుణ్యంబుల**

**విఙ్టవీగుదురెట్టి <u>వింతరాండ్రు</u>**[36]**...**

**వింత + ఆలు > వింతరాలు 'అన్యురాలు'.**

**9. వెలయాలు :-**

మ. **తలఁపుల్ చిచ్చులు మాటలుజ్జ్వల సుధాధారల్ విభుండైన పు**

**వ్విలుతున్ మెచ్చర యన్యులన్ వలతురే విశ్వాసమున్ లేదు క్రూ**

**రలు తోడుంబతినైన జంపుదురధర్మల్ నిర్దయల్ చంచలల్**

**<u>వెలయాండ్రె</u>క్కడ వారి వేడబము లా వేదాంత సూక్తంబులే.**[37]

తె.వెల; క.బెలె; త.విలై. వెల 'క్రయధనం'.

వెల + ఆలు > వెలయాలు 'వేశ్య' - మతుబర్థం.

**10. శుభాత్మురాలు :-**

క. **చాలముద్దరాలు జవరాలు గొమరాలు**

**నీ <u>శుభాత్మురాలి</u>**[38]**...**

సం.శుభాత్మ + ఆలు > శుభాత్మురాలు 'మంచిమనసుగలది'.

**7. 8 . -ఇ :-**

-ఇ ప్రత్యయం - అభావార్థాన్ని తెలిపే ప్రత్యయమని సులభ వ్యాకరణంలో వావికొలను సుబ్బారావు పేర్కొన్నారు.[39] అట్టిది ఒక్క ప్రయోగం లభించింది. అది - గుడ్డి.

**గ్రుడ్డి :-**

క. **బిడ్డలకు బుద్ధి సెప్పని**

**<u>గ్రుడ్డికిఁ</u> బిండంబు వండికొని పొండిదె**[40]**...**

త.కురడన్; క.కురుడు; తు.కురుడు; తె. గ్రుడ్డు

గ్రుడ్డు + ఇ > గ్రుడ్డి 'అంధుడు/ అంధురాలు'

**7 . 9 . -ఇ**[2] **:-**

-ఇ ప్రత్యయం మతుబర్థంలో స్వార్థంలోనూ ప్రయోగింపబడే తద్ధితం.[41]

మతుబర్థంలో - ఇ ప్రయోగమనేది తెలుగులోనే కాక అన్ని భాషల్లో (ద్రావిడ, ఇండోయూరోపియన్ లో కూడ) ఉంది.

భాగవతంలోని - ఇ ప్రత్యయాంత ప్రయోగాలు -

1. అలవి　　2. ఓలమి　　3. కడలి

4. చూడి, చూలి 5. వెల్లి 6. సంగడి

1.అలవి :-

తే. **మనుజునకైనను వాక్రువ్వ నలవి గాదు,**

**నిగమ జాతంబులైన వర్ణింపలేవ.**[42]

త.అళ్, అళవు; క.అళ, అళవు, అలవు; తె. అలవు, లావు;ప.లావ్; అనే పదాలకు 'శక్తి, నేర్పు, విధము' అని అర్థాలు.పై వాని పరిశీలన వల్ల మూ.ద్రా. రూపం - *అళ్.

కాగ దానిపై ఆయా భాషా ప్రత్యయాలు చేరి అళవు, అలవు, లావు అనే రూపాలు సిద్ధించాయని తెలుస్తుంది.

కాగ, అలవి, అలవులలో ప్రాచీన రూపమేది? అనేది తేల్చవలసి ఉంది. తె.అలవి, క.అలవి ఈ రెండు రూపాలు తప్ప ఇదంత రూపాలు వేరే భాషల్లో లేవు. అంతేకాక తెలుగులో అలవు, లావు అనే ప్రయోగాలున్నాయి. ప.లావ్ ఉంది. అది అళవు/అలవు రూపాల వర్ణ వ్యత్యయ రూపమే. ఈ విధంగా అన్ని భాషల్లో లభించే రూపం ప్రాచీనంగా భావించవచ్చు. పదాలు ఆయా భాషల్లో ప్రవేశించాక మార్పులు పొందడం సహజం. కాబట్టి ఆ పదాలు తెలుగు కన్నడాల్లో ప్రవేశించి, తర్వాత మార్పులు పొందాయని నిరూపించబడింది.

అలవు + ఇ > అలవి 'శక్తి, సాధ్యం' (స్వార్థంలో).

2 . ఓలిమి :-

చ. **హరి! పరమాత్మ! కేశవ! చరాచర భూత శరీర ధారివై**

**పరగుదు వీవు నిట్టులుగఁ బ్రాణనిరోధమెఱుంగ మెందు మున్**

**దిరముగ దేవదేవ! జగదీశ్వర! సర్వశరణ్య! నీ పదాం**

**బురుహము లోలిమై శరణుఁబొందెద మార్తిహరించి కావవే.**[43]

త. ఓళి; మ. ఓళిక్క; క.ఉళి; కోత. ఓళి అనే క్రియా రూపాలు 'దాక్కొను' అనే అర్థంలో ఉన్నాయి. తెలుగులో అట్టి క్రియలేదు.

కాగ, త. ఉళవు 'రహస్యం', ఒళివు 'రహస్య ప్రదేశం'; మ. ఓళి; క. ఒళవు, ఒళగు 'రహస్యం'; తె.ఒళవు 'రహస్యం', ఓలము 'రహస్యస్థానం, మరుగైన చోటు'.

ఓలము + ఇ > ఓలిమి 'చాటు, మఱుగు' అని అర్థం.

కాగ ప్రస్తుత పదానికి అర్థం సం. ఆళిః -- ప్రా. ఓలీ -- తె. ఓలి.

ఓలి + ఇమి / ఓలి + మి > ఓలిమి 'నిండుగా, సంపూర్ణంగా' అని చెప్పుకోవాలి. ఇది ప్రకరణానుకూల అర్థమే కాని సాక్షాత్సంకేతితార్థం కాదు.

**3 . కడలి :-**

**ఎడమఁ గుడి మునుపు దిరుగుచు**

**గుడినెడమను వెనుకఁదిరుగు కులగిరి కడలిన్[44]....**

కడలు 'అల'. అలలు కలది కడలి. కడలు + ఇ > కడలి 'సముద్రం'. మతుబర్థం.

కడలికి సజాతీయాలు - త. కటల్; మ. కటల్; క.కడల్; కొడగు. కడ; తు.కడలు: (D.E.D. -939)

**4.చూలి :-**

ఆ: **భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు**

**శూలికైన దమ్మి చూలికైన[45]...**

పై ప్రయోగంలో సమాసగతంగా చూలి ఉంది. (వివరాలకు చూ. చూలాలు)

**5 .వెల్లి :-**

క. **అప్పాల వెల్లి లోపల[46]...**

త. వెళ్ళమ్ 'ప్రవాహం, సముద్రం, సముద్రపుటల, నీరు; మ.వెళ్ళమ్ 'నీరు'; తు. బొళ్ళ ప్రవాహం, నీటితో ముంచివేయు.( D.E.D. -4529)

దీన్ని పరిశీలిస్తే - *వెళ్ - అనే మూ.ద్రా. రూపానికి 'నీరు' అని అర్థం ఉండెనని, తర్వాతి కాలంలో నీటికి సంబంధించిన అర్థాలన్నీ కలిగినాయని స్ఫురిస్తుంది.

మూ.ద్రా. - *వెళ్ - తె. వెల్ల్. దీనిపై ప్రత్యయాలు చేరిన రూపాలే ఇప్పుడు లభిస్తున్నాయి.

వెల్ల్ + ఇ > వెల్లి 'నీరుకలది, అలలు గలది - సముద్రం', ప్రవాహం. వెల్ల్ + ఉవ > వెల్లువ 'నీటి యొక్క స్వభావం - ప్రవాహం'.

పై సందర్భంలో సముద్రార్థంలో వెల్లి ప్రయోగించాడు.

**6. సంగడి :-**

క. **సంగడి దిరిగెడు శంభుడు**[47]....

క. **సంగడి లోకములన్నియు**[48]....

సంగడము + ఇ > సంగడి - 'స్నేహం, మొత్తం'.

సంగడము 'స్నేహం, పరివారం' మొదటి పద్యంలో స్నేహార్థంలో, రెండవ పద్యంలో 'మొత్తం' అనే అర్థంలో కవి ప్రయోగించాడు.

(వివరాలకు చూ. సంగడీడు)

**7.10. -ఇక :-**

అగ్గల మొదలైన శబ్దాలకు - ఇక అనే ప్రత్యయం భావార్థంలో వస్తుంది.[49]

అరమర మొదలైన శబ్దాలకు - ఇక ప్రత్యయం స్వార్థంలో వస్తుంది.[50] భాగవతంలోని ఇక ప్రత్యయాంతాలు -

1. అగ్గలికము    2. ఉమ్మలికము

**1.అగ్గలిక :-**

వ. **చెలియలిం జంపు నగ్గలిక యెగ్గని యుగ్గడించి**[51]....

క. అగ్గళ, అగ్గళె, అర్గళ అనే సజాతీయ రూపాలున్న తెలుగుపదం అగ్గలము. దీనికి అధికము, ఆధిక్యము అని అర్థాలు. అగ్గల + ఇక > అగ్గలిక 'ఆధిక్యం' (భావార్థంలో) .

**2.ఉమ్మలికము :-**

ఉ. **ఇమ్ముల నున్న వాడె హరి? యిక్కడి కెప్పుడువచ్చు? వచ్చి మా**

**యుమ్మలికంబు వాపునె?**[52]**....**

ఉమ్మలము 'సంతాపం'. ఉమ్మల + ఇక > ఉమ్మలిక, సంతాపం, బాధ (భావార్థంలో).

**7.11. -ఇడి :-**

-ఇడి అనే తద్ధిత ప్రత్యయం వివిధార్థాల్లో -

1. అభావద్యోతక మతుబర్థంలో (లేని అనే అర్థంలో)[53]

2. మతుబర్థంలో (కల్గుటను తెల్పు ప్రత్యయం)[54]

3. ధర్మివాచకంగా[55]

- ప్రయోగించ బడుతుంది. - ఇడి ప్రత్యయాంతాలు -

1. కట్టిడి 2. చెవిటి 3. పసిడి

**1.కట్టిడి :-**

క. **కట్టా! తలమునుకలు నై**

**దట్టపు విరహాగ్ని శిఖలు తరుణులవేప**

**న్నెట్టుం బలుకవు చూడవు**

**కట్టిడివి కదా కుమార! కరుణోదారా!**[56]

కట్టు 'నియమం/ధర్మం'. కట్టు + ఇడి >కట్టిడి 'అధార్మికుడు, దయలేని వాడు,

నిర్ధయుడు' అని అర్థం.

కట్టిడి అనే నిరనుస్వార రూపానికి 'నియతి, ఆజ్ఞ' అని అర్థం కాగా, కట్టిఁడి అనే సానుస్వార రూపానికి 'క్రూరం/నిర్ధయ' అని అర్థం. ఈ భేదం గమనించవలసింది.(వివరాలకు చూ. కట్టు)

**2.చెవిటి :-**

**జడుని తెలుఁగున నంధుని చందమునను**

**<u>జెవిటి</u> భంగివి**[57]**...**

చెవి + అవిటి > చెవిటి అని శ.ర. లో రూపసాధన చేసినట్లు శ్రీ సూ.రా.ని. లో పేర్కొన్నారు. కాని చెవి + ఇఁడి > చెవిటి అనే రూపం సమ్మతించదగింది.

మ.త. చెవి 'చెవి', చెవిటు 'చెవుడు', చెవిటి, చెవిటన్ 'చెవిటి'; అనే రూపాలను పరిశీలిస్తే 'చెవిటి' అనే రూపం ఇతర భాషల్లో కూడ ఉంది. కాగ అవిటి అనే పదం తెలుగులో తప్ప ఇతర భాషలో లభించలేదు. కాబట్టి ఆ భాషల్లో కూడ వ్యుత్పత్తిని చెప్పటానికి (అవిటి) ఈ తర్కం సరిపోదు. కాబట్టి అక్కడ దాన్ని ప్రత్యయంగా పేర్కొనడమే సబబు.( D.E.D. -1645)

చెవి + ఇఁడి > చెవిటి. అనుస్వారలోపం, పదాంత పరుషీ కరణం జరిగింది. (అభావార్థంలో - ఇడి).

చెవుడు అనే రూపాన్ని కూడ భాగవతంలో ప్రయోగించాడు.

**3. పసిఁడి :-**

తే. **... అర్థిబంచిన <u>పసిఁడి</u>ట్టియై నటించు**[58]**...**

పసిమి 'పచ్చందనము'. ఈ శబ్దం వృత్తిలో అంత్య లోపం పొంది, పసి మిగులును.

పసి + ఇఁడి > పసిఁడి 'పచ్చదనము కలది - బంగారము' అని ధర్మి వాచకం (మతుబర్థం).

**4.వెరవిడి :-**

క. **బరువైన కొడుకు మోఁతను**

**<u>వెరవిఁడి</u> యిలమీఁద బెట్టి**[59]**...**

వెరవు అనే శబ్దానికి 'ఉపాయం, నేర్పు, రీతి, ధర్మం' అనేవి అర్థాలు. వెరవు + ఇఁడి > వెరవిడి 'ఉపాయహీనుడు', మూర్ఖుడు (అభావార్థంలో - ఇఁడి).

వెరవు + అరి > వెరవరి 'ఉపాయశాలి'.

**7.12. -ఇదమ్ :-**

~~ఈ~~ తద్ధిత ప్రత్యయం మతబర్థంలో కాని స్వార్థంలో కాని వస్తుంది.[60]

**బెట్టిదము, బెట్టిదుఁడు :-**

క. **<u>బెట్టిదము</u>గు శాపమునకు**[61]**...**

మ. **... వామకర సంక్రాంతంబు గావించి, <u>బెట్టిదుఁడై</u>**[62]**...**

బెట్టు అనే తెలుగు పదానికి సజాతీయ రూపాలు -

త. వెట్టై 'కాఠిన్యం'; క.బెట్ట, బెట్టి, బెట్టు 'కాఠిన్యం, దృఢత్వం'; అనేవి లభించాయి.

బెట్టుకు తెలుగులో ఉన్న అర్థాలు - 1. ఉద్ధతి 2. క్రౌర్యం 3. దృఢత్వం 4. అతిశయం 5. ధైర్యం, బింకము 6. గౌరవం అనేవి.

బెట్టు + ఇద > బెట్టిద. నపుం. రూపం - బెట్టిదము.

పుం. రూపం - బెట్టిదుడు. స్త్రీ. రూపం - బెట్టిదురాలు.

బెట్టిదము 'క్రౌర్యం, కఠినం, సాహసం, గర్వం, భయంకరం'.

**7. 13. -ఇర :-**

**వేగిరము :-**

వేగ శబ్దముపై స్వార్థమున వచ్చు తద్ధిత ప్రత్యయం **-ఇర**[63] .

వేగ + ఇరము > వేగిరము - 'వేగం'.

క. ... **<u>వేగిరమున</u> విరహిజనుల వేఁటాడె నాగిన్**[64]

అని భాగవత ప్రయోగం.

**7.14. -ఈ :-**ఇది కొన్నిచోట్ల మతుబర్థ పుంస్త్వబోధక తద్ధితం.మరికొన్నిచోట్ల స్వార్థ బోధకప్రత్యయం.[65]

**1.దాపరీఁడు :-**

సీ. **.... వీడటే! మందలో వెన్నలు దొంగిలి**

**దర్పించి మెక్కిన <u>దాపరీఁడు</u>.**[66]

దాపరము 'దొంగిలించుట'. దాపరము + ఇ > దాపరి 'దొంగ'.

దాపరి + ఈ + డు > దాపరీఁడు 'దొంగ', 'వంచకుడు'. స్వార్థంలో.

**2. సంగడీడు :-**

ఆ. **<u>సంగడీ</u>ల నడుమఁ జక్కనఁ గూర్చుండి**[67]...

సంగడము 'సమానం, జత, స్నేహం, ఉజ్జీ'.

సంగడము + ఇ > సంగడి 'సంబంధిజనం, జతయైనది, స్నేహం, సాహచర్యం, ప్రేమ'.

సంగడి + ఈఁడు > సంగడీఁడు 'స్నేహితుడు'.

**7.15 -ఉక :-**

స్వార్థంలో వచ్చే తద్ధిత ప్రత్యయం.[68]

**1.నిప్పుక :-**

చ. **పెట పెట బండ్లు గీటుచును భీకరుఁడై కనుగ్రేవ <u>నిప్పుకల్.</u>**[69]

నిప్పు + ఉక > నిప్పుక 'అగ్ని'.

**2.నెలతుక :-**

**<u>నెలతుక</u> యెప్పుడు నివసించునేయింట**

**నా యిల్లు పరమగు నమృత పదము.**[70]

నెలఁత + ఉక > నెలతుక '1. స్త్రీ 2. భార్య'. (వివరాలకు చూ. నెలఁత)

**3.పడుతుక :-**

క. **జడను వడి మోహమున నా <u>పడఁతుక</u>**[71]**...**

పడతి 'స్త్రీ' . పడతి + ఉక > పడతుక

**4. పొలతుక :-**

క. **పొలఁతుక దన యుత్సంగం**[72]**...**

పొలతి 'స్త్రీ'. పొలతి + ఉక > పొలతుక.

**7.16. - ఎఁడు :-**

పరిమాణార్థక ప్రత్యయం.[73]

క. **జడగతులును బలు పిఱుఁదులు**

**<u>బిడికెడు</u> నడుములును**[74]**....**

పిడికిలి + ఎడు > పిడికెడు . అంత్యాక్షర లోపం.

**7.17 -క :-**

**వంటకము :-**

ఆ. **అవని సురుఁడు గుడవ నతిపవిత్రంబైన**

**<u>వంటకంబు</u> భూమి వరుఁడు గుడిచె.**[75]

వండు + ట > వంట. వంట + కము > వంటకము ' పాకం, అన్నం, ఆహారపదార్థం'.

- క ప్రత్యయమేదీ వైయాకరణులు పేర్కొనకున్నా ఇక్కడ అవసరమని తోస్తుంది.

వంట అనే కృదంతం స్పష్టంగా కనిపిస్తుంది. దానిపై -క ప్రత్యయం కూడా స్వార్థంలోనే కనిపిస్తుంది. కాబట్టి -క అనే తద్ధిత ప్రత్యయాన్ని ఒప్పుకొనక తప్పదు.

నిప్పుక అనే పదాన్ని కూడ నిప్పు + ఉక అనే కంటే  నిప్పు + క అని - క ప్రత్యయంతంగా చెప్పవచ్చు.

**7.18. - కత్తియ / కత్తె :-**

స్త్రీత్వ బోధక ప్రత్యయం. కొన్నిచోట్ల స్వార్థంలో, కొన్నిచోట్ల మతుబర్థంలో వస్తుంది.[76] భాగవతంలో ప్రయోగాలు -

1. చెలికత్తె  2. పొత్తుకత్తె  3. బందికత్తె  4. వేడుకల కత్తె

**1.చెలికత్తె :-**

వ. **సరస్వతీ తీరంబు జెలికత్తెలతో గూడియున్న**

**నూర్వశిం గని.**[77]

చెలి + కత్తె > చెలికత్తె 'మిత్రురాలు'. (స్వార్థంలో)

**2.పొత్తుకత్తె :-**

వ. **... తమ తమ పొత్తుకత్తెలుం దారును.**[78]

పొత్తు 'స్నేహం'. పొత్తు + కత్తె > పొత్తుకత్తె 'స్నేహితురాలు'

**3.బందికత్తె :-**

మ. **... బలిష్ఠుండగు కాముఁబారిఁ బడి నే నెట్లోర్చెదన్ బందిక**

**త్తె బడిం బాపపుఁ దృష్ణ యిప్పు డకటా! దీర్ఘాకృతిన్ రొప్పెడిన్.**[79]

బంది 'చెఱసాల, బందిపోటు'.

బంది + కత్తె > బందికత్తె 'దోపుడు కత్తె' (స్వార్థంలో).

**4.వేడుకల కత్తె :-**

ఆ. **అమరవరుల నడుగ నా <u>వేడుకలకత్తె</u>**

**యెఱుఁగు గాని యితరు లెఱుఁగ రనిరి.**[80]

వేడుక 'కుతూహలం, కాంక్ష, సంతోషం, వినోదం, విలాసం'.

వేడుక + ల + కత్తె > వేడుకల కత్తె 'వేశ్య, జారిణి'.

**7.19. -కాఁడు :-**

(1) పుంస్త్వంలో మతుబర్థంలో అలూదులకు చేరు తద్ధిత ప్రత్యయం. (మగాది గణంలో గణించబడడం వల్ల డుజ్జొతుంది).

(2) స్వార్థంలో కూడ రావచ్చును.

(3) తిర్యక్కులకు కూడ ఈ ప్రత్యయం కన్పిస్తుంది.

(4) ఈ '-కా' ప్రత్యయానికి ఒక్కోసారి గకారం కన్పిస్తుంది.[81]

భాగవతంలోని ప్రయోగాలు :

1. ఏటుకాడు 2. గమికాడు 3. ఘోణిగాడు

4. చెలికాడు 5. తరిగాడు 6. విలుకాడు

7. వేటకాడు 8. వేడుకకాడు 9. సంగడికాడు

**1. ఏటుకాడు :-**

ఉ. **నమ్మిన ముగ్ధలన్ రహితనాథల నక్కట! నేడు రెండు మూ**

**డమ్ముల <u>యేటుకాఁడె</u>దుర నడ్డము రాఁదగవే కృపానిధీ!**[82]

ఏయు > ఏటు 'బాణ ప్రయోగం'

ఏటు + కాఁడు > ఏటుకాఁడు 'బాణాలను ప్రయోగించువాడు (విలుకాడు)'.

**2. గమికాఁడు :-**

వ. **అంత రథిక సహస్రంబులకు *<u>గమికాఁడైన</u>* భీష్ముండు**[83]...

మని 'గుంపు'. గమి + కాడు > గమికాఁడు - సేనాధిపతి, ముఖ్యుడు.

**3. ఘోణిగాఁడు :-**

చ. **వనముల నుండుఁ జొచ్చు మునివర్గములోపల ఘోణిగాఁడు**[84]...

సం. ఘోణి 'పెద్దముట్టె కలది - (అడవి) పంది'.

ఘోణి + కాఁడు > ఘోణిగాఁడు 'అడవి పంది'.

**4.చెలికాఁడు :-**

సీ. **చెలికాడ! రమ్మని చీరు నన్నొకవేళ**[85]...

చెలి + కాఁడు > చెలికాఁడు 'మిత్రుడు'

**5. తరిగాఁడు :-**

క. ***<u>తరిగాంఁడ్ర</u>* లోన నొకఁడట**

**తరి కడవకుఁ గుదురు నాఁక త్రాడును జేరుల్**

**దరి గవ్వంబును దానఁట**

**హరి హరి చిత్రలీల హరియే యెఱుగున్.**[86]

తె. ü తరుచు 'మథించు'. తె. ü తరుచు + ఇ > తరి 'మథనము'.

తరి + కాఁడు > తరికాఁడు / తరిగాఁడు 'మథించువాడు'.

ఈ పదానికి కన్నడలో మాత్రమే ఇవే రూపాలు సజాతీయాలుగా ఉన్నాయి.

**6.విలుకాఁడు :-**

క. **... ఓపిక విలుకాఁడొక్కం**

**డీ పురి లేఁడయ్యె నయ్య! యిది పాపమగున్.**[87]

త.విల్; మ.విల్, విల్లు; క.బిల్, బిల్లు; పర్జి.విల్; కుయి. విడు, విలు; బ్రా. బిల్ అనే పదాలు తె.విల్లు 'ధనుస్సు' పదానికి సజాతీయాలు.

త. విల్లణ్, విల్లవణ్, విల్లోణ్, విల్లి 'ధానుష్కుఁడు'; మ.విల్లణ్, విల్లి;

విలు + కాఁడు > విలుకాఁడు 'ధానుష్కుఁడు'.

**7. వేటకాఁడు :-**

శా. **వాలింజంపెను వేఁటకాని పగిదిన్**[88]**...**

వేట + కాఁడు > వేటకాఁడు 'వేటాడువాడు'

(వివరాలకు చూ. వేఁట)

**8. వేడుక కాడు :-**

క. **సంగడి లోకము లన్నియు**

**మ్రింగుచుఁ గ్రక్కుచును బయల మెలఁగించుచును**

**ప్పొంగెడు వేడుకకాఁడటు**

**మ్రింగుడువడె బకుని చేత మీఁ దెఱిఁగి నృపా!**[89]

వేడుక 'కుతూహలం, కాంక్ష, సంతోషం, వినోదం, విలాసం'.

వేడుక + కాడు > వేడుక కాఁడు 'వినోదం గా కలవాడు'.

**9. సంగడి కాఁడు :-**

వ. ... **<u>సంగడికాండ్రతో</u> నగియెడు చందంబున**[90]...

సంగడి 'స్నేహం'. సంగడి + కాఁడు > సంగడి కాఁడు 'స్నేహితుఁడు'.

**7 . 20 . - త :-**

స్త్రీ వాచ్య మైనపుడు మతుబర్థంలో-

(1) కులవాచకానికి (ఉదా - చాకిత)[91]

(2) ఎవ్వరి, ఒక్కరి శబ్దాలపై కూడా వస్తుంది.[92]

(3) యువతి విటీ రజస్వలలు గుబ్బెత మిండత ముట్టుతలు నాఁబడుదురు.[93]

కేవలం పై పరిస్థితుల్లోనే కాక 'స్త్రీ వాచ్యమైనపుడు, మతుబర్థంలో - త ప్రత్యయం కలుగుతుంది' అని సాధారణంగా చెప్పవచ్చు. - త ప్రత్యయాంత ప్రయోగాలు భాగవతంలో-

1. నెలఁత 2. మెలఁత 3. వ్రేఁత

**1.నెలఁత :-**

ఆ. **<u>నెలఁత</u> చూపు వాఁడు నెచ్చోటి కచ్చోటు**

**జిష్ణు ధనద ధర్మ జీవితంబు.**[94]

త. నిలవు, నిలా; మ. నిలా, నిలావు; కొలామి. నెల; నాయకి, నెల అనే పదాలకు 'చంద్రుడు, వెన్నెల' అని అర్థాలు. తెలుగులో కూడ నెల శబ్దానికి అర్థాలవే. స్త్రీల ముఖాన్ని చంద్రునితో పోల్చడం ప్రసిద్ధం.( D.E.D. -3113)

నెల + త > నెలఁత 'చంద్రముఖి, ప్రియురాలు, భార్య, స్త్రీ'

(ఆలంకారికార్థం నుండి సాధారణీకరణం)

**2. మెలఁత :-**

సీ. **మీఁ దెవ్వడెఱుగును <u>మెలఁత</u> ప్రాణము తోడ**[95]...

తె. üమెలగు,తె. ü మెలయు అనే ధాతువులు వేరువేరు అర్థాల్లో ఉన్నాయి. వాటిలో మెల అనే భాగం సాధారణం. అట్లే ఈ రెండింటి అర్థాల్లో సాధారణార్థం ఒకటుంది. అది 'ఆనుకూల్యంగా / జాగరూకతతో ప్రవర్తించు'.

మెల + తఙ్ > మెలఁత 'జాగరూకతతో ప్రవర్తించునది, స్త్రీ'. ధాతుజన్యంగా చెప్పడం వల్ల దీన్ని కృదంతమని చెప్పుకోవాలి.

**3. వ్రేఁత :-**

వ. **వ్రేతల చేత రక్కసి సేఁత లన్నియు నెఱింగి**[96]**...**

వ్రే 'గొల్లకులము'. వ్రే + త > వ్రేత 'గొల్లది'.

**7. 21 . -ంత :-**

పరిమాణార్థమున వచ్చు తద్ధిత ప్రత్యయని వైకృత చంద్రికా కారుడు పేర్కొన్నాడు.[97] అటువంటి ప్రయోగాలు-

| | |
|---|---|
| 1. ఇంతంత | భాగ - 6-489 |
| 2. ఓపినంత | భాగ - 4 - 933 |
| 3. కన్నంత | భాగ - 1 - 17 |
| 4. తెలియవచ్చినంత | భాగ - 1 - 17 |
| 5. తోచినంత | భాగ - 6-23 |
| 6. నిగిడినంత | భాగ - 6-23 |
| 7. నొడివినంత | భాగ - 8-593 |
| 8. విన్నంత | భాగ - 1-17 |
| 9. తెలిసినంత | భాగ - 5-16 |

మొదలైనవి లభించాయి. కాని బాల వ్యాకరణోద్ద్యోతంలో - "అంత-ఇంత" ఇత్యాదులు

తద్ధిత ప్రత్యయములు గావు. అవి ప్రత్యేక శబ్దములే"[98] అని వ.చిన సీతారామశాస్త్రి గారు పేర్కొన్నారు. కాబట్టి ఈ పదాలను ఎక్కువగా వ్యాఖ్యానించనవసరం లేదు.

**7 . 22 . - తనము :-**

భావార్థంలో వచ్చే ప్రత్యయమిది. ఆ పదాలను క్రమంగా పేర్కొంటాను.

| | | | |
|---|---|---|---|
| 1. | ఊసరవెల్లితనము | (10-ఉ.454) | 'అవసరాన్ని బట్టి మారుట'. |
| 2. | కమ్మదనంబు | (10-పూ.1098) | 'ప్రియత్వం'. |
| 3. | కలికితనము | (10-పూ.819) | 'నేర్పు'. |
| 4. | కల్లతనము | (9-14) | 'వంచన'. |
| 5. | క్రించుదనంబు | (9-111) | 'అల్పత్వం' |
| 6. | గఱువతనము | (10-145) | 'గౌరవం'. |
| 7. | గొంటుతనము | (10-పూ.1147) | 'కాఠిన్యం'. |
| 8. | చక్కదనము | (1-428) | 'సౌందర్యం'. |
| 9. | చల్లదనము | (8-156) | 'శైత్యం'. |
| 10. | చఱుతతనము | (3-490) | 'చిన్నతనం'. |
| 11. | చూలాలితనము | (8-501) | 'గర్భం'. |
| 12. | చెలితనము | (8-359) | 'స్నేహం'. |
| 13. | జడ్డుతనము | (2-53) | 'మాంద్యం'. |
| 14. | జాణతనము | (6-180) | 'నేర్పు'. |
| 15. | దిట్టతనము | (10-పూ.1345) | 'సామర్థ్యం, ధైర్యం'. |

| | | | |
|---|---|---|---|
| 16. | దొంగతనము | (10-పూ.1183) | 'చౌర్యం'. |
| 17. | నిజమరితనము | (9-61) | 'సత్యశీలత, పాతివ్రత్యం'. |
| 18. | నేర్పరితనము | (10-పూ.931) | 'చాతుర్యం'. |
| 19. | పందతనము | (10-పూ.36) | 'పిరికితనం, సోమరితనం'. |
| 20. | పడుచుదనము | (4-423) | 'యౌవనం'. |
| 21. | పెద్ద తనము | (3-380) | 'గొప్పతనం, వార్ధక్యం'. |
| 22. | పొంతనము | (9-363) | 'ఆనుకూల్యం'. |
| 23. | పోటుదనము | (8-31) | 'శౌర్యం'. |
| 24. | బంటుతనము | (3-674) | 'దాస్యం'. |
| 25. | మగతనము | (10-పూ.1550) | 'పౌరుషం'. |
| 26. | మగనాలితనము | (9-28) | 'పాతివ్రత్యం'. |
| 27. | మగువతనము | (9-20) | 'స్త్రీత్వం'. |
| 28. | ముసలితనము | (9-175) | 'వార్ధక్యం'. |
| 29. | మెత్తదనము | (10-222) | 'మార్దవం'. |
| 30. | వాడితనము | (10-ఉ.725) | 'తీక్షణత'. |
| 31. | విన్నదనము | (9-402) | 'వైవర్ణ్యం, దైన్యం'. |
| 32. | వెడగుదనము | (2-150) | 'అవివేకం'. |
| 33. | వెఱ్ఱితనము | (1-516) | 'మూర్ఖత్వం'. |

ఇవన్నీ భావార్థంలో ప్రయోగించబడినవే.

**7. 23 .  -న :-**

నల్ల మొదలైన గుణవాచకాలకు చేరే ప్రత్యయం.[99]

-న ప్రత్యయాంత ప్రయోగాలు భాగవతంలో-

| | |
|---|---|
| 1. అల్లన | 10-పూ. 293 |
| 2. గ్రక్కున | 10-పూ. 252 |
| 3. జిల్లున | 8-252 |
| 4. నల్లన | 10-పూ. 71 |
| 5. మెత్తన | 10-పూ. 166 |
| 6. మెల్లన | 1-407 |

**7. 24 .  -ని :-**

ఈ ప్రత్యయం గుణవాచకాలపై 'ఐన అనే అర్థంలో వచ్చేది. భాగవతంలో అట్టి ప్రయోగాలు.

| | |
|---|---|
| 1. కమ్మని 'కమ్మనైన' | 10-పూ.106 |
| 2. చక్కని | 6-135 |
| 3. చల్లని | 1-451 |
| 4. చిక్కని | 6-135 |
| 5. తియ్యని | 8-546 |
| 6. తీయని | 8-447 |
| 7. తెల్లని | 9-422 |

8. నెమ్మని 10-ఉ.317

9. మెత్తని 10-పూ.991

10. మెల్లని 8-44

11. వెచ్చని 10-పూ.702

**7 . 25 . -బంటి :-**

దఘ్నార్థంలో ప్రయోగించబడే ప్రత్యయం.[100]

**కుత్తుకబంటి :-**

సీ. **జనులు హూ! హూ! యను చలివేళ**

**గుత్తుకబంటి తోయముల లోపలవసించి**[101]...

అనే పద్యంలో ప్రయోగించిన కుత్తుక బంటి 'కంఠంవరకు' అనే ప్రయోగం ఒక్కటి లభించింది.

**7.26. -మి :-**

భావార్థంలో వచ్చే ప్రత్యయం. దీన్ని - ఇమి ప్రత్యయంగా పేర్కొన్నారు.[102] కాని - మి ప్రత్యయంగా దీన్ని - ఇమి అని పేర్కొనడం వల్ల కలిగే ప్రత్యేక ప్రయోజనం ఏమీ లేనందువల్ల వ్యాకరణంలో లాఘవానికే పెద్ద పీట కనుక. అట్టి ప్రయోగాలు -

| | | |
|---|---|---|
| 1. కడిమి | 2. చెలిమి | 3. పసిమి |
| 4. పేర్మి | 5. పోడిమి | 6. బలిమి |
| 7. మిసిమి | 8. మేలిమి | 9. వాడిమి |
| 10. వేడిమి | | |

**1.కడిమి :-**

సీ. **కడిమి గోవులు పంచగవ్యంబులను నిచ్చె.**[103]

కడు అనే పదం 'మిక్కిలి', అధికమైన అనే అర్థంలో ప్రసిద్ధం.

కడు + మి > కడిమి. స్వరాకర్షణ వల్ల 'ఉ' - ఇగా మారింది.

కడిమి 'ఆధిక్యం గల, గొప్పనైన' అనే అర్థంలో ప్రయోగించబడింది.

**2.చెలిమి :-**

వ. **ఆచార్యానుగ్రహవంతుండైన పురుషుండు బ్రహ్మనిష్ఠులతోడ జెలిమి సేయుచు**[104]...

చెలి 'స్నేహితురాలు'. చెలి + మి > చెలిమి - 'చెలితనం, స్నేహం'.

**3. పసిమి :-**

క. **పసుపులు నూనెలు నలఁదిన**

**పసఁదనరి సువర్ణ బర్హి బర్హి ప్రభతోఁ**

**బసిమి గలిగి వెలుఁగొందుచుఁ...**[105]

పసి 'పచ్చనిది'. పసి + మి > పసిమి 'పచ్చందనము'.

**4 . పేర్మి / పేరిమి :-**

ఉ. **... ధరణి చక్రధురంధరుడయ్యె ( బేర్మితో**[106]

పేరు 'పెద్ద, గొప్ప, శ్రేష్ఠ-'. పేరు + మి > పేర్మి. అంత్యవర్ణలోపం.

సమస్వరత వల్ల పేరిమి అనే రూపం సిద్ధిస్తుంది.'గొప్పదనం, అభివృద్ధి' అని దీనికి అర్థాలు.

**5. పోఁడిమి :-**

వ. **నా రాచపూఁబోఁడి వాఁడిమి చూపుల నాఁడు పోఁడిమి నెఱపుచు**[107]...

పోఁడి 'చక్కనిది, అందము'. పోఁడి + మి > పోఁడిమి 'అందం, అతిశయం, మర్యాద.

**6. బలిమి :-**

మ. **బలిమిన్ దైత్యుల జంపరాదు**[108]...

బల శబ్దంపై స్వార్థంలో -ఇమి చేరడం వల్ల బలిమి అనే రూపం నిష్పన్నమౌతుందని - వైకృతచంద్రిక.[109]

**7. మిసిమి :-**

సీ. **పాల మున్నీటి లోపలి మీఁది మీఁగడ**

**మిసిమి జిడ్డునఁజేసి మేనువడసి.**[110]

మిసి 'కాంతివిశేషం'. మిసిమి 'కాంతి విశేషం, లావణ్యం, వెన్న'.

**8. మేలిమి :-**

వ. **మెల్లని మేలిమి మాటల నారాజుందీవించి**[111]...

మేలు 'శ్రేష్ఠత, వరం, ఉపకారం, పుణ్యం, సుఖం, లాభం, క్షేమం'

మేలు + మి > మేలిమి (స్వరాకర్షణ). మధ్య స్వరలోపం వల్ల - మేల్మి.

దీనికి కూడా అవే అర్థాలు.

**9. వాఁడిమి**[112] **:-**

వాఁడి 'పదను, క్రూరత్వం, కాఠిన్యం, శౌర్యం'.

వాఁడిమి 'ప్రతాపం, పరాక్రమం, నైశిత్యం'.

**10. వేఁడిమి :-**

క. **కంటే జగముల దుఃఖము**

**వింటే జలజనితవిషము వేఁడిమి ప్రభువై**

**యుంటకు నార్తులయాపద**

**గెంటించుట ఫలము ధవళగిరి న్మృగాక్షీ!**[113]

## 7.27 - ఱిక :-

భావార్థంలో వచ్చే తద్ధిత ప్రత్యయం. లభించిన ప్రయోగాలు -

1. పెద్దఱికం 2. పేదఱికం

3. రాచఱికం

**1.పెద్దరికం :-**

ఉ. **మన్నన నీదయారసము మాటల <u>పెద్దఱికంబు</u> చాలదే?**[115]

పెద్దఱికం 'పెద్దతనం, గొప్పదనం'

**2. పేదరికం :-**

క. **ప్రక్షీణ దివిజ వల్లభ**

**రక్షాపరతంత్రుడగుచు రాజీవాక్షుం**

**డ క్షణమున బలి యింటికి**

**భిక్షా గమనంబు సేసెఁ <u>బేదఱికము</u>తోన్.**[116]

పేదఱికం 'దారిద్ర్యం' (పేదతనం)

**3.రాచరికం :-**

క. **ఏటికి నీ <u>రాచరికం</u>?**[117]**....**

సం. రాజన్ > తె. రాజు. ఈ రాజు అనేది వృత్తిలో రాచ శబ్దంగా ప్రయోగించబడుతుంది.

రాచ + ఱికము > రాచఱికము / రాచర్కము అని ప్రయోగాలున్నాయి. కాని సాధు రేఫతో వేరే కవులెవరూ ప్రయోగించలేదు. కాగ పోతన మాత్రం - రాచరికం అనే ప్రయోగించాడు.

ఇంతవరకు భాగవతంలోని తద్ధిత ప్రత్యయాలు వ్యాఖ్యానించడం జరిగింది.తద్ధిత ప్రయోగ బాహుళ్యం తెలుగులో తక్కువే అయినా వాటి గొప్పదనం తీసివేయ దగింది కాదు .

## 7.28. భాగవత ప్రయుక్త తద్ధితాంత ప్రయోగాలు - సాంఖ్యిక పట్టిక.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1. -అ | (4) | 2.-అడి | (1) | 3.-అము | (1) |
| 4.-అరి | (16) | 5.-అలి | (1) | 6.-ఆడు | (2) |
| 7.-ఆలు | (10) | 8.-ఇ[1] | (1) | 9.-ఇ[2] | (6) |
| 10.-ఇక | (3) | 11.-ఇడి | (3) | 12.ఇదం | (1) |
| 13.-ఇర | (1) | 14.-ఈ | (2) | 15.-ఉక | (4) |
| 16.-ఎడు | (1) | 17.-క | (1) | 18.-కత్తె | (4) |
| 19.-కా | (9) | 20.-త | (3) | 21.-ంత | (9) |
| 22.-తనం | (33) | 23.-న | (6) | 24.-ని | (11) |
| 25.-బంటి | (1) | 26.-మి. | (10) | 27.ఱిక. | (3) |

# పాద సూచిక

1. బాల వ్యాకరణం
   - తద్ధిత -28.
2. భాగవతం8-309.
3. భాగవతం1-472.
4. భాగవతం8-320.
5. భాగవతం 7-101.
6. -సింగరాచార్యులు,అళహ.
   ఆంధ్ర మహా భారతంలో
   కృత్తద్ధిత ప్రయోగములు
   -విశ్లేషణము.పుట 38.
7. బాల వ్యాకరణం
   - తద్ధిత -28.
8. భాగవతం 9-470.
9. బాల వ్యాకరణం
   - తద్ధిత -17.
   ప్రౌఢ వ్యాకరణం
   - - తద్ధిత -3.
   ఆంధ్ర కౌముది649,650.
10. భాగవతం 3-380.
11. భాగవతం 6-329.
12. భాగవతం 10-93.
13. భాగవతం 1-479.
14. భాగవతం 8-694.
15. భాగవతం 10పూ398.
16. భాగవతం 10ఉ758.
17. భాగవతం 6-181.
18. భాగవతం 7-270.
19. భాగవతం 10పూ477.
20. భాగవతం 10పూ292.
21. భాగవతం 9-571.
22. భాగవతం10పూ987.
23. భాగవతం 8-353.
24. భాగవతం 10పూ284.
25. భాగవతం 9-66.
26. వ్యాకరణ పదకోశం పుట.92.
27. భాగవతం 1-217.
28. భాగవతం10పూ1248.
29. భాగవతం 8-471.
30. భాగవతం 9-72.
31. భాగవతం 9-640
32. భాగవతం 9-58.
33. భాగవతం 8-516.
34. భాగవతం 9-23.
35. చూ.కొమరాలు.
36. భాగవతం 6-255.
37. భాగవతం 9-416.
38. చూ.కొమరాలు.
39. వ్యాకరణ పదకోశం పుట.120.
40. భాగవతం1-311.
41. బాల వ్యాకరణం
    - తద్ధిత -18.
42. భాగవతం3-1024.
43. భాగవతం4-276.
44. భాగవతం8-211.
45. భాగవతం1-17.
46. భాగవతం8-209.
47. భాగవతం10పూ387.
48. భాగవతం10పూ444.
49. బాల వ్యాకరణం తద్ధిత-7

50. బాల వ్యాకరణం
- తద్ధిత -9
51. భాగవతం10పూ82.
52. భాగవతం10పూ1473.
53. బాల వ్యాకరణం
- తద్ధిత -24.
54. ఆంధ్ర కౌముది.653,654.
55. ఆంధ్ర కౌముది.655,656.
56. భాగవతం10పూ999.
57. భాగవతం9-40.
58. భాగవతం9-268.
59. భాగవతం10పూ261.
60. ప్రౌఢ వ్యాకరణం.తద్ధిత10.
61. భాగవతం1-477.
62. భాగవతం6-387.
63. వ్యాకరణ పదకోశం పుట.133.
64. భాగవతం10పూ765.
65. బాల వ్యాకరణం
- తద్ధిత -15,16.
66. భాగవతం10పూ1248.
67. భాగవతం10పూ496.
68. వ్యాకరణ పదకోశం పుట.141.
69. భాగవతం9-102.
70. భాగవతం8-273.
71. భాగవతం10పూ347.
72. భాగవతం4-787.
73. వ్యాకరణ పదకోశం పుట.167.
74. భాగవతం10పూ185
75. భాగవతం9-147.
76. వ్యాకరణ పదకోశం పుట.197.
77. భాగవతం9-411.
78. భాగవతం10పూ768.
79. భాగవతం9-575.
80. భాగవతం9-379.
81. వ్యాకరణ పదకోశం పుట.212.
82. భాగవతం10పూ1055.
83. భాగవతం1-214
84. భాగవతం7-31.
85. భాగవతం1-367.
86. భాగవతం8-205.
87. భాగవతం10ఉ1279.
88. భాగవతం10పూ1459.
89. భాగవతం10పూ444.
90. భాగవతం7-211.
91. బాల వ్యాకరణం
- తద్ధిత -19.
92. ప్రౌఢ వ్యాకరణం.శబ్ద-65.
93. బాల వ్యాకరణం
- తద్ధిత -21.
94. భాగవతం8-273.
95. భాగవతం10పూ38.
96. భాగవతం10పూ243.
97. వైకృత చంద్రిక. తద్ధితా37.
98. బాల వ్యాకరణోద్ద్యోతం.పుట .310.
99. బాల వ్యాకరణం
- తద్ధిత -6
100. ప్రౌఢ వ్యాకరణం.- తద్ధిత -17.
101. భాగవతం4-650.
102. బాల వ్యాకరణం - తద్ధిత 5.
103. భాగవతం8-269.
104. భాగవతం4-620.

77. భాగవతం9-411.
78. భాగవతం10పూ768.
79. భాగవతం9-575.
80. భాగవతం9-379.
81. వ్యాకరణ పదకోశం పుట.212.
82. భాగవతం10పూ1055.
83. భాగవతం1-214
84. భాగవతం7-31.
85. భాగవతం1-367.
86. భాగవతం8-205.
87. భాగవతం10ఉ1279.
88. భాగవతం10పూ1459.
89. భాగవతం10పూ444.
90. భాగవతం7-211.
91. బాల వ్యాకరణం - తద్ధిత -19.
92. ప్రౌఢ వ్యాకరణం.శబ్ద-65.
93. బాల వ్యాకరణం - తద్ధిత -21.
94. భాగవతం8-273.
95. భాగవతం10పూ38.
96. భాగవతం10పూ243.
97. వైకృత చంద్రిక. తద్ధితా37.
98. బాల వ్యాకరణోద్యోతం.పుట .310.
99. బాల వ్యాకరణం - తద్ధిత -6
100. ప్రౌఢ వ్యాకరణం.- తద్ధిత -17.
101. భాగవతం4-650.
102. బాల వ్యాకరణం - తద్ధిత 5.
103. భాగవతం8-269.
104. భాగవతం4-620.
105. భాగవతం10పూ176.
106. భాగవతం10పూ510.
107. భాగవతం9-25.
108. భాగవతం9-487.
109. వైకృత చంద్రిక. తద్ధిత31.
110. భాగవతం8-266.
111. భాగవతం9-138.
112. చూ.పోడిమి.
113. భాగవతం8-233.
114 వ్యాకరణ పదకోశం. పుట.469.
115. భాగవతం8-668.
116. భాగవతం8-525.
117. భాగవతం9-407

# భాగవతంలో కృత్తద్ధిత ప్రయోగాలు - విశ్లేషణ

ఇంతవరకు భాగవతంలో ప్రయోగింపబడిన కృదంతాలన్నీ సవిశేషంగా చర్చించి, నిరూపించబడ్డాయి. వాటిని ఆయా లక్షణాలను బట్టి కొన్ని విభాగాలు చేయవచ్చు. అవి స్థూలంగా -




**ప్రత్యయ రహితాలు :-** ' అదర్శనంలోపః (అష్టాధ్యాయ 1-1-60) అనే సూత్రం ప్రకారం ఒక ప్రత్యయం లేదంటే అక్కడ అది కనించడం లేదని, లేదా వచ్చి లోపించిందని అర్థం. ఇక్కడ కూడ ప్రత్యయరహిత కృదంతాలు అంటే ప్రత్యయం చేరి ఏర్పడనివి అని మాత్రమే అర్థం.

తెలుగులోని క్రియా ధాతువులన్నీ ఉదంతాలే. వాటికి -ఉ ప్రత్యయం చేరినపుడు (ఉత్వ సంధి నిత్య సంధి కాబట్టి) ప్రత్యయం కనిపించదు. అటువంటి వాటినే ప్రత్యయరహితాలని ఇక్కడ పేర్కొనడం జరిగింది.

( చూ. 111 నుండి141వరకు )

**ప్రత్యయం కలిగినపుడు మార్పు కలుగనివి :-**

ప్రత్యయం చేరినా ధాతువులో ఏ భాగం చెదరకుండా ఉండేవి ఇవి. అయితే - సంధి వశాత్తు జరిగే ప్రక్రియలు సహజం. అట్టివి.

(KÇ¶.146#°O_ 175=~ì½)

**. ప్రత్యయంచేరగా మార్పు కలిగేవి :-**

(1) ధాత్వంత లోపం కలవి :-

( చూ. 1 నుండి 110 వరకు)

(2) లోపదీర్ఘం :-

(చూ. 176 నుండి 181వరకు )

(3) ఆది దీర్ఘం :-

(చూ.142నుండి 144వరకు )

(4) ఆదిహ్రస్వం

( చూ. 145 నుండి 147వరకు )

(5) ద్విత్వం :-

ధాత్వంతం ద్విత్వమే లోపిస్తే, లేదా రెండక్షరాలు లోపించినా వచ్చే ప్రత్యయం ద్విత్వమౌతుంది.

( చూ. 29, 65, 64, 97, 147 )

(6) పరుషీకరణం :-

మూలధాతువులో ఉన్న సరళం పరుషంగా మారుతుంది.

( చూ. 182 )

## భాగవత - కృదంతాల విశ్లేషణ

### 8.1. ధాత్వంతలోపం కలవి :-

**-అ**

| | | |
|---|---|---|
| (1) | తెఱచు + అ > తెఱ } | } 'చు' లోపం |
| (2) | నడచు + అ > నడ | |
| (3) | పొగయు + అ > పొగ | 'యు' లోపం |
| (4) | పొడము + అ > పొడ | 'ము' లోపం |

**-అవు**

| | | |
|---|---|---|
| (5) | తొడుగు + అవు > తొడవు | 'గు' లోపం |
| (6) | నెలయు + అవు > నెలవు | 'యు' లోపం |

**- ఇ**

| | | |
|---|---|---|
| (7) | తడియు + ఇ > తడి | 'యు' లోపం |
| (8) | దయ్యు + ఇ > దప్పి | 'యు' లోపం |
| (9) | ముడియు + ఇ > ముడి | 'యు' లోపం |
| (10) | విరియు + ఇ > విరి | 'యు' లోపం |

**- ఇమి**

(11) కూరుచు + ఇమి > కూరిమి 'చు' లోపం

(12) తొలుచు + ఇమి > తొలిమి 'చు' లోపం

(13) బలియు + ఇమి > బలిమి 'యు' లోపం

(14) ముదియు + ఇమి > ముదిమి 'యు' లోపం

**- క**

(15) అలుగు + క > అలుక 'గు' లోపం

(16) ఎఱుగు + క > ఎఱుక 'గు' లోపం

(17) కలగు + క > కలక 'గు' లోపం

(18) కినియు + క > కినుక 'యు' లోపం

(19) కూయు+క > కూక 'యు' లోపం

(20) తునుగు + క > తునుక 'గు' లోపం

(21) నడచు + క > నడక 'చు' లోపం

(22) పోవు + క > పోక 'వు' లోపం

(23) మలగు + క > మలక 'గు' లోపం

(24) ముదియు + క > ముదుక 'యు' లోపం

(25) మునుగు + క > మునుక 'గు' లోపం

(26) మూగు + క > మూక 'గు' లోపం

(27) మొలచు+క > మొలక 'చు' లోపం

(28) వీగు + క > వీక 'గు' లోపం

(29) వ్రచ్చు + క > ప్రక్క 'చు' లోపం

(30) వంగు + క > వంక 'గు' లోపం

**- కడ**

(31) నిలుచు + కడ > నలకడ 'చు' లోపం

**- కువ**

(32) అడగు + కువ > అడకువ 'గు' లోపం

(33) తెఱచు + కువ > తెఱకువ 'చు' లోపం

(34) కలగు + కువ > కలకువ 'గు' లోపం

(35) తేగు + కువ > తేకువ 'గు' లోపం

(36) మెలగు + కువ > మెలకువ 'గు' లోపం

- గు

| | |
|---|---|
| (37) మెఱయు + గు > మెఱుగు | 'యు' లోపం |
| (38) వెఱచు + గు > వెరగు | 'చు' లోపం |

-ట

| | |
|---|---|
| (39) ఆడు + ట > ఆట | 'డు' లోపం |
| (40) చమర్చు+ట > చెమట | 'రు' లోపం |
| (41) తివురు + ట > తివుట | 'రు' లోపం |
| (42) తీడు + ట > తీట | 'డు' లోపం |
| (43) తేఱు + ట > తేట | 'ఱు' లోపం |
| (44) పాడు + ట > పాట | 'డు' లోపం |
| (45) మండు + ట > మంట | 'డు' లోపం |
| (46) వేచు + ట > వేట | 'చు' లోపం |

-టు

| | |
|---|---|
| (47) ఓడు + టు > ఓటు | 'డు' లోపం |
| (48) కఱచు + టు > కాటు | 'ఱచు' లోపం |
| (49) తూఱు + టు > తూటు | 'ఱు' లోపం |
| (50) పడు + టు > పాటు | 'డు' లోపం (దీర్ఘం) |
| (51) పొడుచు + టు > పోటు | 'డుచు' లోపం |
| (52) వయచు+టు > వాటు | 'యచు' లోపం |
| (53) వ్రేయు + టు > వ్రేటు | 'యు' లోపం |

| | |
|---|---|
| పేరు + గు > పెరుగు - | ఆదిహ్రస్వత |
| విను+ఉ > వీను - | ఆది దీర్ఘం |
| కను+ఇక/ఉడ > కానిక/కానుక- | ఆది దీర్ఘం |
| కను + పు > కానుపు | ఆది దీర్ఘం |
| కను + ఉ > కన్ను | అంత్యద్విత్వం |
| కూయు+ఇ > కుయ్యి | ఆదిహ్రస్వత, ద్విత్వం |
| చేయు + ఇ > చెయ్యి | ఆదిహ్రస్వత, ద్విత్వం |

-త

| | |
|---|---|
| (54) ఊదు + త > ఊత | 'దు' లోపం |
| (55) కూయు+త > కూత | 'యు' లోపం |
| (56) చేయు+త > చేత | 'యు' లోపం |
| (57) పూయు +త > పూత | 'యు' లోపం |

(58) మేయు + త > మేత 'యు' లోపం

(59) మోయు+త > మోత 'యు' లోపం

(60) మ్రోయు+త > మ్రోత 'యు' లోపం

(61) రోయు + త > రోత 'యు' లోపం

-ప

(62) మురియు + పము > మురిపము 'యు' లోపం

-పి

(63) తెలుచు+పి > తెలుపి 'చు' లోపం

(64) దయ్యు+పి > దప్పి 'యు' లోపం

(65) నొచ్చు+ప్పి > నొప్పి 'చు' లోపం

-పు

(66) ఆర్చు+పు > ఆర్పు 'చు' లోపం

(67) ఇంచు+పు > ఇంపు 'చు' లోపం

(68) ఊర్చు+పు > ఊర్పు 'చు' లోపం

(69) ఏచు+పు > ఏపు 'చు' లోపం

(70) కాచు+పు > కాపు 'చు' లోపం

(71) గెలుచు+పు > గెలుపు 'చు' లోపం

(72) చూచు+పు > చూపు 'చు' లోపం

(73) తలచు+పు > తలపు 'చు' లోపం

(74) తార్చు+పు > తార్పు 'చు' లోపం

(75) తీయు+పు > తీపు 'యు' లోపం

(76) తెంచు+పు > తెంపు 'చు' లోపం

(77) నడచు+పు > నడపు 'చు' లోపం

(78) నెరయు+పు > నెరపు 'యు' లోపం

(79) పనుచు+పు > పంపు 'చు' లోపం

(80) పలుచు + పు > పలుపు 'చు' లోపం

(81) పెంచు+పు > పెంపు 'చు' లోపం

(82) పొడుచు+పు > పొడుపు 'చు' లోపం

(83) పొలుచు + పు > పొలుచు 'చు' లోపం

(84) బలియు+పు > బలుపు 'యు' లోపం

(85) మలుచు+పు > మలుపు 'చు' లోపం

(86) మెలయు+పు > మెలపు 'యు' లోపం

(87) మోయు+పు > మోపు 'యు' లోపం

(88) వంచు + ప > వంపు 'చు' లోపం

(89) వగచు+పు > వగపు 'చు' లోపం

(90) వలచు+పు > వలపు 'చు' లోపం

(91) వాచు+పు > వాపు 'చు' లోపం

(92) వెఱచు+పు > వెఱపు 'చు' లోపం

(93) వేలుచు+పు > వేల్పు 'చు' లోపం

**-పురము**

(94) కాచు+పురం > కాపురం 'చు' లోపం

**-ము**

(95) నోచు+ము > నోము 'చు' లోపం

**-వ**

(96) త్రోచు+వ > త్రోవ 'చు' లోపం

(97) నెవులు+వ > నెవ్వ 'లు' లోపం

**-వడి**

(98) నడచు+వడి > నడవడి 'చు' లోపం

**-వలి**

(99) కాచు+వలి > కావలి 'చు' లోపం

**-వి**

(100) ఇచ్చు+వి > ఈవి 'చు' లోపం

(101) తనియు+వి > తనివి 'యు' లోపం

(102) తెలియు+వి > తెలివి 'యు' లోపం

**-వు**

(103) కెడయు+వు > కెడవు 'యు' లోపం

(104) కొలుచు+వు > కొలువు 'చు' లోపం

(105) చచ్చు+వు > చావు 'చు' లోపం

(106) తడయు+వు > తడవు 'యు' లోపం

(107) నెలయు+వు > నెలవు 'యు' లోపం

**-సలి**

(108) ముదియు + సలి > ముదుసలి 'యు' లోపం

(109) ముదియు+సలి > ముసలి 'యు' లోపం

**-సు**

(110) మలియు+సు > నులుసు 'యు' లోపం

## 8.2. ధాతువులో మార్పులేనివి.

**-ఉ**

(111) అన్ను (112) అలరు (113) ఊఱుము(114) ఉలుకు(115) కట్టు (116) కన్ను (117) కప్పు (118) కుదురు (119) కూడు(120) కూరుకు (121) చదువు (122) చిక్కు (123) తప్పు (124) తాకు(125) దగ్గు (126) నవ్వు (127) నుడువు (128) పండు (129) పట్టు(130) పలుకు (131) పొందు (132) పొక్కు (133) పొత్తు (134) పోరు(135) బెదరు (136) బొంకు (137) బ్రతుకు (138) మెచ్చు (139) మెఱుము(140) మొక్కు (141) వెలుగు.

### 8.3.1.ధాతువుకు ఆదివృద్ధి వచ్చినవి :-

**(అ) ప్రత్యయం కనిపించనివి :-**

-ఉ

(142) వీనులు

**(ఆ) ప్రత్యయం కనిపించేవి:-**

**-క**

(143) కను+క > కానుక

**-పు**

(144) కను+పు > కానుపు

### 8.3.2 ధాతువుకు ఆదిహ్రస్వత వచ్చినవి :-

**-గు**

(145) పేరు+గు > పెరుగు

**-ఇ:-**

(146) కూయు+ఇ > కుయ్యి (ఆదిహ్రస్వం. ద్విత్వం)

(147) చేయు+ఇ > చెయ్యి / చేయి.

## 8.4. ధాతువులో మార్పులేక ప్రత్యయం చేరినవి

*(i)* **అజాదిప్రత్యయాలు పరమైనపుడు -**

**-అ**

(146) ఎండు+అ > ఎండ

(147) కాయు+అ > కాయ

(148) చాపు+అ > చాప

(149) చెక్కు+అ > చెక్క

(150) దొంగు+అ > దొంగ

(151) పఱియు+అ > పఱియ

**-అడి**

(152) ఆఱు+అడి > ఆఱడి

**-అవు**

(153) చను+ఆవు > చనవు/చనువు (పరసమీకరణం)

(154) తగు+అవు > తగవు/తగువు (పరసమీకరణ)

**-ఇ**

(155) ఎలము+ఇ > ఎలమి

**-ఇక**

(156) ఆడు+ఇక > ఆడిక

(157) ఏలు+ఇక > ఏలిక

(158) ఓపు+ఇక > ఓపిక

(159) కోరు+ఇక > కోరిక

(160) పూను+ఇక > పూనిక

(161) పోలు+ఇక > పోలిక

(162) మచ్చు+ఇక > మచ్చిక

**-ఇకి**

(163) మను+ఇకి > మనికి

(164) విను+ఇకి > వినికి

**-ఇదము**

(165) ఒప్పు+ఇదము > ఒప్పిదము

(166) పన్ను+ఇదము > పన్నిదము

**-ఎ**

(167) జంకు+ఎ > జంకె

**-కలి**

(168) విను+కలి > వినుకలి

**-గడ**

(169) చేరు+గడ > చేరుగడ

**-బడి**

(170) చెల్లు+బడి > చెల్లుబడి

**-వ**

(171) ఎక్కు+వ > ఎక్కువ

(172) తక్కు+వ > తక్కువ

(173) తెగువ+వ > తెగువ

-వు

(174) పుట్టు+వు > పుట్టువు

(175) మను+వు > మనువు

8.5. లోపదీర్ఘాలు:-

-(176) ముడుచు+ట > మూట

-టు

(177) చెడు+టు > చేటు

(178) పడు+టు > పాటు

(179) పొడుచు+టు > పోటు

(180) వయచు+టు > వాటు

(181) కఱచు+టు > కాటు

-వి

(182) ఇచ్చు+వి > ఈవి

8.6. పరుషీకరణం :-

(183) పొంగు+అ > పొంకము

8.7. రెండక్షరాలు లోపించినా, శేషాక్షరంలో మార్పులేనిది:-

(184) ముదియు+సలి > ముసలి.

## 8.8. నిష్కర్ష:-

1. తెలుగులో సాధారణంగా రెండక్షరాల ధాతువులే ఉంటాయి.ఒకవేళ ఉన్నా రెండక్షరాలపై ధాత్వనుబంధంగా - గు, చు, యు లు చేరవచ్చు. కృత్ప్రత్యయం చేరగా అవి లోపిస్తాయి.
2. ఏ కాక్షర ధాతువుపైన కూడ కృత్ ప్రత్యయాలు చేరినపుడు పై ధాత్వనుబంధాలు లోపిస్తాయి. సాధారణంగా ఏకాక్షర (పై అనుబంధంతో కూడినవి) ధాతువు దీర్ఘాచ్చుయుక్తం కాని, బిందుయుక్తంకాని ఔతుంది. లేదా దానికి ద్విత్వం (అనుబంధానికి)
3. త్ర్యక్షరధాతువుకు కృత్ప్రత్యయం పరమైతే, తృతీయాక్షరం లోపిస్తుంది.
4. ద్విత్వాక్షరం స్థానంలో ఆదేశంగా వచ్చే ప్రత్యయం కూడ ద్విత్వమౌతుంది. అలా కాకుండా ద్విత్వమయ్యేది - 'కన్ను' ఒక్కటే (64, 65, 29)
5. -టు ప్రత్యయం పరమైనపుడు ఆద్యాచ్చుపై సర్వం లుప్తమగు. ఆద్యక్షరశేషానికి దీర్ఘమగు.
6. -త ప్రత్యయం దీర్ఘాది (ద్వ్యక్షర?) ధాతువుపైనే వస్తుంది. రెండవ అక్షరం లోపిస్తుంది.
7. ఇచ్చు + వి > ఈవి. ఇందులో అనుబంధ 'చు' తో పాటు, ధాతువులోని 'చు' కూడ లోపించడం వల్ల లోపదీర్ఘం కలిగింది.

8. "కృత్" ప్రత్యయాలైన క, గ, త, ప, వ ఇమి అనే పరమైనపుడు - ధాత్వంత క, గ, చ, యు, వ అను వర్ణాలులో -అని చిన్నయసూరి.

కాగ, -అ, -అవు, -ఇ, -ట, -టు, ము, సలి, సు ప్రత్యయాలు పరమైనా ఈ నియమం ప్రవర్తించింది.

ము, డు, రు, ఋ, దు, లు అనే ధాత్వంతాలు కూడ లోపించాయి.

9. తెలుగు అజంతో భాష మాత్రమే కాదు - ఉదంత భాష కూడా. (Telugu Verbal basis లోని 1200 క్రియలు (100%) ఉదంతాలే. అనుదంతం ఒక్కటి కూడా లేదు.

10. ధాతువుకు పరంగా -ఉ ప్రత్యయం చేరినపుడు (నిత్యసంధి కావడం వల్ల) కృదంతంలో మార్పురాదు.

11. త్ర్యక్షర ధాతువుపై కృత్ప్రత్యయం చేరినపుడు, రెండక్షరాలు కనుకలోపిస్తే ఆద్యక్షర శేషానికి దీర్ఘం వస్తుంది. కఱచు + టు=కాటు; పొడుచు + టు >పోటు.

12. కూయు, చేయు, పేరు, విను, కను ధాతువులు విశిష్టమైనవి. కృత్ప్రత్యయం పరమైనప్పుడు వాటిలో కలిగే మార్పులు అసాధారణాలు.

13. కృత్ప్రత్యయాల్లో -ఇయ ను ఎవరూ పేర్కో లేదు.వంగు +ఇయ =వంకియ అనే రూపం వల్ల దాన్ని పేర్కొన వచ్చు.

14. -ఇక అనే తద్ధిత ప్రత్యయాన్ని అభావార్థంలో లక్షణ కారులు పేర్కొన లేదు.కాని ,నోవు+ఇక>నోవిక 'అనుకూలం' ఆధారంగా దాన్ని కొత్తగా పేర్కొన వచ్చు.

15. ఒకే కృదంతానికి అర్థ విపరిణామాల వల్ల తొమ్మిది అర్థాలు కలిగిన పదం-తేకువ.

16. -ఉడి అనే వ్యతిరేకార్థక తద్ధిత ప్రత్యయాన్ని కొత్తగా పేర్కొన వచ్చు.ఆలుడి 'మంచి నడత'.

17. తద్ధిత ప్రత్యయాల్లో -క అనే దాన్ని లక్షణకారులు పేర్కొన లేదు. వంట+క=వంటకము అనే ఉదాహరణవల్ల '-క' అనే తద్ధిత ప్రత్యయం అంగీకరించాల్సి ఉంది.

18. పరిమాణార్థక ప్రత్యయాలు -అంత,-ఇంత,-ఎడు మొదలైనవి ,దఫ్నార్థక ప్రత్యయాలు -బంటి మొదలైనవి,గుణవాచకప్రత్యయాలు -న ,- ని మొదలైనవి తద్ధిత ప్రత్యయాలుగా లక్షణకారులు పేర్కొన్నా అవి నామనిష్పాదక ప్రత్యయాలు కావన్నది నిజం.అంతేకాకుండా,"క్రియలపై చేరే డుఞ్ భిన్న ప్రత్యయాలను కృదంతాల"ని పేర్కొన్నా -అమి అనే ప్రత్యయం కూడా కృత్ప్రత్యయంగా పేర్కొనడం సమంజసం కాదు. అందుకే ఆసూత్రాన్ని"**క్రియలపై చేరే డుఞ్ భిన్న నామనిష్పాదక ప్రత్యయాలు కృదంతాల**"ని పేర్కొనడం సమంజసం.

తెలుగులో తద్ధిత ప్రత్యయం చేరినప్పుడు అర్థంలో పెద్దగా మార్పు రాదు.ఆ మార్పు సంస్కృతంలో ఉంది. కృదంతాల్లో ఎన్నో రకాల అర్థాలు పుడుతాయి.అందులో అర్థవిపరిణామాలు ప్రముఖ పాత్ర వహిస్తాయి.

కృత్తద్ధితాలు జన్యపదాలే ఐనా, అవి కాని ఎన్నో జన్య పదాలు కనబడుతున్నాయి.అటువంటి-'జన్యపదాలు' ప్రత్యేకంగా పరిశోధన చేయదగిన అంశం.

# అనుబంధం - 1

## ఒకే ధాతువు నుండి వివిధార్థాల్లో పుట్టిన కృదంతాలు

| | | |
|---|---|---|
| 1. | అలయ | 1. అలత |
| | | 2. అలపు |
| | | 3. అలయక |
| | | 4. అలసట |
| 2. | అలుగు | 1. అలుక |
| | | 2. అలుకువ |
| 3. | ఆడు | 1. ఆట |
| | | 2. ఆడిక |
| 4. | ఉండు | 1. ఉనికి |
| | | 2. ఉంకువ |
| | | 3. ఉంట |
| 5. | ఎఱుగు | 1. ఎఱుక |
| | | 2. ఎఱుకువ |
| 6. | ఓడు | 1. ఓట |
| | | 2. ఓటమి |
| | | 3. ఓటు |
| | | 4. ఓడిక |
| 7. | కట్టు | 1. కట్ట |
| | | 2. కట్టడము |
| | | 3. కట్టడి |
| | | 4. కట్టడి |
| | | 5. కట్టు |
| | | 6. కట్టుగడ |
| | | 7. కట్టుబడి |
| | | 8. కట్టువ |
| | | 9. కట్టనము |

| | |
|---|---|
| 8. కను | 1. కన్ను |
| | 2. కానుక |
| | 3. కానుపు |
| 9. కలగు | 1. కలక |
| | 2. కలకువ |
| | 3. కలత |
| 10. కాగు/కాచు | 1. కాగు |
| | 2. కాచు |
| | 3. కాక |
| 11. కాచు | 1. కాపు |
| | 2. కావలి |
| | 3. కాపల |
| | 4. కాచికోలు |
| 12. కుడుచు | 1. కూడు |
| | 2. కుడి |
| | 3. కుడుపు |
| | 4. కూడు |
| 13. కుదురు | 1. కుదురు |
| | 2. కుదిరిక |
| | 3. కుదువ |
| 14. కూడు | 1. కూటువ |
| | 2. కూటమి |
| | 3. కూటము |
| | 4. కూటువ/కూటువు |
| | 5. కూడిక |
| | 6. కూడలి |
| | 7. కూడుదల |
| 15. కొలుచు | 1. కొలువు |
| | 2. కొలుపు |
| 16. గెలుచు | 1. గెలుపు |
| | 2. గెలువము |

| | | |
|---|---|---|
| 17. | చేయు | 1. చేత |
| | | 2. చెయ్యి |
| 18. | చేరు | 1. చేరిక |
| | | 2. చేరువ |
| | | 3. చేరుబడి |
| | | 4. చేర్పు |
| 5. | తొడుగు 1. తొడవు | |
| | | 2. తొడగు |
| | | 3. తొడుపు |
| | | 4. తొడి |
| 8. | తూగు | 1. తూకు |
| | | 2. తూకము |
| | | 3. తూకువ |
| | | 4. తూనిక |
| 21. | తాల్చు | 1. తాలుపు |
| | | 2. తాలిమి |
| 22. | తీయు | 1. తీత |
| | | 2. తీపు |
| 23. | తూఋ | 1. తూర్పు |
| | | 2. తూపు |
| | | 3. తూము |
| 24. | తెగు | 1. తెంపు |
| | | 2. తెగుదల |
| | | 3. తెగుబడి |

25. నడచు
1. నడ
2. నడక
3. నడత
4. నడవ/నడువ
5. నడవడి (నడవడిక)

26. నిలుచు
1. నిలుకడ
2. నిలువు

27. నెరయు
1. నెరపు
2. నెర
3. నెరమిక
4. నెరవు

28. నొచ్చు
1. నొప్పి
2. నొవ్వి

29. పండు
1. పండు
2. పంట

30. పన్ను
1. పన్నకము
2. పన్నిదము
3. పన్నాగము
4. పన్నిక
5. పన్నుగడ
6. పని

31. పడు
1. పడమర
2. పాటు
3. పడక
4. పాడె

32. పుట్టు
1. పుట్టు
2. పుట్టుక
3. పుట్టువ
4. పుట్టువ
5. పుట్ట

33. పొంగు
1. పొంకము
2. పొంగలి
3. పొంగరం

| | |
|---|---|
| 34. పొడుచు | 1. పొడుపు |
| | 2. పొడుము |
| | 3. పొడువ |
| | 4. పొడి |
| 35. పోవు | 1. పోక |
| | 2. పోకడ |
| | 3. పోకు |
| | 4. పోబడి |
| 36. పోరు | 1. పోరు |
| | 2. పోరాటం |
| | 3. పోరితం |
| 37. బలియు | 1. బలిమి |
| | 2. బలుపు |
| 38. మను | 1. మనికి |
| | 2. మనుకువ |
| 39. మఱచు | 1. మఱపు |
| | 2. మఱకువ |
| | 3. మఱుగు |
| 40. ముదియు | 1. ముది |
| | 2. ముదిమి |
| | 3. ముదుక |
| | 4. ముదుసలి |
| | 5. ముసలి |
| | 6. ముద్ది |
| 41. మెలయు | 1. మెలత |
| | 2. మెలపు |
| 42. మోయు/మోపు | 1. మోత |
| | 2. మోపు |
| | 3. మోపుదల |
| | 4. మోపిక |

| | |
|---|---|
| 43. వంగు | 1. వంక (వంకి, వంకె) |
| | 2. వంకర |
| | 3. వంకియ |
| 44. విత్తు | 1. విత్తు |
| | 2. విత్తనం |
| 45. విను | 1. వీను |
| | 2. వినికి |
| | 3. వినికిడి |
| | 4. వినుకలి |
| 46. వెలుచు | 1. వెలుపు |
| | 2. వెలుమర |

